# మన వివాహ వ్యవస్థ

ర చ యి త :
నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

రామకృష్ణ పబ్లికేషన్స్
2. రామన్‌వీధి, టి. నగర్.
మద్రాసు - 600 017.

# మన వివాహ వ్యవస్థ
# MANA VIVAHA VYAVASTHA

ప్రమోదూత శంకరజయంతి
29-4-90

ముఖచిత్రం :
బాపు

రచయిత :
నోరి శ్రీనాథ వేంకట సోమయాజులు

వెల : రు 25-00

ప్రోత్సాహకులు :
నోరి సూర్యనారాయణ చారిటబుల్ ట్రస్టు
2, రామన్ వీథి, టి. నగర్,
మద్రాసు - 600 017.

ప్రకాశకులు - ప్రాప్తిస్థానము:
రామకృష్ణ పబ్లికేషన్స్
2, రామన్ వీథి, టి, నగర్
మద్రాసు - 600 017.

ముద్రణ :
క్రాంతి ప్రెస్, మద్రాసు-1.

# కన్యా వరణాలు

ఇంతవరకు వేదాంత గ్రంథాలను ప్రచురిస్తూ వచ్చిన మేము ఇప్పుడు ఈ ''వివాహ వ్యవస్థ'' అనే గ్రంథాన్ని ప్రచురించటానికి పూనుకోవటం కొంత వింతగా ఉండవచ్చు — ఎందుచేతనంటే - ప్రపంచం అంతా మాయ అని, మిథ్య అని, అజ్ఞాన కల్పితమని ప్రతిపాదిస్తూ సంసార పరిత్యాగాన్ని, కర్మ సన్యాసాన్ని బోధించే వేదాంతానికి ప్రాపంచిక వ్యవహారమైన వివాహానికి పొంతన లేనట్లు కనిపిస్తుంది. కాని, యథార్థానికి విరోధమేమీ లేదు. మనం హరిశ్చంద్ర నాటకం చూస్తున్నంత సేపూ, దానిలో పాల్గొంటున్నంతసేపూ దానిని వేరుగా భావించలేము. అది మనకు వ్యావహారిక సత్యమే! అయితే మనం పారమార్థిక సత్యాన్ని మాత్రం మరచి పోరాదు. నాటకంలో కత్తితో పొడిచి ప్రతి నాయకుణ్ణి చంపటం అనేది ఉంటుంది. దానిని నటించాలేతప్ప నిజంగా చంపకూడదు కదా! అట్లా సహజంగా చంపినట్లు, సహజంగా ఉండేటట్లు నటించకపోతే అది నాటకం కాదు — నాటకానికి లోపం వస్తుంది. అట్లాగే మన ప్రాపంచిక వ్యవహారాలూను. పైగా గార్హస్థ్య మనేది యీ యాశ్రమానికే కాక అన్ని ఆశ్రమాలకు ధర్మాలకు ఆధారం గదా! కాబట్టి గార్హస్థ్యానికి సంబంధించిన గ్రంథ ప్రచురణ అవసరమనే భావించాం. కర్మ అనేది ఉంటే గదా కర్మ సన్న్యాసం అనేది. ప్రపంచం అనేది ఉన్నప్పుడే. అనాత్మ పదార్థం అంటూ ఉన్నప్పుడే ఆత్మపదార్థాలన్నీ గుర్తించే అవకాశం అవసరం ఏర్పడుతోంది. కాబట్టి, ప్రపంచాన్ని, ఈ ఆశ్రమ ధర్మాల్ని పూర్తిగా అందరూ పరిత్యజించటమనేది ఉండదు. పైగా వేదాలు, కర్మను, కర్మసన్యాసాన్నీ కూడా బోధిస్తూనే ఉన్నాయి. కాబట్టి ఈ వైవాహిక వ్యవస్థను గూర్చి పరిజ్ఞానం అందరికీ అవసరమౌతోంది.

ఈ గ్రంథానికి అత్యంత మనోహరమైన, భావగర్భితమైన, పునీతమైన ముఖ చిత్రాన్ని మాకు స్వల్పవ్యవధిలో అందించిన 'బాపు' గారికి మా ప్రత్యేక కృతజ్ఞతలు తెలుపుకుంటున్నాము.

ఈ కారణంగా మేము ప్రచురించిన గ్రంథాలన్నింటిని ఆదరించిన పాఠక మహాశయులు దీనిని కూడా సహృదయంతో ఆదరిస్తారని ఆశిస్తున్నాం. పూజనీయులైన మా పాఠకులందరికీ హృదయపూర్వకమైన నమోవాకాలర్పిస్తున్నాము.

ప్రకాశకులు.

# రక్షాబంధనం

వధూవరులకు కష్టాలు, విపత్తులు రాకుండా కార్యక్రమం నిర్విఘ్నంగా సాగటానికై, ముందుగా వివాహంలో ఒక భాగమైనట్టి, రక్షాబంధన విధిని నిర్వర్తిస్తారు. అట్లాగే, ఈ పుస్తక రచనలో విఘ్నాలురాకుండా, అపార్థాలకు తావులేకుండా, ఆశించిన ప్రయోజనం సిద్ధించటానికై, పాఠకుల మనస్సుకు నచ్చటంకోసమై, పుస్తక రచనలో ఒక భాగమైనట్టి, పీఠికకు మారు పేరైన ఈ రక్షాబంధనం చేయాల్సివస్తోంది. ఇందులో, పుస్తకరచనకు ప్రేరణ ఏమిటి? రచయిత ఉద్దేశ్యం ఏమిటి? రచయిత కోరిన ప్రయోజనం ఏమిటి? పాఠకులు పుస్తకాన్ని ఏ దృష్టితో చదవాలి? పుస్తకంలోని ముఖ్యాంశాలు ఏమిటి? ఈ రచనకు తోడ్పడ్డ రచయితలు, వారి గ్రంథాలు, వాటి వివరాలతోపాటు వారికి కృతజ్ఞతలు చెప్పటం వగైరా విషయాలన్నీ భూమికలో ఉంటాయని విజ్ఞులైన పాఠకులకు తెలుసు. ఈ భూమికకే రకరకాలపేర్లు పెడతారు; అంతే; అందుకనే ముందుగా భూమిక చదివి, ఆపైన పుస్తకంలోని విషయం చదువుతారు. అట్లా, రచయిత వెంటపోయి, చివరకు రచయిత, తన పనిలో, ఎంతవరకు కృతకృత్యుడైనాడో అంచనా వేస్తారు.

మనం ప్రతిరోజూ వార్తాపత్రికలు చూస్తూ ఉంటాం. వీటిలో నిత్యమూ, రాజకీయనాయకులుచేసే వాగ్దానాలూ, ఆర్భాటాలూ, అట్టహాసాలూ, అసత్యప్రకటనలూ, ఉంటూ ఉంటాయి. వీటి తరువాత మనకు దర్శనమిచ్చే వార్తలు, స్త్రీల హత్యలు, ఆత్మహత్యలు, మానభంగాలునూ. మానభంగాలు తప్ప, స్త్రీల హత్యలకు, ఆత్మహత్యలకు వివాహంతో నేరుగా సంబంధం ఉంది —— కట్న కానుకలతో సంబంధం అన్నమాట. ఇవన్నీ డబ్బుకోసం, స్త్రీలను, స్త్రీలే చేస్తున్న హత్యలు లేదా స్త్రీలు పురుషుల ద్వారా చేయిస్తున్న హత్యలు. కొన్ని కొన్ని సందర్భాల్లో భర్తలనే పేరుగల రాక్షసులే చేస్తున్న హత్యలు. జాతి అంతా సిగ్గుతో తలవంచుకోవాల్సిన విషయం! దేశమంతటిని ఒక్క ఊపు ఊపి వదలిన సహగమనాల సంఖ్యను మించిపోయినాయి ఈ కట్నాల హత్యలు! ధనదాహంతో చేసే హత్యలు. తరువాతి స్థానం మానభంగాలది. అక్కడా బాధితులు స్త్రీలే! ఈనాటి నాగరక సమాజంలో తెల్లవారగానే మనకు తెలిసే వార్తలివే!

ఇట్లా జరగటానికి కారణం ఏమిటి? మన వివాహవ్యవస్థలో ఏదైనా దోషం ఉందా? లేక, యువతీయువకులకు వివాహం విషయమై సరియైన అవగాహన లేక పోవటం కారణమా? లేక, మన చదువులు, మన నాగరకత వీటివల్ల కలిగినట్టి దుష్పరిణామమా? అనే ప్రశ్నలు తలయెత్తగా, తీగ కదిలిస్తే డొంక అంతా కదిలి నట్లు, మొత్తం వివాహవ్యవస్థను ఆద్యంతం తెలుసుకోవాల్సిన అగత్యం కలిగింది, ఫలితమే ఈ పుస్తకం. ఈ విషయాలను దృష్టిలో ఉంచుకొని చదివితే ఈ పుస్తకం యొక్క ప్రయోజనాన్ని అంచనా వేయవచ్చు.

నేటి యువతీ యువకులకు వివాహవిషయమై సరియైన అవగాహన లేక పోవటం, నేటి అత్తలు చాలమంది చదువుసంస్కారాలు లేనట్టి, సంకుచిత, స్వార్థ మన స్తత్వం కలిగి, వెనుకటి తరానికి చెందినవారై ఉండటం, ఆ అత్తకోడండ్రంతా, ఆర్థికంగా వెనుకబడి భోగలాలసలో మాత్రం ముందుకు ఉరకలు వేస్తున్న దిగువ మధ్యతరగతి వారై ఉండటం గమనార్హం. ఈ తరగతికి చెందినవారు సామాన్యంగా కొద్దిపాటి చదువు ఉన్నవారై ఉంటారు. కాబట్టి, వారికి మన వివాహవ్యవస్థనుగూర్చి చెప్పటం అవసరం; అనే ఉద్దేశ్యం ఈ ప్రయత్నానికి మొదటి కారణం.

పాశ్చాత్య నాగరికతా వ్యామోహితులై, తప్పటడుగులు వేస్తూ, నిప్పులో పడే శలభాల్లాగా ఉన్న యువతరానికి, మన వివాహాదర్శాలను తెలియజేయటం అవసరమనే తలంపు రెండవ కారణం.

తమ సంతానానికి వివాహ సంబంధాలను కుదర్చటంలో రకరకాల తెచ్చిపెట్టు కొన్న బాధలతో సతమతమౌతున్న తల్లిదండ్రులకు సైతం, ఈ వ్యవస్థ స్వరూపం తెలిస్తే, వారు తమ ఆలోచనా సరళిని మార్చుకోవటానికి అవకాశం ఉంటుందనే భావం, మూడవ కారణం.

వివాహ సంస్కారానికి సంబంధించిన కొన్ని పుస్తకాలు మన తెలుగు భాష లోకి వచ్చాయి. వాటిలో కొంతమంది రచయితలు స్వేచ్ఛావివాహాలను సమర్థిస్తే, మరికొందరు, వివాహాల్లో మంత్రాలు అనవసరం అనీ, అన్నారు. మంత్రాలు ఎందుకు అవసరమో మన శాస్త్రాలు సహేతుకంగా చెప్పాయి. వీరు మంత్రాలు అక్కరలే దనటానికి కారణాలను సహేతుకంగా నిరూపించలేదు; దానివల్ల కలిగే నష్టాలూ చెప్పలేదు — పురోహితుని కిచ్చే కిలో బియ్యమూ, పదిరూపాయల రొఖమూ తప్ప. పైగా, గర్భాదాన మంత్రాలను పేర్కొని వేదాలన్నీ బూతుల బుంగలన్నారు. ఆ

గ్రంథరాజాలను చదివినవారు వాటినే సత్యాలని నమ్ముతారు గదా! ఆ విషయాలను గూర్చిన యథార్థాలను వెల్లడించవలసి రావటం నాల్గవ కారణం.

సంస్కృత భాషలో సూత్ర గ్రంథాలు, స్మృతిగ్రంథాలు, చాలా ఉన్నాయి. వాటివల్ల మాత్రమే. నేటి మన ప్రయోజనం నెరవేరదు. ఇటీవలి కాలంలో, నిన్న మొన్నటి చారిత్రక యుగంలో జరిగిన సాంఘిక సాంస్కృతిక విషయాలను తెలియ జెప్పే చారిత్రక గ్రంథాలు మన భాషలో అంతగా లేవు. ఆ దిశలో చాలా పరిశ్రమ జరగాల్సి ఉంది. ఇది ఐదవ కారణం.

పైన చెప్పిన సందర్భాల్లో ఆంగ్లరచయితల గ్రంథాలే శరణ్యంగా ఉన్నాయి. ఉదా॥ మన దేశంలో జరిగిన బాల్య వివాహాల లెక్కలు, సహగమనాల సంఖ్యలు వగైరాలన్నీ, మనం తెలుసుకోవాలంటే ఆంగ్ల గ్రంథాలే శరణ్యం. పైగా, మన స్మృతిగ్రంథాలు సైతం మనకు లభ్యంకాని స్థితిలో వున్నాం. మన ప్రభుత్వానికి సైతం మన ప్రాచీన సాహిత్యం అంటే, రామాయణ, భారత భాగవతాలు, కావ్య ప్రబంధాలు అనే నమ్మకం. అంతే తప్ప అనేక శాస్త్రాలున్నాయని, వాటిని మనం అనుసరించకపోయినా, అర్థం చేసుకోలేకపోయినా, పరిరక్షించాల్సిన అగత్యం ఉన్నదని, తెలియదు. ఇక ప్రచురణకర్తలు పాఠ్యపుస్తకాలపై వ్రాయబడ్డ నోట్సు, గైడ్సు ప్రచురిస్తే లాభాలు అధికంగా కనిపిస్తున్నప్పుడు ఈ శాస్త్రగ్రంథాలతో చేతులు ఎందుకు కాల్చుకుంటారు?

కాబట్టి, ఏ విశ్వవిద్యాలయాలలోని పరిశోధకులో, కులపతులో తమ గ్రంథాల్లో ఉటంకించినవాటినే ప్రమాణాలుగా గ్రహించాల్సి వస్తోంది. ప్రస్తుతం, మన దేశ భాషల్లో, హిందీలో ఈ విషయమై కొన్ని గ్రంథాలు వెలువడ్డాయి. వాటిల్లో అధికారికంగా, శాస్త్రీయ దృక్పథంతో సాంగోపాంగంగా విషయచర్చ జరుపబడిన గ్రంథాలు శ్రీమద్దయానంద సరస్వతివారు రచించిన సంస్కారవిధి, సత్యార్థ ప్రకాశము లాంటి గ్రంథాలు. డా. రాజబలిపాండేయ రచించిన "హిందూ సంస్కారాలు" అనే గ్రంథం, డా. సంపూర్ణానంద రచించిన "హిందూ వివాహంలో కన్యాదానం" అనే గ్రంథం, డా. కృష్ణదేవ ఉపాధ్యాయ రచించిన "హిందూ వివాహం - ఉత్పత్తి - వికాసం" అనే గ్రంథం. ఇది కాక, మన తెలుగులో లాగానే అనేక ప్రయోగ, పద్ధతి గ్రంథాలూ ఉన్నాయి. పైన పేర్కొనబడిన గ్రంథ రచయితలంతా వేరు వేరు విశ్వవిద్యాలయాల్లో సమాజ, సంస్కృతీ, పురాతత్త్వశాస్త్రాల్లో ప్రొఫెసర్లుగా, వైస్‌ఛాన్సలర్లుగా పనిచేసినవారు కాబట్టి అనేక గ్రంథాలను కూలంకషంగా పరిశీలించి

వ్రాశారు. అయితే వారిదృష్టి కొన్ని విషయాల్లో వారి ప్రాంతీయ ఆచారాలమీదనే లగ్నమవటానికి అవకాశం ఉంది. ఈ పుస్తకంలోని న్యాయశాస్త్రానికి సంబంధించిన దాయప్రాప్తి, స్త్రీ సంపద, దత్తకగ్రహణం, భరణపోషణం, వగైరా విషయాలన్నీ, ఉత్తరప్రదేశ్ న్యాయాధిపతిగా ఉద్యోగ విరమణ చేసిన పండిత గిరిజాశంకర్ మిశ్రచే క్రోడీకరింపబడిన Hindu law (హిందూ విధి) అనే గ్రంథం నుండి గ్రహింపబడినాయి. మితాక్షర, ఇతర స్మృతిగ్రంథాల సూత్రాలు సైతం ఇందులో ఉటంకించారు. ఈ గ్రంథం రచించటంలో పై గ్రంథాలు బాగా తోడ్పడ్డాయి. కాబట్టి, వారికి కృతజ్ఞతాంజలి ఘటింపక తప్పదు.

మనకు అతి కష్టంమీద మనుస్మృతి, ఆపస్తంబగృహ్యసూత్రాలూ మాత్రం లభ్యమౌతాయి. శ్రీ చర్ల గణపతిశాస్త్రిగారు ఉపనయన, వివాహమంత్రాలన్నింటికి తెలుగు అనువాదం చేశారు — కీ.శే. శ్రీ చల్లా లక్ష్మీ నరసింహశాస్త్రిగారు స్మార్త గ్రంథ ప్రచురణలో లబ్ధప్రతిష్ఠులే: వేదోక్త, పురాణోక్త వివాహపద్ధతులపై, ఆపస్తంబ గృహ్యసూత్రాలు, గోత్రప్రవరలకు సంబంధించి వారు ప్రచురించిన గ్రంథాలున్నాయి. ఇక నిరాధారంగా దోషాలను మాత్రమే ఎత్తిచూపే గ్రంథాలు ఉన్నాయి. వాటి విషయం అనవసరం.

ప్రస్తుతమున్న సాంఘిక పరిస్థితుల్లో, ఈ విధమైన పుస్తకాలవల్ల ప్రయోజనం ఏమిటి? అని శంకించి, ప్రశ్నించిన వారున్నారు. నా సమాధానమేమంటే — ఈ పుస్తకాన్ని చదివి, హిందూ వివాహాన్ని గురించిన అవగాహన పొంది,

(1) ఏ ఒక్క జంట అయినా, కట్నకానుకలకు ప్రాధాన్యత యివ్వకుండా, ధర్మంకోసం, సమాజ శ్రేయస్సుకోసం, ప్రేమతో వివాహం చేసుకొన్నా —

(2) ఏ ఒక్క స్త్రీ అయినా, తన భర్త, అత్త, ఆడుబిడ్డలు పెట్టే బాధలకు విసిగి, ఆత్మహత్యకు పూనుకోకుండా, ధైర్యంతో, తనకున్న జీవించే హక్కును నిరూపింపగలిగినా —

(3) ఏ ఒక్క వరుని తండ్రి అయినా, తన కొమార్తె విషయంలోను, తన కుమారుని విషయంలోను భిన్నప్రమాణాలకు తావీయకుండా ఒకే దృక్పథాన్ని ప్రదర్శింపగలిగినా —

(4) ఏ ఒక్క అత్త అయినా, తానూ ఒక యింటి కోడలినే ననీ, స్త్రీలైన తన కూతుర్ని కోడలిని, ఒకే దృష్టితో చూడటం, స్త్రీ అయినట్టి తన ధర్మంగా గుర్తించగలిగినా —

(౫) ఏ ఒక్క సామాజిక, సంస్కృతీ శాస్త్ర విద్వాంసునికైనా ఈ విషయంపై సాంగోపాంగము. సశాస్త్రీయము అయిన గ్రంథాన్ని రచించాలనే ప్రేరణ లభించినా —

ఈ ప్రయత్నం సఫలమైనట్లే!

పైన పేర్కొన్న విద్వాంసులకు వారి గ్రంథాలకు మరొకసారి కృతజ్ఞతాపూర్వకమైన నమస్సుమాలర్పిస్తూ. వైవాహిక కార్యక్రమాన్ని ఆరంభిస్తున్నాము.

— రచయిత

విషయ ప్రవేశం:

వివాహ మనేది మానవ మాత్రులందరికి తెలిసిన విషయం, అనుభవంలోని విషయమే గదా! దీనిని గురించి ప్రత్యేకంగా చెప్పవలసినంత గ్రంథమేముంది? అని కొందరు ప్రశ్నించవచ్చు. మనం గంగానదిలో లేక గోదావరి మొదలైన నదుల్లో స్నానం చేస్తున్నాం. ఆ నది నీటిని త్రాగుతున్నాం. పొలాలకు ఆ నీటిని పెట్టి పంటలు పండించుకొని తింటున్నాం. ఇట్లా నదులు మన అనుభవంలోనివే! అంత మాత్రంచేత, మనం అనుభవించే ఈ పుణ్యనది ఎక్కడినుండి పుట్టింది? ఎన్ని దశలు అనుభవించింది? ఎన్ని ఉపనదులను తనలో కలుపుకొంది? ఏఏ భూభాగాలను సస్య శ్యామలం చేస్తూ, ఎన్నెన్ని జాతులకు ప్రాణదానం చేస్తూ, ఎందరెందరిని తృప్తి పరుస్తూ, ఎన్నెన్ని నాగరకతల్ని చూస్తూ, ఎంతకాలం నుండి ఇట్లా ప్రవహిస్తూ ఈ నాటికి ఈ రూపంలో మన అనుభవంలోకి వచ్చింది? ఎందరు దీనిని కలుషితం చేశారు? ఎందరు దీనిని పూజించారు? అనే విషయాలు తెలుసుకోవలసిన అగత్యం లేదా? ఇవన్నీ తెలిస్తేనే తప్ప మనము ఆ నదియొక్క గొప్పదనాన్ని పవిత్రతను తెలుసుకోలేము. ఈనాడు, ఆ నదీ తీరాల్లో మానవులు చేస్తున్న అపవిత్ర కార్యాలను మాత్రమే చూస్తూ, ప్రాచీనకాలంలో ఆ నదీతీరంలోనే జరిగినట్టి పవిత్రయాగాదుల్ని గూర్చి ఏమాత్రమూ తెలుసుకోనట్టివారికి ఆ నదిలోని మాలిన్యమే కనిపిస్తుంది తప్ప పవిత్రత కనిపించదు. అది వారి దోషదృష్టికి (దోషాల్ని మాత్రమే వెదకే దృష్టికి) నిదర్శనం మాత్రమే! ఆ జీవనది యొక్క ఈ చరిత్ర అంతా తెలిస్తేనే తప్ప, ఆ నది యొక్క పవిత్రతను కాపాడుకోలేము - దానిని అధిక ప్రయోజనాలకు వాడుకోలేము. దానియందు చేరిన కశ్మలాన్ని తొలగించి దానిని అనుభవించలేము. అట్లాగే, వివాహ విషయం కూడాను! షుమారు అయిదువేల సంవత్సరాల సుదీర్ఘ చరిత్ర కలిగిన ఈ సజీవ వ్యవస్థలో అనేక మార్పులు, చేర్పులు సంభవించి ఉండవచ్చు. వాటి అన్నింటిని గూర్చిన సమగ్రమైన అవగాహన ఉన్నప్పుడే అందలి దోషాల్ని పరిహరించి, దానిని మన జీవితంలో ఒక భాగంగా, సమాజానికి ఒక తప్పనిసరియైన సంస్కారంగా ధర్మానికి సాధనంగా, జాతికి జీవగఱ్ఱగా గుర్తించి ఉపయోగించుకో గలుగుతాము.

### వివాహ మనేది
### ఎప్పుడు ఆరంభమైంది?

వివాహం అంటే, స్త్రీ పురుషుల శరీర సంబంధానికి - లైంగిక సంపర్కానికి సంకేతం అని గనుక మనం అనుకుంటే, ఇది సృష్ట్యాది నుండీ ఉన్నదనే అంగీకరించాలి. మానవులందేగాక, పశుపక్షి కీటకాదులందు సైతము ఉన్నదని అనుకోవాలి. ఎందుచేతనంటే, ఈ విధమైన లైంగిక సంపర్కం, (మైథునక్రియ) సంతానోత్పత్తి. సంతాన పోషణం అనేవి, అన్ని జీవరాసుల్లోనూ కనిపిస్తోంది. "ఆహార నిద్రా భయ మైథునశ్చ సామాన్యమేతత్ పశుభిర్నరాణామ్" ఆహారము, నిద్ర, భయము. మైథునము అనేవి నరులకు పశువులకూ కూడా సమానమే! అని మన శాస్త్రకారులు చెప్పారు. అంటే, ఇవన్నీ జీవజంతువులకు **సహజప్రవృత్తులు** లేక సహజాతాలు అన్నమాట. ఇక్కడ మైథునక్రియను వివాహం అని అంగీకరిస్తే, వివాహమనేది కూడా ఒక సహజ ప్రవృత్తే అవుతుంది. ఆధునికులు చాలమంది. వివాహానికి ప్రధాన విషయం మైథున కర్మే అని అంటున్నారు. ఎందుచేతనంటే, వివాహంద్వారా సభ్య సమాజంలో స్త్రీ పురుషుల మైథున కర్మకు అనుమతి ఇవ్వబడుతోంది. పశుపక్ష్యాదుల్లో కూడా మైథునకర్మ ఉన్నా, వివాహం లాంటి కర్మ సంస్కారం ఒకటి ఉన్నట్లు మనకు తెలియదు. కాలమే పశుపక్ష్యాదుల్ని ప్రేరేపిస్తున్నట్లు తెలుస్తుంది. ఈ విధంగా ఆలోచించి చూచినప్పుడు సృష్ట్యాది నుండే వివాహం ఆరంభమైంది అనాలి.

### మానవ జీవితంలో
### వివాహానికున్న సంబంధం:

మానవ జీవితంలో జాతకర్మ నామకరణాది అనేక సంస్కారాలకు స్థానం ఉన్నప్పటికీ, వివాహమనేది లేనప్పుడు మానవజీవితం అసంపూర్ణమైనదే! అంతే కాదు, అవివాహిత జీవనం అపవిత్రమని, అవివాహితుడు యజ్ఞయాగాదులు చేయటానికి అనర్హుడని (అయజ్ఞియో వా ఏష యోఽపత్నీకః) (తై. బ్రా. 2-2-2-6.) శ్రుతులు చెపుతున్నాయి. అయితే. ఇది కర్మకాండలకు ధర్మకార్యాలకు, ప్రాధాన్యత నిచ్చే సంప్రదాయజ్ఞులైనవారి అభిప్రాయమేకాదు, ఆటవిక జాతులవారు, అనాగరక జాతులవారూ కూడా జాతికి వివాహమనే ఆచారం ఆవశ్యకమని, భావిస్తూనే ఉన్నారు. సంతానోత్పత్తి, తనదైన సంసారాన్ని నిర్మించుకోవటం, గార్హస్థ్యజీవితం, దానికి ఆధారభూతమైన ఇతర కర్మకాండల యెడల ఆకర్షణము అనేవి సహజ ప్రవృత్తులుగా అన్ని జాతుల్లోనూ కనిపిస్తూనే ఉంది. చిన్నపిల్లలు సైతం, ఆటపాటల్లో ఇండ్లు కట్టు

కోపటం, గార్హస్థ్యాన్ని ఆటల్లో ప్రకటించటం, మన అనుభవంలోని విషయం. మానవుడు సంఘజీవి - ఏకాంతవాసికాడు. కాబట్టే, తనదైన ఒక సంఘం, ఒక సంసారం, కావాలనుకుంటాడు. సంచార జాతుల్లో కూడా ఈ గార్హస్థ్య జీవితంమీది ఆకర్షణ, సంఘజీవితం మీది ఆకర్షణ, కనిపిస్తూనే ఉంటుంది. కాబట్టి వివాహానికి మానవ జీవితంతో వేరుచేయరాని సంబంధం ఉంది.

వివాహానికి ప్రధానమైన లక్షణం, లైంగిక సంపర్కం (మైథునం) అని, ఈ విధమైన స్త్రీ పురుష సంపర్కానికి సమాజంయొక్క అంగీకారం పొందటమే! అనీ, స్త్రీ పురుష సంపర్కమనేది పశుపక్ష్యాదుల్లో సైతం సహజలక్షణంగా కానవస్తున్నా, బుద్ధిజీవియైన మానవుడు సంఘంయొక్క అంగీకారాన్ని కూడా కోరుతున్నాడని పాశ్చాత్య విద్వాంసులు కొందరు మన దేశంలోని ఆధునికులుకూడా విశ్వసిస్తున్నారు. మనం మానవులం కాబట్టే, సంఘజీవులం, బుద్ధిజీవులం కాబట్టే ఈ వివాహమనే వ్యవస్థ ఎప్పుడు ప్రారంభమైంది? ఎందుకు, ఎట్లా ప్రారంభమైంది? ఏ ఏ దేశాల్లో ఏ ఏ జాతుల్లో, ఏ ఏ కాలాలలో ఎట్లా రూపుదిద్దుకొన్నది? మనదేశంలో ఏ ఏ మార్పులు చెందుతూ వచ్చింది? అని తెలుసుకోవాలనే కోరిక కలగటంకూడా సహజమే! అందుకే ఈ విషయమైన అనేక గ్రంథాలు అనేక భాషల్లో రచింపబడ్డాయి.

చారిత్రకులు, మానవశాస్త్ర పరిశోధకులు చెప్పేదానినిబట్టి, మానవజాతి ఆదిమ యుగంలో సంచారజాతిగా ఉండేది. ఇష్టమైనచోట్ల కొన్నాళ్ళపాటు ఉండటం, మళ్ళీ బయలుదేరటం. అడవుల్లో వేటాడుతూ పొట్టనింపుకోవటం. అతనికి నియమితస్థానం అంటూ లేదు. చెట్లు, చెట్టు తొఱ్ఱలు వాసస్థానం! జంతువుల్లాగా ఇష్టమైనప్పుడు, ఇష్టం వచ్చినట్లు రమిస్తూ ఉండేవారు. కాబట్టి ఆ కాలంలో వారికి వివాహ వ్యవస్థకు అవకాశంలేదు.

తరువాతిది పశుపాలన యుగం. వేటాడి పొట్టనింపుకోవటం మానివేసి, పశుపాలనాన్ని చేపట్టి మానవుడు రెండవదశను చేరాడు. ఆవులు, మేకలు, గొఱ్ఱెలు మొదలైన పశువుల్ని మేపటం, వాటిద్వారా ఇతర జీవితావసరాలను తీర్చుకోవటం, ఆ పశువులకు ఎక్కడ మేత దొరికితే అక్కడ కొంతకాలంపాటు స్థిరంగా ఉండటం, మళ్ళీ మేత దొరికే చోటుకు పోవటంగా ఉండేది. స్థిరనివాసానికి అవకాశం పెద్దగాలేని ఆకాలంలోకూడా వివాహ వ్యవస్థకు గట్టి పునాదులు ఏర్పడి ఉండక పోవచ్చు. అయితే, పశువుతోపాటు సంచరించే ఆ కాలంలో, మానవులు సమూహాలుగా చేరి ఒక్కొక్కచోట కొంతకాలంపాటు ఉండేవారు. కాబట్టి, ఆయా సమూహాలతో వారికి కొన్ని సంబంధాలు ఏర్పడితే ఏర్పడి ఉండవచ్చు.

మానవుని మూడవదశ వ్యవసాయ జీవనం. వ్యవసాయంచేసి పొట్ట నింపుకోవటానికి అలవాటుపడిన ఈ కాలంలో అతడు స్థిరనివాసానికి అలవాటుపడి, ఇల్లు కట్టుకొని, తన జీవికకు, తన వ్యవసాయానికి, పశుపాలనకు సహాయం అవసరమైనందున, జీవిత భాగస్వామినితో పాటు సంతానం యొక్క ఆవశ్యకతను కూడా గుర్తించి ఉంటాడు. వ్యవసాయానికి స్థిరనివాసం అవసరం. ఇల్లు వాకిలి, జనం, పశువులు అవసరం. కాబట్టి, గృహము గృహిణి అవసరమై "న గృహం గృహముచ్యతే గృహిణే గృహముచ్యతే" కేవలం, ఇంటిని ఇల్లు అనటానికి వీల్లేదు, ఇల్లు అంటే ఇల్లాలే! అనే స్థితికి వచ్చి ఉంటాడు. పరివారం పెద్దదై ఉంటేనేగాని వ్యవసాయం సరిగాసాగదు. ఆ పరివారాన్ని సాకేటందుకు గృహిణి అవసరం. కాబట్టి మానవుడు వ్యావసాయిక జీవనం ఆరంభించిన నాటినుండి ఈ వైవాహిక వ్యవస్థ ఆరంభమై ఉంటుందని ఊహించవచ్చు.

వివాహంయొక్క పుట్టుకకు గల కారణాలను గురించి రకరకాల అభిప్రాయాలు ఉన్నాయి. లోగడ చెప్పిన ఆహారనిద్రా భయమైథునాల్లాగానే, సమస్త జంతువులకు, స్వీయరక్షణ, స్వజాత్యభివృద్ధి అనేవి స్వాభావిక ప్రవృత్తులు. సమస్త జీవరాసులు తమ రక్షణకోసం ప్రాకులాడుతాయి. తన జాతి అభివృద్ధి (సంతానాభివృద్ధి) కోసం ప్రయత్నిస్తాయి. "ఏకోఽహం బహుస్యాం ప్రజాయేయేతి" అని, బ్రహ్మయే తానొక్కడే ఉండటానికి యిష్టపడక, అనేక మందిని, అనేకాన్ని సృష్టించాలని పూనుకొన్నట్లు వేదాలు చెపుతున్నాయి. కాబట్టి, స్వీయవృద్ధి, స్వీయరక్షణ అనేవి వివాహానికి ప్రముఖకారణంగా కనిపిస్తుంది. స్వజాతివృద్ధివల్ల తప్ప, స్వీయరక్షణ సంభవం కాదు. ఇదె వివాహానికి ప్రముఖ కారణంగా కనిపిస్తుంది. పాశ్చాత్యుల్లో సైతం ఒకవర్గంవారు ఈ విషయాల్నే అంగీకస్తున్నారు.

రెండవ వర్గంవారు ఏమంటారంటే - అత్యంత ప్రాచీన కాలంలో, మానవుల్లో సైతం వివాహబంధన మనేదిలేదు. ఏ పురుషుడైనా, ఏ స్త్రీ అయినా, ఎవరితోనైనా శారీరక సంబంధాన్ని పెట్టుకోవచ్చు. ఆనాటి సంఘంలో ఈ అనాచారం ప్రబలంగా ఉండేది. సమాజం నైతికంగా పతనోన్ముఖమై ఉంది. ఈ స్థితిని చూచి ఆనాటి సామాజికనాయకులు వివాహమనే కట్టుబాటు ఏర్పాటుచేసి ఉంటారు. 'మెక్ లెనన్' అనే విద్వాంసుడు తన 'Studies in Ancient History' అనే గ్రంథంలో ఈజిప్టు దేశంలో 'మెన్సు' అనే అతను, చైనాలో 'ఫొహీ' అనే వ్యక్తి, గ్రీకుల్లో 'సెక్రోపస్' అనేవాడు, హిందూదేశంలో 'శ్వేతకేతువు', ఇట్లా ఒక్కొక్క దేశంలో

ఒక్కొక్క ప్రసిద్ధపురుషుడు. ఈ స్వేచ్ఛాచారాన్ని ఆపి. వివాహ సంప్రదాయాన్ని నెలకొల్పి ఉంటాడు'' అని వ్రాశాడు.

మూడవ వర్గంవారి అభిప్రాయాన్నిబట్టి సమూహాల మధ్య సామాజిక వివాహాలు ఉండేవని అంటారు. అంటే, ఈ పద్ధతి ననుసరించి ఒక సమూహంలోని వారు (Group) రెండవ సమూహంలోని ఏ స్త్రీతోనైనా, ఏ విధమైన కట్టుబాట్లు లేకుండానే కామకలాపాలు సాగించవచ్చు. ఇక్కడ సంబంధమనేది ఒక సమూహానికి మరొక సమూహానికి మధ్యరాబట్టి. ఈ పద్ధతి ప్రకారం ఒక స్త్రీకి అనేకమంది భర్తలు, ఒక స్త్రీతో అనేకమంది పురుషులు సహపతులుగా వ్యవహరించవచ్చు.

పాశ్చాత్యుల్లో, అనేక జాతుల వైవాహిక సాంఘిక విషయాలను గూర్చి అధ్యయనం చేసిన విద్వాంసుడు డా. వెస్టర్‌మార్క్. తాను రచించిన ''History of human marriage'' అనే గ్రంథంలో ఈ విషయాలను బాగా చర్చించాడు. ఆయన అభిప్రాయం ప్రకారం వైవాహిక వ్యవస్థయొక్క ఉత్పత్తికి కారణం ఆదిమ స్వభావమే; స్త్రీ పురుషుల్లో మైథునప్రవృత్తి అనాదికాలం నుండి ఉన్నదే: ఈ స్త్రీ పురుష సంపర్కంవల్ల కలిగే సంతానాన్ని ఇద్దరూ కలసి రక్షించి పోషించేవారు. పురుషుడు పరివారానికి రక్షకుడు, పోషకుడు అయితే, స్త్రీ ఆతనికి పరివారానికి సహాయకురాలుగా ఉండేది—పిల్లల్ని పోషించేది. ఈ అలవాటు, మొదట ఆచారంగా ఉంటూ, రానురాను చట్టరీత్యా ఆమోదింపబడ్డది. ఇట్లా ఈ అలవాటు సామాజిక వ్యవస్థ రూపం దాల్చింది. పాశ్చాత్య విద్వాంసులు చాలమంది వివాహంలో ప్రముఖ పాత్ర వహించేవి సంతానకాంక్ష. గృహపరివార నిర్మాణము అనే సహజ ప్రవృత్తు లనే ఉద్దేశ్యంతో, ఈ విషయాన్ని బలపరచటానికై పశుపక్ష్యాదుల జీవన విధానాల్ని సైతం అధ్యయనంచేసి, మానవ వివాహ వ్యవస్థకు. పశుపక్ష్యాదుల దాంపత్య వ్యవస్థకు పోలికలున్నాయని చెప్పారు.

పక్షులు కేవలం మైథున సమయంలోనే కాకుండా, ఆ పిమ్మటకూడా సంతానో త్పత్తి జరిగిన పిమ్మటకూడా, ఆడ మగ పక్షులు కలసి సంతానపోషణ చేయటం, గృహనిర్మాణాది కార్యకలాపాలు సాగించటం కనిపిస్తున్నాయి. గార్హస్థ్యంలో స్త్రీ పురుష సఖ్యత, సహకారాలకు పక్షుల జీవనమే మిక్కిలి ఆదర్శపాత్రమైనదని విద్వాంసులు చాలమంది వ్రాశారు. అట్లాగే, పశువుల్లో సైతం, ముఖ్యంగా కోతుల్లో, గొరిల్లాల్లో, చింపాజీల్లో, పారివారిక జీవనం, సంతాన పోషణం, స్త్రీ పురుష సహ కారం వగైరా లక్షణాలు చాలా కనిపిస్తాయి. పశుపక్ష్యాదుల్లాగానే మానవుల్లో సైతం

పురుషుడు స్త్రీతో కలిసి ఉండాలని సహజంగా కోరుతూ ఉంటాడు. అట్లాగే, స్త్రీ కూడా పురుషసంసర్గంలో ఉండాలని కోరుకోవటం సహజం. ఇది స్వాభావికమైన మానసికమైన మానసిక ప్రవృత్తి.

వివాహానికి సంసారానికి (పరివారానికి)
ఉన్న సంబంధం :

వివాహానికి పరివారానికి అన్యోన్య సంబంధం ఉన్నా. వివాహానికి మూలం పరివారమే అనాలి. అంటే, సంసారాన్ని ఏర్పాటు చేసుకోవాలని, సంతానాన్ని పొందాలని, తద్వారా సుఖజీవనాన్ని సాగించాలని కోరిక ఉన్నందువల్లనే వివాహమనే కట్టుబాటు ఏర్పడింది. అయితే, ఈ వివాహమనే కట్టుబాటు అత్యంత ప్రాచీనకాలంలో, ఆదిమ యుగంలో లేదనీ, నాగరికత పెరిగినకొద్దీ వివాహ వ్యవస్థ బలపడుతూ వచ్చిందనీ పాశ్చాత్య చారిత్రకులు అంటారు. ఈజిప్టులో 'మెన్సు' గ్రీకుల్లో 'సెక్రోపిస్' హిందువుల్లో 'శ్వేతకేతువు' లాంటి వారిని ఈ వ్యవస్థకు మూలపురుషులనుగా పేర్కొంటూ ఉంటారు. (ఉద్దాలక మహర్షి కొడుకు శ్వేతకేతువు. ఆతడు తన తండ్రిముందే, ఎవడో పశుబలం కలవాడు. తన తల్లిని చేయిపట్టుకొని లాగుకొని పోవటాన్ని చూచాడు. వెంటనే అతడు బలం కలవానిదే రాజ్యం అనే ఈ దుష్ట సంప్రదాయాన్ని, విశృంఖలతను ఆపుచేసి, వివాహానికి పునాది వేసినట్లు, ఈ విధమైన వ్యభిచారంవల్ల పాపం వస్తుందని ఆదేశించినట్లుగా మహాభారతం ఆదిపర్వం 122 ను బట్టి తెలుస్తోంది. మహాభారతం సభాపర్వంలో మాహిష్మతీనగరంలో (మధ్యప్రదేశ్ లోనిది) స్త్రీలు అగ్నిహోత్రుని వరంవల్ల స్వేచ్ఛగా సంచరిస్తున్నట్లు, వారికి ఎట్టి అదుపు ఆజ్ఞలు లేనట్లు తెలుస్తుంది. సభా. పర్వం. 31, 36-38. అట్లాగే, ఉత్తర కురుదేశంలో కూడా వివాహ బంధన మనేది లేనట్లు తెలుస్తుంది. అయితే, ఈ విషయాలన్నీ భారతకాలానికి పూర్వవిషయాలు. వీటిని మహాభారత కాలానికి అన్వయించటం తప్పు. వ్యాసుడు తనకు పూర్వం ఎన్నడో ఉండిన పరిస్థితుల్ని ఊహించి వ్రాసినవి. కాబట్టి యథాతథంగా గ్రహించటానికి వీలులేదు)

ప్రాచీన భారతంలో
వివాహానికున్న సామాజిక మహత్త్వం :

హిందువుల సంస్కారాలన్నింటిలోకి వివాహానికి అత్యధిక ప్రాధాన్యం మొదటి నుంచి కనిపిస్తుంది. మన గృహ్యసూత్రులన్నీ వివాహంతోనే ఆరంభింపబడి ఉండటమే కాక సమస్త గృహయజ్ఞాలకు వివాహమే ఉద్గమస్థానంగా పరిగణింపబడ్డది.

వేదకాలానికి పూర్వమే వైవాహిక విధులు, ఆచారాలు ప్రపంచంలో ఉన్నట్లు తెలుస్తుంది. (ఋగ్వేదంలోను, అథర్వణవేదంలోను వివాహాన్ని గురించి మనోజ్ఞంగా వర్ణింపబడ్డది.) ఋగ్వేదంలోనే ఊర్వశీ పురూరవుల ఆఖ్యానం లభిస్తున్నా అది ఋగ్వేద కాలానికి సంబంధించినది కాదనీ, అంతకు పూర్వకాలపు స్మృతి అని అభిప్రాయం పండితులు వెలిబుచ్చారు.

(ఋగ్వేదంలో 'వివాహసూక్తం' అనే పేరుతో పదవమండలం 85వ సూక్తం ఒకటి ఉంది.) ఇందులో సూర్యుని కొమార్తె 'సూర్య' అనే ఆమెను సోముని కిచ్చి (చంద్రుడు లేదా స + ఉమ = శివుడు) వివాహం జరిపించినట్లుగా ఒక రూపక కల్పన ఉంది. ఈ సూక్తంలో సోమునికోసం అశ్వినీదేవతలు 'సూర్యా' అనే కన్యను ఎంపిక చేయటం, వివాహం యొక్క ఉద్దేశ్యం, ఆదర్శం, విధులు మొదలైనవి చక్కగా వర్ణింపబడ్డాయి. (ఋగ్వేదంలో మన ప్రాచీన ప్రపంచ భూగోళం, చరిత్ర, సంస్కృతి, వివిధజాతులు, వారి ఆచారాలు, ఆనాడున్న దేవతలు, రాజనైతిక జీవనం, ఆర్థిక జీవనం, కావ్యరచనా కౌశలం, విజ్ఞానం, జ్యోతిషం, ఇటువంటి అనేక విషయాలు ఉండగా కొందరు పండితుల మనుకొనేవారు ఈ వివాహ సూక్తంలోని స్త్రీ పురుష సంగమానికి సంబంధించిన ఒకటి రెండు మాటల్ని గ్రహించి 'వేదాల్లో అన్నీ బూతులే!' అంటూ ఒక వర్గంవారిమీది విద్వేషాన్ని వెళ్ళగక్కటం సమంజసంకాదు. వైద్యశాస్త్రంలో శరీరభాగాలన్నింటిలో బాటు స్త్రీ పురుష జననేంద్రియాలను, వాటి నిర్మాణాన్ని, వాటికి సంబంధించిన వ్యాధుల్ని చెప్పక తప్పదు. అదొక ప్రత్యేక వైద్యశాస్త్ర విభాగం కూడాను. ఈ నాటి పత్రికల్లో వాటికి సంబంధించిన సమస్యల్ని స్త్రీ పురుషులు అడగటం, వైద్యుల సలహాలు చదువుతున్నాం. వైద్యశాస్త్రం అంటే ఈ బూతులేనా? అని ఈసడించటం తగునా? సరే! ఈ విషయాన్ని అట్లా ఉంచుదాం. భారతదేశంలోనేకాక, ప్రపంచంలోనే ఆది సాహిత్యంగా పరిగణింపబడే ఋగ్వేదంలోను, తరువాత గ్రంథాల్లోను ఏమున్నదో చూద్దాం. ఋగ్వేదంలోని ఈ చిన్న వివాహసూక్తమే అథర్వణవేదంలో క్రమంగా 64 మంత్రాలు 75 మంత్రాలు గల రెండు విడివిడి సూక్తాలుగా విపులీకరింపబడ్డది. ఇది కాలాన్ని అనుసరించి వివాహంలో వచ్చిన మార్పులను తెలియజేస్తుంది.

వివాహంతో లభించిన ప్రేమమయమైన జీవితం, తత్ఫలంగా లభించే సంతానం, ఆ సంతానాన్ని పోషించి, పెద్దచేసి, బాధ్యతగల వ్యక్తులనుగా తయారు చేయటంలో ఉన్న కర్తవ్యంతో కూడిన వాత్సల్య భావం, ఇవన్నీ ప్రాచీన భారతీయ

జాతికి బాగా తెలుసు. వివాహంలేని వానికి సంఘంలో గౌరవంలేదు "అయజ్ఞియో వా ఏష యోఽపత్నీకః" తై. బ్రా. 2-2-2-6 — భార్యలేనివాడు యజ్ఞహీనుడు అని అన్నారు. అయజ్ఞీయుడనేది ఆర్యుల్లో చాలా నింద్యమైన పదం.) అట్లాగే, "అథో అర్ధో వా ఏష ఆత్మనః యత్ పత్నీ" తై. బ్రా. 2-9-4-7 (ఏకాకియైనవాడు అపూర్ణుడు. భార్య అతని అర్ధ భాగం.) తైత్తిరీయోపనిషత్తులోని శిక్షావల్లిలో సమావర్తన సంస్కార సమయంలో ఆచార్యుడు శిష్యునితో — ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః (సంతాన సూత్రానికి విచ్ఛేదం కలుగనీయకు) అని బోధిస్తున్నాడు. కాబట్టి వేదకాలానికే వివాహమనేదానిని మన ప్రాచీనులు సామాజిక ఆవశ్యకతగా గుర్తించినట్లు తెలుస్తుంది.

వివాహానికున్న ధార్మిక మహత్త్వం:— ధార్మికత అనేది భారతీయ వివాహానికి ఉన్న గొప్పదనానికి రెండవ కారణం. భారతీయుడు ధర్మప్రాణి. అతని ప్రాణం, అతని జీవనం, అంతా ధర్మంతో కూడి ఉన్నదే! అతని నిత్యకృత్యమంతా ధర్మమయం. భారతీయుడు చేసే సమస్త కార్యాలూ ధర్మమూలకాలుగానే ఉంటాయి. శిశువు జన్మించటం మొదలు జాతకర్మ నామకరణం అన్నప్రాశనం, కేశఖండనం, అక్షరాభ్యాసం ఇట్లా ఏ పని అయినా ధార్మిక కృత్యమే! అడుగులకు అరిసెలు, పళ్లకులకు పంచదార చిలకలు. గడపదాటితే గారెలు, బోర్లపడితే బూరెలు పంచుతూ ఇట్లా పేరంటాలతో పెంపకాలు సాగుతాయి. ఈ ధార్మిక కార్యాలన్నీ స్త్రీ లేకుండా కేవలం పురుషునివల్ల జరిగేవికావు. అందుచేతనే భార్య దగ్గర లేకపోతే భార్యయొక్క చిత్రాన్ని లేదా ఒక చిహ్నాన్ని దగ్గరపెట్టుకొని ఆయా విధులు ఆచరించాలి. సీత, వాల్మీకి ఆశ్రమంలో ఉన్నప్పుడు, రాముడు యజ్ఞం చేయాల్సివస్తే సీతయొక్క బంగారు విగ్రహాన్ని ప్రక్కన పెట్టుకొని చేసినట్లు ఉత్తర రామచరిత్ర చెపుతోంది. అందుకే భార్యను ధర్మపత్ని అన్నారు. అటువంటి (ధర్మపత్నిలేని వానిని యజ్ఞవిహీనుడు అన్నారు. అట్టివాడు ఏ ధర్మాన్నీ ఆచరించటానికి అర్హుడుకాడు.) వివాహవిషయమైన ఇటువంటి దృక్పథం ప్రపంచంలోని ఇతరదేశాలలో కనిపించదు.

ఇంకొక విశేషం. మానవుడు పుట్టటమే మూడు ఋణాలతో పుడతాడని మన శాస్త్రాలు చెపుతాయి. ఋషిఋణం, దేవఋణం, పితృఋణం అనేవి ఋణత్రయం. ఈ (ఋణత్రయ విముక్తి వివాహం ద్వారానే జరగాలి.) "జాయమానో హ వై బ్రాహ్మణ స్త్రిభిః ఋణవాన్ జాయతే బ్రహ్మచర్యేణ ఋషిభ్యో యజ్ఞేన దేవేభ్యః ప్రజయా పితృభ్యః" తై. సం. 6-3-10-5 (మానవుడు మూడు ఋణాలతో పుడ

తాడు. (బ్రహ్మచర్యంతో ఋషుల ఋణం, యజ్ఞాలతో దేవతల ఋణం, సంతానంతో పితౄణం తీర్చుకోవాలి. పితౄణ ముక్తికి ఇంతకంటె సాధనంలేదు.) కాబట్టి సంతాన ప్రాప్తికి సాధనమైన వివాహ మనేది ధార్మిక సంస్కారం అయినది. ఇది అందరికీ అనుభవంలోని విషయం.

ఉపనిషత్కాలానికి ఆశ్రమ వ్యవస్థ బాగా స్థిరపడ్డది. ప్రతివానికీ నాలుగు ఆశ్రమాలు (బ్రహ్మచర్య, గార్హస్థ్య. వానప్రస్థ, సన్న్యాసాశ్రమాలు) కర్తవ్యంగా విధింపబడ్డాయి. వ్యక్తిత్వవికాసానికి వివాహమనేది తప్పనిసరి అని భావింపబడ్డది.

స్మృతికాలం వచ్చేటప్పటికి, ఆశ్రమవ్యవస్థ (ఈశ్వరీయం) భగవంతునిచేత విధింపబడ్డదనే విశ్వాసం బలపడ్డది. ఆ కారణంచేత వివాహ మనేది ఒక కర్తవ్య మైంది. ఆ కాలంలో నైష్ఠిక బ్రహ్మచారుల సంఖ్య (వివాహం చేసుకోకుండా సన్న్యసించిన వారు చాలా తక్కువ; అనే విషయం గృహ్యసూత్రాల్నిబట్టి, ధర్మసూత్రాల్ని బట్టి తెలుస్తోంది. ఆయుర్దాయంలో మొదటి నాల్గవభాగం బ్రహ్మచర్యం, రెండవ నాల్గవభాగం గార్హస్థ్యం, మూడవ నాల్గవభాగం వానప్రస్థం, చివరి నాల్గవభాగం సన్న్యాసాశ్రమంలో గడపాలని మనుస్మృతి 4-1-2 లో చెప్పబడ్డది - (చతుర్థ మాయుషోభాగం) వసిత్వాద్యగురోః కులే; ద్వితీయ మాయుషో భాగం కృతదారో గృహేవసేత్, వనేషు చ విహృత్యైవం తృతీయంభాగ మాయుషః. చతుర్థమాయుషో భాగంత్యక్త్వా సంగాన్ పరివ్రజేత్.) ఆ కాలంలో వివాహం చేసుకోనివాడు హీనుడుగా పరిగణింపబడ్డాడు. యాజ్ఞవల్క్య స్మృతి 1-59 ని వ్యాఖ్యానిస్తూ అపరార్కుడు ఒకానొక లేఖకుని వాక్యాలను ఉదహరించాడు —

> "పత్నీ ధర్మార్థకామానాం కారణం ప్రవర్తం స్మృతమ్
> అపత్నీకో నరోభూప కర్మయోగ్యో న జాయతే
> బ్రాహ్మణః క్షత్రియోవాపి వైశ్యః శూద్రోఽపి వా నరః" అని.

(భార్య అనేది ధర్మార్థకామ సిద్ధికి శ్రేష్ఠమైన సాధనం. అపత్నీకుడైనవాడు, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రుల్లో ఎవడైనా సరే, ధార్మిక క్రియలకు అర్హుడు కాడు - అధికారికాడు.)

## ఆ కాలంలో ఇతర దేశాల్లో వివాహానికున్న ప్రాధాన్యం :

ఈ సందర్భంలో ప్రాచీనకాలంలో ఇతర దేశాల్లో వివాహానికి ఎటువంటి ప్రాధాన్యత ఉన్నది? అనే విషయంకూడా తెలుసుకోతగ్గది. మన దేశంలో లాగానే

ఇతర దేశాల్లోకూడా వివాహానికి అధిక ప్రాధాన్యం యిచ్చారు. ఇజ్రాయిల్ దేశస్థులు మన హిందువుల్లాగానే వివాహానికి మిక్కిలి గౌరవాన్ని యిచ్చారు. ఎథెన్సులో ఆ నాడు ఏ వంశమూ వివాహం చేసుకోని కారణంగా సంతానహీనమై ఉచ్ఛిన్నంకాకుండా చూస్తూ ఉండటానికి నగరంలో ఒక శాసకుణ్ణి కూడా నియమించినట్లు తెలుస్తుంది. అట్లాగే స్పార్టాలో వివాహం చేసుకోనివానికి అనేక సామాజిక అధికారాలు లేకుండా చేసినట్లు, వివాహితులుకాని వయోవృద్ధులను ఎవరూ గౌరవించనట్లు, డా. విలిస్టాయిన్ గుడ్‌సేల్ లాంటి పండితుల వ్రాతలవల్ల తెలుస్తోంది. రోముదేశంలో సైతం, వివాహం చేసుకోకపోవటం అనేది సార్వజనిక దృష్టిలో అపరాధంగా పరిగణించినట్లు, వివాహం చేసుకోకపోవటంవల్ల రాష్ట్రానికి అధికసంఖ్యలో ప్రజలు లభించరని, పితరులకు, గృహదేవతలకు పూజాదికాలు నిర్వర్తించేవారు ఉండరు. కాబట్టి, వివాహమనే దానిని ఒక విధిగా ఏర్పడ చేశారు.

అయితే, క్రైస్తవ ధర్మం విషయం ఆలోచిస్తే ఇందుకు భిన్నమైన విషయాలు గోచరిస్తాయి. క్రైస్తవ పాదరీల అభిప్రాయాలు సెయింట్‌పాల్ అభిప్రాయాలకు అనుగుణంగా ఉన్నట్లు తెలుస్తుంది. ధార్మిక నియామకుడైన ఆయన అభిప్రాయాలకు ఎక్కువ ప్రాధాన్యం. విలువ ఉన్నందున ఈ విషయంలో ఆయన వ్రాతల్ని తెలుసుకోవటం అవసరం "....అయినప్పటికీ, భ్రష్టాచారాల్ని నిరోధించాలంటే ప్రతి పురుషునికి భార్య ఉండటం అవసరం. ప్రతి స్త్రీకి భర్త ఉండటం మంచిది" అంటూ సందిగ్ధంగా ఉన్న అనుమతితోపాటే ఇట్లా అన్నారు — "ఇది కేవలం అనుమతి మాత్రమే! ఆదేశంకాదు. విధికాదు....కాని, ప్రతివాడూ నాలాగా ఉండాలనేదే నా అభిప్రాయం........అందుచేత, అవివాహితులైన స్త్రీ పురుషులకు నేను చెప్పేదేమంటే, వారు నాలాగానే నియమపాలనం చేయటం ఉత్తమం. కాని, వారియందు అటువంటి శక్తి లేనప్పుడు వివాహం చేసుకోవటం మంచిది. భ్రష్టాచారం కంటె, లోలోపల కుమిలిపోవటం కంటె వివాహమే మంచిది" (1. కోర్ 7-2.) ఈ మాటల్నిబట్టి మానవసహజమైన సామాజిక నియమాన్నిగాని, వివాహానికున్న ఆధ్యాత్మిక సంబంధాన్నిగాని వారు పరిగణించలేదనే విషయం తెలుస్తుంది. అందుచేతనే క్రైస్తవ పాదరీల యొక్క వివాహ విషయకమైన అభిప్రాయాల్ని గూర్చిన అధ్యయనం, ఆసక్తికరమైనదిగా ఉండదని డా॥ విలిస్టాయిన్ గుడ్‌సెల్ తన The History of the family as a social and educational institution లో వ్రాశారు. అయితే, ఇదంతా పతితమైన ఆనాటి రోమ్ సమాజానికి విరుద్ధంగా జరిగిన

ప్రతిక్రియ అది. ఆ విధమైన విశ్శృంఖలమైన జీవితమే రోమన్ జాతియొక్క ఆధ్యాత్మిక, భౌతిక పతనం జరగటానికి కారణమైందని గ్రహించాలి.

వివాహం - ఉద్దేశ్యం:—భారతీయుల దృష్టిలో వివాహంయొక్క ఉద్దేశ్యం ఆధ్యాత్మికము, ధార్మికము అయి ఉంది. పాశ్చాత్యుల్లోలాగా, వారి భావాలను అనుకరించేవారిలాగా, కేవలం శారీరక సంబంధానికి మాత్రమే పరిమితంకాదు. వైదిక గ్రంథాల్లోను, ధర్మశాస్త్రాల్లోనూ వివాహోద్దేశ్యం విపులంగా, మహోన్నతంగా చిత్రీకరింపబడ్డది. (ఇవన్నీ ఇతరుల్ని మోసగించటానికి చెప్పబడిన బూటకాలు అనే వారికి చెప్పవలసిందేమీలేదు — వారి బుద్ధి పరిపక్వతకు ఆశ్చర్యపడటంతప్ప ఇటువంటి ఉద్దేశ్యం ఇతరత్రా ఎక్కడా లభించదు.) "గృహస్థాశ్రమంలో ప్రవేశించి, యజ్ఞాల్ని ఆచరించటం, పుత్రుల్ని పొందటం వివాహోద్దేశ్యం" అనీ (ఋగ్వేదం. 10 - 85 వివాహసూక్తం) "గార్హపత్యంకోసమే పురుషుడు స్త్రీని వివాహంచేసుకుంటున్నాడని. అదే వివాహోద్దేశ్యం" అనీ వివాహసూక్తంలో "గృహ్ణామి తే సౌభగత్వాయ హస్తం, మయాపత్యా జరదృష్టి ర్యథాసః భగో అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః (ఋ. వే. 10-85-36) [ఓ వధూ! సౌభాగ్యాన్ని పొందటంకోసం నేను నీ పాణిని గ్రహిస్తున్నాను. నీవు భర్తనైన నాతో వార్ధక్య పర్యంతం ఉండు. ఐశ్వర్యవంతుడు. న్యాయశీలుడు. శరీరాల్ని పోషించేవారు అయిన భగుడు, సూర్యుడు ఇతర దేవతలు గార్హపత్య సంపాదన కోసం నిన్ను నాకు ఇచ్చారు] అని ఉంది. దీనినిబట్టి, గృహస్థాశ్రమధర్మాల్ని పాటిస్తూ, సమాజ సేవ చేయటం వివాహోద్దేశ్యం అని తెలుస్తోంది. (గృహస్థాశ్రమ ధర్మాలైన అతిథి అభ్యాగత సేవలు, దానధర్మాలు, భూతబలులు ఇవన్నీ సమాజశ్రేయస్సు కోసం చేసేవే.) అట్లాగే, భార్యాభర్త లిరువురు కలసి దేవతాపూజచేసే వర్ణన ఋగ్వేదంలో ఉంది — "త్వమర్యమా భవసి యత్ కనీనాం దంపతీ అంజన్తి మిత్రం సుధితం న గోభిర్యత్ దంపతీ సమనసా కృణోషి" (ఋ.వే. 5-3-2) అట్లాగే గృహమంటే గృహిణే (ఋ.వే. 3-53-4) అని చెప్పిన సందర్భాలున్నాయి. మహాభారతంలో సైతం శాంతిపర్వంలో 144-6 —

"న గృహం గృహ మిత్యాహుః గృహిణీ గృహముచ్యతే
గృహంతు గృహిణీ హీనం అరణ్యసదృశం మతం" అని ఉంది.

భర్తయే పుత్రరూపంలో భార్యయందు జన్మిస్తాడు. కాబట్టి స్త్రీని 'జాయా' అని ఐతరేయ బ్రాహ్మణం పేర్కొంటోంది [33-1] అట్లాగే, శత పథ బ్రాహ్మణం,

5-2-1-10 లో "అర్ధో హ వా ఏష ఆత్మనో యజ్జాయా తస్మాద్యావజ్జాయాం న విన్దతే నైవ తావత్ప్రజాయతే అసర్వో హి తావత్ భవతి అథ యదైవ జాయాం విన్దతేఽథ ప్రజాయతే హి సర్వో భవతి" [భార్య. భర్తయొక్క ఆత్మకు అర్ధాంశం. కాబట్టి పురుషుడు భార్యను పొందేటంతవరకు అసంపూర్ణుడుగానే ఉంటాడు. వివాహం చేసుకొని, సంతాన పరంపరను అవిచ్ఛిన్నంగా, నిరంతరాయంగా ఉంచటం ద్వారా పరిపూర్ణుడౌతాడు] అని. కాబట్టి మన ప్రాచీన ఋషి పుంగవులు రాష్ట్రాభివృద్ధికి మానవబలం ఎంత అవసరమో గుర్తించి ఉంటారు. అంతే తప్ప, వారు వివాహాన్ని కేవలం వాసనా పరితృప్తికి సాధనంగా గుర్తించలేదు. కాళిదాసు కూడా రఘువంశకావ్యంలో "త్యాగాయ సంభృతార్థానాం, సత్యాయ మితభాషిణామ్। యశసే విజిగీషూనామ్, ప్రజాయై గృహమేధినామ్" అంటూ, రఘువంశరాజులు సంతానంకోసమే గృహస్థాశ్రమప్రవేశం చేసేవారని చెప్పాడు. వివాహ ప్రయోజనం సంతానమే అనే విషయాన్ని పారస్కర గృహ్యాసూత్రాలు (1-6-3) స్పష్టంగా చెపుతున్నాయి — "సామాహ మస్మి ఋక్త్వం, ద్యౌరహం పృథివీ త్వం, తావేహి వివాహావహై। సహరేతో దధావహై। ప్రజాం ప్రజనయావహై। పుత్రా న్విన్ద్యావహై। బహూన్ తే సన్తు జరదష్టయః। సంప్రియౌ, రోచిష్ణూ, సుమనస్యమానౌ। పశ్యేమ శరదః శతం, జీవేమ శరదః శతం, శృణుయామ శరదః శతమ్" (నేను సామాన్ని, నీవు ఋక్కువు. నేను ఆకాశాన్ని, నీవు భూమివి. కాబట్టి, రా! మనం వివాహం చేసుకుందాం! దానితోపాటు తేజస్సును ధరిద్దాం! పుత్రుల్ని పొందుదాం! మనం ప్రేమతో, ఆనందంగా వంద సంవత్సరాలు బతుకుదాం.) దీనినిబట్టి మన హైందవ వివాహబంధనం అనేది వందసంవత్సరాల పర్యంతం ఉండేదని (ఆధునికులు నవలల్లో నూరేళ్ళపంట అంటున్నారు) వివాహోద్దేశ్యం సంతానప్రాప్తి అని, తెలుస్తోంది సంతానప్రాప్తి అనేది సామాజికంగాను, ధార్మికంగానూకూడా అనివార్యమే! మన సామాజిక స్థితికోసం సంతానం తప్పనిసరే! వేదశాస్త్ర పురాణేతిహాసాల్ని వెక్కిరించే వారూ, వేదాల్ని బూతులనేవారూ, అన్ని రాజకీయ పార్టీలవారూ, అన్ని మతాలవారూ కూడా ఈ విషయాన్ని అంగీకరించినందువల్లనే, వివాహం చేసుకొని సంతానాన్ని కంటున్నారు. వారికోసం ఆస్తిపాస్తుల్ని సంపాదిస్తున్నారు. దీనినిబట్టే, వివాహాని కున్న సామాజిక ప్రాశస్త్యం వ్యక్తమౌతోంది.

ఇక ధార్మిక విషయాన్ని గురించి:— మానవుడు పుట్టటమే మూడు ఋణాలతో పుడుతున్నాడని చెప్పుకొన్నాం. యజ్ఞాలు, దానధర్మాలు చేసి దేవఋణాన్ని, అధ్యాపనంతో ఋషిఋణాన్ని, పుత్రప్రాప్తితో పితౄణాన్ని తీర్చాలని ధర్మశాస్త్రాలు

చెపుతున్నాయి. ఈ ఋణత్రయ విముక్తి అనేదే వివాహ విషయంలోని ధార్మికోద్దేశ్యం.

హిందూ జీవన విధానం ఎప్పుడూ కూడా ధర్మమయమైనదే; జాతకర్మ మొదలు కొని అంత్యేష్టిదాకా, ఉదయంనుండి మరునాటి ఉదయందాకా మనం చేసే ప్రతిపనీ ధర్మమయమైనదే; అటువంటప్పుడు జీవితంలో ప్రధాన సంస్కారమైన వివాహం అనేది ధర్మమయ మవటంలో ఆశ్చర్యం లేదు. ఈ దేశంలో స్త్రీని 'ధర్మపత్ని' అన్నారు. అంటే, ధర్మనిర్వహణంలో, ఎల్లప్పుడు సహాయకారిగా, సహభాగినిగా ఉండేది అన్నమాట. స్త్రీని ఎన్నడూ ఒక భోగవస్తువుగా, దాసిగా, కామక్రీడా వస్తువుగా, తల్లిదండ్రుల వద్ద నుండి అడిగినప్పుడల్లా అడిగినంత డబ్బు తెచ్చియిచ్చే బానిసగా మన మతం, మన పూర్వులు, ఎన్నడూ చూడలేదు. ధర్మాన్ని, మతాన్ని నిర్లక్ష్యంచేసి, డబ్బుకు విలాసాలకు, శారీరక భోగాలకు మాత్రమే విలువనిచ్చిన దౌర్భాగ్యులవల్ల, నేటి స్త్రీలకు దాపురించిన ఈ దుస్థితికి, మన ప్రాచీన ఋషుల్ని, ధర్మశాస్త్రాల్ని నిందించటం అనవసరం। మన మతం, పురుషుని జీవితాన్ని మహోన్నతంగా మలచటానికి, ఆధ్యాత్మిక ధార్మికకార్యాల్లో సహకరించే 'ధర్మపత్ని'గా స్త్రీని గుర్తించింది. ఆపస్తంబ ధర్మసూత్రాల్లో — ''జాయాపత్యోర్న విభాగో విద్యతే. పాణిగ్రహణాద్ధి సహత్వం కర్మసు.'' ఆప. ధ. సూ. 2-6-13-16, 1.7 (స్త్రీ పురుషుల్లో భేదంగాని, విభాగంగాని ఉండదు. స్త్రీ పురుష సంబంధం అవిచ్ఛేద్యం - విడతీయరానిది. పాణిగ్రహణం నాటినుండే అన్ని ధర్మకార్యాల్లో సహయోగం అనేది అవసరం) అట్లాగే, పురుషుడు రెండవ వివాహం చేసుకోకూడదని ద్వితీయ వివాహాన్ని నిషేధించింది—''ధర్మప్రజాసంపన్నే దారే నాన్యాం కుర్వీత.'' (ఆప.ధ.సూ. 2-5-11-12) అని. (పుత్రోత్పత్తి, ధర్మసంపాదనం అనేవి వివాహోద్దేశ్యాలు. భార్యవల్ల ఈ ఉద్దేశ్యాలు నెరవేరినప్పుడు రెండవ వివాహం నిషిద్ధం అన్నారు. కామతృప్తి అనేది లౌకిక ఫలం. అదే పరమార్థంగాదు.) మనువు దృష్టిలో —

''అపత్యం ధర్మకార్యాణి, శుశ్రూషా రతిరుత్తమా
దారాధీన స్తథా స్వర్గః పితౄణా మాత్మనశ్చ హి''

(మనుస్మృతి - 9-28)

[సంతానము, అగ్నిహోత్ర సంపాదనం మొదలైన ధర్మకార్యాలద్వారా పితరులకు సేవ, ఉత్కృష్టమైన రతి ద్వారా భర్తకు స్వర్గసంపాదన సాధనం అవటం అనేవి

భార్య అధీనంలోనే ఉన్నాయి] రతి అనేది చివరిది. అదే ప్రధానం కాదు. యాజ్ఞవల్క్యుడు ——

"లోకానన్త్యం దివః ప్రాప్తిః, పుత్ర పౌత్ర ప్రపౌత్రకైః
యస్మాత్తస్మాత్ స్త్రియఃసేవ్యాః, కర్తవ్యాశ్చ సురక్షితాః॥
[యా.స్మృ. 1-78]

వంశం విచ్ఛేదం రాకుండా ఉండటం, స్వర్గఫలప్రాప్తి అనేవి స్త్రీ ద్వారా మాత్రమే లభించే ఫలాలు. కాబట్టి, స్త్రీని సేవించటం, రక్షించటం అనేవి కర్తవ్యాలు; అని దారసంగ్రహఫలంగా చెప్పాడు. యజ్ఞ నిర్వహణం అనేది భార్యాభర్తలు కలసి ఒకేసారి చేయాలేతప్ప విడివిడిగా చేయరాదని జైమిని మీసాంసా సూత్రాల్లో [6-1-17] చెప్పబడ్డది. మహాభారతంలో - సైతం ధర్మార్థకామాలకు మూలం స్త్రీ అనే చెప్పారు —— "అర్థం భార్యా మనుష్యశ్చ, భార్యాశ్రేష్ఠతమః సఖా, భార్యా మూలం త్రివర్గస్య, భార్యా మూలం తరిష్యతః [మ.భా. 1-74-40] అని చెప్పారు. బృహస్పతి, స్త్రీని భర్తకు అర్ధాంగినిగా, పుణ్యాపాపాలు రెంటికీ భాగస్వామినిగా చెప్పాడు. మన దేశంలో, మన మతంలో స్త్రీని ఏ విధంగా గౌరవించి, సమాజంలో ఏ విధమైన స్థానం ఇచ్చారో తెలియజేయటానికే ఇదంతా చెప్పవలసి వచ్చింది. ధర్మదూరులై, ధనానికి, కుత్సిత మిథ్యా గౌరవాలకూ, ప్రాధాన్యం ఇచ్చే కుహనా విద్వాంసులు, మన ప్రాచీనుల్ని నిందించి, వారిపై స్త్రీలకు గౌరవం లేకుండాచేసి, ఆ విధంగా స్త్రీలను ఈ స్థితికి తెచ్చారు. ఈనాడు స్త్రీలకు మనం ఇస్తున్న విలువ ఎటువంటిదో సరిపోల్చుకోవటానికే ఇదంతా చెప్పవలసి వచ్చింది. స్త్రీకి స్వాతంత్ర్యాన్ని ఇవ్వలేదని, వారికి విద్య నేర్పలేదని ఏవేవో చెప్పారు; చెప్తున్నారు —— స్వాతంత్ర్యానికీ, విద్యకు అర్థాన్ని తెలుసుకోకుండా, రెచ్చకొట్టటం మాత్రం చేయగలరు. మనం ఈనాడు పాశ్చాత్యులు స్త్రీకి ఇస్తున్న విలువల్ని చూచి, వివాహవిషయమై వారి అభిప్రాయాల్ని చూచి, ఆ విధమైన జీవనానికి వ్యామోహితులం అవుతున్నాం కాబట్టి ఈ విషయంలో వారి ఉద్దేశ్యం ఏమిటో కూడా తెలుసుకోవటం మంచిది.

డా॥ వెస్టర్‌మార్క్ అనే సామాజికశాస్త్ర, చారిత్రక పరిశోధకుని మాటల్లోనే "Marriage is a relation of one or more men to one or more women that is recognised by custom or law, and involves certain rights and duties in the case of parties entering the union and in the case of children born for it.......... 'Marrige

always implies the right of sexual intercourse." (Future of marriage in Western civilization. Page 3) ఇదే రచయిత తన History of human marriage (Vol. I) అనే గ్రంథంలో "It is an economic institution which in various ways may effect the Proprietory rights of Parties. It is the husband's duty to support his wife and children but it may also be their duty to work for him." ఈ రచయితే తన 'Future of marriage' అనే గ్రంథంలో

"There are three essential elements in every normal marriage, the gratification of the sexual impulse, the relation between husband and wife apart from it and Procreation. The Primary object of marriage has always been sexual union, as sexual desire is obviously the Primary motive of relation between sexes among animals."

దీనినిబట్టి మనకు తెలిసే ముఖ్యాంశాలేమంటే:

1. వివాహమనేది ఆచారంద్వారా, చట్టంద్వారా అనుమతింపబడే స్త్రీ పురుషుల సంబంధం. దీనివల్ల — ఆ వివాహంవల్ల — ఆ స్త్రీ పురుషుల సంతానానికి కొన్ని అధికారాలు సంక్రమిస్తాయి. వివాహంవల్ల స్త్రీ పురుషుల మైధున కర్మకు అధికారం లభిస్తుంది. ఆ లైంగిక సంపర్కాన్ని సమాజం ఆమోదిస్తుంది.

2. వివాహమనేది ఒక ఆర్థిక వ్యవస్థ. దీనివల్ల వారిద్దరికి [దంపతులకు] వారసుల అధికారం విషయంలో పెద్దమార్పు వస్తుంది. భార్యను, పిల్లల్ని పోషించటం. రక్షించటం భర్తయొక్క విధి. ఆతనికి సేవచేయటం, ఆతనిని సంతుష్టుని చేయటం వారి విధి. కాబట్టి, వివాహమనేది వారి దృష్టిలో ఒక సామాజికమైన, చట్టానికి లోబడిన ఒడంబడిక; పరస్పరాంగీకారం. దానిని పాటిస్తే వివాహ బంధనం ఉంటుంది. లేకపోతే ఉండదు. ఇది ఉభయత్రా వర్తించే కాంట్రాక్టు [ఒడంబడిక] అందుచేతనే ఆ దేశాల్లో విడాకుల సంఖ్య అధికంగా పెరుగుతోంది — ధార్మికమైన బాధ్యతలు. కట్టుబాట్లు లేనందువల్ల.

3. సంతానోత్పత్తి — సంతానాన్ని పొందటమనేది వారి దృష్టిలో ఈ మూడింటి లోకి ప్రధానమైన విషయం. మైధున మనేది పశు పక్ష్యాదుల్లో పైతం విభిన్న లింగాల్లో స్వాభావికం కాబట్టి మానవుల్లో కూడా ఈ కోరిక సహజం.

అందుచేత వివాహానికి ప్రధానోద్దేశ్యం అదే: జంతుప్రవృత్తే: అనేది పాశ్చాత్యుల అభిప్రాయం అని తెలుస్తోంది.

మన భారతీయుల వివాహ వ్యవస్థలోని ప్రధానోద్దేశ్యం ధార్మికమైనట్టిది. కాబట్టే, భార్యను ధర్మపత్ని అన్నారు. మన ఈ వివాహ సంబంధం అనేది యావ జ్జీవితం కలిమిలేముల్లో సైతం ఉండేది - ధర్మనిర్వహణమనేది జీవితాంతం ఉండేది; కాబట్టి: భార్య భర్తలిరువురిలో ఒకరు మరణించినప్పటికీ ఆ సంబంధం తెగిపోయేది కాదు —— ఆర్థికమైన ఒడంబడిక కాదు కాబట్టి, హక్కులకు సంబంధించిన విషయం కాదు కాబట్టి: పాశ్చాత్యుల్లో అయితే, ఆ షరతులు ఎవరు పాటించకపోయినా సంబంధం విచ్ఛిన్నమైపోతుంది. ఒడంబడిక రద్దు అవుతుంది. సంతానోత్పత్తి విషయంలో సైతం ఉద్దేశ్యంలో భేదం ఉంది. భారతీయ దృక్పథం ప్రకారం సమాజస్థితి, కుటుంబంయొక్క ఉనికి అవిచ్ఛిన్నంగా సాగటంకోసం, ధర్మనిర్వహణ కోసం సంతానం అవసరం. "ప్రజాతన్తుం మావ్యవచ్ఛేత్సీః" అని. తై.ఉ. 1 చెపుతోంది. పాశ్చాత్యుల ఉద్దేశ్యం ప్రకారం, సహజ ప్రవృత్తి అయిన మైథున క్రియవల్ల సంతానం కలుగుతోంది కాబట్టి వారి పోషణ, వారసత్వాదులు విధింపబడు తున్నాయి. ఈ విధంగా భారతీయ వైవాహిక జీవనానికి ప్రేమ, ధర్మము, ఆనందమయ జీవనము అనేవి ఉద్దేశ్యాలుకాగా, యూరపు దేశాలలోని వైవాహిక జీవనం సహజ ప్రవృత్తికి, ఆర్థికానికి, తాత్కాలిక విషయ వాసనలకు కారణ మౌతోంది. నేడు భారతీయులు సైతం ఆర్థిక విషయాలకు, భోగాలకు, ధనానికి తాత్కాలిక సుఖానికి అధిక ప్రాధాన్యం యిస్తూ, ధర్మాన్ని త్యజించటానికి సిద్ధ పడుతూ ఉండటం సమాజ పతనానికి దారితీస్తుందేమోననే భయము, అనుమానము కలుగుతున్నాయి. లేకపోతే, కట్నాలకు సంబంధించిన ఈ స్త్రీ హత్యలన్నీ ఏమిటి?

**వివాహము - చారిత్రక వికాసము:**

ఇంతవరకు వివాహమనే సంస్కారాన్ని గురించి, దాని ఉద్దేశ్యాన్ని గురించి కొంతవరకు తెలుసుకొన్నాం. అయితే. ఈ వివాహ వ్యవస్థ అనేది ఏ విధంగా వికాసం చెందుతూ ప్రస్తుతస్థితికి వచ్చింది? అనే విషయాన్ని గురించి తెలుసుకోవాల్సి ఉంది.

చాలామంది శాస్త్రజ్ఞులు, బహుపత్నీత్వం అనే ఆచారం, బహుపతీత్వ సంప్ర దాయం, స్త్రీ పురుషుల విశృంఖల కామవిహారం అనేవి మానవజాతియొక్క ఆరంభ యుగంలో ఉన్నట్లు పేర్కొంటున్నప్పటికీ. ఇందుకు తగినన్ని ఆధారాలు లభ్యం

కావటంలేదు. అయితే, ఈనాటికీ కొన్ని దేశాల్లోని కొన్ని జాతుల్లో అల్పసంఖ్యలో బహుపత్నీత్వ, బహుభర్తృత్వ సంప్రదాయం కనిపిస్తున్నా, ప్రాచీన కాలంనుండీ ఏకపత్నీత్వానికి, ఏకభర్తృత్వానికి అధిక గౌరవం ఉన్నట్లు తెలుస్తోంది. పైగా అస్థిరమైనట్టి తాత్కాలిక వివాహాలు సైతం ప్రాచీనకాలంలో అధికంగా ఉన్నట్లు కనిపించదు. ఋగ్వేదంలో ఉదహరింపబడిన ఊర్వశీపురూరవగాథ వేదకాలానికి సైతం అత్యంత ప్రాచీనమైనదిగా తెలుస్తుంది. కాని, వేదాలలోను, గృహ్య, ధర్మసూత్రాలలోను, ఇతర స్మృతుల్లోను స్థిరంగా, నియమాలతో కూడి, సాంగోపాంగంగా ఉండే వివాహ సంస్కారాన్నే ప్రశంసించటం జరిగింది.

మన హిందూవివాహ విధానాన్ని గూర్చి, ఆ వివాహంలో ఉన్నట్టి భేదాలను గూర్చి, వాటి మూల స్వరూపాన్ని గూర్చి, వేదాల్లో తెలుస్తోంది. ఋగ్వేదంలోని పదవమండలంలో 85-వదైన వివాహసూక్తంలో బ్రాహ్మవివాహ వర్ణనం కనిపిస్తోంది. ఇందులో కన్యాదానం మొదలైన విషయాలు పేర్కొనబడ్డాయి. ఋగ్వేదం పదవ మండలంలోనే వేరొక సూక్తంలో గాంధర్వ వివాహ వర్ణనం కనిపిస్తోంది. ఇట్లాగే అథర్వణవేదంలోనూ వివాహవర్ణనలు ఉన్నాయి. అయితే వివాహాల్లో భేదాలు, వాటికి నామకరణాలు వగైరాలేవీ లేవు. అనేక గృహ్యసూత్రాల్లో సైతం అష్టవిధ వివాహాలు పేర్కొనబడలేదు. ముందుగా ఆశ్వలాయనుడు వీటిని పేర్కొన్నట్లు తెలుస్తుంది. మనుస్మృతి (3-21)లో—"బ్రాహ్మోదైవస్తథైవార్షః ప్రాజాపత్యస్తథాసురః। గాంధర్వో రాక్షసశ్చైవ పైశాచశ్చాష్టమోఽధమః॥" అని ఉంది.

బ్రాహ్మము, దైవము, ఆర్షము, ప్రాజాపత్యము, ఆసురము, గాంధర్వము, రాక్షసము, పైశాచము అని వివాహాలు ఎనిమిది విధాలుగా పేర్కొనబడ్డాయి. వీటిలో మొదటి నాలుగు ప్రశస్తమైనవని, చివరి నాలుగు అప్రశస్తమైనవని (అంగీకరింపబడనివి) అంటూ స్థూలంగా వీటిని రెండుగా విభజించారు. వీటిల్లో చివరి రెండూ రాక్షసము, పైశాచము అనేవి నింద్యములు, నిషిద్ధాలు అన్నారు. ఆసుర, గాంధర్వాలు చివరి రెంటికంటె కొంత నయం — సహింపవచ్చు; అంటూ మనుస్మృతి (3-24, 25)లో వీటిలోని మంచి చెడ్డలను గూర్చి చెప్పారు. ఇక్కడ మనం గమనించాల్సిన విశేషం ఏమిటంటే, ఏదైనా ఒక ఆచారం, ముందుగా అనాగరికంగా ఉండి, సమాజం దానిని సహించకపోవటం, సంస్కర్తలు వాటిని సంస్కరించటం, ఆ ఆచారంలో క్రమేణా మార్పులు జరిగి సంస్కరింపబడటం, అది ప్రశస్తరూపంలో సమాజంచేత అంగీకరింపబడటం, అనేవి మనం చరిత్ర ద్వారా తెలుసుకొన్న

సత్యాలు. అట్లాగే, ఈ ఎనిమిది రకాల వివాహాల స్వరూప స్వభావాలను గూర్చి తెలుసుకొన్నప్పుడు మిక్కిలి క్రూరమైన పద్ధతి అత్యంత ప్రాచీనమని. మిక్కిలి ఉత్తమమైన పద్ధతి ఆధునికమని తెలుస్తుంది. కాబట్టి ఈ వివాహాలను గూర్చి చారిత్రకంగా అధ్యయనం చేయాలంటే చివరినుండి ఆరంభించటం సముచితం. అంటే పైశాచంతో ఆరంభించి బ్రహ్మము వరకు అధ్యయనం చేయటం మంచిది. అప్పుడే వివాహవ్యవస్థలో జరిగిన క్రమవికాసం మనకు తెలుస్తుంది. మనం గుర్తు ఉంచుకోవాల్సిన విషయం — అత్యంత ముఖ్యమైన విషయం ఇంకొకటి ఉంది: అదేమిటంటే పైశాచిక వివాహాలు విరివిగా జరిగిన రోజుల్లో కూడా అక్కడక్కడ ఇతర విధాలైన వివాహాలు సైతం జరిగి ఉండవచ్చు; అని. ఎందుచేతనంటే, మానవ సమాజం అంతటా ఒకేవిధమైన వివాహ పద్ధతి ఎన్నడూ అమలులో ఉండి ఉండదు. ఈనాడు కూడా — బ్రాహ్మమే అత్యధికంగా జరుగుతున్న ఈనాడు కూడా ఇతరమైన అన్నిరకాల వివాహాలను మనం అరుదుగానైనా చూస్తూనే ఉన్నాం. అత్యంత నింద్యమైన పైశాచికం సైతం ఈ నాగరక సమాజంలో ఏదో రూపంలో ఎప్పుడో ఒకప్పుడు జరుగుతూనే ఉన్నాయి. ఈ మానభంగాలకు సంబంధించిన ఉదంతాలన్నీ అవేకదా! అట్లాగే, రాక్షస గాంధర్వాలు సైతం జరుగుతూనే ఉన్నాయి. ఇక, వీటి పద్ధతులు. స్వరూప స్వభావాలూ ఎటువంటివో తెలుసుకుందాం.

1. "సుప్తాం మత్తాం ప్రమత్తాం వా రహో యత్రోపగచ్ఛతి।
స పాపిష్ఠో వివాహానాం పైశాచశ్చాష్టమోఽధమః।
(మనుస్మృతి-3-24)

2. "పైశాచః కన్యకా ఛలాత్" అని యాజ్ఞవల్క్యుడు
(యా. స్మృ. 1-61)

3. సుప్తానాం ప్రమత్తానాం వా పహరేత్ స పైశాచః" అని ఆశ్వలాయనుడు
(ఆశ్వ.గృ.సూ. 1-4-31)

1. నిద్రపోతున్నట్టి, ఏకాంతంలో ఉన్నట్టి, స్పృహలేనట్టి కన్యతో మైథునం చేయటం పైశాచకం. ఇది వివాహా లన్నిటిలోకి నికృష్టము, మిక్కిలి హేయము పాపభూయిష్టము అయిన పద్ధతి.

2. కన్యను మోసంతో మోసగించి అపహరించుకుపోవటం పైశాచం.

3. నిద్రపోతున్న, స్పృహలేనట్టి కన్యను అపహరించుకుపోవటం పైశాచం.

ఇటువంటి అభిప్రాయాలే గౌతమ ధర్మసూత్రాల్లో విష్ణు ధర్మసూత్రాల్లో కూడా వ్యక్తం చేశారు. దేవలుడు (దేవల స్మృతిలో) కూడా ఇటువంటి అభిప్రాయాన్నే వ్యక్తం చేశాడు. ఈ పైశాచిక పద్ధతి అత్యంత క్రూరమైనదని నీచాతి నీచమైనదని స్మృతికారులంతా చెప్పారు. కన్య ఎక్కడ లభిస్తే అక్కడ, ఎప్పుడు లభిస్తే అప్పుడు బలాత్కరించటమనేది ఆదిమానవుల్లో అత్యంత అసభ్య జాతుల్లో ఎక్కడో ప్రచారంలో ఉండి ఉంటుంది. ఆనాడు సైతం దీనికి సంఘంలో గౌరవం లేనట్లు తెలుస్తుంది. ఇంత నాగరకులమని, విద్యావంతులమని విఱ్ఱవీగే నేటి సమాజంలో సైతం ఇటువంటి పైశాచిక కృత్యాలు - మానభంగాల లాంటివి జరుగుతూ ఉండటం మనం రోజూ పత్రికల్లో చూస్తున్నాం. మానవజాతికి ఇంతకంటె అవమానకరమైన విషయం ఏముంటుంది? సభ్యసమాజమంతా గర్హించే విషయమే అయినా, పశువులు సైతం పాల్పడని విషయమే అయినా కొన్ని సంఘటనలు జరుగుతూనే వున్నాయి.

అయితే, ఇటువంటి నికృష్టమైన పైశాచిక కృత్యాన్ని మన పూర్వులు వివాహంగా ఎట్లా పేర్కొన్నారు? దీనికి వివాహపద్ధతుల్లో స్థానం ఎట్లా కల్పించారు? అంటే, సమాధానం ఆ కాలంలో మన హిందూ సమాజంలో ఇటువంటి ఆచారం ఉండి ఉండవచ్చు. లేదా కొన్ని అసభ్యజాతుల్లో ఈ పద్ధతి ఆచరణలో ఉన్నందున దీనికి వివాహాల్లో స్థానం కల్పించి ఉండవచ్చు. లేదా, ఈనాటిలాగా మానభంగం చేసి, హింసించి స్త్రీని వదలివేసి పారిపోకుండా, ఆనాడు అట్లా తాను బలాత్కరించిన స్త్రీని వివాహం చేసుకొని పోషించి ఉండవచ్చు. ఈనాడు మనం వివాహ పద్ధతుల్ని వివరించటానికి పూనుకున్నప్పుడు, నేడు జరుగుతున్న పైశాచిక కృత్యాలను వివరించకుండా ఉండలేముగదా! అట్లాగే, అయిష్టమైనా, నిషిద్ధమే అయినా, దీనిని నిందిస్తూనే శాస్త్రకారులు శాస్త్రాల్లో దీనిని ఉదహరించి ఉంటారు. పైశాచానికి గురి అయిన స్త్రీని ఎవరూ వివాహం చేసుకోవటానికి యిష్టపడరు కాబట్టి, ఆ పైశాచిక కృత్యం చేసినవాడే ఆమెను వివాహం చేసుకోవాలని ఆదేశించేటందుకై ఈ విధమైన వాటిని పైశాచాలుగా పేర్కొని ఉంటారు. అదే నిజమైతే ఆనాటి శాస్త్రకారులు మనకంటె చాలా ఉదారులు, సానుభూతిపరులు అని మనం అంగీకరించాలి. ఆపస్తంబుడు, వశిష్ఠుడులాంటివారు కొందరు దీనిని వివాహాల్లో ఒక విధంగా పేర్కొనలేదు. మను స్మృతి భాష్యంలో మేధాతిథి అనే స్మృతికారుడు పైశాచిక రాక్షసాదుల్ని వివాహాలు అని అనకుండా స్త్రీని పొందేందుకు అవలంబించే పద్ధతులుగా పేర్కొన్నాడు. మోసంతో, దొంగతనంగా కన్యను అపహరించి వివాహమాడటాన్ని వశిష్ఠుడు

"బలాచ్చేత్ప్రహృతా కన్యా మంత్రైర్యది న సంస్కృతా అన్యస్మై విధివద్దేయా యథా కన్యా తథైవ సా" (వశి—స్మృ. 17-73) ఎవడైనా కన్యను బలాత్కారంగా ఎత్తుకొని పోయి, మంత్రయుక్తంగా ఆమెను వివాహమాడి ఉండకపోతే, ఆమె మామూలు కన్యలాగానే పవిత్రమైనదే') అని, ఆ కన్య నిర్దోషిత్వాన్ని నిరూపించాడు. దీనినిబట్టి మన ప్రాచీనస్మృతికారులు దీనిని ఒక వివాహపద్ధతిగా అంగీకరించటానికై చెప్పలేదనేది స్పష్టం. వారు కటుశబ్దాల్లో దీనిని ఖండించటాన్ని బట్టే ఈ విషయాన్ని గ్రహించవచ్చు. (ఈ సందర్భంలోనే శ్రీమద్దయానంద సరస్వతి, వేదాలు తప్ప ఇతర గృహ్యసూత్రాలేవీ ప్రమాణం కావని అన్నాడు. మనుధర్మసూత్రాల్లో ప్రక్షిప్తాలను మినహాయిస్తే అది మాత్రమే వేదధర్మాల్ని చెపుతోందని అన్నాడు. స్మృతిపురాణాదులు ప్రామాణికాలు కావు - అనే నిర్ణయం మీదనే ఆర్యసమాజం వారు సంస్కార విధుల్ని విధించారని గుర్తించాలి)

రాక్షస వివాహం

"హత్వా ఛిత్వా చ భిత్వా చ క్రోశన్తీం రుదతీం గృహాత్।
ప్రసహ్య కన్యాం హరతో రాక్షసో విధిరుచ్యతే॥ (మనుస్మృతి. 3-33)

ఏడుస్తూ బొబ్బలు పెడుతూన్న కన్యను, ఆమె బంధువులను కొట్టి, చంపి, గాయపరచి బలాత్కారంగా లాగుకొనిపోయే పద్ధతిని రాక్షస వివాహం అంటారు. అని మనువు చెప్పాడు. పైశాచికంలో కన్యకు తెలియకుండా, మోసగించి తీసికొనిపోవటం చెప్పారు. ఇక్కడ ఎదిరించిన బంధువులందరిని కొట్టి తీసికొనిపోతున్నాడు. మెలకువతో నున్నందున ఏడుస్తూంది. ఇది పైశాచిక, రాక్షసాలకున్న భేదం. అంటే, రాక్షస పద్ధతిలో కన్యయొక్క అనుమతి కోసం ఆమె తల్లిదండ్రుల, బంధువుల అనుమతికోసం ప్రతీక్షించకుండా బలాత్కారంగా హరించుకొని పోవటం అనేది ఉంది. ఇది ప్రాచీన కాలంలో యుద్ధప్రియులైన జాతుల్లో వ్యాప్తిలో ఉండవచ్చు. యుద్ధంలో దోచుకున్న సొమ్ములాగానే, స్త్రీలను సైతం అపహరించి అనుభవించటం అలా ఉండవచ్చు. మనువు పై శ్లోకంలో యుద్ధ దృశ్యమే సాక్షాత్కరిస్తుంది.

ఋగ్వేదంలో విమదుడు యుద్ధంచేసి, జయించి భార్యను పొందినట్లు తెలుస్తుంది. (ఋ. వే. 1-116). "యుద్ధహరేణ రాక్షసః" అని విష్ణు స్మృతిలోను, "రాక్షసో యుద్ధహరణా దితి" అని యాజ్ఞవల్క్య స్మృతిలోను. స్పష్టంగానే రాక్షస వివాహమనేది యుద్ధం నుండి పుట్టినట్లు తెలుస్తోంది. యుద్ధంలో లభించిన స్త్రీలను విజేతలు బంధించటం. పిమ్మట వారిని వివాహమాడటం ప్రాచీన యుద్ధజాతుల్లో

ఆచారంగా ఉండేదని, దాని అవశేష చిహ్నాంగానే ఈ కాలంలో కూడా కొన్ని ఆదిమజాతుల్లో, అనాగరక, అర్థనాగరక జాతుల్లో పెండ్లివారు పరస్పరం పోట్లాడు కోవటం, కన్యను బలాత్కారంగా తీసికొని పోవటం లాంటి దృశ్యాలు కనిపిస్తాయి. చాలమంది ఆటవిక జాతులవారు ఈవిధమైన యుద్ధ దృశ్యాలను పెండ్లికాలంలో అభినయిస్తూ ఉంటారు. గోండుల్లోను ఇంకాకొన్ని జాతుల్లోను, పారిపోయే పెండ్లి కూతుర్ని వెంటబడి తరమటం, పట్టుకోవటంలాంటి నాటకీయత నేటికీ కనిపిస్తుంది. మన పురాణేతిహాసాల్లో ఇటువంటి సన్నివేశాలు అక్కడక్కడ కనిపిస్తాయి. సుభద్రార్జునుల వివాహాన్ని రుక్మిణీ కృష్ణుల వివాహాన్ని రాక్షస వివాహానికి ఉదాహరణగా చెపుతారు. కాని వీరి విషయంలో కన్యల అంగీకారం ఉన్నట్లు, వారి తల్లి దండ్రుల, బంధువుల అంగీకారం మాత్రం లేనట్లు తెలుస్తుంది. పైగా శ్రీకృష్ణునికి ఈ రాక్షస విధి బాగా నచ్చిన పద్ధతిలాగా కనిపిస్తుంది. సుభద్రను అర్జునుడు రాక్షసవిధితో గ్రహించినప్పుడు, బలరాముడు కోపించగా, ఆతని కోపాన్ని శాంతింపచేస్తూ శ్రీకృష్ణుడు అన్నాడు:

ప్రదానమపి కన్యాయాః పశువత్కోఽనుమన్యతే
విక్రయంచా ప్యపత్యస్య కః కుర్యాత్ పురుషోభువి
ఏతాన్దోషాంస్తు కౌంతేయో దృష్టవానితి మే మతిః
క్షత్రియాణాంతు వీర్యేణ ప్రశస్తం హరణం బలాత్
అతః ప్రసహ్య హృతవాన్ కన్యాం ధర్మేణ పాండవః॥
(మ. భా. 1-245-5,6)

‘పశువును దానం చేసినట్లు కన్యాదానం చేస్తారని నిరీక్షిస్తూ వీరుడైనవాడు ఎట్లా కూర్చుంటాడు? అట్లాగే, డబ్బు తీసికొని తన కొమార్తెను అమ్మే నీచుడు ఈ భూమిమీద ఎవడుంటాడు? ఈ దోషాలున్నందువల్లనే అర్జునుడు క్షత్రియోచితంగా సుభద్రను అపహరించుకొనిపోయి ఉంటాడని నా ఉద్దేశ్యం’ అంటూ తన కిష్టమైన రాక్షసాన్ని సమర్థిస్తాడు కృష్ణుడు - తాను చేసిన పనీ అదే గదా! అట్లాగే, భీష్ముడు యుద్ధంలో కాశీరాజును ఓడించి ఆతని కూతురు అంబను విచిత్రవీర్యునికిచ్చి వివాహం చేయటానికై అపహరించుకొని రావటం, భీష్ముడు చేసిన పనిని శిశుపాలుడు కటువచనాలతో నిందించటం భారతంలో ఉంది.

అంతమాత్రంచేత పూర్వకాలంలో క్షత్రియులంతా రాక్షస వివాహాలే చేసుకొనేవారని అనుకోవటం పొరపాటు. ఈ రాక్షస పద్ధతి అపవాదరూపంలో మాత్రమే

ఉండేదని. క్షత్రియులు సైతం మిగతా వివాహ పద్ధతుల్నే అవలంబించేవారని తెలుస్తుంది. ఎక్కడైనా అరుదుగా జరిగినా కన్యయొక్క అంగీకారం తప్పకుండా ఉన్నట్లు తెలుస్తుంది. చరిత్రలో మనకు పృథ్వీరాజు సంయుక్తల వివాహం చివరి రాక్షస వివాహంగా కనిపిస్తుంది. ఇక్కడ కూడా సంయుక్త అంగీకారం ఉంది. ఆమె తండ్రియైన జయచంద్రుని అంగీకారం లేదు. కాబట్టి రాక్షసంలో కన్య అంగీకారం ఉండాలి అని గ్రహించాల్సి వస్తుంది. లేకపోతే ఇవి రాక్షస వివాహాలు కాకుండా పోవాలి. కేవలం యుద్ధంలో అపహరించుకొనిపోయి, కన్య కిష్టం లేకపోయినా చేసుకొనే వివాహాలే రాక్షసాలు అయి ఉండాలి. రాజపుత్ర చరిత్రలో, కొన్ని గాథల్లో, తమ స్త్రీలకు ఇటువంటి దుఃఖం కలగకుండా ఉండటానికై, యుద్ధానికి బయలుదేరే ముందే స్త్రీలను చంపివేయటం, భర్త యుద్ధంలో మరణించినట్లు తెలియగానే స్త్రీలు చితిలో మాడిపోవటంలాంటి కథలు చదువుతూ ఉంటాం. అంటే, ఇతర దేశాల్లో కూడా ఎక్కడైనా, ఎప్పుడైనా ఇటువంటి పద్ధతులు అమలులో ఉన్నాయా? అనే జిజ్ఞాస కలగవచ్చు.

ప్రపంచంలో ఎక్కడా ఈ పద్ధతి లేదనుకోవటం పొరపాటు. ఈ పద్ధతి, ప్రాచీనకాలంలో అన్ని దేశాల్లో, అన్ని నాగరక జాతుల్లో, అనాగరక ఆటవిక జాతుల్లో ఉన్నట్లు పాశ్చాత్య విద్వాంసులు చాలమంది సప్రమాణంగా రుజువుచేశారు. టస్కానియా ప్రజలు యుద్ధాల్లో స్త్రీలను పట్టుకొని వచ్చి వారిని వివాహం చేసుకొనే వారని డా॥ వెస్టర్‌మార్క్ వ్రాశాడు. ఆస్ట్రేలియా ద్వీపంలో చాలచోట్ల కన్యను అపహరించి తెచ్చి పెండ్లి చేసుకొనేవారట. ఆస్ట్రేలియాలో మామూలు పద్ధతుల్లో కన్య లభించదని తోచినప్పుడు అపహరించి తెచ్చేవారని 'విల్‌షైర్' అనే పండితుడు వ్రాశాడు. మెడగాస్కర్‌లో 'సకలవ' జాతివారు ప్రతి సంవత్సరం అనేకమంది ఇతరజాతుల స్త్రీలను అపహరించుకొనివచ్చి పెండ్లి చేసుకొనేవారని Sakalava and their customs అనే గ్రంథంలో Mc. Mohon వ్రాశారు. "మహమ్మదీయేతర జాతుల్లో, యుద్ధంలో స్త్రీలను అపహరించుకు రావటం, అపహరించుకొని రాబడిన కన్య, అపహరించుకొని వచ్చినవానిని వివాహం చేసుకోవటానికి అంగీకరిస్తే వారి వివాహం న్యాయశాస్త్రరీత్యా చెల్లుబాటు అయ్యేది; అంటూ "Kinship and marriage in early Arabia" అనే పుస్తకంలో R. Smith అనే పండితుడు పేర్కొన్నాడు. అట్లాగే, సెమాయిట్, హిబ్రూ జాతుల్లో ఆ జాతి సైనికుల్లో సైతం ఈ పద్ధతి ఆచరణలో ఉన్నట్లు తెలుస్తుంది. గ్రీకుల్లో, ప్రాచీన ట్యూటన్

జాతిలో ఈ ఆచారం ఉండేది. రష్యాలోని కజ్జాక జాతివారిలో 17-వ శతాబ్దివరకు, స్లావ్ జాతివారిలో 19-వ శతాబ్దం వరకు ఈ ఆచారం ఉండి. హై ఆల్బేనియాలో ఈ నాటికీ ఈ పద్ధతి ఉంది. టిబెట్‌లో యువకుడు తాను వలచిన కన్యకోసం కొంత కాలం నిరీక్షించాల్సి వచ్చినపుడు ముందుగా అవకాశం లభించినప్పుడు ఆ కన్యను అపహరించుకొని వచ్చి, తన యింట్లో దాచి ఉంచి, పిమ్మట ఆమెను వివాహమాడటం ఉంది. మలయాలో చాలా ప్రాంతాల్లో ఈ ఆచారం ఉంది. బలి ద్వీపంలో కన్యకు యిష్టం లేకపోయినా ఆమెను తీసికొని పారిపోవటం ఉంది. అయితే. ఇందుకు జుల్మానాలాగా ఆమె తండ్రికి ఆ యువకుడు కొంత ధనం చెల్లించాలి. ఇట్లా ప్రపంచంలోని చాలా భాగాల్లో, వివిధ కాలాల్లో, వివిధ జాతుల్లో, ఈ రాక్షస వివాహ సంప్రదాయం, లేదా, దానిని పోలిన సంప్రదాయం ఆచరణలో ఉన్నట్లు తెలుస్తోంది. అయితే మన దేశంలో హిందువులు, వ్యవసాయం వ్యాపారంలాంటి వృత్తుల్లో స్థిరపడి, స్థిరజీవనానికి అలవాటుపడటంతో ఈ ఆచారం దూరమై పోయింది.

**గాంధర్వం:**

గాంధర్వం అనేది ప్రపంచంలో మిక్కిలి ప్రసిద్ధమైన వివాహ పద్ధతి. అందరికీ ఇష్టమైన పద్ధతి. ఎందుచేత? ఈ పద్ధతి వివాహంలో ప్రేమకు ప్రాధాన్యం ఉంది కాబట్టి! వధూవరుల ప్రేమకు, వారి అభీష్టానికి ఈ గాంధర్వం ఎక్కువ అవకాశాన్ని యిచ్చి, వారి ప్రేమకు ఆధారంగా ఉంటుంది. ఈనాడు పాశ్చాత్యదేశాల్లో నూటికినూరు వివాహాలూ ఈ పద్ధతిలోనే జరుగుతున్నాయని అనవచ్చు. అయితే, గాంధర్వం అనటంతోనే మనదేశస్థులు పెద్ద సభను: రాజకుమారులంతా ఆసీనులై ఉండటాన్ని, ఇటువంటి దృశ్యాల్ని ఊహించుకుంటారు, ఇది తప్పు.

"మిథః సమయం కృత్వోపయచ్ఛేత్ స గాంధర్వః" (ఆశ్వ. గృ. సూ. 1-4-29) "వధూవరులు పరస్పరం నిశ్చయించుకొని, ఒకరితో ఒకరు సమాగమాన్ని పొందటమే గాంధర్వం" అని ఆశ్వలాయనుడన్నాడు. హారీతుడు, గౌతముడు కన్య, తాను స్వయంగా భర్తను ఎన్నుకొనటాన్నే గాంధర్వం అంటారు. మనువు చెప్పినది ఇంకా విస్తృతంగాను, వ్యాపకంగానూ ఉంది —

"ఇచ్ఛా యాఽన్యోన్య సంయోగః కన్యాయాశ్చ వరస్య చ
గాంధర్వః స తు విజ్ఞేయో మైథున్యః కామసంభవః। (మనుస్మృతి 3-32)

వధూవరులు కామానికి వశులై, స్వేచ్ఛగా సంయోగం చెందటం (కలియటం) అనే పద్ధతిని గాంధర్వం అంటారు; అని. ఇందులో వధూవరుల తల్లిదండ్రుల

ప్రమేయం ఉండదు. వధూవరుల కామమే ప్రధానపాత్ర వహిస్తోంది. అయితే ఈ పద్ధతి వెనుక చెప్పబడిన రెంటికంటె ప్రశస్తం అనాలి. ఎందుచేత? ఇది వాటికంటె ఎక్కువ స్వాభావికమైనది కాబట్టి, సహజ ప్రవృత్తి కాబట్టి; వంచన, బలాత్కారము లేదు కాబట్టి!

అయితే, ఈ పద్ధతిని గూర్చిన సూచన మనకు ఋగ్వేదంలో 10-17-12 లో కనిపిస్తుంది. "కియతీ యోషా మర్యతో వధూయోః పరిప్రీతా పన్యసా వార్యేణ భద్రా వధూర్భవతి యత్ సుపేశాః స్వయం సా మిత్రం వనుతే జనేచిత్" "వధువు అందమైన వేషంతో అలంకారాలతో, జనసముదాయంలో తన భర్తను — మిత్రుని — వరిస్తుందో ఆమెను 'భద్ర' అంటారు" అని. అథర్వణ వేదంలో 2-36 లో "ఆ నో అగ్నే సుమతిం సంభలో గమేదిమాం కుమారీం సహ నో భగేన జుష్టా వరేషు సమనేషు వల్గురోషం పత్యా సౌభగమస్త్వస్యై" "కన్యయొక్క తల్లిదండ్రులు వధువును తనకిష్టమైన భర్తను ఎన్నుకొనేందుకు స్వతంత్రంగా వదలి వేస్తారు" అని; అట్లాగే, అథర్వవేదంలో అనేకచోట్ల ఈ గాంధర్వప్రశంస కని పిస్తుంది — "తల్లిదండ్రులు, తమ ఈ కన్య ఎప్పుడు పెద్దదై తనకు తగిన భర్తను ఎన్నుకొంటుంది? అని ప్రతీక్షిస్తూ ఉంటారు," అని, "ఇది, మిక్కిలి సామాన్య విషయమని, ఇందులో నిందింపతగినదేమీలేదని, అప్రతిష్ఠ అనేది లేదు" అని ఋగ్వేదం 6-60 ని బట్టి తెలుస్తుంది.

దీనినిబట్టి మనకు తెలిసే విషయాలు (1) గాంధర్వంలో వధూవరుల పరస్పర ఆకర్షణ, కామం ప్రధానం. (2) ఇరువురూ యుక్తవయస్కులు. (3) తల్లిదండ్రుల ఇష్టంతో అనిష్టంతో పనిలేదు. (4) సంఘంలో ఈ పద్ధతికి అగౌరవంలేదు; అంగీకారం ఉంది; అని.

గాంధర్వంలోని ఔచిత్యానౌచిత్యాలను గూర్చిన అభిప్రాయభేదాలు సైతం ఉన్నాయి. తల్లిదండ్రుల అనుమతిలేకుండా, కన్య తన ఇష్టంవచ్చిన వానిని వరించడం చాలమందికి నచ్చదు; ముఖ్యంగా మనదేశంలో. కాని, ప్రేమ అనే స్వాభావిక ప్రవృత్తిమీద గట్టిగా ఆధారపడిన వివాహం అయినందున ధర్మశాస్త్ర కారులు చాలమంది దీనిని ప్రశంసించారు — "గాంధర్వ మిత్యేకే ప్రశంసన్తి సర్వేషాం స్నేహానుగతత్వాత్" (బౌధా.ధ.సూ. 1-11-13-7) అని బోధాయను డన్నాడు. వాత్స్యాయనుడు — వ్యూఢానాం హి వివాహానామనురాగః ఫలం యతః మధ్యమోఽపి హి సద్యోగో గాంధర్వస్తేన పూజితః

సుఖత్వాద బహుక్లేశాదపి చావరణా దిహ।
అనురాగాత్మకత్వాచ్చ గాంధర్వః ప్రవరోమతః॥

(కామసూత్రాలు — 3-5-29, 30)

(వివాహానికి ఫలం ప్రేమ. ఆ ప్రేమ అనేది గాంధర్వంలో అధికంగా ఉంటుంది. కాబట్టి పూజనీయమైనది. ఇది సుఖాన్ని కలిగించేది. ఇందులో కష్టాలు ఉండవు. — రాక్షసపైశాచాల్లాగా కన్యాపహరణంలాంటి బలాత్కారంతో కూడిన ఇబ్బందులేవీ ఉండవు. ఇది అనురాగాత్మకం. అంటే. ప్రేమమీద ఆధారపడిన పద్ధతి)

కణ్వుడు సైతం "స కామాయాః స కామేన నిర్మన్త్రః శ్రేష్ఠ ఉచ్యతే' (మహాభారతం 6-94-60)లో. తమలోతామే వివాహం చేసుకొందామని అనుకొనే స్త్రీ పురుషులకు ఈ గాంధర్వ వివాహ పద్ధతి శ్రేష్ఠమైనదని అన్నాడు. మహాభారతం లోనే, 13-44-10 లో భీష్ముడు సైతం ఇట్లా అన్నాడు. "బ్రాహ్మః క్షాత్రోఽథ గాంధర్వః ఏతే ధర్మ్యాః నరర్షభ. పృథగ్వా యదివా మిశ్రాః కర్తవ్యాః నాత్ర సంశయః" అని. ఓ ధర్మరాజా! బ్రాహ్మము, క్షాత్రము (ప్రాజాపత్యము) గాంధర్వము. ఈ మూడూ ధర్మానుకూలమైనవిగా చెప్పబడ్డాయి. ఇవి విడివిడిగాగాని ఇతర పద్ధతులతో కలిపిగాని చేయదగినవి. ఇందులో సందేహంలేదు. (భారతంలో బ్రాహ్మ, ప్రాజాపత్య, గాంధర్వ, అసుర. రాక్షసము లైదింటినే చెప్పారు. ఇక్కడ బ్రాహ్మం అనేదాంట్లోనే దైవ ఆర్షవివాహాలు అంతర్భావంగా ఉన్నాయి. అట్లాగే రాక్షసంలోనే పైశాచాన్ని అంతర్భావంచేసి చెప్పారని గ్రహించాలి. ఈ విధంగా భీష్ముడు సైతం గాంధర్వాన్ని ధర్మమనే అన్నాడు. మనువు — "ఇచ్ఛాయాఽన్యోన్య సంయోగః కన్యాయాశ్చవరస్య చ। గాంధర్వ స్సతు విజ్ఞేయో మైథున్యః కామసంభవః॥ (మ.స్మృ. 3-32) అంటూ "పంచనాం తు త్రయో ధర్మ్యాః ద్వావధర్మ్యౌ స్మృతావిహ.

పైశాచశ్చాసురశ్చైవ న కర్తవ్యౌ కదాచన. "(మనుస్మృతి 3-25) అని గాంధర్వాన్ని ధర్మానుకూలమైనదనే అన్నాడు. అయితే, వాత్స్యాయనుడు ఏ కారణం చేత గాంధర్వాన్ని ప్రశంసించాడో. ఆ కారణంగానే (కామమనేది ప్రధానం అవు తుందువల్లనే, ధార్మిక సంస్కార క్రియాహీనంగా జరిగేది కాబట్టే) అది అప్రశస్తం" "గాంధర్వస్తు క్రియాహీనః రాగాదేవ ప్రవర్తతే" అంటూ వీరమిత్రోదయకర్త యైన మిత్రమిశ్రునిలాంటివారు అన్నారు. కేవలం ఆకర్షణవల్ల, కామంవల్ల జరిగే

వివాహం కాబట్టి. దీని స్థిరత్వాన్ని శంకించాడు. ఇతిహాసంలో ఈ విధంగా ప్రసిద్ధంగా ఉన్న వివాహం శకుంతలా దుష్యంతులది, సత్యవతీ శంతనులది. ఇక సంస్కృత సాహిత్యంలో పద్మావతీ ఉదయనుల వివాహం, మాలతీ మాధవంలోని నాయకీనాయకుల వివాహం సాహిత్యపరంగా ఈ వివాహానికి ఉదాహరణలు.

స్వయంవరం:

మనం సామాన్యంగా పురాణాల్లో ఇతిహాసాల్లో స్వయంవరం అనే వివాహ పద్ధతిని గూర్చి చదువుతూ ఉంటాము. దీనిని కూడా గాంధర్వపద్ధతిగానే కొంతమంది పరిగణిస్తారు. కాని, వీటి రెంటికీ కొద్దిగా భేదం ఉంది. గాంధర్వంలో వధూ వరులిద్దరి ప్రమేయమే ఉంటుంది. ఇతరులకేమీ సంబంధం ఉండదు. —ముఖ్యంగా తల్లిదండ్రులకు, బంధువులకు! ముందుగా వారిద్దరే పరస్పరం ప్రేమించుకొని వివాహం చేసుకొంటారు. తరువాత పెద్దల అనుమతి లభించటం, లభించకపోవటంతో ప్రమేయం ఉండదు. స్వయంవరం అట్లాకాదు. ముందుగానే పెద్దలు కన్య తనకు తగిన వరుని వరించటానికి ఏర్పాట్లు చేస్తారు. స్వయంవరం అనేది, సామాన్యము విశిష్టము అని రెండు విధాలుగా ఉండవచ్చు. సామాన్యమనేది, ఆడంబరం ఏమీలేకుండా జరుగుతుంది. అంటే, తండ్రి తన కుమార్తెకు వరుని చూచి వివాహం చేయలేనప్పుడు. కన్య తనంతట తానే వరుని అన్వేషించి నిశ్చయించుకొంటుంది. తన కుమార్తె రజస్వల అయిన మూడు సంవత్సరాలలోగా వరుని వెదకి వివాహం చేయలేకపోతే, తనంతట తానే వరుని, తగిన వానిని అన్వేషించుకొని వివాహమాడే స్వేచ్ఛ, అధికారం కన్యకు ఉన్నట్లుగా మనుస్మృతి చెపుతోంది —

“త్రీణి వర్షాణ్యుదీక్షేత కుమార్యృతుమతీ సతి
ఊర్ధ్వం తు కాలాదేతస్మాద్విన్దేత్ సదృశం పతిమ్. (మనుస్మృతి 9-90)

యాజ్ఞవల్క్యుడు మూడు సంవత్సరాల గడువు కూడా పెట్టలేదు.

“గమ్యం త్వాభావే దాతౄణాం కన్యాకుర్యాత్ స్వయంవరమ్”
(యా. స్మృ. 1-64)

తండ్రి గాని, బంధువులుగాని, బాధ్యతకలవారుగాని, తనకు వివాహం చేయలేని స్థితిలో ఉన్నప్పుడు కన్య స్వయంగా వరుని ఎన్నుకొని వివాహమాడవచ్చు. ఇది సామాన్య పద్ధతి. “ఈ పద్ధతిలో వివాహం చేసుకొన్న కన్య, పుట్టింటివారిచ్చిన

అలంకారాదులను తీసికొని రాకూడదు. వాటి అన్నింటిని వారికే తిరిగి యిచ్చి వేయాలి. ఆమె భర్త (వరుడు) కన్యయొక్క తల్లిదండ్రులకు ఏ విధమైన శుల్కమూ చెల్లించనక్కరలేదు'' అని మనువు శాసించాడు —

''అలంకారం నాదతీత పిత్ర్యం కన్యా స్వయంవరా
మాతృకం భ్రాతృదత్తం వా స్తేనా స్యాద్యది తం హరేత్
పిత్రే న దద్యాత్ శుల్కం తు, కన్యామృతుమతీం హరన్
స హి స్వామ్యాదతిక్రామేదృతూనాం ప్రతిరోధనాత్.''

(మనుస్మృతి 9-92, 93)

సరియైన సమయంలో కొమార్తెకు వివాహం చేయలేని తండ్రికి శుల్కం తీసుకొనే అధికారం ఉండదు. సావిత్రి స్వయంవరం ఈవిధమైనది. అయితే స్వయంవరం అనేది క్షత్రియులకు అభీష్టమైనదే అయినా, వారు కన్యను అపహరించటానికే ఇష్టపడతారు అని మహాభారతం చెపుతోంది —

స్వయంవరం తు రాజన్యాః ప్రశంసంతి ఉపయాన్తిచ
ప్రమథ్య తు హృతామాహు ర్జ్యాయసీం ధర్మవాదినః

(మ. భా. 1-102-16)

**విశిష్ట స్వయంవరం:**

ఈ పద్ధతిలో తండ్రి తన కొమార్తె వివాహం కోసం పెద్ద సభ ఏర్పాటు చేయటం, రాజకుమారులంతా ఆ సభకు రావటం, వధువు అలంకృతయై, పూదండ చేతబట్టి, చెలికత్తె వెంటరాగా సభామంటపంలో ప్రవేశించటం, చెలికత్తె ఒక్కొక్క రాజకుమారుని గుణగణాదులను వర్ణించి చెప్పటం, రాజకన్య తనకు నచ్చిన రూప విద్యావయోలావణ్య పరాక్రమాదులు గలవాని మెడలో పూలదండ వేసి వరించటం, పిమ్మట వారిరువురికి కన్యయొక్క తండ్రి సమంత్రకంగా వివాహం జరిపించటం ఈ పద్ధతి లక్షణం. ఇందుమతి, దమయంతి మొదలైనవారివి ఈ పద్ధతి స్వయంవరాలు. కొన్ని స్వయంవరాలలో, వరునికి పరాక్రమ ప్రదర్శనాదులకు సంబంధించిన కొన్ని షరతులు విధించటం, వరుడు ఆ పరీక్షలో నెగ్గితే కన్య అతని మెడలో మాల వేయటం, తరువాత సమంత్రకంగా వివాహం జరిపించటం ఉంది — సీతా స్వయంవరం, ద్రౌపదీ స్వయంవరం లాగా! ఈ పద్ధతి పూర్వపు మహారాజుల వంశాల్లో ఉన్నట్లు తెలుస్తుంది. బ్రాహ్మణులకీ అధికారం లేదనీ తెలుస్తోంది.

ఈ విశిష్ట స్వయంవరమనే ఆచారంలోనే, కన్యయొక్క అభీష్టంకంటె ఆమె తల్లిదండ్రుల అభీష్టానికి, వారు విధించిన షరతులకు అధిక ప్రాధాన్యం వచ్చింది. క్రమేణా కన్యయొక్క యిష్టానికి ప్రాధాన్యం తగ్గి, దానం రూపంలో కన్యను ఇవ్వటం అనే ఆచారం వచ్చి ఉంటుంది. అంటే, గాంధర్వమైనాసరే మంత్ర సహితంగా వివాహం జరగాల్సిందే!

"గాంధర్వేషు వివాహేషు పునర్వైవాహికో విధిః
కర్తవ్యశ్చ త్రిభిర్వర్ణైః సమయేనాగ్ని సాక్షికః॥

అని మనుస్మృతి 8-226 విషయమై దేవల డన్నాడు. అనాడు గాంధర్వం అనేది అస్థిరమనే భావంతో సమాజం మంత్రహీనమైన వివాహాన్ని అంగీకరించ లేదన్నమాట. ఈ విషయం "అజ్ఞాత హృదయేష్వేవం వైరీభవతి సౌహృదమ్" అభి.శాకుంతలం 5-24 లో కాళిదాసు వచనాల్నిబట్టి తెలుస్తుంది. ఈ విధంగా మంత్ర సహిత వివాహానికి, తల్లిదండ్రులు, పెద్దలు చేసే వివాహానికి, బాల్యవివాహాలకు సమాజంలో ప్రాధాన్యత పెరిగినకొద్దీ గాంధర్వ పద్ధతి క్షీణించింది.

వివాహమనేది మానవజాతికంతకు ఎట్లా స్వాభావికమో, అట్లాగే అన్ని దేశాల్లోనూ ఈ వివాహ పద్ధతులు ఉండేవాను! అన్ని దేశాల్లోను ఏవో కొన్ని మార్పులతో ఈ గాంధర్వాది వివాహాలన్నీ అమలులో ఉన్నట్లు చరిత్రకారుల వ్రాతల్నిబట్టి తెలుస్తుంది. ఈనాటికీ అన్ని దేశాల్లోనూ ఈ గాంధర్వ పద్ధతి, స్వయంవరం పద్ధతి చెదురు మదురుగానైనా కనిపిస్తూనే ఉంటుంది.

ఆసురం (మానుషం) :

కొంతమంది ధర్మశాస్త్రకారులు ఆసుర వివాహాన్నే 'మానుషం' అన్నారు. గాంధిల్యం ప్రకారం ఈ పద్ధతి (ఆసురం) శ్రేష్ఠమైనదని ఆపస్తంబ గృహ్యసూత్రాల్లో చెప్పబడ్డది. ఈ ఆసుర వివాహానికి నిర్వచనం చేస్తూ మనువు —

"జ్ఞాతిభ్యో ద్రవిణం దత్త్వా కన్యాయై చైవ శక్తితః।
కన్యాప్రదానం స్వాచ్ఛన్ద్యాదాసురో ధర్మ ఉచ్యతే."

(మనుస్మృతి-3-31)

వరుడు, కన్యకు ఆమె బంధువులకు యథాశక్తి ధనం ఇచ్చి స్వచ్ఛందంగా కన్యను వివాహమాడటాన్ని ఆసురం అంటారు అని అన్నాడు. ఈ పద్ధతి వివా

హంలో ధనం (కన్యాశుల్కం) ప్రధానపాత్ర వహిస్తోంది. కొంచెం ఇంచుమించుగా ఇది ఒక విధమైన వ్యాపారమే: అందుచేతనే చాలమంది ధర్మశాస్త్రకారులు ఈ పద్ధతిని నిందించి దీనికి 'మానుషం' అనే పేరు ఇచ్చారు. అయితే పైశాచంలోని మోసము, దగా, రాక్షసంలోని క్రూరత్వం వగైరా లక్షణాలు దీనిలో లేనందున వాటి కంటె కొంచెం మంచి పద్ధతిగా అంగీకరింపబడ్డది.

"ఆసురో ద్రవిణాదానాత్" అని యాజ్ఞవల్క్యుడు. "విత్తేనానతిః స్త్రీమతా మాసురః" అని గౌతముడు అన్నారు. అంటే, ఆసురంలో ధనం యిచ్చి కన్యను పొందటం ముఖ్యమైన విషయ మన్నమాట.

పితృస్వామ్యం ఆచరణలో ఉన్న కులాల్లో, కన్యసైతం తండ్రియొక్క సంపదగానే భావింపబడ్డది. వివాహంచేసి కన్యను పంపటంవల్ల సంసారానికి కలిగే నష్టాన్ని పూడ్చటానికై వరుని వద్దనుండి కొంత ధనం అపేక్షించి ఉంటారు. ఇదే రాను రాను కన్యాశుల్కం అనే ఆచారంగా ప్రబలింది. పైగా ఏ కన్యనైనా మూల్యం తీసుకోకుండా ఉచితంగా దానం చేస్తే, ఆ కన్యకు ఆ సంసారానికీ ఏవిధమైన గౌరవము, హోదా లేనట్లుగా పరిగణించేవారు. ఈ కాలంలో వరుడు కట్నం లేకుండా వివాహానికి ఇష్టపడితే ఆతనిని, ఆతని వంశాన్ని కూడా చులకనగా చూస్తున్నట్లు, ఈ కారణంచేత కూడా కన్యాశుల్కం తీసుకోవటం, ఇవ్వటం ఆచారంగా మారి వుండవచ్చు. ఇట్లా కన్యాశుల్కమనేది వంశప్రతిష్ఠకు, వారి స్థాయికి చిహ్నంగా తయారైంది. మొదట్లో కన్యయొక్క తండ్రికి మాత్రమే యిచ్చినా, రాను రాను కన్యకు కూడా కొంత భాగం యివ్వటం ఆచారమైంది. (ఈకాలంలో వరునికిచ్చే కట్నంతోబాటు, అత్తకు, ఆడుబిడ్డలకు, వారి భర్తలకు కూడా కట్నాలు యివ్వటం ఆచారమైనట్లు) కన్యాశుల్కం డబ్బు రూపంలోను, వస్తురూపంలోనూ కూడా ఉన్నట్లు తెలుస్తుంది. ఈవిధమైన కన్యాశుల్కం అనేది ఈ శతాబ్దారంభం వరకు ఆంధ్ర, కేరళ, మద్రాసు మొదలైన దక్షిణ రాష్ట్రాలలో ప్రచారంలో ఉంది. గత శతాబ్దంలో మగవానికి - డబ్బులేని మగవానికి - వివాహమవటమే కష్టంగా ఉండేది. కొన్ని అసభ్య జాతుల్లో కన్యాశుల్కం ఇవ్వలేకపోతే వరుడు కొన్నాళ్ళపాటు మామ గారి యింట్లో ఉండి, అక్కడ ఆ సంసారంలో చాకిరి చేయాలనే నియమం ఉండేది; ఇప్పుడూ ఉంది. ఈ పద్ధతిలో స్త్రీకి సైతము విలువ ఉన్నదని సమాజం గుర్తించిందన్నమాట. చిన్న చిన్న విషయాలలో స్త్రీ మీద పురుషుడు, ఆతని తల్లివాళ్ళు స్త్రీని కష్టపెట్టటానికి సాహసించరు — మళ్ళీ భార్యను పొందాలంటే చాలా ఖర్చుతో

శ్రమతో చూపిన పని కాబట్టి! కొంచెం ఇంచుమించు వరకట్నంవల్ల ఈనాడు పురుషుల స్థితి ఉన్నట్లే. ఆనాడు స్త్రీల పరిస్థితి ఉన్నదనవచ్చు. అందుచేతనే పైశాచ రాక్షస గాంధర్వాలకంటె ఈ పద్ధతి శ్రేష్ఠమన్నారు. అసీరియన్ జాతివారిలో ఈ ఆచారం ఉండేదనీ ఆ ఆచారమే యిచటికి వచ్చి ఉంటుందనీ. అసీరియన్ జాతి ఆచారం కాబట్టి దీనికి 'ఆసురము' అనే పేరు వచ్చి ఉండవచ్చునని కొందరు ఊహిస్తున్నారు.

ఈ ఆసుర వివాహాన్ని గురించిన ప్రస్తావన ఋగ్వేదంలో సైతం (1-109-2)లో ఉంది-అంటే. కన్యావిక్రయాన్ని గూర్చి; కన్యకోసం చాలా మూల్యం చెల్లించాల్సిన అగత్యం గురించి. అట్లాగే కొందరు కన్యలు ధనలోభంలో పడి అయోగ్యులైన వరుల్ని పెండ్లాడినట్లు ఋగ్వేదంలోనే (10-17-12)లో ఉంది. ఆ వేదంలోనే ఒక ఋక్కులో ఒక ఋషి అశ్వినులను విజామాతలాగా ఉదారచరితులుగా ఉండమని ప్రార్థించాడు. "అశ్రవం హి భూరి దావత్తరా వాం విజామాతురుత వా ఘాస్యాలాత్" (ఋ. వే. 1-109-2) విజామాత అంటే డబ్బు పెట్టి భార్యను కొనుక్కున్న భర్త అన్నమాట. అట్లాగే మైత్రాయణీ సంహితలో డబ్బు యిచ్చి కొనుక్కున్న స్త్రీని గురించి చెపుతూ. అట్టి స్త్రీని నమ్మరాదని, చరిత్రహీనురాలని నిందించినట్లుగా కనిపిస్తుంది — "అనృతం వా ఏషాకరోతి యా పత్యుః క్రీతా సతీ అన్యైః సంచరతి" మై. సం. 1-10-11.

ఆరంభంలో ఈ ఆసుర వివాహ పద్ధతి సమాజానికి ఆమోదయోగ్యంగా ఉన్నా, రాను రాను కొంత వ్యతిరేకత వచ్చినట్లు కనిపిస్తుంది. పురాణేతిహాసాల విషయం చూస్తే, రామాయణంలో కైకేయి వివాహం కన్యాశుల్కం తీసుకొనే జరిగినట్లు తెలుస్తుంది. భారతంలో గాంధారి. మాద్రి, వీరి వివాహాలకు సైతం, భీష్ముడు కొంత కన్యాశుల్కం చెల్లించినట్లు తెలుస్తుంది. అప్పటికే సమాజంలో కన్యావిక్రయాన్ని గూర్చిన ఆచారం నింద్యంగా ఉండి ఉంటుంది. మనువు మొదలైన స్మృతికారులు కన్యావిక్రయమనే ఆచారాన్ని ఎంత తీవ్రంగా ఖండించారో చూడండి — (మనుస్మృతి-3-51)

"న కన్యాయాః పితా విద్వాన్ గృహ్ణీయాచ్ఛుల్కమణ్వపి
గృహ్ణన్ హి శుల్కం లోభేన స్యాన్నరోఽపత్య విక్రయీ."

ఎంత పండితుడైనా తన కొమార్తె కోసం కన్యాశుల్కం గ్రహించరాదు. కన్యాశుల్కం తీసుకోవటం అంటే తన కొమార్తెను అమ్ముకోవటమే! అట్లాగే మను స్మృతిలోనే 9-98 లో—

''ఆదదీత న శూద్రోఽపి శుల్కం దుహితరం దదత్
శుల్కం హి గృహ్ణన్ కురుతే ఛన్నం దుహితృవిక్రయమ్.''

బోధాయనుడు తన ధర్మ సూత్రాల్లో (1-11-20) ''క్రీతాద్రవ్యేణ యా నారీ. సా న పత్నీ విధీయతే న సా దైవే న సా పిత్ర్యే. దాసీం తాం కవయో విదుః॥ ధనమిచ్చి కొని తీసికొనిరాబడిన స్త్రీ, పత్ని కానేరదు. అంటే. ఆమెకు ధర్మపత్ని గౌరవముండదు. అటువంటి క్రీతయైన స్త్రీ. దైవకార్యాలలో పితృకార్యాలలో భాగ స్వామిని కానేరదు. అంటే ధర్మపత్ని కానేరదు అని అన్నాడు. అంతేకాక బోధా యనుడే ఇంకొక అడుగు ముందుకువేసి ఇట్లా అంటున్నాడు:—

''శుల్కేన యే ప్రయచ్ఛన్తి స్వసుతాం లోభ మోహితాః
ఆత్మవిక్రయిణః పాపాః మహాకిల్బిష కారకాః
పతన్తి నరకే ఘోరే ఘ్నన్తి చాసప్తమాత్కులమ్.''
(బోధా.ధ.సూ. 1-11-20, 21)

''ధన లోభంలో గ్రుడ్డివాడై తన కూతుర్ని శుల్కం తీసుకొని అమ్ముకొనే పాపిష్ఠివాడు తనను తాను అమ్ముకొన్నవాడే అవుతాడు. అటువంటివాడు తాను ఘోర నరకాన్ని అనుభవిస్తూ, తన ఏడుతరాలవారి పుణ్యాల్ని సైతం నాశనంచేస్తాడు'' అని.

(రెండువేల సంవత్సరాలనాడు మనస్మృతికారులు, ఇంతటి సంస్కారణాభి లాషులై. ఆనాటి దురాచారాన్ని ఇట్లా ఖండించి, సంఘాన్ని ఆ దురాచారం నుండి మరలించటానికి ప్రయత్నించారు. వేల సంవత్సరాలు గతించిపోయినా. ఆ స్మృతి కారుల వచనాల్నే పల్లించి, సంఘాన్ని సంస్కరించటానికి ఏమాత్రమూ పూనుకో కుండా ఉన్న, పండితకుండలధారుల్ని ఏమనాలి? వారికేమీ బాధ్యతలేదా? కన్యావిక్ర యాన్ని ఆనాటి పండితులు ఖండించినట్లు, ఈనాడు గృహ్యసూత్రాల్ని సవరిం చాల్సిన అగత్యంలేదా? వరవిక్రయ విషయంలో. ఇంకా ఇతర దురాచారాల విష యంలో. పండితులైనవారు సమాజానికి త్రోవచూపెంచవద్దా? ఈ పండితులకంటె. అపండితులైన సంఘసంస్కర్తలే నయంగదా! వారు ధైర్యంగా ఇది చెడ్డ ఆచారమని చెప్పనైనా చెప్తున్నారు. పండితులు మాత్రం. ఆ వెనుకటి స్మృతుల్ని వల్లిస్తూ, తమ బుద్ధివైభవానికి, తమ పాండిత్య ప్రకర్షకు లోలోన మురిసిపోతూ బ్రతుకుతున్నారు. ఈనాడు మనువు, బోధాయనుడు లాంటివారే ఉన్నట్లైతే వర విక్రయాన్ని ఖండించి, పితృదేవతలకు ఉత్తమగతుల్ని కలిగించాల్సిన కొడుకునే

అమ్ముకోవడం ఇంతా ఘోరపాతకం అని వ్రాసి ఉండేవారు. లేదా, కాలానికి తగినట్లుగా, రాజకీయ; సాంఘిక, ఆర్థిక సంఘాలలో సభ్యులుగా ఉండటానికి అనర్హులని వ్రాసి ఉండేవారు.)

సరే, ఇక పద్మపురాణంలో అయితే, కూతుర్ని అమ్ముకొన్నవాని ముఖం చూడరాదని అన్నారు. ఒకవేళ పొరపాటున చూస్తే ప్రాయశ్చిత్తంగా సూర్యుణ్ణి చూడాలని అన్నారు — "కన్యా విక్రయిణాం బ్రహ్మన్న పశ్యేత్ వదనం బుధః దృష్ట్వా చాజ్ఞానతో వాపి కుర్యాన్మార్తాండ దర్శనం"

(పద్మపురాణం, బ్రహ్మఖండం 24-26)

దీనినిబట్టి, క్రమంగా సమాజంలో ఈనాడు వరవిక్రయం సిగ్గులేకుండా విచ్చలవిడిగా సాగుతున్నట్లే ఆనాడు కన్యావిక్రయం అనేది పెద్దజాడ్యంగా ప్రబలి ఉంటుంది. అందుకే, సంఘసంస్కరణాభిలాష, సంఘ సౌభాగ్యాన్ని శ్రేయాన్ని కోరిన ధర్మశాస్త్రకారులు ఆ దురాచారాన్ని ఇట్టి పరుషవాక్యాల్లో ఖండించారు. తాత్కాలికంగా, ఈ దురాచారం కొంతకాలంపాటు ఆగినా, మళ్ళీ సంఘం ఆ పూర్వ ఆచారానికి తల ఒగ్గినట్లుగా కనిపిస్తోంది —

భీష్ముడు, మాద్రిని పాండురాజునకిప్పించి వివాహం చేయించాలని తలచి రాయబారానికి వెళ్ళినప్పుడు శల్యుడు ఎంతో సంకోచంతో అంటాడు —

"పూర్వైః ప్రవర్తితం కించిత్కులేస్మి న్నృప సత్తమైః
సాధు వా యది వాఽసాధు తన్నాతిక్రాన్తు ముత్సహే
వ్యక్తం తద్భవతశ్చాపి విదితం నాత్ర సంశయః
న చ యుక్తం తథా వక్తుం భవాన్దేహీతి సత్తమ
కులధర్మః స నో వీర ప్రమాణం పరమం చ తత్
తేనత్వాం న బ్రవీమ్యేతద సందిగ్ధం వచోఽరిహన్?"

(మ.భా. 1-113-14, 15, 16)

"మీరు నా సోదరిని పాండురాజుకిచ్చి వివాహం చేయించాలనుకుంటే మీరు తప్పకుండా కన్యాశుల్కం ఇప్పించవలసి ఉంటుంది. ఇది మా వంశంలో పరంపరంగా వస్తున్న ఆచారం. ఈ ఆచారం మంచిదైనా చెడ్డదైనా దీనిని మేము అనుసరించక తప్పదు. మీరు అన్నీ తెలిసినవారు. నాచేత చెప్పించటం ఎందుకు?" అని. భీష్ముడు కన్యాశుల్కంగా మద్రరాజుకు (పాండురాజుకు మాద్రినిచ్చి వివాహం చేయించటానికై)

రత్నాలు, మణులు వగైరా ధనరాశులు, ఏనుగులు, గుఱ్ఱాలు, వగైరా అనేకం ఇచ్చినట్లు, శల్యుడు వాటిని గ్రహించి సంతోషించినట్లు మహాభారతంలో ఉంది.

(ఈ సందర్భం అంతా చదివితే, ఈనాడు అనేకమంది సంపన్నులు తమ కుమారునికి వరశుల్కం — కట్నం — అడుగుతూ చెప్పేమాటలు శల్యుని మాటలను తలపింపవా? 'మాకు డబ్బుకు లోటులేదు. కాని, మా అంతస్తుకు, హోదాకు తగినట్లుగా తీసుకోకపోతే, సంఘంలో, బంధువర్గంలో గౌరవం ఉండదుగదా!' అంటూ శల్యవచనాల్నే వల్లిస్తూంటారు.)

దీనినిబట్టి మనం గ్రహించాల్సిందేమంటే (1) ఆ కాలంలో సైతం కన్యా విక్రయానికి సంఘంలో ప్రాతినిధ్యం ఉంది. (2) శల్యునిలాంటి వారికి సైతం అది తప్పు అని తెలుసు. (3) సంఘ సంస్కర్తలు, శాస్త్రకారులు అంతా ఈ ఆచారం తప్పు అని, పాపమని ఘోషిస్తూనే ఉన్నారు. (4) కాని, వంశాచారం, సంఘ గౌరవం అనే వంకతో వధూవిక్రయం సాగించేవారన్నమాట. ఈ సందర్భంలో మనం తెలుసుకోవాల్సిన విషయం ఒకటి ఉంది — దక్షిణదేశంలో తంజావూరు జిల్లాలో లభించిన 15-వ శతాబ్దపు ఒక శాసనాన్నిబట్టి, అప్పటి బ్రాహ్మణులంతా సమావేశమై తమలో తాము చర్చించుకొని "ఏ తండ్రి అయినా కన్యాశుల్కాన్ని గ్రహిస్తే అతనిని జాతినుండి బహిష్కరించాలి" అని నిర్ణయించినట్లు తెలుస్తోంది (South Indian Inscription - Vol - I No-56). ఈనాటి పండితులకు, సంస్కర్తలకు ఆమాత్రం ధైర్యం లేకపోవటాన్ని చూస్తే, జాతి ధార్మికంగా ఎంత నిర్వీర్యమౌతోందో తెలుస్తుంది.

పూర్వం, బాల్యవివాహాలు ఈ కన్యావిక్రయ సంప్రదాయానికి బాగా అనుకూలించినాయి — కన్యద్వారా ఏ విధమైన ప్రతిఘటన ఉండదు కాబట్టి; క్రమంగా సభ్యసమాజంలో ఈ కన్యావిక్రయం చాలాభాగం తగ్గిపోయినా, అక్కడక్కడ కొన్ని అసభ్య జాతుల్లో, అశిక్షిత జాతుల్లో ఇంకా అమలులో ఉంది.

ఈ సందర్భంలో ఇతర దేశాల్లో ఈవిధమైన కన్యావిక్రయ పద్ధతి అమలులో ఉందా? లేదా? అని కూడా తెలుసుకోవాలి. ఎందుచేతనంటే, పాశ్చాత్యులూ, వారి భావాలకు దాసులైన కొందరు భారతీయులూ కూడా మన ప్రాచీన సంప్రదాయాల్ని వెక్కిరించటం, హేళనచేయటం పరిపాటి. వారికి, చారిత్రక జ్ఞానం లేకపోయినా, గ్రంథపరిజ్ఞానం లేకపోయినా, వెట్టి, మొట్టి విమర్శలు చేస్తూఉంటారు; కాబట్టి

ఈ కన్యావిక్రయం అనే ఆచారం, ఎప్పుడో ఒకప్పుడు, ప్రపంచంలోని అన్ని దేశాల్లోనూ అమలులో ఉన్నట్లు పాశ్చాత్య చారిత్రకుల వ్రాతల్నిబట్టి తెలుస్తోంది. కొన్ని జాతుల్లో కన్యాశుల్కం పూర్తిగా చెల్లించేదాకా కన్యమీద వరునికి ఏవిధమైన అధికారమూ సంక్రమించదు. ఆ శుల్కం ధనరూపంలోను, వస్తురూపం లోనూ ఉంటుంది. కన్యాశుల్కం చెల్లించలేకపోతే ఆ పురుషుడు మామగారి ఇంట కొంతకాలంపాటు వారికి సేవచేయాలి.

పూర్వపు రష్యన్ సామ్రాజ్యంలోని తుర్కు, తార్తార్ జాతుల్లో ఈ కన్యాశుల్కం చెల్లించటమనేది తప్పనిసరి. ఓటయక్ జాతివారు పశువులు, కోళ్ళుకాక 150 రూబుళ్ళ ధనం చెల్లించాల్సి వచ్చేది. (Westermark - History Vol-II page 381) సుమత్రా ద్వీపంలో బాట్టా జాతివారు కన్యతండ్రికి బంగారు ఉంగరం చెల్లించటం ఆచారం. న్యూగినీలో కుక్కదంతం, పంది, కొన్ని ఆభరణాలు చెల్లించాలి. సుబానూజాతివారిలో వస్త్రాలు, పంచదార, కడవలు, ఇత్తడి పాత్రలు కన్యాశుల్కం. ఫ్లోరిడాలో డబ్బు, ఇతరసామానులు ఇవ్వాలి. ఇట్లా ప్రాచీనకాలంలో ఏ ఏ దేశంలో కన్యాశుల్కం ఏ విధంగా ఉండేదో Westermark అనే చరిత్రకారుడు తన History Vol II Page 354 నుండి 431 వరకు విపులంగా వర్ణించాడు. మొన్న మొన్నటివరకు మన ఆంధ్రదేశంలోనే ఈ ఆచారం అమలులో ఉన్నందువల్లనే 'కన్యాశుల్కం' లాంటి నాటకాలు సంస్కరణాభిలాషతో రచింపబడ్డాయి. ఈ కన్యాశుల్కానికి మూలకారణంగా ఉంటూ వచ్చిన బాల్యవివాహాన్ని నిరోధించటానికి అనేకమంది సంఘసంస్కర్తలు ఉద్యమించాల్సి వచ్చింది.

ఆర్షము:

మనువు, యాజ్ఞవల్క్యుడు, ఆపస్తంబుడు మొదలైన ధర్మశాస్త్రకారులంతా ప్రాజాపత్యం కంటె ఆర్షమే శ్రేష్ఠమైన పద్ధతి అని అన్నారు. కాబట్టి మనం చెప్పుకొనే క్రమంలో ప్రాజాపత్యం తరువాతనే ఆర్షం రావాలి. కాని, ఈ పద్ధతిలో కూడా కన్యావిక్రయ లక్షణాలు గోచరిస్తూ ఉన్నందువల్ల ప్రాజాపత్యంకంటే ఆర్షం హీనమైనదిగా పరిగణించటం జరుగుతోంది. ఈ ఆర్షాన్ని గురించి మనుస్మృతి 3-29 లో—

"ఏకం గోమిథునం ద్వే వా వరాదాదాయ ధర్మతః
కన్యాప్రదానం విధివదార్షో ధర్మః స ఉచ్యతే" అన్నారు.

యజ్ఞయాగాది కార్యాలను నిర్వర్తించటం కోసం కన్యయొక్క తండ్రి వరుని వద్దనుంచి ఒకటి రెండు జతల ఆవులు, ఒక ఆబోతును గ్రహించి, విధి పూర్వకంగా కన్యాదానం చేస్తాడు. ఈ గోమిథునాన్ని గ్రహించటం అనేది యజ్ఞం కోసం కాబట్టి దీనిని ఆర్షమన్నారు. (ఈ రోజుల్లో "మేము కట్నం తీసుకోవటం లేదు. వాళ్ళ అమ్మాయికి ఐదెకరాల మాగాణి, అల్లుడు డాక్టరుగా ప్రాక్టీసు పెట్టటానికి పట్నంలో ఒక మేడ, చిన్నవారు ఇచ్చుకొంటున్నారు" అని అంటున్నట్లు) అసురంలో కన్యా శుల్కం విషయమై బేరమాడటానికి అవకాశం ఉంది. ఇందులో ఆ అవకాశం కనిపించదు. పైగా ఆ తీసుకోనేది ధర్మకార్య నిర్వహణ కోసం అని; కాబట్టి తప్పు లేదనే భావం ఇందులో నిహితమై ఉంది. చాలమంది స్మృతికారులు దీనిని కూడా కన్యాశుల్కంగానే పరిగణించారు. కాని జైమిని మాత్రం ధార్మిక కృత్యాల కోసం గోమిథునాన్ని గ్రహిస్తున్నాడు కాబట్టి తప్పు లేదన్నాడు — "క్రయస్య ధర్మ మాత్రత్వమ్" (పూర్వమీమాంస-6-1-15) దీనిని వ్యాఖ్యానిస్తూ శబరస్వామి తన భాష్యంలో "నాసౌ క్రయః ఇతి. క్రయోహ్యుచ్చనీచపణో భవతి. నియతం త్విదం దానమ్" క్రయవస్తువుకు బజారులో ధర పెరగటం, తరగటం ఉంటుంది. ఇక్కడ అట్లా కాకుండా ఖచ్చితంగా 'గోమిథునం' అని అనటంవల్ల, ఆర్ష పద్ధతిలో ధర్మకార్య నిర్వహణకోసం అల్లుళ్ళు మామగార్లకు ఇచ్చే యీ గోమిథున దానం ఎప్పుడూ ఒకటిగానే ఉంటుంది. కాబట్టి ఇది కన్యాశుల్కం కాదు! అన్నాడు. అట్లాగే, మిత్రమిశ్రుడు తన వీరమిత్రోదయంలో "ధర్మనిమిత్తోహ్యసౌ సంబంధః న లోభ నిమిత్తః" లోభంతో కాకుండా ధర్మంకోసం తీసుకొనేది కాబట్టి శ్రేష్ఠమని చెప్పాడు. ఇట్లా, కొంతమంది శాస్త్రకారులు దీని ఔచిత్యాన్ని సందర్భానుసారంగా సమర్థించినా, మొత్తానికి ఈ పద్ధతి ఆసురానికి స్మృతి చిహ్నంగా, లేక, అవశేష చిహ్నంగా కొంతకాలంపాటు నిలిచి ఉంది. కాబట్టే, విలోమ పద్ధతిలో ప్రాజాపత్యానికి ముందుగానే దీనిని ప్రస్తావించటం జరుగుతూ ఉంటుంది.

మనువు ఇచ్చిన నిర్వచనం పైన ఇవ్వబడ్డది. ఆశ్వలాయన గృహ్య సూత్రాల్లో 1-4-27 లో "గోమిథునం దత్వోపయచ్ఛేత స ఆర్షః" అని బోధాయన ఆపస్తంబాది ధర్మశాస్త్రజ్ఞుల ననుసరించి కూడా యజ్ఞ సంపాదనంకోసం ఒక జత ఆవుల్ని ఒక ఎద్దును మామగారికి ఇవ్వాలని ఉంది." ఇట్లా ఇవ్వటంవల్ల వెనుకటి పదునాల్గు తరాలు, తరువాతి ఆరు తరాలు పవిత్రమౌతాయి" అని యాజ్ఞవల్క్య స్మృతి (1-59) చెప్తోంది— "యజ్ఞస్థ ఋత్విజే దైవ ఆదాయార్షస్తు గోద్వయమ్.

చతుర్దశ ప్రథమజః పునాత్యుత్తర జశ్చషట్'' ఆర్షంలో గోమిథునాన్ని తీసుకోవటం అబద్ధమని. కన్యనిచ్చేటప్పుడు కొద్దో - గొప్పో ఏ రూపంలో తీసుకొన్నా అది నింద్యమేనని మనువు అన్నాడు. (మనుస్మృతి 3-53, 54) ఆర్షము అనే పదం 'ఋషి' అనే పదానికి విశేషణరూపంగా ఉంది. కాబట్టి, యజ్ఞయాగాదులు ఆచరించే ఋషుల కులాల్లో, పురోహిత వంశాల్లో ఈ ఆచారం ఉండి ఉంటుంది. అందుకే ఆర్షమనే పేరు వచ్చి ఉంటుంది. ఈ పై విషయాలను బట్టి ఆలోచిస్తే ఆ కాలంలోనే కన్యాశుల్కాన్ని వదలలేక గోమిథునమనే క్రొత్తపద్ధతి బయలుదేరిందని, ఆ గోమిథున మనేది యజ్ఞ సంపాదనకోసం అని సమర్థించిన వారు, తెగడిన వారూ కూడా ఉన్నారని తెలుస్తుంది. (ఈ కాలంలో వరకట్నం అనకుండా, వధువుకు బంగారము, పొలము వరునికి స్కూటర్లు, కార్లు, టి.వి.లు లాంటి వస్తుసామగ్రి రూపంలో అడిగినట్లుంది) బేరమంటే, ఏ రూపంలో జరిగినా బేరమే కదా! అందుకే దీనికి ప్రాజాపత్యం కంటె తక్కువ స్థాయి ఇచ్చారు.

ప్రజాపత్యం:—ఆర్షంకంటె ప్రాజాపత్యం శ్రేష్ఠతరం అంటారు. ప్రాజాపత్యంలో ఏ విధమైన కన్యాశుల్కమూ ఏ రూపంలోనూ కూడా ఉండదు. కాబట్టి ఇది కేవలం ఆధ్యాత్మిక దృష్టితో జరిగేది కాబట్టి!

ఆశ్వలాయన గృహ్య సూత్రాల్లో (1-4-25) లో ''సహ ధర్మం చరత ఇతి ప్రాజాపత్యః'' వధూవరు లిద్దరూ కలసి సామాజిక, ధార్మిక కర్తవ్యాలను నెరవేర్చటం అనేది ప్రాజాపత్య లక్షణం; దీనినే యాజ్ఞవల్క్యస్మృతి సైతం పేర్కొంటోంది. ''సంయోగ మంత్రః ప్రాజాపత్యే సహధర్మం చర్యతామితి'' అని గౌతమస్మృతి ''సహోభౌ చరతాం ధర్మమితి వాచాను భాష్యచ కన్యాప్రదాన మభ్యర్చ్య ప్రాజాపత్యో విధిః స్మృతః'' (మనుస్మృతి-3-30) వధూవరులిద్దరినీ ధర్మాచరణం చేయమని ఆదేశిస్తూ చేసే వివాహాన్ని — కన్యాదానాన్ని ప్రాజాపత్యం అంటారు. ఇదే స్మృతికారులందరి అభిప్రాయము అని తెలుస్తోంది. అయితే, సహధర్మచరణం అనేది అన్నింటిలోనూ ఉంది కదా! దీనిలోని ప్రత్యేకత ఏమిటి? అంటే, ఈ పద్ధతి ప్రకారం వధూవరులిద్దరూ జీవితాంతం వరకూ నియమితమైన పద్ధతి ప్రకారం ధర్మాలను ఆచరించాలి. పతి గృహస్థాశ్రమాన్ని వదలి ఇతర ఆశ్రమాల్ని స్వీకరించరాదు. ఈ మొదటి భార్యను వదలి ఇంకొక భార్యను వివాహంచేసుకోరాదు; అనే నియమాలు ఉన్నట్లుగా ఆపస్తంబ గృహ్య సూత్రాలకు (1-4-25) వ్రాసిన టీకలో హరదత్తుడు విపులీకరించాడు — ''యద్యప్యన్యేష్వపి వివాహేషు

సహధర్మచరణ మస్తి. తథాప్యత్ర యావజ్జీవం సహధర్మచరణమేవ, న మధ్యే ఆశ్రమాంతర ప్రాప్తిరితి విశేషః కిం చ తథా తయైవ సహధర్మచరణం న త్వన్యంతర వివాహః" అని వ్రాశాడు. ఆ హరదత్తుడే గౌతమ ధర్మసూత్రాలు (1-4-5)ను వ్యాఖ్యానిస్తూ కూడా ఇవే మాటలు చెప్పాడు. కాబట్టి ప్రాజాపత్య ముఖ్య లక్షణాలు (1) ఆజీవనం దంపతుల ధర్మాచరణం (2) ఇతర ఆశ్రమాల్ని స్వీకరించకుండా ఉండటం (3) వేరొక స్త్రీని వివాహమాడకుండా ఉండటం, అనేవి.

ఈ పద్ధతి ననుసరించి దంపతులు ప్రజాపతి మొదల తమ ఋణాల్ని తీర్చు కోవటానికై సంతానాన్ని పొంది, వారిని పెంచి పోషించటం అనే సంబంధానికి తమంతటతాము బద్ధులై ఉంటాడు. అందుచేత ఈ పద్ధతి ప్రశస్తమైనదని ఈనాడు కూడా అంగీకరించవచ్చు. "సహధర్మ క్రియాహేతోర్దానం సమయ బంధనాత్ అలంకృత్యైవ కన్యాయాః వివాహః స ప్రజాపతేః। అని వీరమిత్రోదయంలో ఉదహరింపబడ్డది. సంతానప్రాప్తిద్వారా ప్రజాపతియొక్క ఋణాన్ని తీర్చటం అనే ధర్మం ప్రధానమైనందున దీనికి ప్రాజాపత్యం అనే పేరు వచ్చి ఉండవచ్చు. అయితే ధర్మశాస్త్రాల్నిబట్టి ఈ వివాహం బ్రాహ్మదైవ ఆర్షాలకంటె నికృష్టమైనదిగా ఎందుకు పరిగణింపబడ్డది? అంటే, ఇందులో కన్యాదానం ప్రత్యేకమైన షరతులను విధించి చేయటమే దీనికి కారణం అయిఉండవచ్చు. దానమనేది ఏదైనాసరే, ఏ విధమైన షరతులు లేకుండా చేయాలి. ఇందులో వరునివద్దనుండి కొన్ని షరతులు విధించి హామీలు తీసుకోవటం అనేది దోషం. బ్రాహ్మదైవ వివాహాల్లో ఇటువంటి షరతులు ఏవీ ఉండవు. ఇది మరీ పూర్వకాలం అమలులో ఉండిఉండదు. బాగా చదువుకొన్నట్టి, ఉన్నతమైన శీలసంపద కలిగినట్టి యుక్తవయస్కులైనట్టి వధూ వరులు మాత్రమే జీవితాంతం ధర్మాచరణం చేస్తామనే ప్రతిజ్ఞ చేయగలుగుతారు. కాబట్టి ఇది యుక్తవయస్కులైనవారిలో జరిగే వివాహం అని తెలుస్తుంది.

కొంతమంది శాస్త్రజ్ఞులు ప్రాజాపత్యము, బ్రాహ్మము ఈ రెండూ ఒకటే అనీ, ఒకే పద్ధతికి రెండు పేర్లనీ అంటారు. ప్రాచీనులైన వసిష్ఠుడు, ఆపస్తంబుడు మొద లైన ధర్మశాస్త్రకారులు ఈ ప్రాజాపత్యమనే వివాహపద్ధతిని పేర్కొనలేదు. వారు ప్రశస్తమైన వాటిలో బ్రాహ్మ దైవ ఆర్షాలనే పేర్కొన్నారు. ఎనిమిది రకాలనే సంఖ్యను పూరించటానికై ప్రాజాపత్యాన్ని చేర్చి ఉంటారని విమర్శకులు కొందరు అంటారు. ఇది బ్రాహ్మంలోకే వస్తుందని వారి ఉద్దేశ్యం. ఇది ప్రౌఢ వయస్కుల్లో

జరిగేది కాబట్టి బాల్య వివాహానికి. కన్యాదానానికి తావు లేదని, కాలక్రమేణ బాల్యవివాహాలు ప్రబలిన మీదట ఈ పద్ధతికూడా క్షీణించి, కన్యాదానం అనేదికూడా చోటు చేసుకొన్నదని తెలుస్తుంది.

దైవము: ప్రాజాపత్యం కంటె దైవవివాహం శ్రేష్ఠమైనదని అంటారు. యాజ్ఞవల్క్యుడు ''యజ్ఞస్థ ఋత్విజే దైవః'' (యా. స్మృ. 1-59) అన్నాడు. ఆశ్వలాయనుని అభిప్రాయం ప్రకారం ''ఋత్విజే వితతే కర్మణి దద్యాదలం కృత్య స దైవః'' (ఆశ్వ. గృ. సూ. 3-53.) తండ్రి తన కన్యను అలంకృతను చేసి, తాను చేస్తున్న యజ్ఞంలో పౌరోహిత్యాన్ని నిర్వహిస్తున్న ఋత్విజునకు దానంచేసే వివాహం దైవము అని. బోధాయనుడుకూడా ఋత్విక్కునకు దక్షిణరూపంలో కన్యను యిస్తాడని చెప్పాడు — ''దక్షిణాసు దీయమానా స్వన్తర్వేది యత్ ఋత్విజే స దైవః'' (బౌధా. ధ. సూ. 11) దేవతల నుద్దేశించి చేసే యజ్ఞంలో కన్యనిచ్చి చేసే వివాహం కాబట్టి దీనికి దైవమనే పేరు వచ్చి ఉండవచ్చు. మనువు — ''యజ్ఞే తు వితతే సమ్యగృత్విజే కర్మకుర్వతే అలంకృత్య సుతాదానం దైవం ధర్మ ప్రచక్షతే.'' (మనుస్మృతి. 3-28)'' యజ్ఞంలో కర్మ నిర్వహణం చేస్తున్న ఋత్విజునికి అలంకృతమైన కన్యను దానం చేయటం దైవవివాహం'' అని అన్నాడు. అయితే, యాగాల్లో చేసిన సేవలకుగాను పురోహితునికి కన్య నివ్వటం అనేది వైదికసాహిత్యంలో సైతం కనిపిస్తుంది. పురోహితులు. యజ్ఞానికి యజమానులైన రాజులద్వారా కన్యలను దాసీలను పొందినట్లు కనిపిస్తుంది. అటువంటి కన్యలను 'వధూ' శబ్దంతో వ్యవహరించినట్లు తెలుస్తోంది (ఋ. 5-61-17, 19) లో దాల్భ్యుని కొమార్తె ఐన రథవీతికోసం శ్యావాశ్వుడు చాలా వ్యాకులపడినట్లు తరువాత ఆమెను పొందినట్లు తెలుస్తుంది. 'బృహద్దేవత' అనే గ్రంథంలో శ్యావాశ్వుడు తనకోసం కాకుండా తన కుమారునికోసం కన్యను అడిగినట్లుంది. ఇట్లా రాజులవద్ద నుండి కన్యలను. సంపాదించటం అనేది వివాహం ఎట్లా అవుతుంది! ఈ పద్ధతి మొదటి మూడు వర్ణాల్లోనే ఉండి ఉంటుంది. వారే యజమానులైనా, ఋత్విక్కులైనా కాబట్టి! ఇది ఉంపుడుకత్తెల ఆచారానికి కూడా త్రోవ తీసి ఉండవచ్చు. ఆ కాలంలో యజ్ఞంలో పురోహితునికి కన్యాదానం చేయటం గొప్ప పుణ్యంగా భావించి ఉంటారు. తరువాత తరువాత యజ్ఞాలు తగ్గిపోయినకొద్దీ ఈ ఆచారంకూడా లుప్తమైపోయి ఉండవచ్చు. లేదా. సమాజంలోని. కన్యలలో వ్యతిరేకత ప్రబలి లుప్తమైపోయి ఉండవచ్చు. ఇది కూడా పురోహితుని సేవలకు ప్రతిఫలంగా యిచ్చే దానమే కాబట్టి ప్రశస్తమైనదిగా

పరిగణింపబడకపోవచ్చు. ఈ యజ్ఞయాగాదులు క్రీ.శ. నాల్గవ శతాబ్దం వరకు బాగానే ప్రచారంలో ఉన్నాయి. ఆ యజ్ఞాల్లో అనేకమంది పురోహితులు పాల్గొనటం, వారిలో విద్యావయోరూపగుణాదులు కలవారియెడ యజమాని మోహితుడై యుక్తవయస్కురాలైన తన కన్యను దానం చేయటం. యజమానులైనవారు అగ్రవర్ణమైన బ్రాహ్మణ ఋత్విక్కులకు కన్యనిచ్చి వివాహం చేయటం గౌరవంగా భావించి ఉంటారు. ఆనాటి సమాజంలో పెరిగిన కన్యలు ప్రౌఢలైనా ఆ విధమైన సంస్కారం కలిగినవారే అవటం వలన అందుకు అంగీకరించటం జరిగి ఉండవచ్చు. ఏమైనప్పటికి, ప్రతిఫలంగా యిచ్చేది. స్వార్థంతో చేసేదీ అయిన దానం ప్రశస్తం కాదు కాబట్టి దీనిని సైతం బ్రాహ్మం కంటె తక్కువగానే భావించారు.

బ్రాహ్మము: బ్రాహ్మవివాహమనేది విశుద్ధమైనదని. మిగతావాటికంటె బాగా వికాసం చెందిన పద్ధతి అని. పవిత్రమైన పద్ధతి అని. స్మృతికారులందరి అభిప్రాయం. దీని పేరునుబట్టి ఇది బ్రాహ్మణులకు తగిన పద్ధతి అని తెలుస్తోంది. బ్రాహ్మణులు అంటే కేవలం వర్ణరీత్యానే కాకుండా బ్రహ్మజ్ఞులైనవారు అనుకున్నా తప్పులేదు. అంటె. పండితుడు. విద్యావినయసంపన్నుడు. శీలవంతుడు అయిన వరుని ఆహ్వానించి ఏవిధమైన శుల్కం తీసుకోకుండా సాలంకృతయైన కన్యను సదక్షిణాకంగా దానం చేయటం ఈ పద్ధతిలోని విశేషం.

మనువు—"ఆచ్ఛాద్య చార్చయిత్వా చ శ్రుతిశీలవతే స్వయమ్
ఆహూయ దానం కన్యాయా బ్రాహ్మో ధర్మః ప్రకీర్తితః
(మ. స్మృ. 3-27)

అని పై విషయాన్నే చెప్పాడు. ఈవిధంగా చేసిన వివాహంవల్ల జన్మించిన పుత్రుడు వెనుకటి పన్నెండు తరాల పితరుల్ని. రాబోయే పన్నెండు తరాల పితరుల్ని తరింపచేస్తాడని ఆశ్వలాయను డన్నాడు. కొందరు తల్లిదండ్రుల వంశాలకు చెందిన వెనుకటి పదితరాలు, రాబోయే పదితరాల పితరుల్ని తరింపచేస్తాడన్నారు. యాజ్ఞవల్క్యుడు ఇరువైన్రొల ఇరవై ఒక్క తరాల వారిని పవిత్రం చేస్తాడని అన్నాడు —

"బ్రాహ్మోవివాహః ఆహూయ. దీయతే శక్త్యలంకృతా
తజ్జః పునాత్యుభయతః పురుషానేక వింశతిమ్" (యా. స్మృ. 1-58)

కన్యాదాతతోసహా ఇరవై ఒక్క తరాలని అనుకోవాలి. ఈనాడు కూడా కన్యాదానం చేసేటప్పుడు "మయాసహ దశపూర్వేషాం దశాపరేషాం. మద్వంశ్యానాం

మాతృపంశ్యానామ్ పితౄణాం నరకాదుత్తీర్య శాశ్వత బ్రహ్మలోకా వాప్త్యర్థం సాలంకృత సహిరణ్యోదక కన్యాదానమహం కరిష్యే'' అని అంటున్నారు. ఇతర వివాహపద్ధతుల్తో దీనిని పోల్చినప్పుడు (1) దీనిలో క్రౌర్యం దుర్మార్గం లేవు. (2) శారీరక బల ప్రదర్శనం, యుద్ధం వగైరాలు లేవు. (3) ఏవిధమైన షరతులూ లేవు. (4) ఏవిధమైన కామవాసనల ప్రకోపమూ లేదు. (5) ఏవిధమైన శుల్కమూ లేదు. (6) ఏదో ఒక ప్రయోజనాన్ని కోరిచేసే (లాభాన్ని పొందిచేసే) దానమూకాదు. కాబట్టి, మిగతా అన్ని వివాహ పద్ధతులకంటె ఇది ఉత్కృష్టమైనదని పలువురి అభిప్రాయం. ఋగ్వేదంలో ఈవిధమైన వివాహం సూర్యాసోములకు జరిగినట్లుగా ఉంది. ఇది ఈ పద్ధతి వివాహానికి పూర్వరూపమై ఉండాలి. సూర్యాసోముల వివాహాన్ని గూర్చిన వర్ణన ఋగ్వేదం పదవ మండలం 85 వ సూక్తమైన వివాహ సూక్తంలో మనోరంజకంగా వర్ణింపబడ్డది. ఈ వివాహసూక్తమే అథర్వణ వేదంలోకి గ్రహింపబడి క్రమంగా 64. 75 మంత్రాలుగల రెండు సూక్తాలుగా విపులీకరింపబడ్డది. ఋగ్వేదంలోని పూర్తి సూక్తాన్ని కాకపోయినా కొన్ని ఋక్కులను, వాటి అర్థాన్ని తెలుసుకొంటే, నాటి వివాహ ప్రయోజనం, ఆదర్శం, ఆ పద్ధతులు తెలుస్తాయి. (కొందరు ప్రబుద్ధులు, ఇందులోని గర్భాదానానికి సంబంధించిన ఒకటి రెండు వాక్యార్థాల్ని గ్రహించి, మొత్తం ఋగ్వేదమంతా బూతుల బుంగ అనీ, వివాహాలకు మంత్రాలు అక్కరలేదని ఏమేమో వ్రాశారు. అవన్నీ ఎవరిమీదనో ఉన్న విద్వేషాన్ని వెల్లడించేవేతప్ప చారిత్రక దృష్టితో, సామాజిక ప్రయోజనాన్ని అపేక్షించి వ్రాసినవి కావు.) వేదకాలీనమైన ఈ వివాహాన్ని గురించి తెలుసుకుందాం. ఈ సూక్తంలోని వర్ణనలు, కథ వగైరాలన్నీ కల్పితాలని అనుకున్నప్పటికి వాటివల్ల ఆనాటి ఆచార వ్యవహారాలు, వారి ఆదర్శాలు వగైరాలు ప్రతిఫలించి నాయనకతప్పదు. నేటి కథల్లో ఈనాటి సామాజిక పరిస్థితులు ప్రతిబింబిస్తున్నట్లు:

సూర్యా అనే ఆమె సూర్యుని కొమార్తె. ఈ సూర్యా అనే కన్యకు సోముడు తగిన వరుడని అశ్వినీ దేవతలు అతనిని వరునిగా వరించారు. సోముడు ఉత్తముడు, పరాక్రమసంపన్నుడు. అతని వరణీయ గుణాలు ఈవిధంగా వర్ణింపబడ్డాయి —

''సోమేనాదిత్యా బలినః సోమేన పృథివీ మహీ అథో నక్షత్రాణామేషాముపస్థే
సోమ ఆహితః। (2)

సోమునికంటె ఆదిత్యుడు మాత్రమే బలశాలి. సోమునికంటె పృథివి మాత్రమే పూజనీయమైనది. ఈ అక్షతులైన — పరాక్రమవంతులైన బ్రహ్మ

వారల యందు సోముడొక్కడే స్థిరంగా ఉన్నాడు — వారి అందరికంటె ఉత్తముడై ఉన్నాడు అని.

“సోమో వధూ రభవదశ్వినాస్తా ముభా వరా
సూర్యాం యత్పత్యే శంసన్తీం మనసా సవితా దదాత్. (9)

పతిని పొందాలని మనస్సులో కోరుకుంటూ ఉన్న సూర్యా అనే కన్యను, కన్యయొక్క తండ్రియైన సూర్యుడు, సోమునికివ్వాలని అనుకొన్నప్పుడు, అశ్వినీ దేవతలు మధ్యవర్తులుగా సోముని వద్దకు వచ్చారు. సోముడు కూడా సూర్య పుత్రికనే భార్యగా వరించి ఉన్నాడు — వివాహమాడాలని అనుకుంటూనే ఉన్నాడు.

వివాహమైంది. సవిత్రుడు తన కొమార్తెను అత్తవారింటికి పంపుతున్నాడు. (వివాహం కన్య యింటనే జరిగింది. ఇది ఈనాటికీ వస్తున్న ఆచారం) అశ్వినీ దేవతలు రథాన్ని తోలుతున్నారు. ఆ రథంమీద వధూవరులు కూర్చున్నారు. పెండ్లి కొమార్తె కన్నవారి యిల్లు వదలి అత్తవారింటికి వెడుతోంది —

“ప్రేత్వా ముంచామి వరుణస్య పాశాద్యేన త్వాబధ్నాత్సవితా సుశేవః।
ఋతస్య యోనౌ సుకృతస్య లోకే౽రిష్టాం త్వా సహపత్యా దధామి (24)

వరుణ పాశంలాంటి ప్రేమబంధంతో, నీ తండ్రి నీకు ఇంతవరకు సుఖాన్ని కలిగిస్తూ, బంధించి ఉంచాడు. అటువంటి ఆ పితృప్రేమబంధంనుండి నేడు నిన్ను విడిపిస్తున్నారు. సత్యపాలనకోసం, ధర్మాచరణంకోసం నిన్ను ఏవిధమైన దుఃఖాలూ లేనట్టి నిన్ను నీ భర్త యింటిలో ఉంచుతున్నాను. ఓ సూర్యా! నీవు సౌభాగ్యశాలివై, భర్త యింటికి వెళ్ళు. అతని గృహపత్నివి కమ్ము. పుత్రాదుల్ని పొందు. దేవతలు శుభం కలుగజేయుగాక! అంటూ, పురోహితుడు అక్కడ ఉన్నవారితో అంటున్నాడు —

“సుమంగలీరియం వధూరిమాం సమేత పశ్యత సౌభాగ్య మస్యై దత్వా యాథాస్తం విపరేతన.” “ఈమె శుభంకరమైన, మంగళప్రదమైన చిహ్నాలతో కూడినది. రండి. మీరంతా ఈమెను దర్శించండి. ఈమెను సౌభాగ్యవతి అయ్యేటట్లు ఆశీర్వదించి మీ యిండ్లకు పొండు” అని.

వివాహ సమయంలో వరుడు (సోముడు) వధువుతో (సూర్యాతో) అంటున్నాడు — “గృహ్ణామి తే సౌభగత్వాయహస్తం మయాపత్యా జరదష్టిర్యథాసః।

"భగో అర్యమా సవితా పురంధిర్మహ్యం త్వాదుర్గార్హపత్యాయ దేవాః॥"

ఓ వధూ! నేను సౌభాగ్యం పొందటంకోసం నీ పాణిగ్రహణం చేస్తున్నాను. నీవు వార్ధక్యం పర్యంతం భర్తనైన నాతో ఉండు. ఐశ్వర్యవంతుడు. న్యాయవంతుడు. సమస్త శరీరాల ధారణపోషణలకు కారకుడైన సవితృ దేవుడు. దేవతలు. గార్హపత్య సంపాదనకోసం నిన్ను నాకు ఇచ్చారు" అని.

అత్తవారింటికి వెళ్ళిన పిమ్మట వధువును ఆశీర్వదిస్తున్నారు — "సమ్రాజ్ఞీ శ్వశురేభవ: సమ్రాజ్ఞీ శ్వశ్రవాం భవ. ననాన్దరి సమ్రాజ్ఞీ భవ. సమ్రాజ్ఞీ అధి దేవృషు" (46) ఓ వధూ! నీవు మామకు, అత్తగారికి ఆడుబిడ్డలకు సామ్రాజ్ఞివి కమ్ము. మరదులకు యజమానురాలివి కమ్ము" అని.

"ఇమాం త్వమిన్ద్ర మీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు
దశాస్యాం పుత్రానాధేహి పతిమేకాదశం కృధి" (45)

ఓ వీర్యవంతుడవైన సోముడా! నీవు ఈ వధువును సౌభాగ్యవంతురాలినిగా చెయ్యి: పుత్రవంతురాలినిగా చెయ్యి! ఈమె యందు పదిమంది కుమారులను ఆధానం చెయ్యి. భర్త రూపంలో నీవు ఈమెకు పదకొండవవానిగా ఉండు" అని.

దేవతల్ని ప్రార్థిస్తున్నారు —

"సమంజన్తు విశ్వేదేవాః సమాపో హృదయాని నౌ
సం మాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దధాతు నౌ।

దేవతలందరు వధూవరులమైన మా హృదయాలను ఏకం చేయుదురుగాక. జలదేవత మా హృదయాలను కలుపుగాక! వాయుదేవుడు మా హృదయాలను కలుపుగాక! ఉపదేశంచేసే వేదవాణి మా హృదయాలను కలుపు గాక!" అని.

ఇట్లా వివాహ సూక్తంలో ఆనాటి అనేక విషయాలు. ఆచారాలు. మనకు తెలుస్తాయి. ఆనాటి పద్ధతులు, వధువుకు అత్తవారింట్లో ఉన్న స్థానం. వధూవరుల కర్తవ్యాలు. మొదలైనవి తెలుస్తాయి. ధనం, కామం, మొదలైన ప్రలోభాలేమీ యిక్కడలేవు. పెండ్లికూతురు ఏమీ తెలియని బాలిక అనటానికి వీలులేదు. చిన్నపిల్ల అయితే అత్తవారింట సామ్రాజ్ఞిగా వ్యవహరించటం అసంభవం కదా! అట్లాగే. పుత్రాధానం కూడా ధర్మనిర్వహణలో ఒక భాగమే! పది

పుత్రులను కన్న తరువాత, భర్తయైనవాడు పతిరూపంలో పదునొకండవ వాడుగా ఉండాలిట. ఎంత మహోన్నతమైన భావన. కొడుకుల్లాగానే, వాను కూడా భార్య ఆదేశాలకు తల ఒగ్గుతూ ఆమె అభీష్టాల్ని అనుసరించాలి; ఆమె అందరికే యజమానురాలు. అందరిబాగు కోరవలసినది ఆమే! మహోన్నతభావాలను, ఆదర్శాలను వదలి బూతులను మాత్రమే వెదకటం ఎందుకు?

ఇటువంటి ఒకటి రెండు వివాహాలను గూర్చిన ప్రస్తావనతప్ప ఋగ్వేదాదుల్లో ఎక్కువగా కనిపించవు. ఈ బ్రాహ్మంలో కన్యను దానంగా ఇస్తున్నట్లు తెలుస్తోంది. అంటే, కన్యాశుల్కం లాంటి ప్రతిఫలాపేక్ష ఏమీలేకుండా, యోగ్యుడైన వరుని పిలిపించి కన్యను దానంచేయట మనేది నిజంగా నైతికంగా సామాజిక వికాసమనే అనాలి. (ఈ సందర్భంలో దానం చేయటానికి కన్యను భోగవస్తువుగా భావించారా? ఇట్లా దానంచేయటం స్త్రీ జాతిని అవమానపరచటంకాదా? వరదానమే ఎందుకు చేయరాదు? ఒకరిని ఒకరికి దానం చేయటం ఎందుకు? అని ప్రశ్నించేవారూ ఉన్నారు. నిజమే! కన్య అత్తవారింటికి వెడుతోంది కాబట్టి, ఆమెను దానంచేసి నట్లుగా అంటున్నారు. వరుడు అత్తవారింటికి కాపురానికి వెడుతున్న సందర్భాలూ ఉన్నాయిగదా! అప్పుడు వరదానమనే అనుకోవాలి) 'అగ్నిసాక్షిగా, దైవసాక్షిగా వరుడు ధర్మాచరణానికి సంబంధించిన ఈ శపథం చేస్తున్నందువల్ల, స్త్రీయొక్క అధికారానికి, గౌరవానికి లోటు ఏమీ ఉండదు' అనే విశ్వాసం కలగటానికి అవకాశం ఉంది. ఈ కాలంలో అన్ని వర్ణాల్లోనూ ఈవిధమైన వివాహాలే అధికంగా జరుగుతున్నాయి.

ఇంతవరకు మనం స్మృతుల్లో ఉదహరించిన వివాహపద్ధతుల్ని గురించి సంగ్రహంగా తెలుసుకున్నాం. యథార్థానికి ఈ కాలంలో మనం చూస్తున్న వినిమయ పద్ధతి (కుండమార్పిడి అంటారు) సేవాపద్ధతి, ఇల్లరికం పద్ధతి ఇట్లా అనేక పద్ధతులు ఉన్నా, బ్రాహ్మవివాహ పద్ధతే అంతటా జరుగుతోంది. వెనుకటి వివాహపద్ధతులలోని బాగోగుల్ని మనం ఈనాడు విమర్శించినా కలిగే ప్రయోజనం ఏమీ ఉండదు. మనం గ్రహించవలసిందల్లా వివాహ వ్యవస్థయొక్క క్రమవికాసం ఎట్లా జరిగిందీ? చారిత్రకంగా సమాజంలో వివాహ విషయకమైన అభిప్రాయాలు ఎట్లా మారుతూ వచ్చాయి? వాటిని, వాటివల్ల కలిగిన పరిణామాల్ని దృష్టిలో పెట్టుకొని ప్రస్తుతం అమలులో ఉన్న పద్ధతులలో బాగోగుల్ని విమర్శించుకొని వాటిలోని చెడును ఏ విధంగా సంస్కరించాలి? అనే విషయాలను గూర్చి ఆలోచించాలి. ఈ వివాహ

వ్యవస్థకు, వర్ణవ్యవస్థకు ఏమైనా సంబంధం ఉన్నదా? అనే విషయాన్ని సైతం తెలుసుకొని. అవసరమైన సంస్కారణలకు పూనుకోవటం మంచిది.

వివాహ వ్యవస్థకు వర్ణవ్యవస్థకు ఉన్న సంబంధాన్ని గురించి ప్రాచీన స్మృతి కారుల అభిప్రాయాల్ని తెలుసుకుందాం. బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్యాలనే నాలుగు పద్ధతులూ ప్రశస్తం అన్నారుగదా! ఈ నాలుగూ సమంత్రకంగా జరిగే పద్ధతులు. బంధువులు, పెద్దలు అంతా సమావేశమౌతారు. పదిమంది సమక్షంలో జరుగుతాయి. మిగతావాటిల్లో మంత్రవిధులకు స్థానంలేదు. ఏఏ వర్ణాలవారికి ఏ ఏ వివాహాలు సముచితంగా ఉంటాయి? అనే విషయంలో ధర్మశాస్త్రకారుల్లో భిన్నాభిప్రాయాలున్నాయి. —

మనువు — "చతురో బ్రాహ్మణ స్యాద్యా న్ప్రశస్తాన్కవయోవిదుః।
రాక్షసం క్షత్రియస్యైకం, ఆసురం వైశ్యశూద్రయోః॥
(మ. స్మృ. 3. 24)

బ్రాహ్మణులకు మొదటి నాలుగు పద్ధతులు, క్షత్రియులకు రాక్షసం, వైశ్యశూద్రులకు ఆసురం ప్రశస్తం అంటారు. రెండవ పద్ధతిప్రకారం (మనుస్మృతి 3-23) రాక్షస పైశాచాలు మినహా ఆరూ బ్రాహ్మణులకు, చివరి నాలుగు (ఆసుర గాంధర్వ రాక్షస పైశాచాలు) క్షత్రియులకు. గాంధర్వ, ఆసుర, పైశాచము, వైశ్యశూద్రులకు సముచితం అన్నారు. మూడవ పద్ధతి ననుసరించి (మనుస్మృతి. 3-25.) ప్రాజాపత్య, గాంధర్వ. ఆసురాలు, అన్ని వర్ణాలవారూ చేసుకోవచ్చు. కాని, ఆసుర పైశాచాలు ఏ వర్ణంవారూ చేసుకోరాదు. (మనువే ఇంతకుపూర్వం ఆసురం వైశ్యశూద్రులకు తగినదన్నాడు) మనువే "పృథక్ పృథక్ వా మిశ్రౌ వా వివాహే పూర్వచోదితౌ। గాంధర్వో రాక్షసశ్చైవ ధర్మ్యౌక్షత్రస్యతౌ స్మృతౌ (మనుస్మృతి. 3-26)" పైన చెప్పబడిన గాంధర్వరాక్షసాలు, విడివిడిగా గాని, రెంటి మిశ్రమరూపంలోగాని క్షత్రియులకు సముచితమైనది అన్నాడు. పై వివరణనుబట్టి మనువు ఖచ్చితమైన నిర్ణయం ఏమీచేయలేదని తెలుస్తోంది. (ఇటువంటి సందర్భాలను పురస్కరించుకొనే శ్రీదయానంద సరస్వతి మనుస్మృతిలో అనేక ప్రక్షిప్త శ్లోకాలను తరువాతి స్మృతికారులు చేర్చారని అన్నారు.)

బోధాయనుడు నారదుడు మొదలైనవారు ఎవరికి తోచిన విధంగా వారు చెప్పారు. అయితే, పైశాచం ఎవరికీ పనికిరాదని, గాంధర్వం అన్నివర్ణాలకు సము

చితమే అని, పైశాచానికి పాల్పడేవాడు పశువుకంటె హీనుడని; అంతా అంగీకరించి నట్లు తోస్తుంది. ఇప్పుడు వర్ణవ్యవస్థలోను. వారి వారి గుణ కర్మ విభాగాలలోను అనేక మార్పులు వచ్చినందున ప్రాచీన పద్ధతులేవీ ఈనాడు యథాతథంగా గ్రహింప టానికి వీలులేదు. పైగా, వివాహాలనుబట్టి వర్ణాల్లో మార్పు రావటం జరిగింది కాబట్టి వెనుకటి స్మృతి నిర్ణయాలు ఈనాడు ఎంతవరకు ఏ రూపంలో వర్తిస్తాయనేది సందేహా స్పదం. ఏమైనప్పటికి ఈనాడు బ్రాహ్మము అధికాధికంగాను. ఆసురము అత్యల్పం గాను. గాంధర్వం చెదురు మదురుగాను జరుగుతున్న పద్ధతులు. బ్రాహ్మంలో కన్య యొక్క తండ్రి యోగ్యుడైన వరుని చూచి, తాను ఏమీ తీసుకోకుండా సమంత్రకంగా, సదక్షిణాకంగా. సాలంకృత కన్యాదానం చేయటం ప్రధాన లక్షణం. సదక్షిణాకం అని అన్నారే తప్ప (ఏ దానమైనా సదక్షిణాకంగానే ఉండాలి) వరుని దక్షిణ (కట్నం) ముందే నిశ్చయించుకోవటం, ఆ దక్షిణ అనేది వేల, లక్షల సంఖ్యలో ఉండటం, కన్యాదానం కంటె దక్షిణకు ప్రాధాన్యత ఎక్కువవటం లాంటి భ్రష్టాచారం పూర్వం ఉన్నట్లు లేదు.

ఈ కాలంలో వివాహాన్ని బట్టి, వారికి పుట్టే సంతానం యొక్క ఆరోగ్యం, తెలివితేటలు మొదలైనవాటిని శాస్త్రీయంగా అంచనావేసి చెపుతున్నారుగదా! ఈ విష యమై ప్రాచీన శాస్త్రకారుల అభిప్రాయాలు ఎట్లా ఉన్నాయో చూద్దాం. అంటే ఈ నాటి వివాహాల్లో, మేనరికాలు, అప్పకొమార్తెను (సోదరీపుత్రికను) వివాహమాడటం లాంటివి కొన్ని జరుగుతున్నాయి. కొంతమంది వీటిని సమర్థిస్తున్నారు. కొంతమంది విజ్ఞాన శాస్త్రరీత్యా వీటిని ఖండిస్తున్నారు. అట్లాగే సమంత్రకంగాను. అమంత్రకం గానూ కూడా వివాహాలు జరుగుతున్నాయి. అనులోమ, ప్రతిలోమ వివాహాలు, వర్ణాంతర, మతాంతర వివాహాలు జరుగుతున్నాయి. పూర్వులు చెప్పిన ఎనిమిదిరకాలే కాకుండా, ఈనాడు మనం విభజించాలనుకుంటే అనేకరకాల వివాహాలు జరుగు తున్నాయి. "యథా యుక్తో వివాహస్తథా యుక్తా ప్రజాభవతి" (ఆప. ధ. సూ. 2-5. 12-14) ఎటువంటి వివాహమైతే అటువంటి సంతానమే కలుగుతుంది; అని. అంటే, బ్రాహ్మవిధి ప్రకారం జరిగిన వివాహమైతే వారి సంతానం ఉన్నతమైన గుణశీలములు కలవారు అవుతారని, పైశాచం అయితే దుర్మార్గులు. అవినీతిపరులు అవుతారన్నమాట. ఈ విషయమై మనువు —

"బ్రాహ్మాదిషు వివాహేషు చతుర్ష్వేవాను పూర్వశః
బ్రహ్మవర్చస్వినః పుత్రాః జాయన్తే శిష్టసంమతాః।

రూప సత్త్వగుణోపేతాః ధనవంతో యశస్వినః
పర్యాప్తభోగాః ధర్మిష్ఠాః జీవన్తి చ శతం సమాః।

ఇతరేషుచ శిష్టేషు నృశంసానృత వాదినః
జాయన్తే దుర్వివాహేషు బ్రహ్మధర్మద్విషః సుతాః।

(మను. స్మృతి 3-39, 40, 41)

ఆధ్యాత్మిక భావ సంపన్నమైన బ్రాహ్మ, దైవ, ఆర్ష, ప్రాజాపత్య వివాహాల వల్ల పుట్టిన సంతానం అందము, సద్గుణాలు, ధనము, కీర్తి, చిరాయువులతో కూడి ధర్మపరాయణులై భోగాలు అనుభవిస్తారు. చివరి నాల్గురకాల వివాహాలవల్ల కలిగిన సంతానం నిర్దయులు, అసత్యభాషణులు, ధర్మద్రోహులు అవుతారు; అని. చాలమంది స్మృతికారులు ప్రశస్తమైన వివాహాలవల్ల కలిగిన సంతానం అనేకతరాల పితృదేవతల్ని, వారి వంశాల్ని పవిత్రం చేస్తారని చెప్పారు. మన హిందూ వివాహ ప్రయోజనం సంతానం, తద్వారా వంశ పవిత్రత, ధర్మనిర్వహణం అనేది. ఇది మన హిందువుల విశ్వాసం. ఈ ప్రశస్త వివాహాల గొప్పదనాన్ని గురించి వ్రాస్తూ, ప్రసిద్ధ విద్వాంసుడు డా. కాణే తన History of Dharma Sastra అనే గ్రంథంలో "ఈ విభిన్న పద్ధతుల వివాహాలను గూర్చి ఎవరెన్ని రకాలుగా హేళన చేసినా, ఈ పద్ధతులు సమాజానికి ఉన్నతాదర్శాలను చెపుతున్నాయని, చక్కటి ఆదర్శవంతమైన జీవనాన్ని గడపటానికి మార్గం చూపుతున్నాయని, నైతిక శిక్షణను నేర్పుతున్నాయని అనక తప్పదు" అని వ్రాశారు.

ప్రస్తుతం అధిక ప్రచారంలో ఉన్న వివాహాలు బ్రాహ్మము, ఆసురము అని లోగడ అన్నాం. వీటిలో ఆసురమనేది లోగడ కన్యా విక్రయరూపంలో ఉంటే, ఈ రోజుల్లో వరవిక్రయ రూపంలో ఉంది. కన్యావిక్రయరూపంలో - కన్యకు ఓలిగా కొంత సొమ్ము యివ్వటం అనేది కొన్ని జాతుల్లో ఈనాటికీ ఉంది. ఏ రూపంలో ఉన్నా విక్రయమనేది విక్రయమేగదా! ధార్మికదృష్టి లోపించినట్లే! ఆర్థికదృష్టి ప్రాధాన్యం వహిస్తోందన్నమాట. వరవిక్రయం, కన్యాశుల్కాలు రెండూ కూడా సమాజంచేత గర్హింపబడుతున్నందున, యువకులు, సంఘసంస్కరణాభిలాషులు గాంధర్వంవైపుకు మొగ్గు చూపుతున్నందున దీని (గాంధర్వ) ప్రాచుర్యానికి ఎక్కువ అవకాశాలు కనిపిస్తున్నాయి. ఇంతవరకు ప్రాచీన వివాహపద్ధతుల్ని తెలుసుకున్నాం.

## వివాహ విషయంలో ఎదురౌతున్న ప్రతిబంధకాలు:

వివాహ సంబంధం నిశ్చయించుకోవాలంటే, అనేక అడ్డంకులు ఎదురౌతు న్నాయి. వాటిలో ప్రధానమైనవి — వధూవరుల యోగ్యతలు. కులం. గోత్రం. శాఖ, కట్నం, ప్రవర, జాతకాలు. అంతస్థులు. ఆచారాలు. లాంఛనాలు, వావి వరుసలు. సంప్రదాయాలు. కర్మకాండలు మొదలైనవి ఎన్నో ఉన్నాయి. వీటి అన్నింటిని అధిగమిస్తేనేగాని వివాహ సంబంధం నిశ్చయం కాదు. వీటిని గురించి కూడా మనం సంగ్రహంగా తెలుసుకోవాల్సిన ఆగత్యం ఉంది.

## ముందుగా వరునికి ఉండాల్సిన యోగ్యతలు:

వివాహ మనేది వధూవరులకుండే పరస్పర సంబంధం కాబట్టి. ఇద్దరూ సుఖ జీవనం గడపటానికి. సమాజానికి భారం కాకుండా ఇద్దరూ యోగ్యులైన పౌరులుగా. ధర్మపరాయణులై ఉండటానికి అవసరమైన గుణగణాలు కలిగి ఉండాలి. అందు చేత వధూవరుల కుండాల్సిన గుణగణాదుల్ని గూర్చి మన శాస్త్రకారులు వివరించారు.

వరుడు బుద్ధిమంతుడై ఉండాలి. అటువంటి బుద్ధిసంపన్నుడైన వానికే కన్య నివ్వాలని ఆశ్వలాయనుడు "బుద్ధిమతే కన్యాం ప్రయచ్ఛేత్" (ఆశ్వ. గృ. సూ. 1-5-2) అన్నాడు. ఆపస్తంబుడు, మంచికులంలో పుట్టినవాడు మంచి నడవడి కలవాడు. శుభలక్షణాలు కలవాడు. విద్య, ఆరోగ్యం కలిగినవాడై ఉండాలి "బంధు శీల లక్షణసంపన్న శ్రుతవాన్ అరోగః ఇతి వరం సంపత్" (ఆప.గృ.సూ. 3-20) అన్నాడు. బోధాయనుడు తన గృహ్యసూత్రాలు 4-1-12 లో బ్రహ్మచర్యాన్ని చక్కగా పాటించినవానికే కన్య నివ్వాలని అన్నాడు. బ్రహ్మచర్యమంటే గురు కులంలో బ్రహ్మచారిగా విద్యాభ్యాసం చేసినవాడని భావం.

మనువు—"వేదానధీత్య వేదౌ వా వేదం వాపి యథాక్రమమ్
అవిప్లుత బ్రహ్మచర్యో గృహస్థాశ్రమ మావిశేత్. (మనుస్మృతి. 3-2)

బ్రహ్మచర్యాన్ని చక్కగా పాటిస్తూ మూడుగాని. రెండుగాని, ఒకటిగ్గాని వేదాల్ని చక్కగా అధ్యయనం చేసిన బ్రహ్మచారే గృహస్థాశ్రమ ప్రవేశానికి అర్హుడు" అన్నాడు. అటువంటివాడే గురువు అనుమతిని పొంది. సమావర్తన సంస్కారాన్ని పొందిన ద్విజుడు తన కులానికి చెందిన శుభలక్షణాలు కలిగిన కన్యను వివాహమాడాలని అన్నాడు.

బ్రహ్మచర్యమనే విధిని స్మృతికారులంతా చెప్పారు. అయితే ఈ కాలానికి పైన చెప్పబడిన గురుకులవాసం, వేదాధ్యయనం లాంటివి, అందరికీ అన్వయించవు గదా! అందుచేత స్మృతిచంద్రికలోని ఈ లక్షణాలను మనం గ్రహించవచ్చు.

“కులం చ శీలం చ వపుర్యశశ్చ, విద్యాం చ విత్తం చ సనాథతాం చ ఏతాన్ గుణాన్ సప్త పరీక్ష్య దేయా, కన్యా బుధైః శేషమచిన్తనీయం.” కులము, శీలము, శరీరము, యశస్సు, విద్య, ధనము, బాంధవుల సహాయ సహకారాలు, అనే ఈ ఏడుగుణాలూ ఆలోచించి కన్యనివ్వాలి. మిగతా విషయాలను గూర్చి ఆలోచించ నక్కర లేదు; అని.

గౌతముడు — విద్య, మంచి నడవడి, బాంధవ్యము, శీలము కలవాడు ఉత్తమ వరుడు అన్నాడు (విద్యా చారిత్ర్య బంధు శీలసంపన్నాయ కన్యాం దద్యాత్) అని. అట్లాగే ఆపస్తంబుడు తన ధర్మసూత్రాల్లో (1-3-20) “బంధు శీల లక్షణ సంపన్నః శ్రుతవానరోగ ఇతి” అని అన్నాడు. బృహత్పరాశర సంహితననుసరించి “జాతి, విద్యా, యౌవన, బల, స్వాస్థ్య, బాంధవ సహాయం, ఉత్సాహం, ధన సంపత్తి” అనేవి ఉండాలి. ఇవన్నీ ఉన్నప్పటికీ, వివాహానికి ముఖ్యోద్దేశమైన సంతానప్రాప్తికి అనివార్యగుణం అయిన పుంస్త్వం కలవాడు. వీర్యవంతుడై వుండాలని ప్రత్యేకంగా చెప్పనక్కరలేదు. అట్లాగే వధువు స్త్రీత్వం కలదై ఉండాలి. అంటే ఉభయుల్లోనూ ప్రజననశక్తి ఉండాలి. అట్లాగే బ్రహ్మచర్యమూను! క్షేత్రాన్ని బీజవంతునికే యివ్వాలి. మూర్ఖ, పక్షఘాతం, సగోత్రుడు, కుష్ఠరోగి, పతితుడు, ప్రచ్ఛన్నవేషంతో ఉన్నవాడు, ఇటువంటివానికి పిల్లనీయరాదని స్మృతులన్నీ చెపుతున్నాయి. ధర్మశాస్త్రాల్లో వధువుకు క్షేత్రమనే పదం వాడారు.

## కన్య కుండాల్సిన లక్షణాలు, యోగ్యతలు:

మన ధర్మశాస్త్రాల్లో వధువుకుండాల్సిన లక్షణాల్ని గురించి కూడా విపులంగానే వర్ణించారు. కొంత అతిగా వర్ణించారన్నా తప్పు లేదు. సంతానోత్పత్తికి విశుద్ధము, సమర్థవంతము అయిన క్షేత్రం అవసరం. బీజశుద్ధి ఎంత ముఖ్యమో, క్షేత్ర శుద్ధి కూడా అంతే ముఖ్యం. బీజం బలహీనమైనదైనా, బలంగల క్షేత్రంలో బాగా వృద్ధి పొందుతుంది. అందుచేతనే మనువు —

“క్షేత్రం బీజవతే దేయం నాబీజా క్షేత్ర మర్హతి” అంటూ క్షేత్రశుద్ధిని గురించి నొక్కిచెప్పాడు.

వయస్సును గురించి చెప్పాలంటే, వరుడు యువకుడై, పుంస్త్వం కలవాడై ఉండాలన్నప్పుడు వధువు కూడా యువతియై స్త్రీత్వం కలదై ఉండాలి కదా! పెండ్లికూతురు బాలిక అయి ఉండాలని, ఋతుమతి కాకుండా ఉండాలని ఎక్కడా ఉన్నట్లు కనిపించదు. ఆశ్వలాయన గృహ్యసూత్రాలలో (1-7-2) త్రిరాత్ర బ్రహ్మచర్యం పాటించాలని ఉంది. వివాహం కాగానే వధూవరుల సమాగమం కూడదని అన్నారు. కాబట్టి వధువు యొక్క వయస్సు 14, 15 సంవత్సరాలకు తక్కువ ఉండదు. పై సూత్రాన్ని వ్యాఖ్యానించిన హరదత్త, నారాయణాదులు కొన్ని ప్రాంతాల్లో వివాహం అయిన వెంటనే (విదేహ వాసుల్లో) సమాగమం ఉన్నట్లు, కొన్ని ప్రాంతాల్లో బ్రహ్మచర్యవ్రతపాలనం మూడు రాత్రులు, కొన్నిచోట్ల 12 రాత్రులు పాటిస్తున్నట్లు వ్రాశారు. కాబట్టి పెండ్లికూతురు మరీ చిన్న బాలికలు కారని తెలుస్తోంది. ప్రాచీనకాలంలో అతి బాల్యవివాహాలు ఉన్నట్లుగా దాఖలాలు కనిపించవు.

మన స్మృతుల్లో అక్కడక్కడ 'నగ్నిక' అనే పదాన్ని వాడారు. పెండ్లికూతురు నగ్నికగా ఉండాలని. "యావన్న లజ్జయాంగాని, కన్యా పురుష సన్నిధౌ యోన్యాదీన్యవగూహేత, తావద్భవతి నగ్నికా." (స్మృతిచంద్రిక) బాలికకు సిగ్గు ఏర్పడకుండా ఉన్న వయస్సు, పురుష సన్నిధిలో సైతం శరీరావయవాల్ని కప్పుకోవాలని తెలియని వయస్సులో ఉన్న బాలికను 'నగ్నిక' అంటారు; అని. గోభిల గృహ్యసూత్రాల (3-4-6) టీకలో యౌవనాన్ని, కామవాసనను పొందనట్టి, రజస్వల కానట్టి కుచహీనయైన కన్యను నగ్నిక అంటారు అని ఉంది. వీరమిత్రోదయంలో "త్రింశద్వర్షః షోడశవర్షాం భార్యాం విన్దేత నగ్నికాం" అన్నారు. 16 సంవత్సరాల కన్యను నగ్నిక అన్నారు. "నగ్నికా సజాతా బ్రహ్మచారిణీ" (హారీత గృహ్య సూత్రాలు 1-19-2)లో వివాహ సమయానికి బ్రహ్మచారిణి అయి ఉండాలని మాత్రమే అన్నారు. మాతృదత్తుడు ఈ శబ్దార్థాన్ని వ్యాఖ్యానిస్తూ వివాహమైన పిమ్మట ఏకాంతంలో పతి సమాగమాన్ని కోరటానికి సిద్ధంగా ఉన్న కన్య "తస్మాద్వస్త్ర విక్షేపణార్హా నగ్నికా మైథునార్హేత్యర్థః" అని అన్నాడు. ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చింది? అంటే అతి బాల్యవివాహాలను సమర్థించేవారు ఈ శబ్దాన్ని ఆధారంగా తీసుకొని ఏమేమో చెపుతూ ఉంటారు కాబట్టి! వారి వాదమంతా నిరాధారం అని గ్రహించటానికి ఇదంతా చెప్పవలసి వచ్చింది. ఇంకొక విషయాన్ని తీసికొని అతిబాల్య వివాహాలను సమర్థిస్తూ ఉంటారు. వేదాలకు, ధర్మశాస్త్రాలకు

విపరీతార్థాలను కల్పించగలిగిన మహావిద్వాంసులు మన భూఖాగంలో జన్మించి నందున, వారి మాటలను వేదవాక్యాలుగా నమ్మే మూఢులు సైతం అసంఖ్యాకంగా ఉన్నందున, కొన్ని విపరీతాచారాలు ప్రబలి సంఘం తప్పుత్రోవన పడ్డది. ఉదాహరణగా చెప్పాలంటే —

ఋగ్వేదం పదవమండలంలో వివాహసూక్తం ఉన్నదని చెప్పుకొన్నాం. ఆ వివాహ సూక్తంలోని 40-వ ఋక్కు ఇట్లా ఉంది — ''సోమస్యజాయా ప్రథమం, గంధర్వస్తే పరః పతిః। తృతీయోఽగ్నిష్టేపతి స్తురీయస్తే మనుష్యజాః। (కన్యలు ముందుగా సోముని భార్యలై, పిమ్మట గంధర్వుని భార్యలై, ఆ పిమ్మట అగ్నికి భార్యలై చివరకు మనుష్యునికి భార్యలౌతారు అని భావం) ఈ భావాన్ని తీసుకొని మన పండితులు సోమగంధర్వాగ్నులకు భార్యలుగా కాక పూర్వమే కన్యాదానం చేయటం మంచిదని, అందుకే బాల్యవివాహాలు శ్రేష్ఠమని ఏమేమో చెపుతారు.

వశిష్ఠ స్మృతి పై ఋక్కునే ఈ విధంగా వ్యాఖ్యానించింది —

''పూర్వం స్త్రియః సురైర్భుక్తాః సోమగంధర్వ వహ్నిభిః
గచ్ఛన్తి మానుషాన్ పశ్చాత్ నైతాదుష్యన్తి ధర్మతః।
తాసాం సోమోఽదదచ్ఛౌచం, గంధర్వః శిక్షితాం గిరమ్
అగ్నిశ్చ సర్వభక్షత్వం తస్మాత్ నిష్కల్మషాః స్త్రియః'' అని.

కన్యలు ముందుగా బాల్యంలో సోమగంధర్వాగ్నులచేత అనుభవింపబడతారంటే, వారు కన్యయొక్క శారీరక వికాసానికి ఎట్లా తోడ్పడుతారో చక్కగా వివరించారు. ఇటువంటి కావ్య సౌందర్యంకల ఋక్కునకు విపరీతార్థాలు కల్పించే వారిని ఎట్లా అభినందించాలో తెలియదు. బాల్యంలో ఉన్న పిల్లలనే యక్ష గంధర్వ రాక్షసాదులు ఆవహిస్తారని మనం వింటూ ఉంటాం. వశిష్ఠస్మృతి ఇందులో నిబిడమై యున్న అర్థాన్ని చక్కగా వివరించింది. మానవజీవితాన్ని యౌవనంలో మన్మధుడు, వార్ధక్యంలో యముడు అనుభవిస్తారని అంటే ఏమని అర్థం చెపుతారు?

దానం అనేది ఒకేసారి చేయాలి — ఎవరిచేతనూ అనుభవింపబడనిదై ఉండాలి. ఏ ప్రతిఫలమూ ఆశించకుండా యివ్వాలి. ఇట్లా దానాన్ని గూర్చి చెప్పబడి ఉన్నందున సోమ గంధర్వాగ్నులచేత ఉపభుక్తమైన కన్యను దానం చేయటం పాపం. కాబట్టి, బాలికనే, నగ్నికనే దానం చేయాలి అని సంఘానికి బోధించిన పాండిత్యానికి జోహారులు! మన ప్రాచీన సాహిత్యంలో. ఆ పండితులు చదివిన సంస్కృత

కావ్యనాటకాదుల్లో ఎక్కడా వారు చెప్పే నగ్నికా నాయికగా లేదు. అమాయకులు, సత్యశీలురూ అయినవారు వారి మాటలను నమ్మి బాల్యవివాహాలకు పూనుకొని ఉంటారు. దానికి కొన్ని చారిత్రక పరిస్థితులు కూడా తోడై ఉండి ఉండవచ్చు. ప్రాచీన ఆయుర్వేద శాస్త్రజ్ఞులంతా స్త్రీకి వివాహోచితమైన వయస్సు పదహారు సంవత్సరాలకు పైగానే ఉండాలని చెప్పారు. పైగా పాతిక సంవత్సరాల వయస్సుకు తక్కువ వయస్సు కల పురుషుడు. పదహారు సంవత్సరాలకు తక్కువ వయస్సు గల స్త్రీతో సంభోగం చేసినప్పుడు ఆ భ్రూణం గర్భాశయంలోనే నష్టమైపోతుంది. లేదా. పుట్టినప్పటికి అల్పాయుర్దాయం గల శిశువు అయి వుంటుందని కూడా చెప్పారు సరే! అదృష్టవశాత్తు సంఘసంస్కర్తల కృషివల్ల, ప్రభుత్వశాసనాలవల్ల ఈ బాల్య వివాహ సమస్య ఈనాడు లేదు. ఎక్కడో తప్ప. అన్ని వర్ణాల్లోనూ బాల్య వివాహాలు లుప్తమై పోయినాయి. సనాతనుల మనుకొనేవారు, లోగడ బాల్య వివాహాలను ప్రోత్సహించిన వారు కూడా ఈనాడు తమ కొమార్తెలకు 20 సం॥ దాటిన పిమ్మట కనీసం డిగ్రీ చదువు పూర్తి చేసిన పిమ్మటనే వివాహం చేస్తున్నారు. కాబట్టి ఈ సమస్య ఇక లేనట్లే! ఎక్కడైనా ఉంటే, నింద్యమైనప్పటికీ. పైశాచం అక్కడక్కడ కనిపిస్తున్నట్లే!

ప్రాచీనులు చెప్పిన వధూలక్షణాలను చూద్దాం. శతపథ బ్రాహ్మణంలో స్త్రీని యజ్ఞవేదికతో పోల్చారు — "ఏవమేవ హి యోషాం ప్రశంసన్తి పృథుశ్రోణిర్విమృష్టాంతరా సా మధ్యే సంగ్రాహ్యేతి" (శ. బ్రా 1-2-5-16) శారీరక సౌందర్యాన్ని గురించి చెపుతూ పృథుశ్రోణి (పెద్దపిరుదులు కలది) విమృష్టాంతర (విశాలమైన భుజాంతరములు కలది) సన్నని నడుము కల స్త్రీని ప్రశంసిస్తారని చెప్పారు. ఇవన్నీ యువతీలక్షణాలు. ఆశ్వలాయనుడు సమస్త బాహ్యశుభలక్షణాలతో తృప్తి పడ్డాడు. భారద్వాజ గృహ్యసూత్రాల ననుసరించి నాలుగు ప్రధాన లక్షణాలుండాలి - "చత్వారి వివాహ కారణాని విత్తం రూపం ప్రజ్ఞాబాంధవమితి" (1-6) ధనం, అందము; ప్రజ్ఞ, కులం (బాంధవ్యం) అనేవి. ఇంకా కొంతమంది సూత్రకారులు. లోకదృష్టి కలవారు. వధువుయొక్క రూపానికే ప్రాధాన్యత ఇచ్చారు — 'అప్రజ్ఞా హి కథం సంవాసః' అంటూ. అట్లాగే శరీరసౌందర్యము. ఆరోగ్యము. తెలివితేటలు. సద్గుణాలు కలిగిన కన్యను వివాహమాడాలని అంటూ మన పూర్వనాటక ప్రబంధకవుల వర్ణనల్లాగా. ఈనాటి సినిమాతారల వేషభూషల్లాగా రకరకాలుగా వర్ణించారు. రూపలావణ్యాదులకు. తెలివితేటలకు, కులీనతకు కొలత ఏముంటుంది? తావలచింది రంభ. తామునిగింది గంగ. బుర్రకొక బుద్ధి, నోటికొక్క రుచి అనే సామెత ఉండనే

ఉన్నాయిగదా! వివాహానికి సంతానం అనేది ప్రధానోద్దేశ్యం గదా! మంచిసంతానాన్ని ఇవ్వజాలిన స్త్రీ అని ఎట్లా తెలుస్తుంది? ఆపస్తంబ గృహ్యసూత్రాల్లో దీనికొక పద్ధతిని చెప్పారు. అది హాస్యాస్పదంగాను, కొంత వినోదంగాను, విచిత్రంగానూ ఉన్నా, శకునాలకు, సోదెలకు ఇతర మూఢవిశ్వాసాలకు, ఇంకా చోటున్న సమాజంలో ఉన్నట్టి మనం తెలుసుకోవటంలో తప్పులేదు.

కన్యాపరీక్షానికి ముందు వరుడు. సంవత్సరానికి రెండు పంటలుపండే పొలంలో నుంచి కొంత మట్టిని, గోశాలనుండి కొంత మట్టిని, యజ్ఞం అయిపోయిన పిమ్మట, యజ్ఞవేదిలో నుండి కొంత మట్టిని, ఇంకిపోని చెరువునుండి కొంత మట్టిని, ద్యూతస్థానం నుండి కొంత, నాలుగువీధులు కలిసే చోటునుండి కొంత మట్టిని, బీడు (ఊసర క్షేత్రం) నుండి కొంత మట్టిని, శ్మశానం నుండి కొంత మట్టిని. మొత్తం 8 చోట్ల నుండి మట్టిని తీసుకొని రావాలి. తరువాత ఈ దిగువ మంత్రం చదవాలి —

''ఋతమగ్రే ప్రథమం యజ్ఞఋతే సత్యం ప్రతిష్ఠితమ్, యదిదంకుమార్యాభిజాతా తదియమిహ ప్రతిపద్యతాం యత్సత్యం తద్దృశ్యతా మితి'' (ఆప. గృ. సూ. 1-4-12)

పిమ్మట కన్యను పైన చెప్పిన మృత్తికలలో నుండి ఏదో ఒక భాగాన్ని తీసుకోమని చెప్పాలి. ఆమె తీసిన మట్టినిబట్టి ఫలితం ఈ దిగువ విధంగా గ్రహించాలి.

''గోష్ఠాన్ పశుమతీ. వేది పురీషాద్బ్రహ్మ వర్చస్వినీ, అవిదాసినో హ్రదాత్, సర్వసంపన్నా దేవనాత్ కితవీ చతుష్పథాత్ విప్రవ్రాజినీ, హరిణాదధన్యా, శ్మశానాత్పతిఘ్నీ'' (ఆప. గృ. సూ. 1-4-14,20) ఆమె తీసిన మట్టినిబట్టి క్రమంగా - ధనవంతులు. సంతానము. పశుసంపద, బ్రహ్మవర్చస్సు, సర్వసంపదలు కలవారు, జూదగాండ్రు, సన్యాసులు, దరిద్రులు అయిన సంతతి కలుగుతుందని, శ్మశానం నుండి తెచ్చిన మట్టిని తీస్తే భర్తృఘాతుకురాలు అవుతుందని అన్నారు. గోభిలగృహ్యసూత్రాల్లో (2-1-4.9) లౌగాక్షిగృహ్య సూత్రాల్లో (14-4-7) ఈ విధమైన వర్ణనే ఉంది.

ఆపస్తంబగృహ్య సూత్రాల్లో ఇంకొకవిధమైన వర్ణన కూడా ఉంది. వధూవరులకు సంబంధించిన ఇరుపక్షాలవారి అంగీకారము అయిన పిమ్మట వరుడుగాని, అతని బంధువులు గాని ఒక మట్టిముద్దను తీసుకుంటారు. ఆ మట్టిలో వరి, గోధుమలు, యవలు లాంటి ధాన్యపుగింజలుంటాయి. రెండవ ముద్దలో యజ్ఞవేది భస్మం,

మూడవ మట్టిముద్దలో పేడ, నాల్గవ ముద్దలో దున్నిన పొలంలోని మట్టి, ఐదవ ముద్ద శ్మశాన మృత్తిక కలిపి ఉంటాయి. వీటిని వధువు ముందుంచి. ఆమె కిష్టమైన ముద్దను ముట్టుకోమంటారు. మొదటి ముద్ద సౌభాగ్యాన్ని ఐశ్వర్యాన్ని, రెండవది బ్రహ్మవర్చస్సును. మూడవది పశుసంపదను, నాల్గవది ధాన్యసంపదను సూచిస్తాయి. ఐదవది గర్హ్యమైనది. ఇట్లా భావిదాంపత్య ఫలితాన్ని, అదృష్టాన్ని తెలుసుకొనే చాలా పద్ధతులు చెప్పబడ్డాయి. ఇవన్నీ ఈనాడు చిలకజోస్యం చెప్పించుకొనేవారు, రైల్వేస్టేషనువద్ద, బజార్లోను పటంపెట్టుకొని కూర్చుండే జ్యోతిష్కుల వద్ద చేయిజాపే ఆధునికుల హేళనకు పాత్రాలే అవుతాయి. కాని ఇటువంటివే కొన్ని పద్ధతులను వరుడు జూదగాడు, త్రాగుబోతు. సత్యవాది. ధార్మికుడు. భార్యను పంపేవాడు, అత్తవారిని ఏడిపించేవాడు. మోసగాడు వీటిలో ఎటువంటివాడో కనిపెట్టేందుకు చెప్పి ఉంటే ఇంకా బాగుండేది.

వధువును ఎన్నుకొనేందుకు
మన ప్రాచీనులు చెప్పిన ముఖ్య విషయం:

భ్రాతృహీనయైన కన్య పనికిరాదు. అని. అంటే, ఈనాడు ఇది (భ్రాతృహీనయై ఉండటం) ఉత్తమ లక్షణంగా పరిగణింపబడటం మనం చూస్తున్నాం — అత్తవారి ఆస్తి కూడా లభిస్తుందని. కాని, దీనిని మన పూర్వులు నిందిస్తున్నారు— (మానవ గృహ్యసూత్రాలు. 1-7-8. మనుస్మృతి-3-11. యాజ్ఞవల్క్యస్మృతి-1-53 మొదలైన స్మృతుల్లో భ్రాతృహీనయైన కన్య పనికిరాదన్నారు.) సోదరులు లేని కన్యను. తండ్రి ఎవరో తెలియని కన్యను వివాహమాడరాదని మనువు స్పష్టంగా చెప్పాడు. ఋగ్వేదంలో —— 'భ్రాతృహీనయైన కన్య, తన తండ్రి యింటికి తిరిగి వచ్చినట్లుగానే ఉష కూడా స్వల్పకాలంపాటు అట్లా ప్రకాశించి తిరిగి తన జన్మస్థానానికి తిరిగి వచ్చేస్తుంది.' అని వర్ణింపబడి ఉంది. అథర్వవేదంలో ఒకచోట (1-17-1) 'భ్రాతృహీనయైన కన్యలాగానే వారిని అట్లా కాంతి విహీనంగా కూర్చోనీయండి' అని ఉంది. కొడుకులు లేనివారికి కూతురే కొడుకు అవుతుంది- ఆమెనే పుత్రునిలాగా భావించి పెంచుతాడు ('పుత్రవత్పాలితామయా' అని కన్యాదాన సమయంలో అంటాడు కూడాను) దౌహిత్రుడు ఉత్తరాధికారి అవుతాడు కాబట్టి అతడు (మనుమడు) తండ్రి వంశానికి కాక. తల్లియొక్క పుట్టింటి వంశానికి ఉత్తరాధికారియై వారికి పిండప్రదానాదులు చేస్తాడు. ఆ విధంగా అల్లుని నుండి మాట కూడా తీసుకుంటాడు. అందుచేతనే పూర్వం సోదరులు లేని కన్యను చేసుకొనేవారు కారు.

కోసం పుత్రుని దత్తత అయినా తీసుకోవాలి. (ఎంతమంది అస్తులకైనా ఉత్తరాధికారులై, వాటి నన్నింటిని జీర్ణించుకోగల శక్తిసంపన్నులైన ఆధునిక వరులకు, వారి తల్లిదండ్రులకు, భ్రాతృహీనయైన కన్య ఉత్తమోత్తమంగా తోచటంలో ఆశ్చర్యమేముంది?)

మనువు — 'నోపయచ్ఛేత్ తాం ప్రాజ్ఞః పుత్రికా ధర్మశంకయా' అన్నాడు. భ్రాతృహీనలైన కన్యలు వివాహం కాక, తండ్రి యింటనే జీవితాంతం ఉండిపోయినట్లు ఋగ్వేదంలో (2-17-7) చెప్పబడి ఉంది — "అమాజారివ పిత్రోః స చాసతీ సమానాదా సదసస్త్వామియే భగమ్" అని.

వసిష్ఠ ధర్మసూత్రాల్లో (17-16) కన్యయొక్క తండ్రి, కాబోయే అల్లునితో "భ్రాతృహీనయైన ఈ కన్యను నీ కిస్తున్నాను. కాని, ఈమెకు పుట్టినవాడు నా కుమారుడౌతాడు" (అభ్రాతృకాం ప్రదాస్యామి తుభ్యం కన్యామలంకృతామ్, అస్యాం యో జాయతే పుత్రః, స మే పుత్రో భవేదితి) అని. కాబట్టి, పూర్వకాలంలో భ్రాతృహీన యైన వాని పుత్రుడు తమ కులాన్ని పెంపొందించడని తలచి ఆ విధమైన వివాహాన్ని నిషేధించారు. కాల మహిమవల్ల ధర్మంకంటె ధనానికి ప్రాధాన్యత పెరిగినందున భ్రాతృహీనయే సర్వోత్తమమైనదిగా భావింపబడుతోంది.

వధువు యొక్క వయస్సును గూర్చి లోగడ ప్రస్తావించటం జరిగింది. వేద కాలంలోనే కాకుండా, గృహ్యసూత్ర రచనాకాలంలో కూడా పెండ్లికొమార్తెలు వయస్సు వచ్చినవారై యున్నట్లు తెలుస్తోంది. లోగడ మనం ప్రస్తావించుకొన్న 'నగ్నిక' అనే శబ్దానికి అర్థం మహాభారతంలో 16 సం॥ వయస్సు గల స్త్రీ అని అన్నారు. హారీతగృహ్య సూత్రాల్లో వివాహ సమయానికి బ్రహ్మచారిణిగా ఉన్నది నగ్నిక అని అన్నాడు. మాతృదత్తుడు "తస్మాద్వస్త్ర విక్షేపణార్హా నగ్నికా మైథునార్హేత్యర్థః" వివాహమైన పిమ్మట ఏకాంతంలో పతి సమాగమం కోసం వస్త్రావ్యాపనాలను తొలగింపజాలిన వయస్సు కలది అన్నారు.

క్రీస్తుకు పూర్వం 400 నుండి 100 సం॥ వరకు ఉండిన సూత్రకారులు చాల మంది కన్యను రజోదర్శనమైన పిమ్మట ఎక్కువ కాలం వివాహం చేయకుండా ఆపవద్దని వ్రాశారు. మనువు, కన్య ఋతుమతి అయిన పిమ్మట 3 సం॥ల వరకు తల్లిదండ్రులు, బంధువులు వివాహం చేయకపోతే కన్యయే స్వయంగా వరుని వరించవచ్చు నన్నాడు - ఆమె స్వయందత్త; ఇదంతా వెనుకటి గాథ. క్రమంగా కన్యల వివాహ వయస్సు తగ్గుతూ రావటానికి చారిత్రక కారణాలు:

1. వైదిక కాలంలో కన్యలకు సైతం ఉపనయనం, వేదాధ్యయనం ఉండేవి. కాబట్టి అధ్యయనం పూర్తి అయ్యేవరకు ఆగేవారు. క్రమంగా వేదాధ్యయనం సన్నగిల్లటం, పుట్టింట భారంగా ఉన్నట్లు భావన కలగటం.

2. వంశాన్ని నిలబెట్టటానికి, పవిత్రం చేయటానికి పుత్రుడు అవసరం కాబట్టి తొందరగా వివాహం చేస్తే సంతానం తొందరగా కలుగుతుందని కొడుకుల వివాహానికి తొందరపడటంతో, కన్యల వివాహ వయస్సు సైతం తగ్గుతూ రావటం. (ఈ సందర్భంలో ఈ విషయం స్మరణకు వస్తోంది. ప్రాచీన కాలంలో అక్షరాభ్యాసం లేదా విద్యాభ్యాస వయస్సు 7, 8 సంవత్సరాలు. క్రమంగా అది 5 సంవత్సరాలకు తగ్గింది. విద్యయొక్క ప్రాధాన్యతను గుర్తించిన కొద్దీ ఈనాడు 3 సం॥రాలకే ప్రారంభమౌతోంది — బాలురు బాలికలకు కూడా)

3. అప్పటికి బౌద్ధం బాగా ప్రచారంలోకి వచ్చి భిక్షువులు, భిక్షుణులు ఒకే సంఘారామంలో ఉంటూ ఉండటం, అనేక దూషిత కార్యాలకు ఆస్కారం కలగటం. దీని ప్రభావం సంఘం మీద పడటంవల్ల సైతం శాస్త్రకారులు త్వరగా కన్యలకు వివాహం చేయటం మంచిదనే అభిప్రాయానికి రావటం.

4. గ్రీకులు, మహమ్మదీయులు, క్రైస్తవులు మొదలైన ఇతర మతాలవారితో మన దేశానికి సంబంధం ఏర్పడిన పిమ్మట వర్ణసాంకర్య భయంతో బాల్య వివాహాలకు ప్రోత్సాహం లభించి ఉండవచ్చు. మహమ్మదీయ యుగంలో 15, 16, 17 శతాబ్దాల్లో మన దేశంలో అత్యంత బాల్యవివాహాలు ప్రారంభమైనట్లు నాటి యాత్రికుల వ్రాతలవల్ల తెలుస్తోంది. మన దేశానికి వచ్చిన ఇతర జాతులవారి అలవాట్లనుబట్టి మనవాళ్ళు కూడా వారి సంప్రదాయాలనే అనుకరించి ఉండవచ్చు.

యూరపు దేశాల్లో ఆనాడు బాల్య వివాహాల ఆచారం బాగా ఉంది. రోములో 10, 12 సంవత్సరాల బాలికలకు వివాహం చేసేవారని Muler పండితుడు Family అనే గ్రంథంలో వ్రాశాడు. యూరపులో, మధ్య యుగంలో సైనిక రాజకీయ కారణాలవల్ల 5 సం॥ల కన్యలకు వివాహాలు చేసినట్లు J. L. Devis అనే పండితుడు The short History of women అనే గ్రంథంలో వ్రాశాడు. బాలునికి 15 సంవత్సరాలు, బాలికకు 12 సం॥లు వచ్చిన పిమ్మట వివాహం చేస్తే ఆనాడు చర్చి,

సంఘమూ కూడా హేళన చేసేవారని Muler పండితుడే Family అనే గ్రంథంలో వ్రాశాడు — 'ఇంగ్లండులో ట్యూడర్ కాలంలో ఉన్నత వర్గాలలోని బాలికల వివాహం చాలా చిన్న వయస్సులో 4,5, సం॥ వయస్సులో జరిగేది' అని కూడా వ్రాశాడు. అట్లాగే F. J. ఫర్నివల్ తన Child marriage and divorces అనే పుస్తకంలో వివాహాలు 9, 10 సంవత్సరాల వయస్సులో ఒక్కొక్కప్పుడు 2,3, సం॥ల వయస్సులో జరిగినట్లు వ్రాశాడు. 1929 సం॥ వరకు ఇంగ్లండులో ఈ బాల్యవివాహాలు అధికంగానే జరిగినాయి. ఆ సంవత్సరం వరకు చట్టరీత్యా వధూవరుల వివాహ వయోపరిమితి 12, 14 సంవత్సరాలుగా ఉండేది. ఆ సంవత్సరమే పార్లమెంటు వధూవరుల కనీస వివాహ వయస్సు 16 సం॥లుగా చట్టం చేసింది. అటువంటివారి సంపర్కము, సాంగత్యము కలిగిన పిమ్మట మన దేశంలో సైతం అతిబాల్య వివాహాలు విస్మారంగా జరగటంలో ఆశ్చర్యం ఏముంది? అటువంటి యూరపు దేశీయులు, వారి మానసపుత్రులు మన శ్రుతి స్మృతుల్ని హేళన చేయటం నిందించటం అర్థరహితం కాదా? అట్లాగే మహమ్మదీయ జాతుల్లో ఈ బాల్యవివాహాలు ఉండేవి, ఉన్నాయి. ఈనాడు ఆ దేశాల్లోను, మన దేశంలోనూ కూడా పరిస్థితులు మారిపోయినాయి. కాబట్టి, చెప్పదలచిం దేమంటే, చరిత్ర గతి మారుతూ ఉంటుంది. ఇది పరమ సత్యం. ఏ విషయాన్నైనా విమర్శించేటప్పుడు ఆనాటి దేశకాల పరిస్థితుల్ని దృష్టిలో పెట్టుకొని విమర్శించాలి. మంచిని గ్రహించాలి, చెడును వదలిపెట్టాలి. గ్రుడ్డిగా, వివేకహీనులై, సానుభూతి లేకుండా ప్రాచీనుల్ని తెగడటమే పనిగా పెట్టుకోరాదు. చారిత్రక విమర్శకునికి సానుభూతి, సమయం, సహనం అనే గుణాలు అవసరం. ఏ విమర్శకునికైనా ఈ గుణాలు ఉండాల్సినవే!

ఇంతవరకు మనం చర్చించుకొన్నట్టి ఏ రకం వివాహమైనా, ఏ వయస్సులో చేసే వివాహమైనా కొన్ని ధార్మిక క్రియలు, విధులు మాత్రం తప్పనిసరిగా జరగాల్సినవే అని తెలుస్తుంది. ఈ విధులు, అన్ని మతాలవారికీ ఉంటాయి; వారి వారి మతాలకు సంబంధించినవి. ఒకరి ధార్మిక విధుల్ని ఇంకొకరు హేళన చేయటం మూర్ఖత్వమే అవుతుంది. బంధుమిత్రులంతా ఒకచోట చేరటం, సమంత్రకంగా వివాహం జరగటం అనేది మన హిందూ సంప్రదాయంలో ఉన్నది. ఇతర మతాలవారు కూడా తమ తమ మతగ్రంథాలలోని వచనాల్ని పఠించటం, అది వారి మత పురోహితుని లాంటి వానిద్వారా జరగటం, విందులు వినోదాలు వారి వారి మత సంప్రదాయాల్ని బట్టి జరగటం మనం చూస్తున్నాం.

కాబట్టి వివాహంలో ధార్మిక క్రియలకు అధిక ప్రాధాన్యత ఉంది. గాంధర్వ రాక్షసాల్లో సైతం, సమంత్రకంగా వివాహం జరగాల్సిందే అనే విషయం మన పురాణాల ద్వారా తెలుస్తోంది. ఈ ధార్మిక క్రియవల్లనే, ఈ విధులవల్లనే ఆ వివాహానికి సంఘంలో గుర్తింపు వస్తోంది. సామాన్యంగా అమలులో ఉన్న ధార్మిక విధులు క్రియలను గురించి ముందు తెలుసుకోవాలి.

వధూవరుల కులగోత్ర విచారణతో ఈ ధార్మిక క్రియలు ఆరంభమౌతున్నాయి. వయస్సు తరువాత కులగోత్ర శాఖ నక్షత్రాదులను గూర్చిన విచారణలోనే చాలా వివాహ సంబంధాలు కుదరకుండా వెడిపోతున్నాయి. అంటే వీటికి కూడా మన ధర్మశాస్త్రాలతో సంబంధం వున్నదన్న మాట. కాబట్టి వీటిని గురించి కూడా తెలుసుకోవాలి. వివాహ సంబంధం కుదరటానికి ప్రతిబంధకాలుగా ఉన్న విషయాలు: 1) సగోత్ర వివాహం. 2) సపిండ వివాహం. 3) సప్రవర వివాహం. 4) జాతకాలు-నక్షత్రాలు, 5) అసవర్ణ వివాహం. 6) అనులోమ వివాహం, 7) ప్రతిలోమ వివాహం. 8) విధుత వివాహం. 9) విజాతీయ వివాహం మొదలైనవి.

గోత్రము: అనేక వివాహ సంబంధాలు, అన్నీ కుదిరినా గోత్రాలు ఒకటే ఉన్నటంవల్ల (సగోత్రాలు) కుదరక పోవటం మనం చూస్తున్నాం. అంటే సగోత్ర వివాహాలను సమాజము, ధర్మశాస్త్రమూ కూడా అంగీకరించటం లేదన్నమాట. విష్ణు ధర్మసూత్రాలు, యాజ్ఞవల్క్య ధర్మసూత్రాలు మొదలైన స్మృతిగ్రంథాల్లో సగోత్ర వివాహం నిషిద్ధమని చెప్పబడ్డది. వధూవరుల గోత్రాలు భిన్నమైనవిగా ఉండాలన్న మాట గోత్రమనే శబ్దానికి చాలా అర్థాలు కనిపిస్తున్నాయి. ఋగ్వేదంలోనే గోశాల, గోసమూహం, మేఘం, పర్వతశ్రేణి, మేఘాలను సైతం కప్పివేసే ఎత్తైన శిఖరం; ఇట్లా అనేక సందర్భాల్లో అనేక అర్థాల్లో వాడబడ్డవి. కొన్ని ఋక్కుల్లో సమూహం అనే అర్థంలో గోత్రశబ్దం వాడబడ్డది. ఇదే మనం ప్రస్తుతం గ్రహించాల్సిన అర్థం; అంటే మానవ సమూహం అని — ఒక మూలపురుషుని నుండి వరుసగా వస్తున్న వంశీజులు అనేది ఆధునికార్థంగా వాడుతున్నాం. కాని ఈ అర్థంలో ఋగ్వేదంలో ఎక్కడా గోత్ర శబ్దం వాడబడలేదు. అథర్వ వేదంలో 'విశ్వగోత్ర్యః' అనే శబ్దం ఉంది. దాని అర్థం 'అన్ని పరివారాలతోనూ సంబంధం ఉన్నవాడు అని. గోత్రం అన్నీ మనం వాడే అర్థంలో మొదటిసారిగా ఛాందోగ్యోపనిషత్తులో కనిపిస్తుంది. సత్యకామజాబాలుణ్ణి ఆతని గురువు 'నీవు ఏ గోత్రం వాడవు?' అని అడిగినట్లు ఉంది. ఇక్కడ గోత్ర శబ్దానికి మనం అనుకొనే అర్థం, ఒకే రక్తంతో పరస్పరం

సంబంధం ఉన్నవారు అని; ఒకే మూలపురుషుని నుండి పుట్టినందున రక్తసంబంధం కల మానవ సముదాయం అని గ్రహించాలి. ఈవిధంగా కాశ్యపగోత్రజులు అంటే, కశ్యపుడు మూలపురుషుడుగా గల వంశంలో పుట్టినవారు అని అర్థం. అట్లాగే భార్గవులు వాశిష్ఠులు, ఆంగీరసులు మొదలైనవారు. అంటే ఒకే ఋషి మూలపురుషుడుగా కలవారంతా సగోత్రులన్న మాట. సగోత్రుల్లో వివాహం పనికిరాదని మన భారతదేశంలోనే కాకుండా ఇతర దేశాల్లో సైతం ఈ నియమం ఉంది! అనాగరక, అర్థనాగరక, బర్బర జాతుల్లో సైతం ఈ నియమం ఉంది. ఈ విధమైన గోత్ర నియమం బౌద్ధ సాహిత్యంతోబాటు మానవ, వసిష్ఠ, గౌతమాది ధర్మసూత్రాల్లో అనేకసార్లు ఉదహరింపబడ్డది.

సగోత్ర వివాహం పనికిరాదనే వారు చెప్పే సిద్ధాంతాలు, అభిప్రాయాలూ ఈ విధంగా ఉన్నాయి:

1. ఆదిమ కాలంలో కన్యల సంఖ్య చాలా తక్కువగా ఉన్నందు వల్ల అసగోత్ర వివాహ పద్ధతి అమలులోకి వచ్చింది. అంటే, ఇతర గోత్రాలలోని కన్యలను వివాహమాడే పద్ధతి ఆరంభమైనదన్న మాట.
2. ఒకే పరివారానికి సంబంధించిన వారిలో యౌవన స్వేచ్ఛాచారాన్ని ఆపటం కోసం ఈ అసగోత్ర వివాహ పద్ధతి ఆరంభమైంది అని అంటారు.
3. మరి కొంతమంది అభిప్రాయాన్నిబట్టి, ఒకే పరివారంలో — సమూహంలో కలిసి మెలిసి పెరిగినవారిలో యౌవనాకర్షణ ఉండకపోవటంవల్ల అసగోత్ర వివాహ పద్ధతి ఆరంభమైంది; అని
4. మరి కొంతమంది, 'ఆదిమ యుగంలో ఒక సమూహంలోని (పరివారంలోని) ప్రముఖుడు (నాయకుడు) ఆ పరివారంలోని యువతుల్ని తనకోసమే అట్టిపెట్టుకొనేవాడనీ, ఈ పద్ధతిమీది ఈర్ష్యకొద్దీ తమ పరివారానికి బయటి వారితో వివాహం చేసే ఆచారం ఏర్పడ్డదనీ, ఇదే తరువాత తరువాత ఆచారంగా మారింది' అని అంటారు.
5. ఇంకా కొంతమంది, అసగోత్ర వివాహానికి మూలకారణం ధార్మికచిహ్నమనీ, (టోటం) తమ రక్తం పవిత్రమైనదని, అటువంటి తమ రక్తంలాంటి పవిత్ర రక్తం కలవారితో (ఆ ధర్మచిహ్నం కలవారితో) యౌవనసంబంధం అపవిత్ర కార్యమని తలచి సగోత్ర వివాహాలను నిషేధించి ఉంటారు; అని.

ఇవన్నీ పాశ్చాత్యులు చెప్పే కారణాలు. ఇవి తర్కానికిగానీ, సామాన్య బుద్ధికిగాని నిలిచేవి కావు — 1) స్త్రీల సంఖ్య తక్కువగా ఉన్నా, తమ పరివారం లోని ప్రతివానికి ఇది అడ్డంకి కానేరదు. 2) యౌవనస్వేచ్ఛాచారాన్ని ఆపటం అనే ఉన్నతాదర్శంతో కూడిన సంస్కారం, ధార్మిక వికాసం అనేవి అసభ్య ఆటవిక జాతుల్లో కలిగిందని అనలేము 3) ఒకే పరివారంలోనివారిలో ఆకర్షణ లేకపోవటం అనేది నిషేధానికి కారణం కాదు గదా! అది పరిణామం అనిపించుకొంటుంది. పశువుల్లో మనకు ఈ ప్రవృత్తి కనిపిస్తోంది. ధార్మికమైన ఉత్సవాల్లో, ఆయినవారిలో పరస్పరాకర్షణలు వగైరాలు కనిపిస్తున్నాయి. 4) ఈ పెత్తందార్లుచేసే దుష్కృత్యం అనేది పశువుల నుంచి అరువు తెచ్చుకొన్న సిద్ధాంతం — బలమైన పశువులు బలహీనమైనవాటిని పారద్రోలటం అనేది. బలిష్ఠమైనవాడు ఇతర పరివారాల నుండి వచ్చిన వారిమీద సైతం పెత్తనం వహించలేడా? 5) ధార్మిక చిహ్నం అనే సిద్ధాంతం కూడా కుదరదు. ఒకే ధార్మికచిహ్నం కలవారు స్నేహితులు అవుతారే తప్ప దేవతలు కారు. కాబట్టి అసగోత్ర వివాహాలకు పైవి ఏవీ కారణాలు కావు. చారిత్రక దృష్టితో చూస్తే - ప్రాచీనులు తిండి కోసం ఒక చోటునుండి ఇంకొక చోటుకు వలస పోతూ ఉండేవారు. అక్కడ క్రొత్త పరివారాలతో (గోత్రాలవారితో) పరిచయం కలుగుతూ ఉండేది. ఆ క్రొత్త గోత్రాలవారితో కలిగిన స్నేహం, పరిచయం ఆధారంగా. ఆ క్రొత్తవాతావరణంలోనే భార్యల్ని వెతుక్కోవాల్సిన అగత్యం కలిగేది. ఈ పద్ధతే క్రమంగా అసగోత్ర వివాహానికి దారి తీసి ఉంటుంది. రాక్షస వివాహం (కన్యాపహరణ పద్ధతి) కూడా ఈ అసగోత్ర వివాహానికి కొంత కారణమైతే అయి ఉండవచ్చు, సగోత్ర వివాహంలో ఒకే కన్య కోసం యువకుల్లో పోటీ ఏర్పడవచ్చు. ఆ కారణంచేత కూడా అసగోత్ర వివాహం అనేది ఆచారంగా మారి విధి రూపాన్ని దాల్చి ఉండవచ్చు. ఏమైనప్పటికీ ఈ అసగోత్ర వివాహ మనేది రెండు వేల సంవత్సరాలకు పూర్వమే ఆరంభమై స్థిరమైన ఆచార రూపాన్ని దాల్చి ఉండవచ్చునని చారిత్రకుల అభిప్రాయం.

## సగోత్ర వివాహాలు ఎందుకు పనికిరావు?

ఇక ముందు చెప్పబోయే సపిండ సంబంధంకంటె ఈ సగోత్ర సంబంధం చాలా విస్తృతమైంది, దృఢమైనది. సపిండ సంబంధం అనేది ఏడు లేక అయిదు తరాలతో విడిపోతూంది. కాని, ఈ సగోత్ర సంబంధం అనేది ఎన్ని తరాలు గడిచినా, ఎన్ని శతాబ్దాలైనా విడిపోయేది కాదు. ఏ వరుడైనా సగోత్ర కన్యను వివాహ

మాడటానికి వీలులేదు. పెంపుడు కొడుకు కూడా, తన జనకతండ్రి యొక్క గోత్రానికి సంబంధించిన కన్యను వివాహమాడరాదు. (పెంపుడు - దత్తత అనేది సగోత్రీకుల్లోనే జరుగుతుంది. అసగోత్రికులకు పెంపుడు వెళ్ళినా జనక గోత్రానికి సంబంధించిన కన్యను వివాహ మాడరాదు) దత్తునికి జనక తరఫున పిండప్రదాన బాధ్యతగాని, వారసత్వ అధికారంగాని లేకపోయినా, మనువు సగోత్ర వివాహాన్ని మాత్రం నిషేధించాడు. సూత్రకాలంలోనే సగోత్ర వివాహం నిషేధింపబడ్డది. బ్రహ్మాండ పురాణంలో సైతం —

"సగోత్రాద్వా, సపిండాద్వా, వివాహో గోవధ స్తదా
నరాశ్వమేధే మద్యశ్చ. కలౌ వర్జ్య ద్విజాతిభిః॥

అని సగోత్ర సపిండ వివాహాలు పనికిరానట్లు చెప్పబడ్డాయి. ద్విజులే కాకుండా ఏ కులంవారైనా గోత్రమనేది తెలిస్తే సగోత్ర వివాహానికి యిష్టపడరు; ఇష్టపడటం లేదు. ఇది హిందూ సమాజంలో చాలా పట్టుదలతో పాటిస్తున్న నియమం. ఎంత కాలమైనా మూలపురుష రక్తసంబంధం ఉన్నదనే భావనే ఈ పట్టుదలకు కారణం. ఈ విషయంలో ఇంకొక ఆసక్తికరమైన విషయం ఏమంటే కొన్ని కులాల్లో, కొన్ని శాఖలవారిలో తమ గోత్రమే కాకుండా మేనమామల గోత్రం కూడా కలియకుండా వుండాలని చూడటం ఉంది. కన్యయొక్క గోత్రమే కాకుండా, కన్యయొక్క మేనమామల గోత్రం కూడా వరుని గోత్రం అయి ఉండకూడదన్న మాట. మన దక్షిణ దేశంలో చాలా వర్ణాల్లో ఈ ఆచారం ఉంది. కన్య మేనమామ గోత్రము, వరుని గోత్రము ఒకటే అయినప్పుడు కన్యయొక్క తల్లిద్వారా వరునికి సగోత్రమే అవుతుందనేది ప్రధాన కారణం. కొంతమంది ఏమంటారంటే, వివాహం కావటంతోనే కన్యయొక్క జనక తరఫున ఉండిన ఇంటిపేరు, గోత్రం కూడా మారిపోతోంది కాబట్టి ఈ విషయంలో పట్టింపు అక్కర లేదు అని అంటారు. కాని కొందరు అంగీకరించరు. వివాహమైనంతమాత్రంచేత రక్తం, రక్తసంబంధం మారవు అని కొందరంటారు. ఈ విధమైన సగోత్ర వివాహాల నిషేధానికి కారణం ప్రవర ఒకటి అవటమే; ఈ ప్రాచీన కాలం నుండి స్మృతికారులంతా సప్రవర వివాహాలను నిషేధించారు.

ప్రవర అంటే, గోత్రానికి మూలపురుషుడు ఒకడు ఉంటాడు. సామాన్యంగా ఆ మూలపురుషుని పేరే గోత్రానికి ఉంటుంది. ఆ మూలపురుషుడు, ఒక ఋషిగాని, పఖ్యాతపురుషుడుగాని అయి ఉంటాడు. ఆ మూలపురుషుని నుండి వరుసగా వచ్చిన

ముగ్గురు లేక అయిదుగురు పురుషుల్ని పేర్కొంటారు. అంటే, ఆ మూలపురుషుని వంశంలో పుట్టిన ప్రఖ్యాత పురుషుల పరంపరనే ప్రవర అంటున్నారు. ప్రవర అంటే సంతతి అని శబ్దార్థం. ముగ్గురు పురుషులను పేర్కొంటే త్ర్యార్షేయం అనీ అయిదుగురిని పేర్కొంటే పంచార్షేయమనీ అంటారు. వధూవరుల ప్రవర ఒకటి ఆయి ఉండకూడదు. సామాన్యంగా ప్రవర ఒకటే అయినప్పుడు గోత్రం కూడా ఒకటే అయి ఉంటుంది. ఒక్కొక్కప్పుడు ఒకరు లేక ఇద్దరు ఋషులు రెండు గోత్రాలలోనూ ఉండవచ్చు. అంటే గోత్ర పురుషులు భిన్నంగా ఉండి, ప్రవరలో వచ్చే ఋషులు వధూవరుల గోత్రాల్లో ఒకే విధంగా ఉన్నప్పుడు అటువంటి సప్రవర వివాహాల్ని సైతం నిషేధించారు. త్ర్యార్షేయం, పంచార్షేయం అన్నప్పుడు ప్రయోగించే ఆర్షేయ శబ్దానికి ఋషుల సంతానం అనిగాని, ఆ ఋషులకు సంబంధించిన వారని గాని అర్థం. ఈ ఆర్షేయ శబ్దం వేదాల్లో సైతం కనిపిస్తుంది. తైత్తిరీయ సంహితలో 'ఆర్షేయం' అంటే యజ్ఞం చేసే యజమానియొక్క సుప్రసిద్ధులైన పూర్వీజులు అని అర్థం చెప్పారు. సుమంతుడు చెప్పినట్లుగా పారస్కరగృహ్య సూత్రాల్లో గదాధరుడు తన వ్యాఖ్యలో ఈ దిగువ పంక్తుల్ని ఉదాహరించారు ——

పరిణీయ సగోత్రాం తు సమాన ప్రవరాం తథా
త్యాగం కుర్యా ద్ద్విజ స్తస్యా స్తత శ్చాంద్రాయణం చరేత్.

అంటూ సగోత్ర సప్రవర వివాహాలకు చాంద్రాయణ వ్రతాన్ని ప్రాయశ్చిత్తంగా విధించారు. ఆ భార్యను విడిచిపెట్టరాదు. మైథునకర్మ మాత్రం పనికి రాదు... ''త్యాగశ్చోపభోగస్య న తు తస్యాః'' అని కూడా అన్నారు. కాబట్టి, మన ప్రాచీనులు, అర్వాచీనులు కూడా సగోత్ర సప్రవర వివాహాలకు తమ అంగీకారాన్ని యివ్వలేదు.

సపిండ వివాహం పనికిరాదు:

పిండము అంటే శరీరం అని అర్థం. సపిండులు అంటే ఒకే శరీరంతో సంబంధం ఉన్నవారు అని అర్థం. తండ్రి, తాత, పినతండ్రులు, పెత్తండ్రులు వీరంతా ఒకే శరీరంతో సంబంధం ఉన్నవారు - సపిండులు. తల్లి, పినతల్లి, పెత్తల్లి, మాతామహుడు, మేనమామ వీరంతా సపిండులు. ఒకేశరీరానికి సంబంధించిన పరమాణు సంబంధం (క్రోమోజోమ్సు అనుకోండి) కలిగి ఉన్నవారి మధ్య వివాహం కూడదు అని. అంటే సపిండ వివాహం నిషిద్ధం అని. తండ్రి యొక్క

శరీర పరిమాణు సంబంధం కొడుకుకు ఉంటుంది. తాతయొక్క పరమాణు సంబంధం మనుమనికి ఉంటుంది. అట్లాగే తల్లియొక్క పరమాణు సంబంధం కూతురికి. కొడుకుకు ఉంటుంది. తల్లి తండ్రి (మాతామహుడు) యొక్క శరీరపరమాణు సంబంధం దౌహిత్రునికి, మేనమామ సంబంధం మేనల్లునికి వుంటుంది. ఈకాలం లోని వైజ్ఞానికులు ''క్రోమోజోమ్స్' అనేవి తండ్రి నుండి కొడుకుకు పరంపరగా సంక్రమిస్తాయని అంటారు. అందుకే కొంతమంది ఇతర మేనరికాలను, మేనమామ కూతుర్ని చేసుకోవటానికి అంగీకరించరు. ఒకే ఇంటిపేరు గలవారి మధ్య వివాహ సంబంధం కూడదనటానికి కారణం ఇదే! అట్లాగే, మనలో పుట్టరికాలు చూచి, వరుస కాదని అనటంలో ఉద్దేశ్యం ఇదే! అయితే ఈ సపిండ వివాహానికి హద్దులు చెప్పారు. తల్లి తరపున అయితే అయిదు తరాలు, తండ్రి తరపున అయితే ఏడు తరాలు ఈ సపిండసంబంధం ఉంటుందని, ఆపైన అయితే సపిండ సంబంధం ఉండదని. ఉదాహరణగా చెప్పాలంటే —

తండ్రి (1)

| | |
|---|---|
| 2) కన్య | 2) కన్య |
| 3) పురుషుడు | 3) పురుషుడు |
| 4) పురుషుడు | 4) పురుషుడు |
| 5) పురుషుడు | 5) పురుషుడు |
| 6) పురుషుడు | 6) పురుషుడు |
| 7) పురుషుడు | 7) పురుషుడు |
| 8) కన్య | 8) పురుషుడు |

దీనిని బట్టి (8) కన్యకు (8) పురుషునికి సపిండ సంబంధం ఉండదు; 7 తరాలు దాటిపోయినందున.

తల్లి (1)

| | |
|---|---|
| 2) పురుషుడు | 2) పురుషుడు |
| 3) పురుషుడు | 3) పురుషుడు |
| 4) పురుషుడు | 4) పురుషుడు |
| 5) కన్య | 5) కన్య |
| 6) పురుషుడు | 6) కన్య |

ఈ పట్టిక ననుసరించి తల్లి నుండి (6) వ తరంలోని పురుషునికి (6) వ తరంలోని కన్యకు సపిండ సంబంధం ఉండదు; తల్లిద్వారా ఐదు తరాలు గడచిపోయినందున.

యాజ్ఞవల్క్య వసిష్ఠాది స్మృతికారులంతా ఈ విషయాన్ని అంగీకరించారు. సపిండ వివాహాన్ని నిషేధించటానికి కారణాలు (1) వధూవరులకుండే దోషాలు, వారి సంతానానికి సంక్రమిస్తాయని, (2) మిక్కిలి దగ్గర సంబంధం కలవారు, మిక్కిలి సమీపంలో ఉంటూ, ఒకే ఇంట్లో పెరుగుతూ ఉంటారు. ఆ స్థితిలో పోషితమైన ప్రేమకారణంగా, ఆ కన్యలకు భర్తలు దొరకటం కష్టం కావచ్చు. (3) దగ్గర సంబంధం కలవారిమధ్య నుండే ప్రేమ విశాలమైనదికాక, సంకుచిత మైనదిగా ఉంటుంది. (4) మిక్కిలి సామీప్యంగల వారిలో పారస్పరిక సంబంధంవల్ల, ఆకారంలోను, శారీరక శక్తిలోను, రూపంలోను, తెలివితేటల్లోను, చాలా లోపాలు రావటం అనుభవంద్వారా ఆనాటివారు గుర్తించి ఉండవచ్చు — ఈనాటి డార్విన్ చెప్పినట్లుగా, శాస్త్రజ్ఞులు చెపుతున్నట్లుగా; ఇవన్నీ అసపిండ వివాహాలకు దారితీసి ఉండవచ్చు.

### వినిమయ వివాహం (కుండమార్పిడి వివాహం):

వివాహసంబంధం నిశ్చయించటానికి మరొక ప్రతిబంధకం కుండమార్పిడి పద్ధతి. అంటే, ఒకవధూవరుల జంటలో, వధువు అన్నకుగాని తమ్మునికిగాని, వరుని అప్పనుగాని, చెల్లెలినిగాని యివ్వటం. అన్యోన్యం, వధూవరుల మార్పిడి అన్న మాట. స్మృతి ముక్తాఫలంలో ఒక కన్యను వివాహమాడే వరుడు, తన సోదరిని తన భార్యయొక్క సోదరునికి ఇచ్చి వివాహం చేయరాదని చెప్పబడ్డది. అయితే కొన్ని నిమ్నజాతుల్లో, ఈ కుండమార్పిడి పద్ధతి అమల్లో ఉంది. ఈ పద్ధతి సభ్యజాతుల్లో కూడా, ఆర్థికంగా వెనుకబడి ఉండటంవల్లగాని, ఆ శాఖవారి సంఖ్య తక్కువై ఉండటంవల్లగాని, సంబంధాలు దొరకకగాని, చేసుకోవటం ఉంది. కాని, అట్టి వివాహాలను సంఘం నీచమైనదిగానే భావిస్తోంది. ఇటువంటి సంబంధాలవల్ల గృహకలహాలకు అవకాశం ఎక్కువ ఉన్నందున ఎవరూ ఇష్టపడరు.

ఇద్దరు కూతుళ్ళ వివాహాలు ఒకేసారి చేయరాదనేది మరొక ప్రతిబంధకం. ఈ కారణంగా, కొంతకాలంపాటు ఒక కన్య వేచిఉండాల్సి వస్తుంది. ఖర్చులు అధికమై, శ్రమసైతం అధికమవటం జరుగుతుంది. ఇట్లా ఒకసారిగా ఇద్దరి

వివాహాలు చేయరాదనటానికి కారణం గృహకలహాలకు అవకాశం ఉంటుందని అను ఉండవచ్చు. పెట్టుపోతల్లో, మర్యాదల్లో భిన్నాభిప్రాయాలకు పోటీలకు, తావుంటుందని కావచ్చు. కన్యాదాతకు, కార్యభారం. ధనం విషయమైన ఇబ్బందులు కలుగుతాయని కావచ్చు. అట్లాగే ఒకే తల్లికి పుట్టిన ఇద్దరు సోదరులకు, ఒకే తల్లికి పుట్టిన ఇద్దరు కన్యలను — అప్పచెల్లెండ్రను ఇచ్చి వివాహం చేయటం కూడా సంఘంలో తప్పుగానే భావింపబడుతోంది. ఈ విషయాలు 'స్మృతిముక్తాఫలం వర్ణాశ్రమ ధర్మప్రకరణంలో చెప్పబడ్డాయి —

"ప్రత్యుద్వాహో నైవకార్యో నైకస్మై దుహితృ ద్వయమ్
నచైక జాతయోః పుంసోః ప్రయచ్ఛేత్ దుహితృ ద్వయమ్" అని.

ఇంతవరకు వివాహ సంబంధాన్ని నిశ్చయం చేసుకోవటానికి ముందు ఆలోచించుకోవాల్సిన విషయాల్ని చెప్పటం జరిగింది. సపిండ, సగోత్ర, సప్రవర. అన్యోన్య వినిమయ వివాహాదుల్ని నిషేధించటానికి కారణాలను పలువురు శాస్త్రజ్ఞులు పలురకాల కారణాలను చెప్పినప్పటికీ అవన్నీ ఊహాజనితాలే! వీటిని నిషేధించిన స్మృతులు సైతం, నిషేధాల్ని, వీటిని అతిక్రమిస్తే చేయవలసిన ప్రాయశ్చిత్తాదుల్ని వివరించినాయే తప్ప, ప్రతి విధికి నిషేధానికి కారణాన్ని చెప్పి నిరూపించలేదు. సంఘాచారాలను, వాటిలో ప్రబలే అనాచారాలను, వాటివల్ల సంఘానికి కలిగే కష్టనష్టాలను అనుభవపూర్వకంగా చూచినపిమ్మటనే శాస్త్రాలు విధినిషేధాలను శాసిస్తాయి: ఆ కాలంలో ఆ కష్టనష్టాలు అందరి అనుభవంలోనూ ఉండి ఉంటాయి కాబట్టి వాటిని వివరించటానికి శాస్త్రాలు పూనుకోవు. వాటి వివరాలన్నీ వివరించటం వాటిపని కాదు. కాబట్టి, శాస్త్రాల్లో చెప్పబడిన విధినిషేధాలు కారణం చెప్పకపోయినా ఆచారం రూపంలో, పరంపరాగతంగా సంఘంలో ప్రబలుతాయి. ఈ విధినిషేధాదులన్నీ మనకు పరంపరగా వస్తున్నవే! అయితే, ఆనాడు తమ పరివారం, తమ గోత్రం, తమ అన్యోన్య బాంధవ్యాలకు దూరంగా ఉండే సంబంధాలనే చాలా ఉత్తమమైనవిగా నిర్ణయించారు. ఈనాటి శాస్త్రజ్ఞులు సైతం అంగీకరిస్తున్న విషయమే! ప్రసిద్ధ జీవశాస్త్రజ్ఞుడు డార్విన్ ఒకే కులంలో గనుక వివాహాలు చాలా కాలంపాటు వరుసగా సాగితే, వారికి పుట్టే బిడ్డలు పొట్టివారు, బలహీనులు, అంగవికలురు అయి సమాజానికి చాలా హాని కలుగుతుందని వ్రాశాడు. ఈ విషయాన్ని గ్రహించి జంతువుల్లో మొక్కల్లో ప్రయోగాలుచేసి సంకర జాతుల్ని ఈనాడు

సృష్టిస్తున్న విషయం మనం చూస్తున్నాం. ఇటువంటి అనుభవంతోనే ప్రాచీనులు ఈ విధినిషేధాలను చేసినా చేసి ఉండవచ్చు.

ఇంతవరకు మనం. స్మృతుల్లో చెప్పబడిన వివాహాలను గూర్చి తెలుసుకున్నాం. ఇవిగాక (1) సవర్ణ వివాహాలు (2) అనులోమ వివాహాలు. (3) ప్రతిలోమ వివాహాలు (4) అంతర్జాతీయ వివాహాలు (5) మతాంతర వివాహాలు అని యిట్లా అనేక విధాలుగా ఉన్నాయి.

సవర్ణ వివాహాలంటే. వధూవరులిద్దరూ ఒకే వర్ణానికి (కులానికి) చెందినవారై ఉండాలి. ఈ విధమైన సవర్ణ వివాహ పద్ధతి హిందూ సమాజంలో చాలాకాలంనుండి దృఢంగా ప్రవేశ్యానికొని ఉంది. సామాన్యంగా దీనిని ఎవరూ లోగడ ఉల్లంఘించలేదనే విషయం మనకు తెలుస్తుంది. మనుస్మృతిలో —

‘‘ఉద్వహేత ద్విజో భార్యాం సవర్ణాం లక్షణాన్వితాం’’ (3-4) లో చెప్పబడి ఉంది. అయితే, అత్యంత ప్రాచీనకాలంలో, అంటే. వర్ణవ్యవస్థ దృఢంగా ఏర్పడి ఉండని రోజుల్లో ఈ సవర్ణ వివాహ వ్యవస్థ ఉండేదని గట్టిగా చెప్పలేము గదా! ఈనాడు మాత్రం నూటికి తొంబదితొమ్మిది వివాహాలు సవర్ణ వివాహాలే! ఇప్పుడిప్పుడే కులాంతర వివాహాలు చాలా అల్పసంఖ్యలో ఆరంభమైనాయి. స్మృతికాలంలో అసవర్ణ వివాహాలు జరిగినట్లు. వాటిని గృహ్యసూత్రాల్లో, ధర్మసూత్రాల్లో ఆమోదించినట్లు తెలుస్తోంది. అనులోమ ప్రతిలోమ వివాహాలన్నీ యథార్థానికి. ఈ అసవర్ణ వివాహాలనే మనం అనుకోవాల్సి వస్తుంది.

**అనులోమ వివాహాలు:**

వైదిక కాలంలో అనులోమ వివాహాలకు అధికంగా అవకాశం ఉండేదని చెప్పవచ్చు. ఆనాడు అనులోమ వివాహాలే గనుక లేకపోతే (అసవర్ణ వివాహాలే లేకపోతే) ఉత్సవ సమయాల్లో పండుగ పబ్బాల్లో సంఘాలుగాను. వ్యక్తులుగానూ కూడా, యువతీ యువకులు పరస్పరం కలుసుకొనే స్వాతంత్ర్యం ఎట్లా ఉండేది? అంటే. ఈనాడు స్కూళ్ళలో. కాలేజీల్లో, సినిమాల్లో ఇతర ఉత్సవాల్లో స్వేచ్ఛగా పాల్గొంటున్నట్లు ఆనాడు కూడా పాల్గొనేవారని మనకు ప్రాచీన సాహిత్యాదులవల్ల తెలుస్తోంది. అసవర్ణ వివాహాలే క్రమబద్ధంచేయబడి. అనులోమ, ప్రతిలోమ వివాహాల రూపందాల్చి ఉండవచ్చు — సూత్రకారులు. ధర్మశాస్త్రాల్లో వీటికి హద్దులు ఏర్పరచి ఉండవచ్చు.

ఋగ్వేద కాలీనులైన పురోహితులు రాజవంశాల్లోని కన్యలను వివాహమాడినట్లు ఋగ్వేదంవల్ల తెలుస్తోంది — చ్యవనుడు, శ్యావాశ్వుడు, విమదుడులాంటి వారు. బహుశః ఆనాటి చరిత్రకారులు బ్రాహ్మణులే అయినందున బ్రాహ్మణులు చేసుకొన్న అనులోమ వివాహాలను మాత్రం అధికంగా, ప్రముఖంగా ఉదాహరించి, బ్రాహ్మణ కన్యలు ఇతర జాతులవారిని వివాహమాడిన ఉదంతాలను ఉపేక్షించి ఉంటారని పలువురి అభిప్రాయం. ఇందుకు అవకాశం లేకపోలేదు. ఎందుచేతనంటే సంఘంయొక్క ఆమోదం పొందిన వాటికే అధిక ప్రచారం ఇవ్వటం, తమకు అంగీకారం కానివాటిని ఉపేక్షించటం సహజంగా జరిగే విషయం. అయినప్పటికి, క్షత్రియుడైన భావయవ్యుని భార్య ఆంగిరస బ్రాహ్మణ వర్ణానికి చెందిన కన్య అని ఋగ్వేదం 1-126 వల్ల తెలుస్తోంది. సామాన్యులు చేసుకొన్న ఇటువంటి వివాహాలను ఉపేక్షించి ఉంటారు. యయాతి దేవయానుల వివాహం విలోమ వివాహమే; ఋగ్వేదంలో యయాతి పేరును, ఆతని పుత్రుల పేర్లు ఉన్నవి. కాబట్టి ప్రసిద్ధులైన వారివలెనే సామాన్యులు కూడ విలోమ వివాహాలు చేసుకొని ఉండవచ్చు.

అథర్వవేదం (5-17-8, 9)లో బ్రాహ్మణుడు, అన్ని కులాల కన్యలకు శ్రేష్ఠతమమైన వరుడుగా పేర్కొనబడ్డది. దానిలోబాటు బ్రాహ్మణ స్త్రీలు, రాజకీయమైన సహాయంతో మళ్ళీ తమ భర్తలను పొందినట్లు ఉంది. అంటే బ్రాహ్మణులు ఇతర వర్ణాల కన్యలను వివాహమాడటం ఎక్కువ అయినదన్నమాట. అయితే యజుర్వేదానికి చెందిన తైత్తిరీయ సంహితవల్ల (7-4-19-2, 3) శూద్ర స్త్రీని వివాహమాడిన ఆర్యపురుషుల్ని సభల్లో వేళాకోళం చేసినట్లుగా ఉంది. ఇటువంటి అనులోమ వివాహాలు సమాజంలో అంగీకారాన్ని పొందినట్లు, విస్తృతంగా చలామణి అయినట్లు తెలుస్తోంది. ఔశిజ, కవష, వత్స, నామధేయులైన మహాత్ములవంటివారు కొందరు దాసి లేక శూద్రస్త్రీయందు పుట్టినవారని ఋగ్వేదంవల్ల (1-18-1, 1-112) తెలుస్తోంది. వైదిక సాహిత్యంలో దాస శబ్దంకంటె దాసీ శబ్దం అధికంగా కనిపిస్తుంది. బహుశః ఇరుగుపొరుగు వారిని జయించినప్పుడు, వారిపై ఆధిపత్యాన్ని సంపాదించినప్పుడు తత్ఫలితంగా దాసీజనం విజేతల అధికారంలోకి వచ్చి, వారిద్వారా ఈ దాసీపుత్రులు అనే శబ్దం ప్రచారంలోకి వచ్చి ఉంటుంది. వారి సంఖ్య కూడా ఎక్కువ అయి ఉండవచ్చు.

ఆపస్తంబ, మానవగృహ్యసూత్రాల్లో ఈ అనులోమ వివాహ ప్రసక్తి లేక పోయినా, గౌతముడు మాత్రం ఈ అసవర్ణ వివాహాలవల్ల పుట్టినవారు ఏ జాతికి

చెందుతాయి అటువంటి చిన్నచిన్న కులాల పేర్లను పేర్కొన్నాడు. అంతేకాదు, శూద్రస్త్రీని వివాహమాడిన బ్రాహ్మణుని శ్రాద్ధసమయాల్లో భోక్తగా గాని, మరొకందుకు గాని పిలువరాదన్నాడు. పారస్కర ధర్మసూత్రాలు (1-4) వల్ల, వసిష్ఠ ధర్మసూత్రాలు (1-24) వల్ల, బ్రాహ్మణుడు శూద్రస్త్రీని వివాహమాడవచ్చునని. అయితే ఈ వివాహం వైదిక మంత్రాలతో జరుగరాదని అన్నాడు. ఇటువంటి వివాహాలవల్ల కులం నశిస్తుందని, చచ్చిన పిమ్మట ఉత్తమ లోకాలు లభించవని వసిష్ఠ ధర్మసూత్రాలు చెపుతున్నాయి. (1-27) ఎందుచేతనంటే, ఇటువంటి వివాహాలు కామవాసనా ప్రేరితాలు కాబట్టి! బోధాయనుడు ఏ వర్ణానికి చెందిన భార్యయొక్క సంతానానికి ఎంతెంత దాయభాగం వస్తుందో వివరించాడు. ఏ భార్య చచ్చినప్పుడు, ఎవరెవరికి ఎన్నెన్ని రోజులు అశౌచం ఉంటుందో కూడా చెప్పాడు. దాయభాగాన్ని చెపుతూ "నానా వర్ణ స్త్రీ సమవాయే దాయం దశాంశాన్కృత్వా చతురస్త్రీన్ద్వావేకమితి యథాక్రమం విభజేత్" (బో.ధ.సూ.) బ్రాహ్మణుడు క్షత్రియ వైశ్య స్త్రీలను కూడా వివాహమాడితే అతని ఆస్తిని పదిభాగాలుచేసి బ్రాహ్మణ స్త్రీ సంతానానికి నాలుగు భాగాలు, క్షత్రియ స్త్రీ సంతానానికి మూడుభాగాలు, వైశ్య స్త్రీ సంతానానికి రెండు భాగాలు, శూద్ర స్త్రీ సంతానానికి ఒకభాగం యివ్వాలని అన్నాడు. ప్రాచీనకాలంలో సంఘం గాని, స్మృతికారులుగాని అనులోమ ప్రతిలోమ వివాహాలను ప్రోత్సహించలేదు. నిషేధించారు. నిరసించారు. నిరుత్సాహపరచారు. కాని సంఘంలోని వ్యక్తులు ఏ వర్ణంవారైనా కాముకత్వానికి లోనై అటువంటి వివాహాలు చేసుకున్నప్పుడు, వారి సంతానాన్ని గుర్తించి సంఘంలో వారికి సైతం స్థానాన్ని కల్పించారనే విషయం మనం గమనించాలి. అనులోమ వివాహాల్ని (భర్త ఉన్నత కులంవాడై భార్య తక్కువ కులం కలది అయిన వివాహాల్ని) కొంతవరకు అంగీకరించినా, ప్రతిలోమ వివాహాల్ని పూర్తిగా ఖండించారు. అంటే, స్త్రీ ఉన్నత కులానికి చెందినదై భర్త తక్కువ కులానికి చెందినవాడైనప్పుడు వారి సంతానానికి కూడా సంఘంలో ఒక స్థానాన్ని కల్పించి ఉపాధి అవకాశాలను నిర్ణయించారు.

మనువు కాలంలో ఈ వర్ణాంతర వివాహాలు (అనులోమ విలోమ వివాహాలు), బాగా జరుగుతూ ఉండినట్లు, అందుచేతనే మనువు వాటిని ఉపేక్షించలేక, తన ధర్మ శాస్త్రంలో వాటిని గూర్చిన విచేచన చేయాల్సి వచ్చింది. ఈ వివాహాలవల్ల ఉత్పన్నమైన సమస్యలకు సమాధానాలను చెప్పాల్సి వచ్చింది. అందుకే, విలోమ వివాహాలను, అనులోమ వివాహాలను ఎంత ఖండించినా, ఈ వివాహాలకు ఫలితంగా

జన్మించిన సంతానానికి నామకరణంచేసి వారికి రావలసిన దాయభాగాదుల్ని నిర్ణయించి సమాజంలో వారి స్థానాన్ని సుస్థిరం చేశారు. సృష్ట్యారంభంలో ఒకే జాతిగా ఉండి. తరువాత చాతుర్వర్ణ వ్యవస్థ నెలకొని. క్రమంగా పరస్పర సాంకర్యంవల్ల ఇన్ని కులాలు ఏర్పడ్డాయనే విషయం మనం గ్రహించవచ్చు. మనువు, ఈ అనులోమ ప్రతిలోమ వివాహాలవల్ల పుట్టిన సంతానికి ఇచ్చే పేరు. వృత్తి మొదలైన విషయాలను విపులంగానే చర్చించాడు. జంతువుల్లో. మొక్కల్లో సాంకర్యాన్ని మనం సృష్టిస్తూ అనేక క్రొత్తరకాలను సృష్టిస్తున్నాము. ఈవిధంగానే మానవుల్లో వర్ణ సాంకర్యం ఏర్పడ్డదని. వీరిలో హెచ్చుతగ్గులనేవి ఆయాకాలాలలోని పరిస్థితుల ప్రాబల్యంవల్ల వచ్చినవని గ్రహించాలి. అంతే తప్ప ఎవరో స్వార్థపరులు కల్పించినవని నిందించటం తప్పు. నేటి రాజకీయాల్లో సైతం కొంతకాలం ఒకరి ప్రాబల్యం. కొంతకాలంపాటు మరొకరి ప్రాబల్యం కొనసాగటం చూస్తున్నాం. క్రమంగా మనం కులరహితమైన సమాజం వైపుకు పురోగమిస్తున్నాం. కాబట్టి ఈ దిగువ విషయాలను కేవలం చారిత్రక దృష్టితోనే చూడాలి తప్ప వర్ణద్వేష దృష్టితో చూడరాదు. ఈనాడు మనం చేస్తున్న పనులు. మన ప్రవర్తన భావితరాలవారి విమర్శలకు నిందలకు లోనుకాకుండా ఉండేటట్లు మనం సహనంతో వ్యవహరించాలి. నేడు మన సమాజంలో కనిపించే ఇన్ని కులాలు. ఇన్ని వృత్తులు ఎట్లా ఏర్పడ్డాయి? అనే చారిత్రకాంశాన్ని మనం తెలుసుకోవాలంటే, మనువు చెప్పిన ఈ దిగువ విషయాల్ని మనం గ్రహించాలి. ఈ దిగువ పట్టికలో అనులోమ, ప్రతిలోమ వివాహాలవల్ల కలిగిన సంతానానికి పెట్టిన పేర్లు, అట్టి వర్ణ సాంకర్యంవల్ల, మళ్ళీ జరిగిన వర్ణసాంకర్యం (రెండుసార్లు సాంకర్యం కలగటం)వల్ల, అనేక వర్ణాలు బయలుదేరినట్లు స్పష్టమౌతుంది. మనువు కాలానికి ఉన్న అనులోమ ప్రతిలోమ సంకర వివాహాలు ఈ దిగువ పట్టికవల్ల తెలుస్తాయి.

## (1) అనులోమ సాంకర్యం

| భర్తయొక్క వర్ణం | భార్యయొక్క వర్ణం | వీరిద్దరికి కలిగిన సంతానంయొక్క వర్ణం |
|---|---|---|
| బ్రాహ్మణ | వైశ్య | అంబష్ఠ |
| బ్రాహ్మణ | శూద్ర | నిషాద, పారశవ |
| క్షత్రియ | శూద్ర | ఉగ్ర |

## (2) ప్రతిలోమ సాంకర్యం

| | | |
|---|---|---|
| శూద్ర | వైశ్య | ఆయోగవ |
| శూద్ర | క్షత్రియ | క్షత్తా |
| శూద్ర | బ్రాహ్మణ | చండాల |
| వైశ్య | బ్రాహ్మణ | వైదేహిక |
| వైశ్య | క్షత్రియ | మాగధ |
| క్షత్రియ | బ్రాహ్మణ | సూత |

## (3) రెండవసారి సాంకర్యం

| | | |
|---|---|---|
| బ్రాహ్మణ | ఉగ్ర | ఆవృత్త |
| బ్రాహ్మణ | అంబష్ఠ | ఆభీర |
| బ్రాహ్మణ | ఆయోగవ | ధిగ్వణ |
| నిషాద | శూద్ర | పుక్వస |
| శూద్ర | నిషాద | కుక్కుటక |
| క్షత్రియ | ఉగ్ర | శ్వపాక |
| వైదేహిక | అంబష్ఠ | వేణ |
| వ్రాత్యబ్రాహ్మణ | బ్రాహ్మణ | ఘూర్జకంటక |
| వ్రాత్యక్షత్రియ | క్షత్రియ | మల్ల |
| వ్రాత్యవైశ్య | వైశ్య | సుధన్వాచార్య |

(వ్రాత్యుడంటే, ఉపనయన సంస్కారాదులు లేక, జాతిభ్రష్టుడైన ద్విజుడు)

పక్షపాతము, మిథ్యాగర్వము లేకుండా సత్యాన్వేషణ బుద్ధితో పైపట్టికనుబట్టి ఆలోచిస్తే ఈ దిగువ విషయాలు తెలుస్తాయి.

1. మనువు కాలానికే తమకు విధింపబడిన ఉపనయన సంస్కారాదులను వదలి, వేదాధ్యయనాదులను వదలి, ద్విజులు కొందరు జాతిభ్రష్టులై వ్రాత్యసంజ్ఞను పొందారు. ఇది ఒక విధమైన జాతిభ్రష్టత.
2. అనులోమ, విలోమ, వివిధ సాంకర్య వివాహాలు జరగటంవల్ల మనువు కాలానికే అనేక కులాలు, వారికి కొన్ని వృత్తులు ఏర్పడ్డాయి.

3. మొదట ఒకటిగా ఉన్న మానవజాతి క్రమంగా వర్ణవ్యవస్థను ఏర్పరచుకొని క్రమంగా సంకరమై కులవ్యవస్థను ఏర్పరచుకొన్నది. ఇది. ఈ సంకరసృష్టి ఏ ఒకరో చేసినది కాదు. ఎవరినీ నిందించాల్సిన పని లేదు. — ఈనాడు జంతువుల్లో, తరు లతాదుల్లో మనం చేస్తున్న సంకరసృష్టి కాలానికి అనుగుణంగా జరుగుతున్నట్లే ఆనాటి సమాజావసరాలను బట్టి, కాలానుగుణంగా జరిగిన సంకర సృష్టి చారిత్రక పరిణామమే!

4. ఇన్ని విధాలుగా సాంకర్యాన్ని పొందిన మానవుల్లో ఒక వర్ణం గొప్పదని. ఒక వర్ణం తక్కువదని భావించటం మూర్ఖత్వం.

5. మనువు కాలంలో పెట్టిన వర్ణాల పేర్లు, ఈనాడు దేశంలోని వివిధప్రాంతాల్లో, వివిధ భాషల్లో అనేక రకాలుగా ఉండవచ్చు.

6. ఈనాడు సమాజం లెక్కలేనన్ని కులాల్లో విభక్తమై, మళ్ళీ కుల రహితమైన సమాజ నిర్మాణం వైపుకు పురోగమిస్తోంది. ఇది చారిత్రక పరిణామం: ఎవరు ఆపినా ఆగేది కాదు ఈ చక్రభ్రమణం. తన కులం పేరు చెప్పుకోవటానికే సిగ్గు పడుతున్న, ఒకరి కులం పేరు అడగటానికే సిగ్గుపడుతున్న నేటి సభ్య సమాజం ఇందుకు సాక్ష్యం; అయితే ఇదంతా మన ప్రాచీన చరిత్రను తెలుసుకోవటానికి మాత్రమే చెప్పబడుతోంది. ధాన్యాదులు సంకరం చేయబడి సహస్రాధికంగా క్రొత్త వంగడాలు రావటం, ఆ విధమైన సాంకర్యశక్తి కొన్ని తరాలు ఉండి, మామూలు స్థితికి రావటం చూస్తున్నాం.

ఇంతవరకు స్మృతి కాలం విషయం చెప్పుకొన్నాం. చరిత్రను పరిశీలించినా మనకు ఈ అసవర్ణ వివాహాలు గోచరిస్తాయి. అనేక మంది రాజులు తమ శక్తిని - రాజకీయమైన బలాన్ని పెంచుకోవటానికై ఇతర జాతికి చెందిన రాజకన్యలతో, రాజకుమారులతో వివాహ సంబంధాలు పెట్టుకున్నారు. ఈ విషయం మనం ఈనాడు కూడా చూస్తున్నాం. ఆర్థిక, రాజకీయ ప్రయోజనాల కోసం ఇంతవరకు పరాయి వాళ్ళుగా పరిగణింపబడినవారితో ఇతర ప్రాంతాలవారితో ఈనాడు వివాహసంబంధాలు కలుపుకొంటున్నాం. అట్లాగే శుంగ వంశానికి చెందిన బ్రాహ్మణ రాజైన అగ్నిమిత్రుడు (క్రీ.పూ. 150) మాలవిక అనే క్షత్రియ కన్యను వివాహమాడాడు. గుప్త వంశానికి చెందిన చంద్రగుప్త విక్రమాదిత్యుని (క్రీ.శ.380-412) కొమార్తెను వాకాటక వంశానికి చెందిన బ్రాహ్మణరాజైన రెండవ రుద్రసేనుడు పెండ్లాడాడు. గుప్తచక్రవర్తులు వైశ్యులని చాలమంది చరిత్రకారుల అభిప్రాయం. ప్రతిహారవంశ

స్థాపకుడైన హరిశ్చంద్రునికి (క్రీ.శ. 550) బ్రాహ్మణ, క్షత్రియ జాతులకు చెందిన ఇద్దరు భార్యలు ఉండేవారు. కదంబ రాజవంశ స్థాపకుడైన మయూరశర్మ బ్రాహ్మణుడు. కాని, పల్లవరాజుల బాధ పడలేక క్షత్రియ ధర్మాన్ని స్వీకరించాడు. అప్పటి నుండి వీరి పేరు చివర 'శర్మ' అనేది పోయి 'వర్మ' అనేది చేరింది. ఈ వంశానికి చెందిన కకుత్స్థవర్మ, గుప్తరాజులకు తన కూమార్తె నిచ్చాడు. అట్లాగే విజయనగర చక్రవర్తియైన మొదటి బుక్కరాయల కుమార్తె యైన విరూపాదేవి వివాహం, ఒక సామంతుడు బ్రాహ్మణుడైన బ్రహ్మ అనే వానితో జరిగింది. ఇట్లా ప్రాచీన శిలా శాసనాలవల్ల, తామ్రపత్రాలను (ఎపిగ్రాఫికా ఇండికా భాగాలను పరిశీలించి) పరిశీలించిన చారిత్రకుల వ్రాతలవల్ల ఇటువంటి అనులోమ ప్రతిలోమ వివాహాలు పరశ్వతాలుగా జరిగినట్లు తెలుస్తోంది గొప్పవారివి మాత్రమే చరిత్రకు ఎక్కి ఉంటాయి. సామాన్య ప్రజల్లో ఇంకా అధికంగానే జరిగి ఉంటాయి. ఇక సంస్కృత సాహిత్యంలో ఇటువంటివి చాలా కనిపిస్తాయి.

ఈ అనులోమ వివాహాలు పదవ శతాబ్దం నుండి కొంత తగ్గినట్లు కనిపిస్తుంది. క్రీ.శ. పదవ శతాబ్దం వరకు ద్విజ జాతికి చెందిన మూడు వర్ణాలవారిలోనూ ఒకే విధమైన సాంస్కృతిక ఏకత్వం ఉన్నట్లు కనిపిస్తుంది. యజ్ఞయాగాదులు, ఉపనయనాది సంస్కారాలూ, వేదాధ్యయనాదులన్నీ ఒకేవిధంగా ఉన్నట్లు కనిపిస్తుంది. శాస్త్ర విహితమైన ధర్మాలను అంతా పాటించారు. కాని రాను రాను వారిలో పవిత్రత పారిశుద్ధ్యం, ధర్మపాలనంలో రాజీలేని పట్టుదల. వీటి కారణంగా పరస్పర భేద భావాలు ప్రబలినాయి. క్షత్రియ ప్రాబల్యం, జైన బౌద్ధమతాల ఆవిర్భావంతో పరిస్థితులు మారినాయి. బ్రాహ్మణులు. యజ్ఞయాగాదులతోపాటు పశుహింసను. మాంసాశనాన్ని వదలివేశారు. సంధ్యావందనం రెండుసార్లు కాకుండా మూడుసార్లు చేయటం. స్నానాలు, క్రొత్త వ్రతాలు. ఉపవాసాలు ప్రారంభించారు. త్యాగానికి, తపస్సుకు, పవిత్రతకు క్రొత్త ఆదర్శాలను సృష్టించారు. కాని పరాక్రమ స్వభావులు యుద్ధ ప్రియులు అయిన క్షత్రియులకు మాంసాహారం వదలటం లాంటివి అసహజంగా కనిపించినాయి. అట్లాగే కృషి వాణిజ్యాదుల్లో అధికంగా ప్రవృత్తిమైన వైశ్యజాతికి వేద పఠనం, వ్రతాచరణా కష్టంగా తోచటంలో ఆశ్చర్యం లేదు. ఈవిధమైన స్థితిలో ఈ జాతుల్లో పరస్పరం వివాహాలు జరగటం అనేది అసంభవమే! కాగా అంతవరకు శాస్త్రసమ్మతంగా వస్తూ ఉండిన అనులోమ వివాహాలు కూడా ఆగిపోయినాయి. ఈనాడు కూడా ప్రతిలోమ వివాహాలను తక్కువగా. నీచంగానే చూస్తున్నారు; సంఘానికి భయపడుతున్నారు.

**ప్రస్తుతస్థితి:**

అసవర్ణ వివాహాలు ఈనాడు ఎక్కువ సంఖ్యలో కాకపోయినా, అక్కడక్కడ జరుగుతూనే ఉన్నాయి. ఈ విషయమై సంఘంలో కొంత మార్పు వచ్చినట్లు కనిపిస్తోంది. యాభై సంవత్సరాల క్రితం ఉండిన సంకోచం సంఘ భీతి ఈనాడు చాలాభాగం తగ్గిపోయింది. అంతేకాదు అసవర్ణ వివాహాలకు సంఘ సంస్కర్తలనుంచి, యువతరంనుండి, ప్రభుత్వంనుండి కూడా ప్రోత్సాహం లభిస్తోంది. ఇప్పుడు అసవర్ణ వివాహం. లేక కులాంతర వివాహం వర్ణాంతర వివాహం అనే వ్యవహారమే తప్ప అనులోమ ప్రతిలోమ భేదమనేది లేదు ఈ విధమైన వివాహాలకు చట్టరీత్యా కూడా గుర్తింపు లభించింది. Special Marriage act 1923 సవరణనుబట్టి అనులోమ ప్రతిలోమ వివాహాలు రెండూ కూడా చట్టరీత్యా అమోదింపబడ్డాయి. ఇటువంటి వివాహాలకు రిజిస్ట్రేషను ఉండాలనే నియమం మాత్రమే ఉంది. క్రమంగా ఇటువంటి నియమాలన్నీ తొలగిపోయి వర్ణాంతర వివాహాలు సర్వ సమ్మతమే అయ్యేరోజులు సమీపంలోనే ఉన్నాయి. సమాజం ఈ దిశలో వేగంగానే ముందుకు సాగుతోంది. వైద్యశాస్త్రం, జీవశాస్త్రం లాంటి ఆధునిక విజ్ఞానశాస్త్రాలు వీటిని సమర్థిస్తున్నాయి. ఆర్థిక పరిస్థితులు, చదువు సంధ్యలు, జీవన విధానాలు, ఆధునిక విజ్ఞానం, సినిమాలు వగైరాలన్నీ సంఘంలోని వర్ణవిభేదాన్ని (వివాహ విషయంలో) తొలగించటంలో అధికంగా తోడ్పడుతున్నాయి.

**కులాంతర వివాహాల బాగోగులు:**

ప్రాచీన ఆచారాదుల్ని గట్టిగా సమర్థించే కొందరు ధార్మికదృష్టితో ఇటువంటి వివాహాలను నిరసిస్తున్నారు. వేరు వేరు కులాల ఆచార వ్యవహారాలు, భోజన భాజనాదులు ఇందుకు కొంత కారణం. కాని, క్రమంగా ఈ ఆధునిక నాగరకత అందరినీ ఒకే పద్ధతిలోకి తీసికొనివస్తోంది. అందరి చదువులు, అందరి విందులు వినోదాలు, కట్టు, బొట్టు జుట్టు లాంటి అలంకారాలు, సినిమాలు టి. వి. లాంటి పరికరాలు, ఉద్యోగాలు, వృత్తులు, ఇవన్నీ వేరువేరు కులాలవారిలో పూర్వం ఉండే భేదాలను చాలావరకు తగ్గించివేస్తున్నాయి. క్రిందివారు పైకి, పైవారు క్రిందికి, లేదా యిరువురూ కలిసి ఒకే దిక్కుకు పయనిస్తున్నందున ఆచార వ్యవహారాల్లోని భేదాలు తగ్గిపోతున్నాయి.

అయితే, ధార్మికదృష్టిని దూరంగా ఉంచి, వైజ్ఞానిక దృష్టితో చూస్తే, ఈ కులాంతర వివాహాలవల్ల హాని ఏమీ ఉండదని తోస్తుంది. జీవశాస్త్రజ్ఞులు, మానవ

రుధిరంలో ఉండే జీవాణువులు, ఒకే జాతిలో సంయోగం చెందినప్పుడు వారికి పుట్టే సంతానం చాలా బలహీనము, మందబుద్ధిగలది. అవుతుందని అంటున్నారు. వారు చెప్పటమేగాదు, అనేకమంది దగ్గరి సంబంధాలు చేసుకొన్నవారి సంతానంలో, ఇటువంటి లోపాలు కనిపించటం ప్రత్యక్షంగా చూస్తున్న విషయమే; భిన్నజాతుల సంబంధంతో పుట్టిన సంతానం బలంగా. ఆరోగ్యంగా, తెలివితేటలు కలవారుగా ఉంటున్నారు. ఈ విషయం జంతువుల్లో, చెట్టు చేమల్లో ఇంకా బాగా రుజువౌతోంది. అందుచేత ఈ అసవర్ణ వివాహాలను హేయంగా చూడాల్సిన అగత్యంలేదు. వధూవరులకు చెందిన రెండు కులాలవారి సంస్కృతి ఒకటే అయినప్పుడు. అంటే, వారి భాష, కట్టు బొట్టు జుట్టు, తిండి. వారి పండుగలు, నోములు. వ్రతాలు, ఆచార వ్యవహారాలు, మతము, విందులు వినోదాలు, ఇవన్నీ ఒకటే అయినప్పుడు. ఇక కులాలు, శాఖలు అనేవి భిన్నమైనవి అయినా ఇబ్బంది లేదు. ఇటువంటివాటిని శాస్త్రసమ్మతాలుగానే భావించాలి. గృహ్య శాస్త్రకారులు ఈ అభిప్రాయంతోనే అసవర్ణ వివాహాలకు అనుమతి యిచ్చారని గ్రహించాలి. ఈనాడు జరుగుతున్న కులాంతర వివాహాల్లో తప్పుపట్టవలసిన పనిలేదు. తమ కులంలో తమ సంస్కృతికి తగినట్టి తమ వంశగౌరవానికి తగిన వరుడుగాని వధువుగాని లభించనప్పుడు ఇతర కులాలలోని వారితో సంబంధం కలుపుకోవటంలో తప్పులేదు. ఉదాహరణగా చెప్పాలంటే, కన్య వైద్యశాస్త్రం అభ్యసించి. వైద్యవృత్తిచేస్తూ. విదేశాల్లో ఉద్యోగం చేయటానికి యిష్టపడి వెడుతూన్నప్పుడు. ఆ కన్యకు తగిన వరుడు ఆమె కులంలో లభించనప్పుడు, ఇతర కులానికి చెందిన వరునితో వివాహం చేసుకోవటంలో తప్పులేదు. అట్లాగే, కలసి కాలేజీలలో చదువుతున్నవారిలో పరస్పరం ప్రేమాకర్షణల వల్ల జరిగే వివాహాలను సైతం తప్పుపట్టనక్కరలేదు. కేవలం కాముకత్వంతో కన్నుకానక చేసుకొనే అస్థిర వివాహాలను మాత్రమే మనం గర్హించాలి. ఇంతవరకు వివాహ సంబంధం కుదరటానికి అవరోధంగా ఉన్నట్టి కులాన్ని గురించి. వర్ణాంతర వివాహాన్ని గురించి చర్చించాము.

కట్నం, లాంఛనాలు, మర్యాదలు, కులాచారాలు; మొదలైనవి కూడా వివాహ సంబంధం కుదరటానికి అవరోధంగా ఉంటున్నాయి. ముఖ్యంగా కట్నం అనేది అనేక అనర్థాలకు కారణమౌతోంది. అంటే, ధనమనేది. కులగోత్రాలకంటె, చదువు సంధ్యలకంటె, రూపలావణ్యాదులకంటె. మాట మర్యాదలకంటె. ప్రాణానికి ప్రాణమైనట్టి భార్యకంటె. ధర్మంకంటె. పరలోకంకంటె ప్రముఖపాత్ర వహిస్తోంది. ఈనాడు మనం వార్తాపత్రికల్లో నిత్యమూ చూస్తున్న స్త్రీల ఆత్మహత్యలకు,

హత్యలకు కారణం కట్నం (ధనం) అవటం మనకు తెలుసు. ఇది మానవత్వం తలవంచుకోవాల్సిన విషయం. ఈ కట్నంయొక్క పుట్టుపూర్వోత్తరాలను తెలుసు కుందాం.

మనదేశంలో ప్రాచీన కాలంలో కట్నం అనే ఈ దురాచారం లేనేలేదు. చారిత్రక యుగానికి పూర్వం కన్యలు తమ పరివారంయొక్క సంపదగా భావింపబడే వారు. అందుచేత. తమ పరివార సంపదను వేరొకరి పరివార వృద్ధికోసం యిస్తు న్నప్పుడు. ఆ కన్యయొక్క తండ్రి కొంత సొమ్ము పరిహారంగా తీసికోవటం ఉంది. తమ పరివార సంపదను వదులు కొంటున్నప్పుడు కొంత పరిహారాన్ని కోరటంలో ఔచిత్యం ఉంది. నేటిలాగా కన్యను, ధనాన్ని కూడా కోరటం ఆనాడు లేదు. ఎవరైనా కట్నమనేది అడిగినా ఇచ్చేవారు కాదు. స్మృతుల్లోగాని, సంస్కృత ప్రాచీన సాహి త్యంలోగాని ఈ కట్నాల ప్రసక్తిలేదు. కన్యాశుల్క ప్రసక్తి ఉంది. ఒకవేళ ప్రాచీన కాలంలో వరకట్నాలు ఉండిఉంటే స్మృతికారులు వరశుల్కాలను ఖండించి ఉండేవారే! అయితే వస్త్రాభరణాలతో అలంకృతమైన కన్యనుదానం చేయాలని మాత్రం చెప్పారు. ఆ వస్త్రాభరణాలనేవి కన్యాదాతయొక్క శక్తిసామర్థ్యాల మీద ఆధారపడి ఉండేవి. అవి అతని యిష్టాన్నిబట్టి యిచ్చేవేతప్ప ఈనాటిలాగా బలవంతం, నిర్బంధం ఏమీలేదు. అల్లుండ్రకు, కూతుళ్ళకు బహుమానంగా ఏమైనా యిస్తే, అవన్నీ తమ యిష్టప్రకారం, సంతోషంతో యిచ్చేవే తప్ప నిర్బంధమంటూ లేదు.

ఈ శతాబ్దారంభం వరకు కన్యాశుల్కాలు అమలులో ఉన్నాయి. కాని క్రమంగా కన్యావిక్రయపద్ధతి ఆగిపోయి వరశుల్కము, వరవిక్రయ పద్ధతి భయంకర రూపందాల్చి ఈనాడు సమాజానికి పెద్దసమస్య అయికూర్చుంది. ఈనాడు ముందుగా కట్నం విషయం తేల్చుకొనే తరువాతి విషయాలను గూర్చి — కన్య అందచందాలు, చదువుసంధ్యలు, కులీనత, మొదలైన విషయాలను — పరిగణిస్తున్నారు. తాము కోరిన కట్నం యివ్వగల స్తోమత ఉన్నదని తెలిసినప్పుడే కన్యను చూడటానికి, మాట్లాడటానికి అంగీకరిస్తున్నారు. కన్యతరఫువారు సైతం ఆ సంబంధాన్ని అందుకోగలం అనుకున్నప్పుడే వారిపద్దకు పోతున్నారు. ముందుగా తాము యివ్వ గలిగిన కట్నాన్ని మాటల సందర్భంలో వెల్లడిస్తున్నారు. ఇవి దక్షిణదేశంలోనే కాక ఉత్తరదేశంలో సైతం, హిందువుల్లోనే కాకుండా యితర మతాలవారిలో సైతం వ్యాప్తిలో ఉన్నాయి.

కన్యను దానంగా యివ్వటం అనే పద్ధతి, ఆచారం అమలులోకి వచ్చినప్పటి నుండీ ఈ కట్నాలు ఆరంభమై ఉంటాయి. ఏ దానం యిచ్చినా సదక్షిణాకంగా యివ్వాలి. దక్షిణతో సహా యివ్వని దానంవల్ల ఫలితం ఉండదు. భగవద్గీతలో సైతం —

"విధిహీన మసృష్టాన్నం. మంత్రహీన మదక్షిణమ్
శ్రద్ధావిరహితం యజ్ఞం. తామసం పరిచక్షతే. (17-13)

శాస్త్రోక్త పద్ధతిలో చేయనట్టి, అన్నదానం చేయనట్టి, మంత్రాలతో చేయనట్టి, దక్షిణ యివ్వనట్టి, శ్రద్ధతో చేయనట్టి యజ్ఞాన్ని తామస యజ్ఞం అంటారు; అని. అట్లాగే ఇతర స్మృతుల్లోనూ చెప్పబడి ఉన్నందున గోదానంలాంటి ఇతర దానాలు చేసినప్పుడు వాటిని అలంకరించినట్లే కన్యను సైతం అలంకరించి దక్షిణతో సహా దానంచేయటం ఆచారమైంది. దక్షిణ యిచ్చేటప్పుడు 'యథాశక్తి హిరణ్యం' అని చెపుతారు. కాని, యిప్పుడు 'యథాశక్తి' అనే మాటను ఉపేక్షించి, వేలలో, లక్షల్లో, బంగారాన్ని తులాల్లో, పొలాన్ని యకరాల్లో ముందుగానే నిర్ణయించుకుంటున్నారు. అసలుకంటె వడ్డీ ముద్దు అనే సామెతను అన్వర్థం చేస్తున్నారు. కన్యకంటె, అలంకారాలు, కన్యాదాన దక్షిణ ప్రధానమైనాయి. స్వేచ్ఛగా యిచ్చే దక్షిణ నిర్బంధమైంది. దీనికి కారణాలు అనేకం;

ప్రతి తండ్రి, ప్రతి తల్లి, తన కుమార్తె సుఖపడాలని కోరటం సహజం. ఆ సుఖం అనేది డబ్బువల్ల వస్తువాహనాలవల్ల లభిస్తుందనీ, వాటివల్లనే సంఘంలో గౌరవం లభిస్తుందని అనుకోవటంవల్ల, సంపన్నులైనట్టి, పెద్ద ఉద్యోగులైనట్టి వరులకోసం అన్వేషిస్తారు. ఈవిధంగా వరుల మూల్యం పెరుగుతుంది.

ఏ వరుని తండ్రి చూచినా, తమ అంతస్థును హోదాను లోలోపల అంచనా వేసుకొని, చుట్టుప్రక్కలవారు, బంధువులు తీసుకొన్న కట్నాల్ని నెమరువేసుకుంటూ, తాను తనకొడుకు చదువు సంధ్యలకు చేసిన ఖర్చుల్ని అప్పజా వేసుకొని, తమ కుమారుని విలువను అంచనా వేసుకొని కూర్చుంటాడు. ఆ వరుడు ఆస్తి, అందం, చదువు, ఉద్యోగం వగైరా పురుష లక్షణాలు కలవాడైతే ఆ రేటు ఆకాశాన్ని అంటుతుంది. ఆ ఉద్యోగాన్నిబట్టి, చదువునుబట్టి వారికి ప్రత్యేకమైన రేట్లు ఉన్నాయి. డాక్టరు, ఇంజనీరు, I A.S. I.P S. లాంటివారి రేటు వేరు. మంత్రుల కొడుకుల రేటువేరు. బ్యాంకు ఉద్యోగుల రేటు వేరు. గవర్నమెంటులో లంచాలు

వాగా వచ్చే ఉద్యోగస్తుల రేటువేరు. వస్తువుల ధరలు మార్కెట్టులో డిమాండును బట్టి, Brand name ను బట్టి మారుతూ ఉన్నట్లు ఒక్కొక్క చదువుకు, ఒక్కొక్క ఉద్యోగానికి, కట్నాల మార్కెట్టులో రేట్లు పెరుగుతూ తరుగుతూ ఉంటాయి. వరులు అమెరికాలాంటి దేశాలలో ఉండేవారైతే ఆ రేటువేరు. ఈ కట్నం అనే ఆచారం ఎంత నింద్యమైనదైనా, సమాజంలో దీనికి రావలసినంత వ్యతిరేకత రాకపోగా· గౌరవం పెరగటం ఆశ్చర్యంగా ఉంటుంది. ఇందుకు కారణాలను పరిశీలిస్తే, ఈ దిగువ అంశాలు ప్రధాన కారణాలుగా తెలుస్తుంది. వరునివైపువారి దృష్టితోచూస్తే—

1. పెండ్లికుమారుని చదువుసంధ్యలకు L.K.G నుండి ఉద్యోగం వచ్చేవరకు అయిన ఖర్చు ఉమ్మడి సంసారంలోంచి చేసినందున దానిని మొత్తంగా రాబట్టాలనే భావం ఉండటం.
2. తాను పెట్టిన ఖర్చుయొక్క ఫలితాన్ని అనుభవించేది పెండ్లికుమార్తె కాబట్టి కట్నం తీసుకోవటంలో తప్పులేదనే భావం.
3. తన కుమార్తె వివాహానికి తాను ఖర్చు చేసినట్టి, లేదా ఖర్చుచేయవలసి యున్న పైకాన్ని కొడుకుద్వారా రాబట్టాలనే తలంపు.
4. సంఘంలో తమ అంతస్థును, గౌరవాన్ని నిలబెట్టుకోవటానికి కట్నం అత్యధికంగా తీసుకోవటం తప్పనిసరి అనే భావం.

వధువువైపు వారి దృష్టితో చూస్తే —

1. తమ కొమార్తె సుఖపడాలని, ఆ సుఖం అనేది ధన కనక వస్తు వాహనాల ద్వారా లభిస్తుందనే తప్పుడు అభిప్రాయం ఉండటం.
2. గొప్పవారితో సంబంధం తమ అంతస్థును పెంచుతుందనే భావం.
3. తన కుమార్తెకిచ్చే ధనాన్ని కొడుకుద్వారా రాబట్టవచ్చుననే తలంపు.
4. తన కొమార్తె సైతం తన సంసారంలో సభ్యురాలే కాబట్టి, ఆమె వాటా ఆమెకు యివ్వటంలో తప్పులేదనే భావం (స్త్రీ ధనంగాగాని, కట్నం రూపంలోగాని)

సంఘపరంగా ఆలోచించి చూస్తే —

1. ప్రస్తుతం మన చదువులు వ్యక్తిలో ధార్మిక నైతిక విలువల్ని పెంపొందించేవి కాకపోవటం.

2. ఆధునిక నాగరికతా వ్యామోహం. సినిమాలు. క్లబ్బులు. బార్లు, పార్లు. స్కూటర్లు, టి.వి.లు. ఫ్రిజ్‌లు. ఇత్యాదా ఆధునిక పరికరాలను సంపాదించటం. అనుభవించటమే జీవిత పరమావధిగా భావించటం. అట్టి వారికే సంఘంలో గౌరవం ఉండటం.

3. ధనమే జీవిత పరమార్థమైనందున. ఆ ధనాన్ని సంపాదించటానికి ఎవరిని ఏవిధంగా బాధించినా తప్పులేదని తలంచటం. అందుకే డబ్బుకోసం అత్త మామల్ని. భార్యను వేధించటం.

4. స్వార్థచింతన మితిమీరి పెరిగిపోవటం. సంఘం యెడల తమకున్న బాధ్యతను విస్మరించటం.

5. సంఘం కూడా నిర్లిప్తవైఖరిని అవలంబించటంవల్ల సంఘంనుండి ప్రతిఘటన ఏదీ లేకపోవటం.

ఇట్లా అనేక కారణాలు ఉండవచ్చు. ఈ దురాచారంవల్ల కలుగుతున్న అనర్థాలు —

1. ఆర్థికంగా వెనుకబడి ఉన్నందువల్ల విద్యారూప గుణశీలాదులు ఎన్ని ఉన్నా, కన్యలకు మంచి వంశంలోకి వెళ్ళే అవకాశం లేకపోవటం.

2. కట్నాలు పోయలేనందున నీచులు. విద్యాగుణశీలాదులు లేనివారి యింటి కోడలుగా వెళ్ళవలసి రావటం.

3. ఆ గుణహీనుల యింట. డబ్బుకోసం వేధించే అత్త ఆడుబిడ్డలవల్ల భర్తవల్ల, నరకయాతనలు అనుభవించి, ఆ బాధలు భరించలేక ఆత్మహత్యలకు పాల్పడటం, లేదా ఆ దుర్మార్గులచేత హత్యగావింపబడటం; నిత్యం మనం చూస్తూ పత్రికల్లో చదువుతున్న విషయాలే! తమ సంతానంమీది ప్రేమతో ఆత్మహత్యలకు పాల్పడలేక జీవచ్ఛవాలుగా బ్రతుకుతున్నవారెందరో ఉన్నారు. పత్రికలకెక్కని హత్యలెన్నో ఉంటాయి.

4. సమాజంలోని ఆర్థికంగా వెనుకబడినవారు, పై వర్గంతో ఏ విధమైన సంబంధాలూ లేక వేరు వేరు వర్గాలుగా ఉండిపోవటం; రాజకీయ సామాజిక విషయాల్లో వైషమ్యాలు పెరిగిపోవటం, సామ్యవాద సిద్ధాంతం నేతిబీర కాయ వంటిది అవటం. ఇవన్నీ ఈ దురాచారంవల్ల కలిగే దుష్పరిణామాలు.

ఈ కట్నాలు, కానుకలు, లాంఛనాలు అనేక రకాలుగా ఉంటాయి.

1) వధువుకు ఆభరణాల రూపంలో ఇచ్చే బంగారం. 2) వధువుకు భూమి రూపంలో స్థలాల రూపంలో యిచ్చే స్థిరాస్థి. 3) వరునికి యిచ్చే నగదు 4) వధువుకు వస్తురూపంలో యిచ్చే చరాస్థి 5) వరుని తండ్రికి పెండ్లికుమారుని చదువు కోసం ఖర్చుపెట్టిన సొమ్ము నిమిత్తమై యిచ్చే ధనం 6) అత్తగారికి, ఆడుబిడ్డలకు లాంఛనాల నిమిత్తమై యిచ్చే నగదు, వస్త్రాలు వగైరా.

పై తరగతి వారిలోని వెండి బంగారాలు కిలోలలో, తులాలలోను, డబ్బు లక్షల్లోను, భూమి ఎకరాలలోను, కార్లు, టి. వి. లు. A. C. లు. స్కూటర్లు ఫ్రిజ్‌లులాంటి వస్తువులన్నీ యింటి సామాను రూపంలో ఉంటాయి.

మధ్య తరగతి దిగువ తరగతి వారిలో ఈ వస్తువులు అల్పసంఖ్యలో ఉంటాయి. అందుచేతనే, భర్త అత్త, ఆడుబిడ్డలు, ప్రక్కయింటి కోడలు తీసికొని వచ్చిన వస్తువులు, డబ్బు, తమ కోడలు తీసికొని రాలేదని వేధించటం, పుట్టినింటికి పంపటం. కుమార్తె కాపురం నిలబెట్టటానికై నానాబాధలూపడి వారు అడిగినవి సమకూర్చటం, తాము ఆర్థికంగా చితికిపోవటం, వారి ఆశకు అంతులేకపోవటం, ఈ బాధలు భరించలేక స్త్రీలు ఆత్మహత్యలకు పాల్పడటం, ఇవన్నీ నిత్యకృత్యాలు అయినాయి. పైగా ఈ వేధింపులకు, హత్యలకు, హింసలకు స్త్రీలైన అత్తలు ఆడుబిడ్డలే కారణం కావటం మరీ విచారింపదగిన విషయం.

ఈ కట్నాలనేవి ఒక్కొక్క కులంలో ఒక్కొక్క విధంగా ఉండటం కనిపిస్తోంది. కొన్ని కులాలలో వరునికి ధనరూపంలో యిచ్చే కట్నంమీద ఇక కన్యకు గాని, కన్యయొక్క తల్లిదండ్రులకుగాని, ఏవిధమైన అధికారమూ ఉండదు. వరుడు ఆతని తల్లిదండ్రులు ఆ ధనాన్ని ఏవిధంగా వెచ్చించినా అడిగే అధికారం లేదు.

కొన్ని కులాలలో వరకట్నం అని అన్నప్పటికి, ఆ కట్నం భూమిరూపంలోనో ఇతర స్థిరాస్థిరూపంలోనో ఉంటుంది. ఆ ఆస్థి కన్యపేరనే ఉంటుంది. కన్యకు సంతతి కలుగని పక్షంలో ఆ ఆస్థి కన్యయొక్క పుట్టినింటివారికే వస్తుంది. అట్లాగే, చరాస్థిమీద సైతం కన్యదే హక్కు. ఇది కాక వరునికి యిచ్చే ధనం ఏదైనా ఉంటే దానిపై కూడా కన్య తల్లిదండ్రులకు అడిగే హక్కు ఉంటుంది.

కొన్ని వర్ణాలవారిలో స్త్రీధనమంటూ ఏమీ ఉండదు. పెండ్లినాడు వరునికిచ్చే నగదుమీద కన్యకేమీ అధికారం లేదు. ఆమెకిచ్చిన బంగారం వగైరాలమీద సైతం ఆమెకు అధికారం ఉండదు. భర్త, అత్తమామలు కలసి ఉమ్మడి సంసారం కోసం

ఖర్చుచేసుకొన్నా అడిగే హక్కులేదు. అత్తవారు యోగ్యులైతే వారి ఇంట గృహిణి గానూ. యోగ్యులుకాకపోతే పనికత్తెగానో, వంటకత్తెగానో బ్రతకాల్సిందే!

ఇక ఆర్థికంగా వెనుకబడినట్టి. కేవలం సంసారంలోని వారంతా శరీరకష్టం మీదనే బ్రతికే వర్గంవారున్నారు. వారిలో ఈ సమస్యలు తలయెత్తవు. వారు శ్రమ జీవులు. స్వేచ్ఛాజీవులు. పరాన్నభుక్కులు కారు. కృత్రిమాడంబరాలతో బ్రతికే సంపన్న వర్గాలవారిలో కనిపించే కృత్రిమజీవనం వీరిలోలేదు. అత్తమామల ఆడు బిడ్డల ఆరళ్ళు. భర్తల అఘాయిత్యాలు వగైరాలతోపాటు ఆత్మహత్యలు సైతం తక్కువే! నిజానికి. వివాహం. దాంపత్యం, సహధర్మచరణం. సహజీవనం అనేవి వారిలోనే ఉన్నాయేమో అనిపిస్తుంది. అయితే. చదువు సంధ్యలు, ఉద్యోగాలు. లేనందువల్ల సామాజిక విలువలు లోపించటంవల్ల వారి దాంపత్యాలు లోకులకు ఆదర్శ ప్రాయంగా కనిపించటం లేదు. శ్రామిక వర్గాలోని ఈ స్త్రీలు ఉన్నత వర్గాల్లోని స్త్రీలలాగా కేవలం ఆటబొమ్మలుగా. విలాస వస్తువులుగా, కాకుండా. స్వతంత్రంగా పొట్టపోసుకోగలం అనే ధైర్యంలో, వ్యక్తిత్వంతో ఉన్నట్లు కనిపిస్తుంది. అయితే దారిద్ర్యం. నిరక్షరాస్యత అనేవి. వారి ధైర్యాన్ని. వ్యక్తిత్వాన్ని. స్వాతంత్ర్యాన్ని వెక్కిరిస్తూంటాయి. మెల్లగా వీరి జీవితాల్లో కూడా కట్నకానుక లనేవి ప్రవే శిస్తున్నాయి.

ఈ వరకట్న మనే దురాచారాన్ని రాజకీయనాయకులు. విద్వాంసులు. సంస్కర్తలు, యువకులు. వృద్ధులు అంతా వ్యతిరేకిస్తారు. కాని. ఈనాడు కట్నం లేని వివాహం వివాహమే కాదు. కట్నం తీసుకోనివాడు సంఘానికి లోకువ. ఆ పెండ్లికుమార్తెకు కూడా లోకువే! అందరూ అసహ్యించుకొంటూ. అందరూ ఒక్కగా పోషిస్తూన్న వ్యవస్థ, ఆచారం అనేది ఏదైనాఉంటే. అది కట్నాల సమస్యే! ప్రభుత్వం సైతం శాసనాలద్వారా ఆపలేని దురాచారం ఇది. కాలమే దీనిని మార్చాలి. అంతవరకు మానవ ప్రయత్నం జరుగుతూ ఉండాల్సిందే!

జాతకాలు:

వివాహ సంబంధాలు కుదరటానికి. ఆటంకంగా ఎదురౌతున్న సమస్యల్లో వధూవరుల జాతకాలు కలియటం అనేది ఒకటి. ఈ ఇరవయ్యవ శతాబ్దంలో సైతం. సమాజం అనేక విధాలుగా పురోగతి సాధించిన ఈ రోజుల్లోకూడా వివాహ సంబంధం కుదరాలంటే, జ్యోతిషానికి — జాతకాలకు అత్యంత ప్రాధాన్యం కని పిస్తోంది. బాగా చదువుకొన్న నాగరకులు సైతం జాతకాలకు మితిమీరిన ప్రాధాన్యం

యిస్తున్నారు. వధూవరుల జన్మకాలాన్నిబట్టి గుణించి, చక్రంవేసి, ఆయారాసుల్లో ఏ ఏ గ్రహాలున్నాయో లెక్కించి, ఆయా గ్రహాల మిత్రత్వ శత్రుత్వాలనుబట్టి, ఆ వధూవరులకు వివాహం చేయవచ్చునా? చేయరాదా? అనే విషయాన్ని జ్యోతిష్కులు లెక్కవేసి చెబుతారు. దీనినే వాడుకభాషలో జాతకాలు కలవటం, కలవకపోవటం అంటారు. ఈ విషయంలో నమ్మకం ఉన్నవారు, అన్ని విషయాలూ అనుకూలంగా ఉన్నా, జాతకాలు కలవలేదని, సంబంధాలు వదిలివేసినవారున్నారు. ఈ విధమైన నమ్మకం చదువు రానివారిలోకంటె చదువుకొన్నవారిలో ఎక్కువగా ఉంది. అయితే, కొంతమంది గడుసరులు కట్నం విషయంలోను, ఇతర విషయాల్లోను దీనిని అడ్డం పెట్టుకుంటారు. వారిస్తామన్న కట్నం చాలనప్పుడు, పెళ్లి నచ్చనప్పుడు మొరటుగా చెప్పకుండా మర్యాదగా జాతకాలు కలవలేదని తప్పుకుంటారు. ఆడపిల్లవారు సైతం, పెళ్లివాని ఉద్యోగం మంచిదికాదనో, ప్రమోషన్ అవకాశం లేదనో, తాము కోరుకున్న ఉద్యోగం కాదనో తిరస్కరించాల్సి వచ్చినప్పుడు, ఇతరులకు చెప్పాల్సి వచ్చినప్పుడు జాతకాలు కలవలేదని దాటవేస్తారు. తమకు యిష్టమైతే జాతకాలు వాటంతట అవే కలుస్తాయి. ఈ విషయంలో ఈ జాతకాలనేవి మహోపకారం చేస్తున్నాయనే అనాలి!

వివాహాదుల్లోనే కాకుండా, నిత్యకృత్యాల్లో సైతం ఇంతటి ప్రాచుర్యాన్ని పొందినట్టి, దేశపాలకులచేత సైతం మన్నన లందుకొంటున్న ఈ జాతకాలు, జ్యోతిష్యం అనే వాటిని గూర్చి తెలుసుకోవటం అప్రాసంగికం కాదు. ఒక విధంగా చూస్తే అవసరం కూడాను. కొన్ని అగ్రవర్ణాలలో మాత్రమే ఆమలులో ఉన్న ఈ జాతకాల సాంప్రదాయానికి వివాహాదుల్తో ఉన్న సంబంధం తెలుసుకోవాల్సిందే!

జ్యోతిశ్శాస్త్ర విజ్ఞానం అనేది సంహితా బ్రాహ్మణాలకాలానికే అంకురించి విస్తరించినట్లు, దీనిని రాశిదైవ నక్షత్ర విద్యలనేవారని తెలుస్తుంది. ఈ విజ్ఞానాన్ని ఆధారంగా చేసుకొని లగధుడనే ముని 43 శ్లోకాలు గల చిన్నగ్రంథాన్ని వ్రాశాడు. దీనిని వేదాంగ జ్యోతిషం అనేవారు. తరువాత క్రమంగా వరాహమిహిరుడాదిగా గల ప్రతిభాశాలురవల్ల మహాశాస్త్ర రూపాన్ని దాల్చి కాలక్రమేణా బాగా వృద్ధిపొందింది. శాఖోపశాఖలుగా విస్తరిల్లింది. మొదట యజ్ఞయాగాదుల కోసం ఉపయుక్తమైన ఈ జ్యోతిషం, జాతకర్మ మొదలు గర్భాదాన పర్యంతం, సమస్త సంస్కారాల్లో అంత్యేష్టి సంస్కారాల్లో సైతం చోటు చేసుకొన్నది. మన చేతుల్లో లేని పుట్టటం చావటం మినహా, సమస్త కార్యకలాపాల్లో, నిత్యకృత్యాల్లో సైతం జ్యోతిషానికి

మంచి పట్టు చిక్కింది. అందుకనే దానిని నమ్ముకొని. అమ్ముకొనేవారి జాతకాలు మూడు పూవు లారు కాయలుగా పెరిగిల్లుతున్నాయి - వారి జాతకమే వారికి తెలియక పోయినా! వారి మాటలు వేదవచనాలుగా చలామణి అవుతున్నాయి.

మన దేశంలో వివాహం లాగానే అనేక ధార్మిక కృత్యాలు ఆచరించటం ప్రాచీన కాలంనుండి ఉంది. ఆ యా ధర్మకార్యాలు ఏ ఏ మంచి అనుకూల సమయాల్లో చేయాలో చెప్పటం వరకే జ్యోతిషం పరిమితమై ఉండేది. ఏ యజ్ఞం ఏ మాసంలో ఏ తిథినాడు ఏ సమయంలో ప్రారంభించాలి? వివాహం చేయటానికి ఏ తిథి, ఏ నక్షత్రం, ఏ సమయం అనుకూలంగా ఉంటుందో చెప్పి, స్థూలంగా ముహూర్త నిర్ణయం చేసేది ఈ శాస్త్రం. క్రమంగా ఇది విస్తృతమై వ్యక్తుల జాతక చక్రాలు వేసి. వరునికి ప్రమోషన్ యోగం ఉందా? లేదా? వధువుకు వాహనయోగం. ఆభరణ యోగం ఉందా? లేదా? వరునికి ధనయోగం. గృహ నిర్మాణ యోగం ఉన్నాయా లేవా అని విచారణ చేసి నిర్ధారించి చెప్పే స్థితికి ఎదిగారు ఈ శాస్త్రజ్ఞులు.

ఈ సందర్భంలోనే ఒక దృష్టాంతాన్ని పరీక్షిద్దాం. వైద్యశాస్త్రం ఉంది. అది స్థూలంగా ఆహారపు విలువలు. వస్తుగుణాలు; ఏ కూరలో, ఏ పప్పుల్లో, ఏ దుంపల్లో ఏఏ ఖనిజ లవణాలు, విటమినులు, పిండిపదార్థాలు, మాంసకృత్తులు ఏఏ పాళ్ళల్లో ఉన్నాయో, సగటు మానవునికి అవి ఏఏ పాళ్ళల్లో అవసరమౌతాయో వివరించి చెపుతాయి. స్థూలంగా చెప్పిన ఈ విషయాల్ని. మనం ప్రతిరోజూ తినేటప్పుడు వాటిలోని గుణాలను పరిశీలించి. ఎంతెంత తినాలో నిర్ణయించి తినలేము గదా! వైద్యశాస్త్రం చదివిన డాక్టర్లకే అది సాధ్యం కాని విషయం. అయితే, వైద్యశాస్త్రం తప్పు అనే మూఢుడు ఎవడూ ఉండడు. దానిని ఎంతవరకు ఆచరణలో పాటించాలో తెలుసుకొని ఆచరణలో పెట్టుకోవాలి. అట్లాగే జ్యోతిషం విషయంలో కూడా! వివాహానికి అవసరమైన స్థూలనియమాలను శాస్త్రం చెప్పింది. వాటిని పాటిస్తే చాలు గదా! ఫలభాగాన్ని గురించిన వ్యక్తిగత పరిశీలన నిరర్థకం గదా! ఆ చెప్పేవారి జాతక ఫలం, వారికే తెలియదాయె! వారి మాటలతో మనం బాధపడటం అనవసరమే గదా! జ్యోతిశ్శాస్త్రాన్ని తప్పు అనటం కాదు. ఏ మూర్ఖుడు అనడు. ఆ శాస్త్రాన్ని ఎంతవరకు మనం పాటించాలో తెలుసుకోవటం అవసరం. వ్యక్తి జాతకాలను పరిశీలించి, సంబంధాలు నిర్ణయించే పద్ధతి, వేదకాలం నుండీ లేదు.

ఋగ్వేదంలో వివాహసూక్తంలో (10-85-13)లో "అఘాసు హన్యతే గావో ఫాల్గున్యోః పర్యుహ్యతే" అఘలో (మఘలో ఆవులు చంపబడతాయి. ఫాల్గుణంలో

కన్యలు తమ పుట్టినింటి నుండి తీసికొనిపోబడతారు'' అని ఉంది. ఆప స్తంబగృహ్య సూత్రాల్లో (3-1.2) ''మఘాభిర్గావో గృహ్యన్తే ఫల్గునీభ్యాం వ్యూహ్యతే'' అంటూ ఈ విషయమే చెప్పబడ్డది. దీనినిబట్టి వైదిక కాలంలో. చంద్రునితో మఘానక్షత్ర సంయోగం జరిగినప్పుడు (మాఘమాసంలో) వివాహాలు జరిగి ఉండవచ్చు. ఆశ్వలాయన గృహ్యసూత్రాల్లో ''ఉదగయన ఆపూర్యమాణపక్షే. కల్యాణే నక్షత్రే, చౌల కర్మోపనయన గోదాన వివాహాః సార్వకాలమేకే వివాహం'' (1-4-1-2) సూర్యుడు ఉత్తరాయణంలో ఉండగా. శుక్లపక్షంలో మంచి నక్షత్రంలో చౌలము. ఉపనయనం, గోదానం, వివాహ సంస్కారాలు చేయాలి. కొందరు, వివాహం మాత్రం అన్ని కాలాల్లోనూ, అన్ని మాసాల్లోనూ చేయవచ్చు నంటారు అని ఉంది. శాంఖాయన గృహ్యసూత్రాలూ (1-5-5) ఇట్లాగే చెప్పినాయి.

ఆపస్తంబగృహ్య సూత్రాల్లో (2-12.13) శిశిరంలోని రెండు నెలలు (మాఘ-ఫాల్గుణాలు) గ్రీష్మ ర్తువులోని చివరి నెల (ఆషాఢం) మినహా మిగతా అన్ని నెలల్లోనూ వివాహం చేయవచ్చునని ఉంది. తన కూతుర్ని అల్లుడు బాగా ప్రేమించాలని అనుకొనే తండ్రి, తన కొమార్తె వివాహం (నిష్ట్యా) స్వాతి నక్షత్రంలో చేయాలి. అట్లా చేస్తే ఆ కన్య భర్తకు ప్రేమాస్పదయై తండ్రి యింటికి తిరిగిరాదు - ''యాం కామయేత దుహితరం ప్రియాస్యాదితి తాం నిష్ట్యాయాం దద్యాత్. ప్రియైవ భవతి. నైవ చ పునరాగచ్ఛతి ఇతి బ్రాహ్మణాపేక్షోవిధిః। ఆప.గృ.సూ. 3-3.)

బోధాయన గృహ్యసూత్రాల్లో (1-1-18 నుండి 21 వరకు) ''సర్వేమాసాః వివాహస్య. శుచితపస్తపస్య వర్జమిత్యేకే, రోహిణీ మృగశీర్ష ఉత్తరే ఫల్గునీ స్వాతీతి వివాహస్య నక్షత్రాణి. పునర్వసూతిష్యో, హస్తః, శ్రోణా, రేవతీ అన్యేషాం భూతి కర్మణాం'' అని ఉంది. బోధాయనుడు పైన చెప్పబడిన మాసాలను అంగీకరిస్తూ, రోహిణీ. మృగశిర. ఉత్తరాఫల్గుణి. స్వాతి నక్షత్రాలు వివాహానికి తగినవని, పునర్వసు. పుష్యమి. హస్త. శ్రవణం. రేవతి నక్షత్రాలు వివాహానికి తప్ప ఇతర సంస్కారాలకు పనికివస్తాయన్నాడు. మానవగృహ్యసూత్రాల్ని (1-7-5) అనుసరించి రోహిణి. మృగశిర, శ్రవణం. ధనిష్ఠ (శ్రవిష్ఠ) ఉత్తరాభాద్ర, ఉత్తరాషాఢ, ఉత్తరా ఫల్గుణి వివాహానికీ. కన్యను అత్తవారింటికి పంపటానికీ మంచి నక్షత్రాలని అన్నాడు. కాఠక, వారాహ సూత్రాల్లో కూడా ఇట్లాగే ఉంది. భగుడు దేవతగా గల నక్షత్రంలో వివాహం జరిగినట్లు బాలరామాయణం బాలకాండలో, మహాభారతం ఆది పర్వంలో ఉంది.

కౌశిక గృహ్యసూత్రాల్లో వివాహాలు కార్తిక పూర్ణిమ తరువాత వైశాఖ పూర్ణిమకు ముందు జరగాలని ఉంది — "ఊర్ధ్వకార్తిక్యా ఆ వైశాఖ్యాః యథా కామీవా. చిత్రాపక్షం తు వర్జయేత్. (కౌ.గృ.సూ. 75-2-4) తమకు అనుకూలమైనప్పుడు ఎప్పుడైనా చేయవచ్చు. కాని చైత్రమాసాన్ని మాత్రం తప్పకుండా విడిచి పెట్టాలి; అన్నాడు.

వీటి అన్నింటిని బట్టి చూస్తే వివాహం చేయవలసిన నెల, నక్షత్రాలను మాత్రం గృహ్యసూత్రాలు పేర్కొన్నాయి. వర్షగ్రీష్మాదివి ఉపద్రవాలు లేని నెలలు అటువంటి కాలాన్ని మంచివిగా నిర్ణయించినట్లు తెలుస్తుంది. పైగా వివాహానికి అన్ని నెలలూ మంచివే అని చెప్పిన సూత్రకారులూ ఉన్నారు. నిజానికి వారి దూరదృష్టిని, యథార్థ దృక్పథాన్ని అభినందించాల్సిందే! ఎందుచేతనంటే — ఆకలైనప్పుడు అన్నప్రాశన చేయాలి అన్నట్లుగా, వివాహ మనేది నిశ్చయమైన తరువాత, వధూవరుల అంగీకారం జరిగిన తరువాత, ఇక ఉత్తరాయణ దక్షిణాయనాల కోసం, మాసాల కోసం వాయిదా వేయటం మంచిది కాదు అని వారు ఆనాడే గ్రహించి ఉంటారు. అట్లాగే గృహ్యసూత్రకారులు వివాహానికి ఉపయుక్తమైన నక్షత్రాలను ఖచ్చితంగా, నిర్ద్వంద్వంగా పేర్కొన్నారు.

## వివాహ ముహూర్తం:

గృహ్యసూత్రాలన్నీ వివాహ ముహూర్తాన్ని నిర్ణయించే సందర్భంలో కూడా చాలా ఉదారంగా దూరదృష్టితో, తేలికగా ఉండేటట్లు వ్యవహరించాయి. కాని, తరువాత తరువాత ఆ సూత్రాలకు వ్యాఖ్యానాలు వ్రాసిన వ్యాఖ్యాతలు, తమ కాలానికి అభివృద్ధి చెందిన జ్యోతిశ్శాస్త్రాన్ని ఆధారంగా గ్రహించి చాలా గందరగోళాన్ని సృష్టించినట్లు తెలుస్తోంది. రఘునందనుడు తన 'ఉద్వాహతత్త్వం' అనే గ్రంథంలో రాజమార్తాండునివి, భుజబలభీమునివి అంటూ ఈ దిగువ శ్లోకాన్ని ఉదాహరించాడు —

"రాజగ్రస్తే తథాయుద్ధే పిత్రూణాం ప్రాణసంశయే
అతిప్రౌఢా చ యా కన్యా నానుకూల్యం ప్రతీక్షతే
అతివృద్ధాచ యా కన్యా కులధర్మ విరోధినీ
అవిశుద్ధాపి సా దేయా చంద్రలగ్నబలేన తు.

(రాజమార్తాండ)

పెండ్లి కొమార్తె యువతి అయితే (ప్రౌఢ) లేక వృద్ధ అయితే శుభాశుభాలను ఆలోచించకుండా మంచి మాసం కోసం ప్రతీక్షించకుండా నక్షత్రం చంద్రుని అనుకూల్యం చూచి వివాహం చేసివేయాలి.

''గ్రహశుద్ధి మబ్దశుద్ధిం మాసాయనర్తు దివసానామ్
అర్కాక్ దశవర్షేభ్యో మునయః కథయన్తి కన్యానామ్.
(భుజబలభీమ)

పెండ్లికొమార్తె పది సంవత్సరాల వయస్సు కలది అయినప్పుడే ఆ పిల్ల వివాహం కోసం అయనం, మాసం, నక్షత్రం, వారము మొదలైనవి చూడాలి. పెద్ద మనిషి అయిన పిమ్మట చూడనక్కరలేదు. అని

''సంస్కార రత్నమాల'' అనే గ్రంథంలో వివాహానికి అనుకూలమైన మాసం విషయంలో స్మృతులకు వైరుధ్యం ఉంది కాబట్టి తమ తమ దేశాచారాన్ని అనుసరించి నిర్ణయించుకోవటం మంచిది'' అని ఉంది. వివాహ విషయంలో ఇంకా కొన్ని నియమాలు చెప్పబడ్డాయి. వరుడు జ్యేష్ఠుడు: వధువు జ్యేష్ఠకన్య, మాసం జ్యేష్ఠమాసం పనికిరావు అన్నారు. దీనినే ఈనాడు త్రిజ్యేష్ఠ అంటున్నారు. అట్లాగే ఏ నెలలో, ఏ రోజున, ఏ నక్షత్రంలో జన్మించారో, ఆ నెలలో ఆ రోజున ఆ నక్షత్రంలో వివాహం చేయటం నిషిద్ధం. సోమ, బుధ, గురు, శుక్రవారాలు వివాహానికి శుభకరమైనవని అన్నారు. కాని, మదన పారిజాతం అనే గ్రంథంలో ''న వారదోషాః ప్రభవన్తిరాత్రౌ'' రాత్రులందు జరిగే వివాహానికి వారదోషం లేదన్నారు. రాత్రి లగ్నమైతే వారం ఏదైనా పరవాలేదన్నమాట. నిర్ణయసింధు (3 పూర్వార్ధం) అనే గ్రంథాన్ని అనుసరించి రజస్వల అయిన కన్యయొక్క వివాహానికి గురుశుద్ధి చూడటం వ్యర్థం అన్నారు — ''రజస్వలాయాః కన్యాయాః గురుశుద్ధిం న చింతయేత్'' అని. ''సంస్కార ప్రకాశం'' అనే గ్రంథంలో గంగా గోదావరీ మధ్య దేశంలో గురుడు సింహరాశిలో ఉండగా వివాహంగాని ఉపనయనంగాని చేయరాదన్నారు.

వీటి అన్నింటిని బట్టి, ఆలోచించి చూస్తే ప్రాచీన సూత్రకాలానికి, స్మృతికాలానికి, మనహిందూ సంస్కారాల్లోకి జ్యోతిషశాస్త్రం అనవసరంగా చొరబడలేదని అవసరమైనంత మేరకు, సమాజానికి ఆచరణ యోగ్యమయ్యేవిధంగా, తగినంత స్వేచ్ఛ నిచ్చిందని మనకు అర్థమౌతుంది. చాలమంది ఈనాడు వివాహానికి అనుకూల

మైన నెల, తిథులు వారాలు, విషయమై అనేక యిబ్బందులకు గురి అవుతున్నారు. ఈ విషయంలో మన సూత్రకారులు. స్మృతికారులు ఉదారంగానే ఉన్నారు; ముఖ్యంగా రాజస్వల అయిన కన్య విషయంలో;

వధూవరుల జాతక చక్రాలు, వాటి పొంతన:

అనేకమంది బాధపడుతున్న విషయం, అనేక మంచి సంబంధాలను వదులుకోవటానికి కారణమైన విషయం. అనేకమంది వధూవరుల ప్రేమను కాలరాచిన విషయం. వధూవరుల జాతకచక్రాలకు పొంతన కుదరక పోవటం:

జ్యోతిషశాస్త్రాన్ని అవహేళనచేయటం మా అభిమతం కాదు. ఏ శాస్త్రాన్నీ అవహేళన చేయనక్కరలేదు. ప్రతి శాస్త్రమూ అనుభవాన్ని ప్రమాణాలను గ్రహించే సూత్రీకరించబడుతుంది. సూత్రీకరించటానికి వీలులేని సందర్భాల్లో నిర్ణయించుకొనే స్వేచ్ఛ మనకు వదలిపెడుతుంది. ఉదాహరణగా వ్యాకరణశాస్త్రాన్ని చూద్దాం. భాష బాగా వృద్ధిచెందిన పిమ్మట ఆ భాషలోని శబ్దజాలాన్ని ప్రయోగాల్ని వ్యాకరించి సూత్రీకరిస్తారు. సూత్రాలకు లోబడనివేవైనా ఉంటే, ప్రయోగాల్నిబట్టి గ్రహించమంటారు. ఆ వ్యాకరణశాస్త్రంలోని కొన్ని ముఖ్య ప్రయోగాలను మనం తెలుసుకొంటే తప్ప (మాతృభాష మినహా) ఆ భాషలో మన భావాన్ని వ్యక్తంచేయలేము. అంటే, విశేష పాండిత్యం వ్యాకరణంలో మనకు లేకపోయినా సామాన్య పరిజ్ఞానం, ప్రయోగం తెలిసిఉండాలి. అప్పుడే ఆ శాస్త్ర ప్రయోజనం నెరవేరుతుంది. సంఘ వ్యవహారం జరుగుతుంది. ఏ శాస్త్రమైనా, ఆ కాలంలోని వ్యవహారాన్నిబట్టి, అనుభవాన్నిబట్టి, ప్రయోగాన్ని బట్టి సూత్రీకరింపబడుతుంది. కొంత కాలానికి పైన పేర్కొన్న వ్యాకరణశాస్త్ర నిబంధనలు అధికమై సామాన్యులకు అందులో లేనివిధంగా తయారైతే, సమాజం ఆ నియమాలను ఉల్లంఘించి క్రొత్త ప్రయోగాలను చేపట్టి తన వ్యవహారం నడుపుకొంటుంది. మళ్ళీ శాస్త్రజ్ఞులు బయలుదేరి దానికి వ్యావహారికమనో, గ్రామ్యమనో పేరుపెట్టి, మళ్ళీ ఆ భాషను వ్యాకరిస్తారు. క్రొత్త వ్యాకరణం అమలులోకి వస్తుంది. దీనినిబట్టి, శాస్త్రమనేది మానవునికోసం, సంఘ ప్రయోజనంకోసం పుడుతోంది; అని మనం గ్రహించాలి. అట్లాగే, జ్యోతిషశాస్త్రమూను. దేశకాలాల్ని బట్టి శాస్త్ర ప్రయోజనం మారుతుంది.

పూర్వకాలంలో వివాహ సమయంలో వధూవరుల జాతక చక్రాలువేసి, వాటిని పరిశీలించి, వాటి శుభాశుభ ఫలాలను నిర్ణయించి, వివాహసంబంధాలను

నిర్ణయించినట్లు ఎక్కడా కనిపించదు. అంటే. శ్రుతి స్మృతుల్లో వధూవరుల జాతక చక్ర పరీక్షచేసి, వారి దాంపత్యంయొక్క అనుకూల్య ప్రాతికూల్యాలను నిర్ణయించా లని చెప్పలేదు. బహుశః ఆనాటికి జ్యోతిశ్శాస్త్రం ఇంతగా అభివృద్ధిచెంది ఉండక పోవచ్చు. లేదా తమకు సంబంధించని ఆ శాస్త్రంలో అనధికార ప్రవేశాన్ని వారు కోరివుండకపోవచ్చు. క్రీ.శ. నాల్గవ శతాబ్దం వరకు ఈనాటిలాగా జాతకచక్రాలువేసి, వధూవరుల గ్రహమైత్రి ఇతర శుద్ధులు, కుజదోషాదులు పరిశీలించటం అనేది ఎక్కడా కనిపించదు. భాసనాటకాలను బట్టి (క్రీ.శ. 300) ఆనాడు వివాహానికి ఏ రోజు మంచిది? అనేంతవరకే జ్యోతిష్కులను సంప్రదించటం జరిగినట్లు తెలుస్తుంది. ఇంతకుమించి ఆ శాస్త్రం వివాహాది సంస్కారాల్లో తలదూర్చలేదు. క్రీ.శ. 400 నుంచి 900 వరకు ఈ శాస్త్రం బాగా వృద్ధిపొందింది. అప్పటినుండే వధూవరుల చక్రరచన వాటి పరిశీలన, శుభాశుభ నిర్ణయం వగైరాలు ఆరంభమై ఉంటాయి. క్రమంగా సమాజంలో అన్ని విషయాలలోకి ప్రయాణానికి, టి.వి. కొనటానికి. స్కూటరు కొనటానికి, M. L. A నామినేషను దాఖలుకు; మంత్రివర్గ ప్రమాణ స్వీకారానికి. చివరకు రాజకీయ హత్యలకు సైతం ఈ శాస్త్రాన్ని ఉపయోగిస్తున్నారు. ఈ శాస్త్రం వృద్ధిపొందినందుకు ఎంత సంతోషం కలుగుతుందో ఎంత గర్వం కలుగుతుందో వరాహ మిహిర ఆర్యభట్టులాదిగా శాస్త్రవేత్తలు చెప్పిన గ్రహ గమ నాదులు ఈనాటి శాస్త్రజ్ఞులు చెప్పేదానికి సరిపోలుతున్నందున నిజంగా మన శాస్త్రం గర్వకారణమే గదా! అయితే, శాస్త్రమనేది జాతి పురోగతికి, సుఖానికి, అభ్యుదయా నికి ఉపయోగపడాలి. అంతే తప్ప. అనుమానాలను భయాలను రేకెత్తించి సంఘ పురోగతికి. సుఖానికి అడ్డురాకూడదు. ఏ శాస్త్రమైనా అంతే! మనం కూడా ఏ శాస్త్రాన్ని ఎంత వరకు. ఎట్లా ఉపయోగించుకోవాలో అట్లా అంతవరకే ఉపయోగించుకోవాలి. శాస్త్రాన్ని తప్పు అనటం, దానిని విస్మరించటం పనికి రాదు. ఈనాడు జ్యోతిష్కులు, తమ పాండిత్యంతో వేష భాషలతో. జనంలో ఉన్న నమ్మకాలనే బలహీనతను ఉపయోగించుకొని ఏ గౌరవాన్ని పొందుతున్నారో. ఆ గౌరవాన్ని కొద్దిరోజుల్లో కంప్యూటర్లు, కంప్యూటరు శిక్షణ పొందినవారు పొందుతారు. జ్యోతిషం యాంత్రికమై పోతోందిగదా! కంప్యూ టర్లద్వారా జాతక చక్రాలు ఖచ్చితంగా గుణిస్తున్నారు. త్రికాలవేదులుకాని జ్యోతి ష్కులు వధూవరుల భవిష్యత్తుకు సంబంధించిన మాటలు చెప్పటం, వారి మనసు లలో అనుమాన. భయాలకు సంబంధించిన బీజాలు నాటటం మంచిది కాదు. వధూ

వరుల పెద్దలునైతేం. వధూవరులకు. తమకు అన్ని విషయాలూ నచ్చినప్పుడు. ఇక జాతకాల బాగోగులను గూర్చిన విచారణ అనవసరం. ముహూర్త నిర్ణయమే కర్తవ్యం.

కన్యాదానం ఎవరు చేయాలి? అనే విషయాన్ని గూర్చి తెలుసుకోవటం అప్రాసంగికం కాదు. ఒక్కొక్కప్పుడు ఈ సమస్య తలయెత్తుతుంది. అట్లాగే. వివాహ నిశ్చయం ఎవరు చేయాలి? దీనినే తాంబూలాలు పుచ్చుకోవటం అని. లగ్న పత్రికలు పుచ్చుకోవటం అని అంటూ ఉంటారు. విష్ణుధర్మసూత్రాల్లో (24-38. 39) వరుసగా, తండ్రి. తాత. సోదరుడు ఆ యింటిపేరుగల బంధువులు, మేనమామ. తల్లి, కన్యాదానానికి. వివాహ నిశ్చయం చేయటానికి ఒకరి తరువాత ఒకరు అర్హులు అని చెప్పబడ్డది. యాజ్ఞవల్క్య స్మృతిలో (1-63. 44) మేనమామకు స్థానం ఇవ్వ లేదు. కన్యాదాత పిచ్చివాడై ఉండరాదు అన్నారు. నారదస్మృతిలో (20. 21)

> "పితా దద్యాత్స్వయం కన్యాం. భ్రాతావానుమతే పితుః
> పితామహో మాతులశ్చ. సకుల్యా బాంధవ స్తథా.
> మాతాత్వభావే సర్వేషాం ప్రకృతౌ యదివర్తతే
> తస్యామప్రకృతిస్థాయాం దద్యుః కన్యాం సనాభయః.

తండ్రి, ఆతని అనుమతిని పొంది సోదరుడు, తాత (తండ్రి తండ్రి) మేనమామ, ఆ యింటి పేరుగల బంధువులు. పిచ్చిదికాని తల్లి, అని ఉంది. తల్లికి చివరిస్థానం ఇవ్వటంలో ఉండే ఉద్దేశ్యం, బాధ్యతతో కూడిన కన్యాదాన మనేది పురుష సహాయం తోనే చేయవలసి వస్తుంది కాబట్టి! ధర్మసింధువులో—(3 - పూర్వార్థం)

"కన్యాస్వయంవరే మాతుర్భ్రాత్రభ్యే చ తాభ్యామేవ నాందీశ్రాద్ధం కార్యం. తత్ర మాతా కన్యా వా స్వయం ప్రధానసంకల్ప మాత్రం కృత్వాఽన్య ద్బ్రాహ్మణ ద్వారా కారయేత్" పురుషులు లేనప్పుడు కన్యయే స్వయంవరణం చేయవచ్చు. కన్య యొక్క తల్లి. కన్యాదానం చేయవచ్చు. కన్యగాని. ఆమె తల్లిగాని నాందీశ్రాద్ధం చేయాలి. కన్యగాని, తల్లిగాని సంకల్పంమాత్రం చేసి మిగతా కార్యమంతా ఏ బ్రాహ్మ ణుని ద్వారానైనా జరిపించాలి అని ఉంది. ఈనాటి మన న్యాయాలయాలు (కోర్టులు) కన్యకోసం, ఆమె తల్లి. వరుని నిశ్చయంచేసే అధికారాన్ని అంగీకరించాయి. పైన చెప్పినట్లుగానే ఈనాటికీ జరుగుతోంది. రోగగ్రస్తుడు. పిచ్చివాడు అయిన తండ్రి వివాహ నిశ్చయం చేయటానికి అర్హుడు కాడు. తండ్రి ఉండగానే కన్యయొక్క

మేనమామ వివాహం జరిపిస్తే ఆ వివాహం చెల్లుతుంది—సప్తపది అయిన పిమ్మట ఇక వివాహభంగం జరగదు. ఈ విషయంలో వివాహ సంస్కారానికే ప్రాధాన్యత ఉందే తప్ప, అధికారానికి (తండ్రికి) ప్రాధాన్యత లేదు, అని 'ఉదాహతత్త్వం' అనే గ్రంథంలో ఉంది. (ఇటువంటి పరిస్థితులు, కన్యయొక్క తండ్రి, తన భార్యను వదిలివేసినప్పుడు, కన్యయొక్క బాధ్యతను మేనమామలు చూస్తున్నప్పుడు, సంభవిస్తూ ఉంటాయి.)

# రెండవ అధ్యాయం

ఇంతవరకు, స్థూలంగా ప్రాచీన భారతీయ వైవాహికవ్యవస్థను గురించీ, అందులో క్రమంగా, ఈనాటి వరకూ, సంభవిస్తూ వచ్చిన మార్పులను గురించీ చర్చించుకొన్నాం. ఆ వివాహమనే సంస్కారంలో జరిగే విధులు, పద్ధతులు, ఆచారాలు మొదలైన వాటిని గురించి ఈ అధ్యాయంలో చర్చించదలచుకొన్నాం. వివాహ కార్యకలాపం అంతా ఎట్లా జరుగుతుంది? ఆ విధి విధానాలు ఎందుకు ఎట్లా ఏర్పడ్డాయి. ఆ విధులయొక్క క్రమం ఎటువంటిది? వాటి ప్రయోజనం ఏమిటి? సంఘానికి వాటితో ఉన్న సంబంధం ఏమిటి? మంత్రాలు ఎందుకు? ఈ మొదలైన ప్రశ్నలను చర్చించటం ఈ అధ్యాయంలోని ప్రధానాంశాలు.

వివాహమనే సంస్కారంలోని విధులు, కార్యకలాపాల విషయమేకాక వాటి క్రమాన్ని గురించికూడా, భిన్నపద్ధతులు గోచరిస్తున్నాయి. సూత్రకారులు ఒకరు ఒక విధంగానూ, వేరొకరు మరొకవిధంగానూ చెప్పారు. అట్లాగే కొంతమంది ఒక గృహ్యసూత్రకారుని అనుసరిస్తే, కొందరు ఇంకొక సూత్రకారుని అనుసరిస్తున్నారు. ఇందువల్లనే మన హిందువుల్లోనే, ఆపస్తంబ సూత్రులని, ఆశ్వలాయన సూత్రులనీ, పారస్కర సూత్రులనీ, బోధాయన సూత్రులనీ ఇట్లా అనేక గృహ్యసూత్రాలను అనుసరించేవారున్నారు. దేశ వర్ణాలాదులను బట్టి కొన్ని భేదాలు కనిపిస్తున్నాయి. అయితే, ఈ భిన్నత్వంలోనే ఏకత్వం ఉంది. కొన్ని ప్రధాన విధులు, కార్యకలాపాలు మాత్రం అందరిచేత ఆమోదింపబడి, ఆచరింపబడుతున్నాయి.

ఈ తంతు అంతా ఎందుకు? అని ప్రశ్నించేవారు అసంఖ్యాకంగానే ఈనాడు కనిపిస్తున్నారు. వివాహ మనేది ధార్మిక కృత్యం అవటంతో పాటు, సామాజిక ప్రాధాన్యం కూడా కలది. ఆ దంపతుల్ని సమాజంలో సభ్యులుగా, తమలో ఒకరుగా సాటివారు అంగీకరించే సంఘంచేతనే ఈ విధులు, ఏర్పాటు చేయబడ్డాయి. అంగీకరింపబడ్డాయి. ఈ విధులన్నీ జరిగినప్పుడే, సమాజం ఆ దంపతుల సంబంధానికీ, వారికి పుట్టే బిడ్డల అధికార బాధ్యతలకు ఆమోదాన్ని యిస్తుంది. అందుకే ఈ మంత్రాలు, పురోహితులు, బంధువులు, ఈ తతంగం అంతా అవసరం అవుతోంది. ఈనాడున్న పరిస్థితుల్నిబట్టి, ఈ వివాహ సంస్కార కార్యక్రమం రెండువిధాలుగా జరుగుతున్నట్లు చెప్పవచ్చు. (1) అమంత్రకం (2) సమంత్రకం అని.

అమంత్రకం:— శ్రుతి స్మృతుల మీద విశ్వాసం సన్నగిల్లటం వల్లను, పురోహిత వర్గాలమీది కోపంతోను. కొన్ని వివాహాలు అమంత్రకంగా జరుగు తున్నాయి. అంటే, మంత్రాలు, పురోహితులు, ప్రాచీన విశ్వాసాలవల్ల ఏర్పడిన ఆచారాలు వగైరాలు ఏవీ ఉండవు. ఇంకా వీటికి ఒకేవిధమైన పద్ధతి అంటూ ఏదీ ఏర్పడనందున అనేక విధాలుగా జరుగుతున్నాయి. కొందరు రిజిష్ట్రారు ఆఫీసులో రిజిష్ట్రేషను చేయించుకొంటున్నారు. కొందరు దేవాలయాల్లో దేవుని సమక్షంలో దండలు మార్చుకొని, మరికొందరు ఏ కమ్యూనిటీ హాలులోనో, పార్టీ కార్యాలయం లోనో ఇంటిలోనో దండలు వేసుకొని, ఉంగరాలు మార్చుకోవటం ద్వారా ఈ కార్య క్రమాన్ని జరుపుకొంటున్నారు. ప్రాచీన పద్ధతిలో కాక, ఏ ఇతర పద్ధతిలో జరిగిన వివాహమైనా రిజిష్ట్రేషను చేయించుకొననిదే చట్టసమ్మతం కాదు. అమంత్రక వివా హంలో సైతం కొన్ని విధులు పాటింపబడుతూనే ఉన్నాయి — రిజిష్ట్రారు ఆఫీసుకు పోవటం, సంతకాలు, వేలిముద్రలు, సాక్షులు, రిజిష్ట్రేషను ఫీజులు, దండలు, ఉంగ రాలు, స్నేహితులు, బంధువులు, విందులు, వినోదాలు, కట్నాలు, కానుకలు, చదివింపులు అన్నీ ఉంటాయి. ఉండనివల్లా మంత్రాలు, పురోహితులు, స్మృతుల్లో చెప్పిన పద్ధతులు మాత్రమే! ఎవరికి తోచినట్లు వారు నిర్వహించే వీటినిగూర్చి చెప్పేది ఏమీ ఉండదు. హిందూ వివాహాలకు రెండురకాల గుర్తింపులు ఉంటాయి. ధర్మపర మైన గుర్తింపు, సామాజికమైన గుర్తింపు (చట్టపరమైన గుర్తింపు) అమంత్రకమైన వివాహాలకు ధర్మపరమైన (మతపరమైన) గుర్తింపు ఉండదు. సమంత్రకాలకు రెండు రకాలైన గుర్తింపులూ లభిస్తాయి.

సమంత్రకాలు:— మంత్రము అంటే వేదము అని అర్థం. ఋగ్యజుస్సామ ములకు మొత్తంగా మంత్రమనే అర్థం. దేవతల అనుగ్రహాన్ని సంపాదించటానికి జపించే వర్ణసముదాయం అనీ, స్వభాషణం అని అర్థాలు చెప్పవచ్చు. వేదాలలో ఇటు వంటి మంత్రాలు ఉన్నాయి. మన ప్రాచీన ఋషులు - వసిష్ఠుడు, విశ్వామిత్రుడు మొదలైనవారు మంత్రద్రష్టలు. అంటే, మంత్రాలను దర్శించి, మంత్రప్రభావంవల్ల ఆయా దేవతల సాక్షాత్కారాన్ని పొంది, ఆ మంత్రాలను వ్యాప్తిలోనికి తెచ్చినవారు అన్నమాట. మంత్రాలకు, మంత్రజపాలకు అటువంటి శక్తి ఉంటుందని ఆధునికుల్లో కొందరు అంగీకరించరు. ఈ సందర్భంలో మనం కొన్ని విషయాలను గుర్తుకు తెచ్చుకోవటం సమంజసంగానే ఉంటుంది.

శబ్దాలకు, వాటిని ప్రయోగించే పద్ధతులకు ఒకవిధమైన శక్తి ఉంటుంది. కొన్ని శబ్దాలు సంతోషాన్ని కలిగిస్తాయి. కొన్ని శబ్దాలు కార్యసాఫల్యాన్ని వెలుగజేస్తాయి. కొన్ని శబ్దాలు కోపాన్ని కలిగించి, రాజ్యవినాశనానికి దారితీస్తాయి. కొన్ని శబ్దాలు ఉత్సాహాన్ని కలుగజేస్తాయి. నాన్న, తల్లి మగడు అనేవి సమానార్థకాలే అయినా ప్రయోగంలో ఒకటి సంతోషానికి, ఒకటి కోపానికి కారణమౌతోంది. అట్లాగే మన జాతీయగీతం మనకు ఉత్సాహాన్ని కలిగిస్తుంది. అది ఎక్కడ పాడినా మన దేశాన్ని, దేశమాతను గుర్తుకు తెస్తుంది. అట్లాగే వందేమాతరమ్, జై హింద్, అనేది స్ఫూర్తిని, ఉత్సాహాన్ని యిస్తాయి. ఒకమాట చక్కటి ఫలితాన్ని యిచ్చినప్పుడు, ఎదుటివానిని మార్చినప్పుడు ఆమాట మంత్రంలాగా పనిచేసిందని అంటాము. అంటే, మంత్రానికి అటువంటి అద్భుతశక్తి ఉన్నదన్నమాట. ఈ మంత్రాలు ఛందోబద్ధంగా ఉండవచ్చు, వచనరూపంలో ఉండవచ్చు.

మన వేదాలలోనే గాక ఇతర మతాలవారి పవిత్ర గ్రంథాలైన బైబిల్, ఖురాన్ లాంటివి సైతం మహర్షిద్రష్టాలని ఆయా మతాల వారి విశ్వాసం. వారుకూడా తమ తమ వైవాహిక విధులందు, ఇతర సంస్కారాలలోను ఆ పవిత్ర గ్రంథ భాగాలను పఠించటం ఉంది.

మంత్ర శాస్త్ర మనేది ఒక ప్రత్యేక శాస్త్రంగా మనదేశంలోనే, మన మతంలోనే బాగా వృద్ధి చెందింది. మంత్రముల మహిమ, వర్ణానుపూర్వి యొక్క ప్రభావము, శబ్దముయొక్క నిత్యత్వము అనేది మన ఉపాసకుల కందరకు అనుభవంలో ప్రత్యక్షంగా ఉన్నదే! మంత్రము, యంత్రము, ఉపాసకుడు, గురువు, ఇవన్నీ ఏకరూపములని మంత్ర శాస్త్రం చెప్పుతోంది. — భిన్న వాద్య విశేషములపై భిన్న రాగాలు పలికినట్లుగా, విభిన్న శబ్దాలలో విభిన్న దేవతా స్వరూపాలు వ్యక్తం అవుతాయి. విభిన్నమైన శక్తులు ఉద్భవిస్తాయి.

తేలు కాటుకు, పాము కాటుకు, బాలారిష్టాలకు, దుష్టగ్రహశాంతి ఇట్లా అనేక ప్రయోజనాలకు సైతం మంత్రాలను ఉపయోగించటం మన దేశంలో ఉంది. వీటిని నమ్ముతున్నవారు, నమ్మనివారు కూడా ఉన్నారు. అట్లాగే విభిన్న దేవతల నుద్దేశించి మంత్ర జపాలు చేసి, ఉపాసన చేసి అద్భుతమైన ఫలితాలు సాధించినవారున్నారు. అట్లాగే లౌకికంగా చూచినా, మంత్రాలలాంటి రాజకీయ నినాదాలను సృష్టించి, వాటిని జపించి ప్రచారం చేసి అద్భుత విజయాలు సాధించిన నినాదస్రష్టలను మనం చూస్తున్నాం.

రాజకీయపార్టీ నినాదాలున్నాయి. మంత్రద్రష్టల్లాగా ఆ నినాదస్రష్ట లున్నారు. ఆ నినాదం ఉచ్చరించటంతోనే ఆ పార్టీ, ఆ నినాదస్రష్ట గుర్తుకు వస్తారు. ఆ పార్టీ వారికి ఉత్సాహం, స్ఫూర్తి వస్తుంది. ఎంత పనినైనా సాధించగలుగుతారు. గరీబీ హటావో, ఇంక్విలాబ్ జిందాబాద్, విప్లవం వర్ధిల్లాలి, ఆరుకోట్ల ఆంధ్రులు. ఆత్మ గౌరవం, ఆడుపడుచులు లాంటి శబ్దాలన్నీ ఆయా పార్టీలను, ఆ నినాదాలను సృష్టించినవారిని వారు వాటిద్వారా సాధించిన విజయాలను గుర్తు చేస్తాయి. అవన్నీ మంత్రాల్లాగానే పనిచేసినాయి, చేస్తున్నాయి. ఆ నినాదాలతోనే ఇతరులు సైతం (ఆ పార్టీ వారు) కార్యసాఫల్యాన్ని, లబ్ధిని పొందుతున్నారు. ఏ పార్టీ నీ, ఏ మతాన్నీ అంగీకరించనివారు సైతం కొన్ని శబ్దాలను - నినాదాలను - జపిస్తూనే ఉన్నారు. "మూఢ నమ్మకాలు పోవాలి", "హేతువాదం వృద్ధి చెందాలి" అంటూ!

ఈ విధంగా ప్రాచీన మంత్రద్రష్టలు, ప్రణవమంత్రం, తారక మంత్రం, పంచాక్షరి, అష్టాక్షరి మొదలైన అనేక మంత్రాలను జపించి ఆయా దేవతల్ని ప్రసన్నులను చేసి, సిద్ధులు పొందినట్లు తెలుస్తుంది. అటువంటివారు ఈనాడు కూడా ఉన్నట్లు మనం వింటున్నాం, చూస్తున్నాం. అట్లాగే కోర్టులో సాక్షులు చేసే ప్రతిజ్ఞ, మంత్రులు చేసే ప్రమాణం మొదలైనవాటి అన్నింటికి నిర్దిష్టమైన శబ్ద రచన ఉంది. ఆవిధంగా చేసినప్పుడే ఆ ప్రతిజ్ఞ చెల్లుతుంది. దానిలో ఒక విధమైన శక్తి ఉంటుంది. ఎవరి యిష్టం వచ్చినట్లు వారు చెప్పినా, అతిగా వాగినా, తక్కువ చెప్పినా ఆ శక్తి ఉండదు అని మనం భావిస్తున్నాం గదా!

వివాహాలు చాలా భాగం సమంత్రకంగానే జరుగుతున్నాయి. మనలో అంత స్నేహితమై ఉన్న ధార్మిక విశ్వాసమే దీనికి కారణం. విశ్వాసం వల్లనే మంత్రాలకు శక్తి వస్తుంది. ఇటువంటి, వివాహ మంత్రాలు ఋగ్వేదం పదవ మండలంలోని వివాహసూక్తంలో ఉన్నట్లు లోగడ చెప్పుకొన్నాం. ఆ ఋగ్వేదంలోని మంత్రాలే, ఆ సూక్తమే అథర్వవేదంలోని 14-వ. కాండలోని రెండు అనువాకాలుగా ఉన్న రెండు సూక్తాలలో మొత్తం 139 ఋక్కులలో విపులీకరింపబడ్డది. అంటే వివాహ సంస్కార విధులు ఋగ్వేద కాలంలోకంటె, అథర్వణవేద కాలానికి విపులంగా పెంపొందినట్లు తెలుస్తోంది. ఈ రెండు వేదాలలోనూ కూడా సూర్యాసోముల వివాహాన్ని రూపకంగా వర్ణించటం జరిగింది. వేదాలలోని వర్ణనలన్నీ ఆనాటి ప్రజల జీవన విధానాన్ని ఆధారంగా గ్రహించినవే అవటంవల్ల ఈ సూక్తాలవల్ల ఆనాటి ప్రజల వైవాహికాచారాలు తెలుస్తున్నాయి. కొంచెం యించుమించుగా ఆనాటి ఆచార

వ్యవహారాలు, విధులు, ఆనాటి మంత్రాలు ఈనాటికీ అవిచ్ఛిన్నంగా కొనసాగుతూ రావటం (ఐదువేల సంవత్సరాలపాటు) నిజంగా ఎవరికైనా ఆశ్చర్యాన్ని కలిగించే విషయమే!

వివాహాలు వేదకాలంలో ఎక్కువ ఆడంబరాలూ, ఆర్భాటాలూ ఏమీ లేకుండా చాలా సింపుల్గా జరిగినట్లు తెలుస్తుంది. రాను రాను దేశకాలాదుల్నిబట్టి, నాగరకతను బట్టి కొన్ని మార్పులు చేర్పులు సంభవించి ఉంటాయి. వివాహమనేది సంఘానికి, పరివారానికి సంతోషాన్ని కలిగించే విషయం కాబట్టి ఆ సంఘ సభ్యులకు, పరివారం లోని వారందరి వినోదం కోసం, సంతోషం కోసం, మేళతాళాలు, విందులు - వినోదాలు తప్పనిసరి! గృహాలంకరణాదులు సరేసరి! ఇవన్నీ జాతియొక్క సౌందర్య భావనను, సంస్కృతిని తెలియజేస్తాయి. పెండ్లికొమార్తె విషయంలో ఆమె బంధు వర్గానికి కొన్ని బాధ్యతలు ఉంటాయి. వారు ఆయా కార్యకలాపాల్లో పాలు పంచుకోవాల్సి ఉంటుంది. అట్లాగే వరుని పక్షం వారికి కూడా కొన్ని బాధ్యతలు, గౌరవం పొందే హక్కులు ఉంటాయి. కొన్ని విధులు కేవలం వధూవరులకు సంబంధించి నవిగా మాత్రమే ఉంటాయి — పాణిగ్రహణం, గ్రంధిబంధనం, హృదయస్పర్శ లాంటివి. కొన్ని విధులు ఉభయ పక్షాలవారి ఆనందం కోసం అవి ఉంటాయి — తలంబ్రాలు, పూలదండల మార్పు, బంతులాటలు, భోజన సమయంలోని వినోదాలు మొదలైనవి. కొన్ని విధులు వధూవరులకు సంతాన ప్రాప్తిని కాంక్షించేవి. కొన్ని విధులు పితృదేవతలను తృప్తిపరచేవి, కొన్ని గ్రహదోషాదులను నివారించేవి, కొన్ని విధులు కష్టాలను తొలగించటం కోసం చేసేవి. ఇట్లా అనేక రకాలుగా ఉంటాయి. ఇవికాక ఆశీర్వచనాలు, దేవతా పూజలు, యాజ్ఞిక క్రియలు, ప్రార్థనలు, వ్రతాలు, పండిత సత్కారాలు ఇట్లా అనేక విధులు ఉంటాయి. ఇవన్నీ మొత్తం మీద ఆ నూతన దంపతుల దాంపత్యం చక్కగా సుఖసంతోషాలతో సాగాలనే!

అధర్వ వేదంలోని వివాహ మంత్రాలతో నిండియున్న 14-వ. కాండలోని రెండు అనువాకాలలోను సూర్యాచంద్రుల వివాహక్రమం ఒక రూపకంగా, చక్కటి కల్పనగా, వర్ణింపబడి ఉంది. ఇది ఎంత కాల్పనికమైన వర్ణన అయినా, వేదఋషులు- వైదిక కవులు సాధ్యమైనంతవరకు యథార్థ సంఘజీవనాన్నే వర్ణించినవారైనందున, వేదఋక్కులను బట్టి ఆనాటి సాంఘికాచారాదులను గ్రహించినట్లే ఈ వివాహ విధులను సైతం మనం గ్రహించాలి. సూర్యుని పుత్రిక సూర్యా. సోముడు అంటే కొందరు చంద్రుడన్నారు. మరికొందరు స + ఉమ అనే అర్థంలో శివుడు అన్నారు.

దేవతలంతా ఈ వివాహంలో పాల్గొన్నారు. అథర్వ వేదంలోని వివాహ సంస్కార క్రమం ఇట్లా ఉంది (14-1-1 నుండి 64 వరకు)

వధువు అందమైన వస్త్రాలను. ఉత్తరీయాన్ని ధరించి. కండ్లకు కాటుక పెట్టుకొని. అర్ధశిరోవేష్టనం దాల్చి తన సఖులు వెంటరాగా. ఆచ్ఛాదితమై ఉన్న రథంలో కూర్చుండి భర్తయింటికి ప్రయాణమౌతుంది. కట్న కానుకల రూపంలో ఆమెకీయబడిన ఆమె తాలూకు సంపద అంతా ఆమె వెంట వుంటుంది. పుట్టినింటి నుండి బయలుదేరేటప్పుడు ఈ భావాలుకల మంత్రాలు చదువబడతాయి — భర్తలను దయగలిగిన సుహృజ్జనాన్ని ఇచ్చే అర్యముని (సూర్యుడు లేదా పితరులలో ప్రథముడు) నీకోసం ప్రార్థిస్తున్నాను. నేను ఈ వధువుకు ఇపటినుండి — ఈ యింటిని వదలివెళ్ళే స్వాతంత్ర్యాన్ని యిస్తున్నాను. కొమ్మనుండి పండును వేరు చేసినట్లుగా పితృగృహంనుండి నిన్ను వేరుచేస్తున్నాను; అంతే తప్ప పతి గృహం నుండి వేరుచేయటం లేదు సుమా! నేను ఈమెను భర్తయొక్క ఇంటిలో ప్రేమ అనే మధురమైన బంధనంతో బంధిస్తాను. మహాత్ముడైన ఇంద్రుడు ఈమెకు ఐశ్వర్యాన్ని యిచ్చి, పుత్రులమధ్య సంతోషంతో ఉండేటట్లు చేయుగాక! సవితృ దేవుడు (సూర్యుడు. తండ్రి) ఏ వరుణపాశంతో బంధించి ఉంచాడో ఆ వరుణ పాశంనుండి (ప్రేమపాశంనుండి) ఈమెను ముక్తురాలిని చేస్తున్నాను. ఓ సుదతీ! సత్యస్వర్గంలో. సద్గుణ ప్రపంచంలో నీవు భర్తతోపాటు సుఖంగా ఉండు! భగుడు (సూర్యుడు. శివుడు) నీ పాణిగ్రహణంలో నీకు మార్గాన్ని చూపుగాక! గృహానికి సామ్రాజ్ఞివి అవటానికై నీ భర్త యింటికి బయలుదేరు. నీవారితో, పరిజనులతో స్త్రీకి తగినట్లుగా మధురంగా మాట్లాడు.'' అని.

పెండ్లినాడు మంత్రపూతమైన జలంతో వధువును స్నానం చేయిస్తారు. శిరోభూషణం ధరింపజేస్తారు (పాపటబిళ్ళ). వేదమంత్రాలతో క్రొత్తవస్త్రాలను ధరింపజేస్తారు. తల్లి పుత్రికా వియోగంతో కంట నీరుపెడుతుంది. తరువాత వివాహ కర్మకాండ ప్రారంభమౌతుంది —

భూదేవియొక్క అంశానికి (ఒడికి) ప్రాతినిధ్యాన్ని వహిస్తున్నట్లుగా వధువును ఒక రాతిపై నిలబెడతారు (అశ్మారోహణం). వరుడు సముచితమైన మంత్రాలను పఠిస్తూ ఆమెపాణిని పట్టుకొని, ఆమెను పోషిస్తానని వాగ్దానం చేస్తాడు. తరువాత వరుడు వధువుకు వస్త్రాలను. ఆభరణాలను కానుకగా యిస్తాడు. వధువు వాటిని ధరిస్తుంది. వరుడు ఆ విధంగా అలంకృతయైన వధువును చూచి ఆనందిస్తాడు.

పిమ్మట భూతప్రేతాదుల్ని, దుష్టశక్తుల్నీ నిరాకరింపటం కోసం కొన్ని ప్రార్థనలు చేస్తారు. శుభాన్ని కాంక్షిస్తూ వివాహయాత్ర (ఊరేగింపు) ఆరంభమౌతుంది. ఈ యాత్రలో కొన్ని మంత్రాలను చదువుతారు. వాటి భావం ఇట్లా ఉంటుంది — “ఈ వధువును, ఇంతకు పూర్వం సోముడు. తరువాత గంధర్వుడు. పిమ్మట అగ్ని పతిగా ఉన్నారు. అంటే (పాతి రక్షతీతి పతిః) రక్షకులుగా ఉన్నారు. ఆమెను వరుసగా ఆ ముగ్గురూ రక్షించి ఈ వరునికి ఇప్పుడు ఇచ్చారన్నమాట. తరువాత ఊరేగింపు వరుని యింటికి వస్తుంది. (అథర్వవేదం - 14-2-1 నుండి 71 వరకు సారాంశం).

వరుని యింటినుండి భూతప్రేతాదుల్ని తోలివేసి ముందుగానే శుభ్రంచేసి ఉంటారు. అత్తవారింట్లో ప్రవేశించిన తరువాత వధువు తనకు కానుకగా ఇచ్చిన ఉత్తరీయాన్ని ధరించి భర్తతోపాటు గృహ్యాగ్నికెదురుగా కూర్చుంటుంది. అక్కడ వృషభ చర్మంమీద పరచిన దర్భలమీద కూర్చుండి భర్తతోపాటు అగ్నిని పూజిస్తుంది.

తరువాత వధువును ఈ విధంగా ఆశీర్వదిస్తారు — “ఈ తల్లి ఒడిలో అనేక రూపాలు కలిగిన శిశువులు పుట్టుదురుగాక! శుభలక్షణాలతో కూడిన ఈమె, ఈ అగ్నియెదుట కూర్చుండి భర్తతోపాటు దేవతలను ఆరాధించుచుండు గాక! శుభలక్షణయుక్తమై ఇంటిని పెంపొందించి, పోషించే ఈమె తన భర్తకోసం శుభకార్యాలు చేయుగాక అత్తకు, మామకు, భర్తకు, ఇంటిలోనున్న వారందరికి సంతోషాన్ని కలిగించుగాక! ఈమె శుభలక్షణ సంపన్న. మీరంతా రండి, ఈ సుమంగళిని చూడండి. ఐశ్వర్యాన్ని యివ్వండి. ఇక్కడ ఉన్నట్టి, శుభ్రకేశాలు కలిగినట్టి ముత్తైదువలైన వృద్ధస్త్రీలు, యువతులు, వయోవృద్ధులు అంతా ఈమెను గౌరవిస్తున్నారు గదా! అయితే, ఇక మీరంతా మీ మీ ఇండ్లకు వెళ్ళండి” అని. (వివాహానికి సంఘానుమతి లభించిందన్నమాట )

అంతా వెళ్ళిపోయిన పిమ్మట భార్యాభర్తల సమాగమం ఆరంభమౌతుంది. రాత్రికి వధువును పడకగదిలోనికి తీసికొని వెడతారు. వధూవరులు ఒకరి నేత్రాలను ఒకరు అభిషిక్తం చేస్తారు. వధువు వరునికి మనుజాత వస్త్రాన్ని — మంత్రపూతమైన వస్త్రాన్ని — ధరింపజేస్తుంది. ఇరువురు ఏకశయ్యాగతులౌతారు. పిమ్మట వరుడు, స్త్రీని బాల్యంనుండి ఆవహించి ఉన్నట్టి విశ్వావసువు అనే గంధర్వుని తొలగి పొమ్మని మంత్రాలతో అర్థిస్తాడు. తరువాత సత్సంతానాన్ని ఇచ్చే మంత్రాలను

చదివి సంగమిస్తారు. తనకు వీరులైన పుత్రుల్ని యివ్వవలసినదిగాను. పదిమంది పుత్రుల్ని ప్రసాదించవలసినదిగానూ, అగ్నిని ప్రార్థిస్తారు. పిమ్మట రాము ధరించిన వైవాహిక వస్త్రాలను పురోహితునికి యిచ్చివేస్తారు — దుష్టగ్రహబాధలన్నీ వాటితోనే పోతాయని నవదంపతుల్ని పెద్దలు మంత్రాలతో ఆశీర్వదిస్తారు. వరుడు, భార్యకు ఈ దిగువ అర్థాన్నిచ్చే మంత్రాలతో స్వాగతమిస్తాడు — "నేను పురుషుణ్ణి, నీవు స్త్రీవి. నేను ఆకాశాన్ని, నీవు భూమివి, నేను సామాన్ని, నీవు ఋక్కువు. ఈ విధంగా మనం కలిసి ఉందాం. ఇక మనం మన పిల్లలకు తల్లి దండ్రులం కావాలి" అని.

అంతవరకు మనం ఋగ్వేద అథర్వవేద కాలీనమైన వివాహానికి సంబంధించిన ఆచారాల్ని తెలుసుకొన్నాం. దీనినిబట్టి వైవాహిక కర్మకాండల్లో క్రమేపీ మార్పు వచ్చినట్లు గోచరిస్తుంది. ఋగ్వేదంలోని వివాహసూక్తాన్నే అథర్వవేదంలో గ్రహించారు. కాని, ఋగ్వేదంలోని చిన్న సూక్తాన్ని అథర్వవేదంలో 64, 75 మంత్రాలు గల రెండు సూక్తాలుగా విపులీకరించినట్లు తెలుస్తుంది. ఇంతవరకు చెప్పినదాన్నిబట్టి మనం గ్రహించాల్సిన విషయాలు (1) కన్యయొక్క వివాహం కన్య యింటనే జరగటం, (2) తండ్రియే కన్యాదానం చేయటం (3) ఆడపెండ్లి వారి యింటి నుండి పెండ్లికొమార్తెను తీసికొని వరుని యింటికి వెళ్ళటం (4) పదిమంది పుత్రుల్ని యిమ్మన్న ప్రార్థన ఋగ్వేదంలో ఉంది. అథర్వవేదంలో ఆ ప్రార్థనలేదు (5) వధువు యువతి అయివున్నది; పసిపిల్ల కాదు.

సూత్రరచనా కాలంలోని విధులు:

గృహ్య సూత్రాల్లో జాతకర్మ మొదలు గర్భాదాన పర్యంతం జరిగే 18 సంస్కారాలకు సంబంధించిన విధులు చెప్పబడ్డాయి. కర్మలనేవి శ్రుతిలక్షణము కలవి, ఆచార లక్షణము కలవి అని రెండు విధాలుగా ఉన్నాయి. యజ్ఞయాగాదులన్నీ ప్రత్యక్షంగా వేదాలవల్ల తెలుసుకోబడుతున్నాయి. వివాహం మొదలైన కర్మలన్నీ ఆచారంవల్ల తెలియబడుతున్నాయి. ఈ గృహ్యసూత్రాలనే స్మార్తసూత్రాలని కూడా అంటారు.

ఈ గృహ్యసూత్రాల్లో బౌధాయన, ఆపస్తంబ, సత్యాషాఢ, ద్రాహ్యాయణ, అగస్త్య, శాండిల్య, ఆశ్వలాయన, శాంభవ, కాత్యాయన గృహ్యసూత్రాలనే ఈ తొమ్మిదీ మిక్కిలి ప్రాచీనమైనవి. వైఖానస, శౌనకీయ, భారద్వాజ, అగ్నివైశ్య,

జైమినీయ, వాధూల, మాధ్యందిన, కౌండిన్య, కౌషీతకీయములనే తొమ్మిది గృహ్య సూత్రాలూ తరువాతవని అంటారు.

ఈ గృహ్యసూత్రాల్లో ఆశ్వలాయన, కౌషీతకి (శాంఖాయన) శాంభవ గృహ్యసూత్రాలు ఋగ్వేదానికి సంబంధించినవి — ఋక్శాఖీయాలు.

గోభిల, ఖాదిర గృహ్యసూత్రాదులు సామశాఖకు చెందినవి. ఇక కృష్ణయజు శ్శాఖీయమైన గృహ్యసూత్రాల్లో ఆపస్తంబ, బౌధాయన గృహ్యసూత్రాలు తైత్తిరీయ శాఖకు చెందినవి. హిరణ్యకేశి, మానవ గృహ్యసూత్రాలు మైత్రాయణీయ శాఖకు చెందినవి.

శుక్ల యజుర్వేదశాఖకు చెందిన వాటిల్లో పారస్కర గృహ్యసూత్రాలు ప్రసిద్ధ మైనవి. కౌశిక గృహ్యసూత్రం అథర్వశాఖకు చెందినది కాబట్టి, ఆయావేదశాఖల ననుసరించేవారు, ఆ వేదశాఖల ఆధారంగా వచ్చిన గృహ్యసూత్రాలనే ప్రామాణి కంగా గ్రహిస్తూ ఆచరిస్తున్నారు. ఆయా వేదశాఖలతోబాటు, ప్రాంతీయ భేదాలు కూడా ఈ గృహ్యసూత్రాల్లో కానవస్తాయి. మన దక్షిణదేశంలో, ముఖ్యంగా ఆంధ్రదేశంలో అన్ని వర్ణాలలోనూ ఆపస్తంబ గృహ్యసూత్రాలే ప్రామాణికంగా పరిగణింపబడుతున్నాయి; అనుసరింపబడుతున్నాయి. బౌధాయన సూత్రులు కూడా కొందరున్నారు. ఉత్తరదేశంలో పారస్కర, బౌధాయన గృహ్యసూత్రాలను అధి కంగా అనుసరిస్తున్నట్లు తెలుస్తుంది. ఏ సూత్రాలను అనుసరించినా, ప్రధానమైన వైవాహిక విధులన్నింటిలోను పాటింపబడ్డాయి. వరుసక్రమంలో మార్పులు ఉంటే ఉండవచ్చు. వేదకాలంలోలేని కొన్ని క్రొత్త వైవాహిక విధులు వీటిల్లో చోటు చేసుకున్నాయి. ఉదా॥ వేదకాలంలో లేని మధుపర్కం, లాజహోమం, అశ్మా రోహణం, హృదయస్పర్శ, సప్తపది, ధ్రువదర్శనం, అరుంధతీ దర్శనం లాంటివి.

ఇందుకు కారణం ఏమంటే, వైదికకాలం తరువాత పురోహితులు ఆయా ప్రాంతాల్లో, స్థానికంగా ఉండే కొన్ని ఆచారాల్ని వివాహ కర్మకాండలో చేర్చాలని అనుకొని ఉంటారు. ఆ ప్రాంతీయ ఆచారాల్ని, పెద్దలు చెప్పిన వాటినీ, ఆ విధుల్లో చేర్చటం అత్యాంతావశ్యకం అయిఉంటుంది. ఉదాహరణగా చెప్పాలంటే, ఈనాడు మనం వధూవరులచేత ఒకరికొకరికి పూలదండలు వేయిస్తున్నాం. ఇది

వైదిక విధికాకపోయినా, లౌకికాచారమే అయినా అందరూ చేస్తూఉన్న ఆచారం అయినందున కొంతకాలానికి ఇది ఒక విధిగామారిపోవచ్చు. పురోహితుడు ఈ దండలు వేయించకపోతే పెండ్లికి వచ్చినవారు ఊరుకోరు. ఈ విధంగా స్థానికమైన ఆచారాలు, వేడుకలు, ఈ విధుల్లో చోటు చేసుకున్నాయి. అంటే, వైదిక మంత్రాలు, లౌకిక తంత్రాలూ రెండూ కలిసినాయి. స్థానికమైన వేడుకలకు, తంత్రాలకు ఉదాహరణలుగా మనం పెద్దలపేరులు తలుపువద్ద పేర్లుచెప్పటం, ఒక కంచంలో భోజనం చేయటం, మేజువాణీలు, దండాదింపులు లాంటివి. ఇటువంటివన్నీ చేరటంవల్ల వివాహ కర్మకాండ పెరిగిపోయింది. ఆపస్తంబ, ఆశ్వలాయనాది సూత్రకారులంతా కూడా వివాహ సంస్కారంలో గ్రామీణ ఆచార వ్యవహారాలను, ఆయా కులాల ప్రాచీన పరంపరాగతమైన మర్యాదలను, తప్పకుండా పాటించాలని నొక్కిచెప్పారు. ఆయా కులాలకు సంబంధించిన వృద్ధ స్త్రీలను సంప్రదించి చేయమని కూడా చెప్పారు.

"క్రమ ఉక్తః స చ దేశాచార వశేనాను కర్తవ్యః"

(ప్రయోగరత్నం, నారాయణభట్టు కృతం)

"జనపద ధర్మాన్ గ్రామధర్మాశ్చ వివాహే ప్రతీయాన్"

(నిర్ణయసింధు పూర్వభాగం - కమలాకరభట్టు)

"సకల గ్రంథానసాదృత్యాచారాను సరణమేవేచ్ఛా పరితోషార్థం యథా చారమపి ప్రయోగో లిఖ్యతే"

(సంస్కార కౌస్తుభం — అనంతదేవకృతం)

"గ్రామవచనం చ కుర్యుః" (పారస్కర గృహ్యసూత్రాలు 1-8-11)

"జనపద ధర్మాః గ్రామధర్మాశ్చ వివాహే ప్రతీయాత్"

(ఆశ్వ. గృ.సూ. 1-5-1)

"ఆవృతాశ్చా స్త్రీభ్యః ప్రతీయేరన్" (ఆప. గృ.సూ. 2-15)

"గ్రామశబ్దేన స్వకుల వృద్ధాః స్త్రియోఽభిధీయన్తే తాఃహి పూర్వపురుషై రనుష్ఠీయ మానం సదాచారం స్మరన్తి."

(పార.గృ. సూత్రాలకు గదాధర టీక)

ఈ విధంగా గ్రామ ధర్మానికి, వృద్ధ వచనానికి, దేశాచారానికి ప్రాధాన్యత వచ్చిందనే విషయం మనం ముఖ్యంగా గమనించాలి. ఈనాడు సైతం ఈ మూడింటికి ఉన్న ప్రాధాన్యతను మనం అంగీకరించి తీరాల్సిందే! ఆ విధంగా సంస్కరించుకోవాల్సిందే! పురోహితులు సైతం కాలాన్నిబట్టి వచ్చిన మార్పుల్ని గుర్తించి, అనేక లౌకిక క్రియల్ని సైతం అంగీకరించి వేదోక్త విధులతోపాటు వాటికి కూడా స్థానాన్ని కల్పించారు, కల్పిస్తున్నారు. ఇటువంటి ప్రాంతీయము, పరంపరాగతము అయిన క్రియలే వేదోక్త విధులకంటె అధిక ప్రాధాన్యత వహిస్తున్నాయని అన్నా, తప్పులేదు. వీటికి — ఈ లాంఛనాలకు, ఆచారాలకు శ్రుతి స్మృతి ప్రమాణాలంటూ ఏవీ ఉండవు. కాబట్టి తమ కొమార్తె వివాహానికి తమ ఆచారంలోలేని లాంఛనాలు వస్తే రావు, తమ కుమారుని వివాహంలో తప్పనిసరిగా పాటించాల్సిన విధులౌతాయి. ఈ స్థానికాచారాలు, లాంఛనాలు వగైరాల్లో ప్రజల విశ్వాసాలకు ఎక్కువ ప్రాధాన్యత ఉన్నట్లు తెలుస్తుంది. అయితే, ప్రధానమైన వేదోక్త విధులు మాత్రం అవిచ్ఛిన్నంగా, వేదకాలంనుంచి వస్తూనే ఉన్నాయి. మార్పులు చేర్పులు దేశకాలాన్నిబట్టి జరుగుతున్నాయి. పూర్వం, ద్విజుల్లో అయిదు రోజులపాటు జరిగే ఈ వివాహ కార్యకలాపం అంతా క్రమంగా, మూడురోజుల్లోకి దిగి, ఆ పిమ్మట మూడు పూటల్లోకి తగ్గి, ప్రస్తుతం ఒక్క పూటతో పూర్తి అయి పోవాలనే పద్ధతిలో ఉన్నట్లు తెలుస్తోంది. పెండ్లివారి మర్యాదలు వగైరాలు భరించ లేక తిరుపతిలాంటి పుణ్యక్షేత్రాల్లో కొద్ది గంటల్లో ఈ సంస్కారాల్ని ముగించు కొని రావటం కూడా పరిపాటిగా మారింది. దీనివల్ల బంధువుల రాకడి; వారికి చేయాల్సిన మర్యాదలు, ఇంటిలోని చాకిరి, ఇతర ఖర్చులు చాలావరకు తగ్గుతాయి. దైవసన్నిధిలో చేశామనే తృప్తి ఉంటుంది. మర్యాదలు చేయలేదనే నిష్ఠూరాలూ ఉండవు. ఇంతకంటె కాస్త తక్కువస్థాయి కలదైనా, పట్టణాల్లో ఉండే కల్యాణ మండపాల్లో, కమ్యూనిటీ హాళ్ళలో, సత్రాల్లో చేయటం. దీనివల్ల కూడా పైన చెప్పిన సౌకర్యాలు కొంతవరకు ఉంటాయి. ఎత్తుడు సంసారం అనే సాను భూతితో చాలావరకు సద్దుకుపోతారు. ఇదే పోను పోను, కులాచారంగా, దేశా చారంగా, గ్రామాచారంగా మారినా మారవచ్చు. పుణ్యక్షేత్రంలో అమంత్రక మైనా పాపం రాదు అనే భావం బలపడవచ్చు. అంటే సంఘమే తన అను కూలాన్నిబట్టి, ఆచారవ్యవహారాలను మార్చుకుంటుంది అనేందుకు ఇది నిదర్శనం కాదా?

ముఖ్యమైన రెండు మూడు గృహ్యసూత్రాల ననుసరించి చెప్పబడిన వైవాహిక విధుల్ని గమనిస్తే హిందూ వైవాహిక విధుల్లోని ఏకత్వం మనకు గోచరిస్తుంది.

| బౌధాయన గృహ్యసూత్రాలు: | పారస్కర గృహ్యసూత్రాలు: |
| --- | --- |
| వరప్రేక్షణం | అర్ఘ్యం, మధుపర్కం |
| నాందీముఖం, బ్రాహ్మణభోజనం | వస్త్రపరిధానం |
| వివాహహోమం | సమంజనం |
| వరుడు వధువు ఇంటికి వెళ్ళటం | సమీక్షణం |
| సమీక్షణం | అగ్నిప్రదక్షిణ |
| పాణిగ్రహణం | వివాహహోమం |
| సప్తపది | లాజహోమం |
| అర్ఘ్యం, మధుపర్కం | పాణిగ్రహణం |
| అలంకరణం | అశ్మారోహణం |
| అదితి, అనుమతి, సరస్వతి, సవిత ప్రజాపతిహోమాలు | స్త్రీ యశోగానం |
| | అగ్నిప్రదక్షిణ |
| హృదయ స్పర్శ | శేష లాజహోమం |
| కర్ణేజపం | సప్తపది |
| పాణిగ్రహణం | సూర్యదర్శనం |
| అగ్నిప్రదక్షిణ | హృదయస్పర్శ |
| అశ్మారోహణం | వృషచర్మంమీద కూర్చుండుట |
| పునః అగ్నిప్రదక్షిణ | గ్రామవచనం |
| ప్రజాపత్య హోమం | ధ్రువదర్శనం |
| ఉద్వాహం, వీడ్కోలు | త్రిరాత్రవ్రతం |
| గృహప్రవేశం | ఆవసథ్యహోమం |
| వృషభచర్మంమీద కూర్చుండుట | ఉద్వాహనం |
| ధ్రువ, అరుంధతీ దర్శనం | చతుర్థీకర్మ |
| త్రిరాత్ర వ్రతం | స్థాలీపాకప్రేక్షణం |
| చతుర్థీకర్మ | గర్భాధానం |
| ఉపసంవేశనం | |

## ఆపస్తంబ గృహ్యసూత్రాలు:

| | |
|---|---|
| వరపూజ | సప్తపది |
| విఘ్నేశ్వరపూజ, పుణ్యాహవాచనం | అశ్మారోహణం |
| రక్షాబంధనం | (సన్నికల్లుపై నెక్కుట) |
| యజ్ఞోపవీతధారణం | లాజహోమం |
| కన్యావరణం | ప్రవేశహోమం |
| మధుపర్కం | వృషభచర్మంమీద కూర్చుండుట |
| మహాసంకల్పం | అరుంధతి దర్శనం |
| కన్యాదానం | ఆగ్నేయస్థాలీపాకం |
| చూర్ణిక | గంధర్వ స్థాపనం |
| సమీక్షణం | త్రిరాత్ర వ్రతం |
| ముహూర్తం | నాందీ సమారాధనం |
| వధూవరుల సంకల్పం | సదస్యం |
| కన్యతలపై కాడినుంచి సువర్ణ జలంతో అభిమంత్రించటం | శేషహోమం |
| | సమంజనం, సమీక్షణం |
| మంగళసూత్రధారణ | సమావేశనం |
| తలంబ్రాలు | కంకణమోచనం |
| బ్రహ్మగ్రంధి | నాకబలి |
| ప్రధానహోమం | అప్పగింతలు |

ఈ పట్టికలవల్ల మనకు దిగువ విషయాలు తెలుస్తున్నాయి.

1. గృహ్యసూత్ర రచనా కాలానికి అమలులోనున్న విధులను సూత్రకారులంతా గ్రహించి క్రమబద్ధం చేశారు.

2. ఏవైనా భేదాలనేవి కనిపిస్తే, అవి ఆయా వేదశాఖలను అనుసరించేవారు ఏర్పరచుకొన్నవే!

3. ఈ విధంగా ప్రతి వేదశాఖకు తనవైన కొన్ని గృహ్యసూత్రాలు ఉన్నాయి.

4. అన్నింటిలోను వేదాలలోని ఋక్కులు గ్రహింపబడ్డాయి; ఆయా వైవాహికాచారాలనూ గ్రహించారు.

5. క్రమేణా వైవాహిక విధులు, కర్మకాండ పెరిగి అనేక మార్పులు, చేర్పులు జరిగాయి. ఉ॥ మధుపర్కం, లాజహోమం, అశ్మారోహణం, హృదయ స్పర్శ, అరుంధతీ దర్శనం లాంటివి.

6. సూత్రరచనా కాలానికి తరువాతి కాలంలో ఇంకా ఎక్కువ విధులు వచ్చి చేరాయి. పూర్వవిధుల్లో మార్పులూ జరిగాయి. వృద్ధ వచనానికి, గ్రామ వచనానికి, దేశాచారాలకు స్థానం కల్పింపబడ్డది.

7. ప్రస్తుత కాలంలో ఇంకా అనేకమైన ఆచారాలు, విధులు, వివాహ కర్మ కాండలో చోటు చేసుకొంటున్నాయి. కొన్ని ప్రాచీన విధులు లుప్తమై పోతున్నాయి.

8. ప్రముఖమైన విధులు అన్ని ప్రాంతాల్లోను, అన్ని గృహ్యసూత్రాల్లోను, అన్ని ప్రయోగ పద్ధతుల్లోను కనిపిస్తున్నందున మన భారతీయ ధార్మిక సామాజిక భావాలు వేదకాలం నుండి అవిచ్ఛిన్నంగా సాగివస్తున్నాయనే విషయం స్పష్టంగా గోచరిస్తుంది.

9. ఆర్యసమాజం వారు అనుసరించే, శ్రీమద్దయానంద సరస్వతి ప్రణీతమైన "సంస్కార విధి" అనే గ్రంథంలోని వివాహ పద్ధతిలో ఋగ్వేద మంత్రాలతోపాటు, పారస్కరగృహ్య సూత్రాలను కూడా గ్రహించారు. ఈవిధంగా ప్రధానాంశాలు అన్ని పద్ధతుల్లోనూ కనిపిస్తున్నాయి.

ఇప్పుడు మన దక్షిణదేశంలో, ముఖ్యంగా ఆంధ్రదేశంలో ఆచరింపబడు తున్న గృహ్యసూత్ర ప్రయోగపద్ధతి ఆపస్తంబ పద్ధతి. ఈ పద్ధతి ప్రకారం జరిగే వివాహ విధులు ఏవిధంగా ఉంటాయో స్థూలంగా తెలుసుకుందాం.

ప్రధానం:

నిశ్చయతాంబూలం — వాగ్దానం — అని కూడా వ్యవహరిస్తారు. కొంత మంది లగ్నపత్రికలు యిచ్చిపుచ్చుకోవటం, తాంబూలాలు పుచ్చుకోవటం అని కూడా అంటారు. వధూవరులు ఒకరి కొకరు నచ్చటం, కట్నకానుకలు నచ్చటం అయిన పిమ్మట, వధూవరుల తల్లిదండ్రులు ఒక మంచిరోజున వివాహ నిశ్చయానికి సాక్ష్యంగా పెద్దలు, పురోహితుల సమక్షంలో ముహూర్త నిర్ణయంచేసి, లగ్న పత్రికలను తాంబూలాలను పరస్పరం యిచ్చి పుచ్చుకొంటారు. ఆహూతులకు, పెద్దలకు

తాంబూలాలు ఇస్తారు. వరునికి కట్నంగా నిశ్చయం చేసుకొన్న సొమ్ములో కొంత భాగం అడ్వాన్సుగా ఇవ్వటం. వధువుకు ఇవ్వదలచిన నగలకొరకు అడ్వాన్సుగా కొంత సొమ్ము ఇవ్వటం జరుగుతుంది. కొన్ని కులాల్లో వరుని ఇంటి సభ్యులందరికి వస్త్రాలు ఇవ్వటం ఆచారంగా ఉంది. ఇది వధూవరుల ఇండ్లలో ఎక్కడైనా జరుగవచ్చు. ఈ నిశ్చయ తాంబూలాలు పుచ్చుకొన్న పిమ్మట ఇరుపక్షాలవారూ మాట తప్పకుండా నిలిచి ఉండాలి. కొంచెం ఇంచుమించుగా వివాహం జరిగినట్లే పరిగణిస్తారు — వివాహవిధులు మాత్రమే మిగిలి ఉంటాయి. ముహూర్తంనాటికి, వరుని పక్షంవారు వధువున్న గ్రామానికి లేదా వివాహం జరిగే చోటుకు తరలి వస్తారు. ఈ ప్రథానమనేది మన దక్షిణదేశంలో జరిగినంత కట్టుదిట్టంగా ఉత్తర దేశంలో ఉన్నట్లుగా కనిపించదు.

వరపూజ:

కన్యాదాత రెండు బిందెలతో పానకం, పూజాద్రవ్యాలు తీసుకొని విడిదికి వస్తాడు. దీనినే పానకం కావడి అంటారు. అక్కడ వరుని, ఆతని తల్లిదండ్రులను పూజించి వారికి పానకం ఇస్తారు. ఆ బిందెలను వారికే ఇచ్చివేస్తారు. పెండ్లి తగాదాలు, మనోమాలిన్యాదులు ఇక్కడనుండే ప్రారంభం (పూజా బిందెలు ఇత్తడి వని, చిన్నవని, స్త్రీలవి కావని పేచీలు) కొందరు కలవారు వెండి బిందెలు ఇచ్చేటట్లు ముందే ఒప్పందం కుదుర్చుకుంటారు.

మంగళస్నానాలు:

వధూవరులు మంగళస్నానాలు చేస్తారు. కన్యాదాత కూడా అభ్యంగన స్నానం చేస్తాడు. ఇక్కడనుండే వివాహవిధులు యథార్థంగా ఆరంభమౌతాయి. వధువుచేత గౌరీపూజ చేయిస్తారు. వరునిచేత సరస్వతీపూజ చేయిస్తారు.

కన్యావరణాలు:

వరుడు ''మమార్థం కన్యాం వృణీధ్వం'' అని, తనకోసం కన్యను వరించ వలసినదిగా తెలివిగల మంచి హృదయం కలవారిని, మిత్రులను ఉభయపక్షాలవారి మేలుకోరే పెద్దలను, బ్రాహ్మణులను కన్యవద్దకు పంపుతాడు. వీరికి మార్గవ్యయానికై దక్షిణగా కొంత ధనం ఇస్తాడు. దారిలో తామర కొలనులు మీకు సుఖాన్ని కలిగించుగాక! అని ప్రార్థించి వారిని పంపుతాడు. ఈ విధంగా ఇచ్చే సదక్షిణాకమైన తాంబూలాలనే కన్యావరణాలు అంటారు. వారు వధువుయొక్క తండ్రియొద్దకుపోయి,

వరునియొక్క గోత్ర ప్రవరాదుల్ని వర్ణించి చెపుతారు. పిమ్మట "ధర్మప్రజా సంపత్త్యర్థం వృణీమహే" ఇట్టి కులగోత్రాదులు కలిగిన వరునికోసం, ధర్మకార్య నిర్వహణ కోసం, సంతానం కోసం మీ కన్యను వరిస్తున్నాను (వృణీధ్వం తస్మై దాస్యామి) అని మూడుసార్లు వాగ్దానం చేస్తాడు. దీనినే కొన్ని ప్రాంతాలవారు 'వాగ్దానం' అని అంటారు. ఇక్కడ ఉభయుల గోత్రప్రవరాదుల్ని మూడుసార్లు చెపుతారు. సభాసదు లందరికి వధూవరుల పూర్తివివరాలు తెలుస్తాయన్న మాట.

మధుపర్కము:

అతిథికి అర్ఘ్యపాద్యాదులు, మధుపర్కం (పెరుగు, నెయ్యి, తేనె ఈ మూడింటిని కలిపి) యిస్తారు. వరునిచేత మధుపర్క ప్రాశన చేయించి, నూతన వస్త్రాలు యిస్తారు. క్రమంగా ఈ నూతన వస్త్రాలనే మధుపర్కాలు అనటం ఆచారమైంది.

యజ్ఞోపవీతధారణం:

తరువాత "ధర్మప్రజా సంపత్త్యర్థం స్త్రియ ముద్వహే" ధర్మకార్యాలకోసం, సంతానంకోసం, సంపదకోసం ఈ స్త్రీని వివాహమాడుతున్నాను అని వరుడు పలికి, వివాహాంగాలలో ఒకటైన రెండవ యజ్ఞోపవీతాన్ని వేసుకోవటానికి సంకల్పం చేస్తాడు. మామూలుగా ఈ రెండవ యజ్ఞోపవీతాన్ని, దీనితోపాటు వెండితో తయారు చేసిన యజ్ఞోపవీతాన్ని కూడా, కన్యాదాత, ఆతని భార్య వరునికే వేస్తారు. గార్హస్థ్యంలో చేసే ప్రతి కార్యమూ ఒక యజ్ఞమే! ఈ యజ్ఞాలను దీక్షగా ఆచరించటానికై ఈ ఉపవీతాన్ని — జంధ్యాన్ని ధరిస్తారు.

మహాసంకల్పం:

కన్యాదానానికి ముందుగా కన్యాదాత ఆచమనంచేసి యీ మహాసంకల్పాన్ని చెప్పాలి. కన్యాదాత బదులు పురోహితుడే చెపుతున్నాడు. ఈ మహాసంకల్పం విన సొంపుగా ఉంటుంది. ఈ సృష్టిలోని లోకాలోకాలను గూర్చి, అవతారపురుషులను గూర్చిన ప్రశంస, కాలచక్రంలో గడచిపోయిన యుగాలను గూర్చిన వివరాలు ఎన్నో ఉంటాయి. చివరలో ఫలానా వారం, ఫలానా తిథినాడు తన పదితరాల పితృదేవతలకు శాశ్వత బ్రహ్మలోక సిద్ధికోసం, లక్ష్మీనారాయణ స్వరూపుడైన వరునికి ఈ కన్యను దానంచేస్తున్నానని సంకల్పంచేస్తాడు. పిమ్మట వధువుకు నూతన వస్త్రాలు ఇస్తారు.

కన్యాదానం:

తరువాత. వరుని పూజించి, కాళ్ళు కడిగి ఈ సువర్ణ ఆభరణభూషితయైన కన్యను దానం చేస్తున్నాను అని యిరువురి గోత్రప్రవరలు చదివి 'నీకు ధర్మార్థ సిద్ధికోసం. సంతానంకోసం కన్యను యిస్తున్నాను' అని కన్యచేతిలో దక్షిణతో కూడిన, చందన తాంబూలాలు ఉంచి ఉదకంపోసి, వరుని దోసిట్లో పోయిస్తాడు. పిమ్మట యథాశక్తి దక్షిణ యిస్తాడు. (ఈ దక్షిణయే కట్నం రూపందాల్చి సమాజానికి భరించలేనట్టి పాపంగా తయారైంది) పిమ్మట కన్యాదాత. వరునితో — ''ధర్మార్థ కామేషు త్వయైషా నాతిచరితవ్యా'' ధర్మార్థకామాలయందు, పుణ్యకార్యాల్లో ఆదాయ వ్యయాల్లో ఈ కన్యయొక్క మాటను నీవు అతిక్రమించవద్దు (ఈమె మాటను ఉపేక్షించ వద్దు) అని అంటాడు. వరుడు దీనికి సమాధానంగా ''నాతి చరామి'' అతిక్రమించను, అని మూడుసార్లు ప్రతిజ్ఞ చేస్తాడు. పిమ్మట చూర్ణిక. మంగళాష్టకాలు చదువుతారు.

సుముహూర్తం:

సుముహూర్తంలో వధూవరుల తలమీద నున్న దర్భల ముడిమీద జీలకఱ్ఱ. బెల్లము. ఉసిరిక పప్పు కలిపిన ముద్దను ఉంచుతారు. ఈ సుముహూర్త సమయంలో అడ్డుగానున్న తెరను తొలగిస్తారు. వరుడు కన్యను చూస్తాడు. ''ఓ వరుణుడా! ఈమెకు సోదరులను చంపనట్టి (ఎల్లకాలము సభ్రాతృకంగా ఉండుటకు లక్ష్మిని ఇమ్ము! ఓ ఇంద్రుడా! నీవు ఈమెకు పుత్రులను చంపనట్టి (ఎల్లకాలము సపుత్రకంగా ఉండేటట్లు) లక్ష్మిని ఇమ్ము! ఓ సవితా! ఈమెకు సమస్త లక్ష్ములను ఇమ్ము!'' అని వరుడు జపిస్తాడు. పిమ్మట వధూవరులు ఆయువు, వర్చస్సు, యశస్సు, బలము అభివృద్ధి కావాలనే తలంపుతో. కర్మలు చేద్దామని. మంచి సంతానాన్ని పొందాలని చేస్తారు.

స్వర్ణ జలాభి మంత్రణం:

బండికాడియందలి రంధ్రంలో బంగారమునుండి కన్యతలపై నుంచిన దర్భలతో చేసిన చుట్టనుంచి, ఆ కాడిరంధ్రంగుండా నీరుపోసి ఆ నీటితో వధువును అభిషేకిస్తారు. ఈ జలం పవిత్రమైనవి, పాపాన్ని పోగొట్టేవి. దంపతులకు సుఖకరమైనవి. కల్యాణకారకములని అర్థంవచ్చే మంత్రాలు చదువుతారు.

ఈ సందర్భంలో చెప్పుకొనే ఒక కథ — అపాల అనే స్త్రీకి కుష్ఠురోగం ఉంది. ఆమె ఇంద్రుని పూజిస్తూ ఉండేది. ఒకరోజున ఆమె స్నానానికి వెళ్ళి,

నదిలోపడి కొట్టుకొనిపోతూ, సోమలత ఆ ప్రవాహంలో కొట్టుకొని రావటం చూచి. ఆ లతను కొరికి ఆ సోమరసాన్ని ఇంద్రునికి అర్పించింది. అది త్రాగిన ఇంద్రుడు తన రథము నాడియొక్క రంధ్రములనుండి నీటిని వెడలించి వాటితో ఆమెను అభిమంత్రించి సూర్యతేజస్సు కలదానినిగా చేశాడు. అట్లాగే. ఇంద్రుడు ఈ వధువును వర్చస్సు కలదానినిగా చేయమని వరుడు ప్రార్థిస్తాడు.

యోక్త్రబంధనం:

వరుడు దర్భలలో పేనిన త్రాటిని వధువు మొలకు కడతాడు.

మంగళ సూత్రము:

ఐదుగురు ముత్తైదువలు దీపాలు వెలిగించి తెచ్చిన తలంబ్రాల బియ్యంమీద మంగళసూత్రాలను ఉంచి పూజించటం. ఆ సూత్రాలను ముత్తైదువల కంఠాలకు అనించి యిప్పుడు వరుడు వధువు మెడలో ఆ సూత్రాలను కడతాడు — "ఓ సౌభాగ్యవతీ! నా జీవనానికి చిహ్నమైన ఈ మంగళసూత్రాన్ని నీ కంఠాన కట్టుచున్నాను- నీవు నూరేండ్లు జీవించు" అనే అర్థం వచ్చే శ్లోకం చదువుతూ మాంగల్యాన్ని కడతాడు. కుంకుమతో ఆ ముడిని పూజిస్తాడు. మాంగల్య ధారణం అనేది వేదాలలోగాని. గృహ్యసూత్రాలలోగాని చెప్పలేదు. అట్లాగే తలంబ్రాలు, పాణిగ్రహణాంగమైన రక్షాబంధనం అనేవి ఆపస్తంబాది సూత్రకారులు చెప్పకపోయినా దేశాచారాన్ని అనుసరించి ఈ విధులు జరుగుతున్నాయి. అంతేకాదు, వివాహంలో మాంగల్య ధారణం, తలంబ్రాలు అనేవి ప్రధాన విధులుగా భావింపబడుతున్నాయి.

తలంబ్రాలు రక్షాబంధనం:

తరువాత వధూవరులు. సంతాన వృద్ధిని. పాడిపంటల సమృద్ధిని, యజ్ఞసమృద్ధిని, ధనసమృద్ధిని కోరి ఒకరిపై నొకరు తలంబ్రాలు పోసుకోవటం ఆచారంగా వస్తున్నది. తరువాత పాణిగ్రహణాంగమైన రక్షాబంధన కార్యక్రమం నిర్వర్తిస్తారు.

ప్రధాన హోమం:

ఇక్కడినుండి వధూవరులు హోమాదికాలను నిర్వర్తించటం ఆరంభమౌతుంది. వరుడు వధువును గృహ్యాగ్నికి ఎదురుగా తీసికొని వస్తాడు. ఈ దిగువ అర్థం వచ్చే ఋగ్వేదమంత్రాలలో వధూహృదయాన్ని అభిమంత్రిస్తాడు — "చిన్నతనంలో నిన్ను ముందుగా సోముడు పత్నిరూపంలో పొందాడు. పిమ్మట గంధ

ర్వుడు, అగ్ని. నిన్ను పత్నీ రూపంలో పొందారు. మనుష్యుడనైన నేను నాల్గవ వాడను. సోముడు నిన్ను గంధర్వునికి, గంధర్వుడు అగ్నికి, అగ్ని ఐశ్వర్యం కోసం, పుత్రులకోసం నిన్ను నాకు యిచ్చాడు'' అని.

సాయణుడు, ఈ మంత్రాలను ఈ విధంగా వ్యాఖ్యానించాడు—''కామభోగేచ్ఛ యింకా అంకురించని సమయంలో సోముడు, ఆ కామేచ్ఛ ఆరంభమయ్యే సమయంలో గంధర్వుడు ఆమెను గ్రహించి, వివాహసమయంలో అగ్నికి ఈయగా, అగ్ని ఈ మనుష్యునికి (వరునికి) యిస్తున్నాడు'' అని. అంటే, కామభోగేచ్ఛ వికసించిన పిమ్మట, సమస్త శక్తులు పూర్తి వికాసాన్ని పొందిన పిమ్మట ఐశ్వర్యం కోసం, సంతానం కోసం, అగ్ని మానవునికి యిస్తున్నాడు.

స్మృతులు దీనినే యింకా బాగా స్పష్టం చేశాయి. స్త్రీని ముందుగా సోమ సూర్యాగ్నులు అనుభవించి, పిమ్మట మనుష్యునికి యిస్తున్నారు. అంటే సోముడు కన్యకు పవిత్రతను, గంధర్వుడు వాక్కును, అగ్ని సర్వమేధ్యాన్ని యిస్తున్నారు. కాబట్టి స్త్రీలయొక్క పవిత్రతకు ఏమీ లోటు రాదు. ఆ పవిత్రత ఎల్లప్పుడూ ఉంటుంది.

సోముడు సస్యాధిపతి, మనస్సుకు కూడా అధిపతి. కాబట్టి చంద్రుడే ముందుగా కన్యను ఆవహించి, శారీరక మానసిక సౌందర్యాన్ని యిస్తాడు. గంధర్వుడు సౌందర్యానికి ప్రతీక. కాబట్టి కన్యకు శరీర సౌందర్యాన్ని, లావణ్యాన్ని యిస్తాడు. వాక్కులో మాధుర్యాన్ని యిస్తాడు. అగ్నితత్త్వం ఆనందాన్ని, కామాన్ని ప్రకోపింపజేసి రజస్సు ఉత్పన్నం అవటానికి కారణం అవుతుంది. అప్పుడు స్త్రీ పూర్తిగా ప్రజనన సామర్థ్యాన్ని పొందుతుంది. ఆ సమయంలో అగ్ని మానవునికి అర్పిస్తున్నాడు. వేరు వేరు దేవతలు వేరు వేరు గుణాలకు, శారీరక క్రియా సామర్థ్యాలకు కారకులని మన హిందువుల నమ్మకం.

పాణిగ్రహణం:

వరుడు, వధువుయొక్క తిరగవేసి ఉన్న కుడి అరచేతిని, తన బోర్లించిన కుడి అరచేతితో ఈ దిగువ అర్థంవచ్చే మంత్రాలను చదువుతూ పట్టుకొంటాడు — ''నేను సౌభాగ్యం కోసం నీ పాణిని గ్రహిస్తున్నాను. భర్తనైన నాతోపాటు దీర్ఘాయువును పొందు. భగుడు, విష్ణువు, అర్యముడు, పురంధి అనే దేవతలు నిన్ను నాకు గార్హపత్యంకోసం యిచ్చారు. కాబట్టి, నీవు నా యింటి యందు శాసనం

చెయ్యి!'' అని. ఇట్లా పాణిగ్రహణం చేసేటప్పుడు, స్త్రీసంతానాన్ని కోరితే బొటనవ్రేలు మినహా మిగతా వ్రేళ్ళను పట్టుకోవాలి. పురుషసంతానం కోరితే, బొటనవ్రేలిమీది రోమాలు పైకి ఉండునట్లుగా వధువు చేతిని పట్టుకోవాలి.

సప్తపది:

పిమ్మట వరుడు తనతోపాటు వధువును అగ్నిహోత్రానికి ఉత్తర దిక్కున కుడికాలుతో తూర్పుకుగాని, ఉత్తరానికిగాని, ఈ దిగువ అర్థంవచ్చే మంత్రాలు చదువుతూ నడిపించాలి. ''ఐశ్వర్యం కోసం (అన్నంకోసం) మొదటి అడుగు ఊర్జం (బలము, శక్తి)కోసం రెండవ అడుగు, వ్రతంకోసం మూడవ అడుగు ఆయువుకోసం నాల్గవ అడుగు, పశువులకోసం అయిదవ అడుగు, ఋతువులకోసం ఆరవ అడుగు, ఓ సఖీ! నాతోడి సఖ్యతకోసం ఏడవ అడుగు అగుగాక! ఈ విధంగా నాకు అనువ్రతవుకమ్ము!'' అని.

వివాహ విధుల్లో ఈ సప్తపది అత్యంత ప్రధానమైన విధి. ఈ సప్తపది అనే విధి జరిగితేనే తప్ప వివాహం అయినట్లు పరిగణింపబడదు. ఈ సప్తపది అయినప్పుడే స్త్రీకి తన పుట్టిన ఇంటి పేరు, గోత్రము వగైరాలు పోయి, భర్త యింటిపేరు, గోత్రము వగైరాలు వస్తాయి —

''స్వగోత్రాద్భ్రశ్యతేనారీ వివాహాత్ సప్తమే పదే.'' (యా.స్మృ. 1-78)

''పాణిగ్రహణ మంత్రాస్తు నియతం దారలక్షణమ్
తేషాం నిష్ఠాతు విజ్ఞేయా వివాహాత్ సప్తమే పదే.'' (మనుస్మృతి-9-70)

అందుచేతనే హిందూ వివాహ చట్టరీత్యా కూడా సప్తపది అయితేనే తప్ప వివాహం జరిగినట్లుకాదు — సప్తపది అయితేనే వివాహం చట్టరీత్యా చెల్లుతుంది. ఈ విషయమే యాజ్ఞవల్క్య స్మృతి (1-84) లో —

''నోదకేన న వాచా వాకన్యాయాః పతిరుచ్యతే
గ్రహణ సంస్కారాత్ పతిత్వం సప్తమేపదే.'' అని చెప్పబడ్డది.

వరుడు — ''సఖీ! ఏడడుగులు నడచిన మనం సఖుల మయ్యెదము గాక! నీ స్నేహంతో నేను పెంపొందుతాను. నీ స్నేహమును వదలను. మనము కలసి ఉండి, కర్తవ్యాలను నిశ్చయించుకొందము గాక! పరస్పరం ప్రేమకలిగి ఉందుము గాక!'' అని అంటాడు. ఇంతటితో ఇరువురూ సఖులౌతారు.

**అశ్మారోహణము — సన్నికల్లు నెక్కుట:**

అగ్నిహోత్రానికి ఉత్తర దిక్కున రాతిని (సన్నికల్లును) ఉంచుతారు. భర్త ఆదేశాన్ని పొంది వధువు తన కాలిని ఆ సన్నికల్లుపై ఉంచుతుంది. వరుడు ఈ అర్థాన్ని యిచ్చే మంత్రాలు చదువుతాడు — "నీవు ఈ రాతిపై నెక్కు. రాయివలె దృఢంగా ఉండు, స్థిరంగా ఉండు. శత్రువులను నీ పాదాలతో త్రొక్కి అణచి వెయ్యి" అని. ఇది శత్రుదమన శక్తికి, అటువంటి వార్ఢ్యానికి ప్రతీక.

లాజహోమం:

తరువాత వధువుచేత భర్తకు దీర్ఘాయువును కోరుతూ, సంతానాన్ని కోరుతూ. పేలాలను హోమం చేయిస్తారు. పిమ్మట వధూవరులు అగ్నిప్రదక్షిణ చేస్తారు. తరువాత వధువు మొలకుకట్టిన యోక్త్రాన్ని విప్పుతారు.

ప్రవేశహోమం — అరుంధతీ దర్శనం:

వరుడు, వధూగృహము నుండి తన యింటికి (విడిదికి) వధువును తీసికొని వస్తూ దిగువ అర్థాన్ని యిచ్చే ఋక్కులలో అభిమంత్రిస్తాడు — "శ్రేష్ఠమైన రథాన్ని ఎక్కి, నిన్ను ఎదుర్కొనే వారిని పారద్రోలుము. భర్తనైన నాచేత శిరసావహింప జేసే దానివికమ్ము. సంతానంతో పదవద్దైన విరాట్ఛందస్సువలె పదిమంది పుత్రులతో విరాజిల్లు. అత్తమామలకు, ఇంటికి రాణివికమ్ము. మఱదులకు, కోడండ్రకు సంతానానికి, ధనానికి, భర్తనైన నాకు, నా తోబుట్టువులకు యజమానురాలవుకమ్ము" అని. పిమ్మట వధూవరులు వృషభ చర్మంమీద ఉత్తర వరుడుగా కూర్చుంటారు (ఇప్పుడు చర్మాన్ని వాడటంలేదు) తరువాత వధువుచేత గృహమున ముందుగా కుడి కాలు పెట్టిస్తారు. ఆ పిమ్మట ఆజ్యాహుతులిస్తారు. మగపిల్లలను మాత్రమే కని, అందరు క్షేమంగా ఉన్న యిల్లాలి కుమారుని ఒకనిని వధూవరులమధ్య. వధువు ఒడిలో కూర్చుండబెడతారు. (పుత్రసంతానాన్ని ఆకాంక్షిస్తూ) పిమ్మట గంధర్వ ప్రతిష్ఠ చేస్తారు. ఆ తరువాత ధ్రువుని. అరుంధతీ నక్షత్రాన్ని చూపిస్తారు. నక్షత్ర దర్శనం అయ్యేంతవరకు మౌనంగా ఉండాలి.

ఆగ్నేయ స్థాలీపాకము:

పెండ్లికొమార్తె చేత ధాన్యం దంపించటం, బియ్యం వగైరాలు చేయించి, వరుడే అన్నాన్ని ఒక చిన్నగిన్నెలో వైదికాగ్ని మీదనే వండి హోమం చేస్తాడు.

అతడు పెండ్లి చేసుకొని గృహస్థుడైనాడు కాబట్టి అతిథి అభ్యాగతులను పోషించటానికై పశుపుచేత వంటచేయిస్తాడన్నమాట. ఈ హోమం చేయించే సమయంలో పశుపు ఖర్తను అనుకొనే ఉంటుంది. ఈ సమయంలోనే వృషభదానం చేస్తారు (ఇది ఇప్పుడాచారంలో లేదు)

త్రిరాత్రవ్రతం:

ఒక దండానికి సూత్రం కట్టి ప్రాణప్రతిష్ఠ చేస్తారు. అగ్నితోబాటు, విశ్వావసువనే గంధర్వుని పూజిస్తూ దంపతులాదండాన్ని తమ మధ్యనుంచుకొని ''మమ్ము అన్యోన్య ప్రేమ కలవారినిగా చేయ''మని ప్రార్థిస్తారు. ఈ విధంగా మూడు అహోరాత్రాలు గంధర్వుడు ఆ దండాన్ని ఆవహించి ఉంటాడని విశ్వాసం. ఈ మూడు అహోరాత్రాలూ దంపతులు బ్రహ్మచర్యాన్ని పూని, నేలమీద పరుండటం, ఉప్పు కారంలేని భోజనం చేయటం జరుగుతుంది. మూడవరోజున నాందీసమారాధనం చేస్తారు.

సదస్యం:

మహాగణాధిపతి పూజ, ఇంద్రాది అష్టదిక్పాలక పూజ, మహాసరస్వతి పూజ, చేస్తారు. ఉభయపక్షముల పురోహితులకు పరస్పరం దక్షిణతో కూడిన తాంబూలాలు ఇస్తారు. సభాపతిని దక్షిణతాంబూలాదులతో పూజిస్తారు. సభలోనున్న విద్వాంసు లందరిని దక్షిణ తాంబూలాలతో అర్చించి వారి ఆశీర్వచనాన్ని పొందుతారు.

కంకణ విమోచనం:

వధూవరుల చేతికి ఉన్న కంకణాలను విప్పుతారు.

శేష హోమం:

నాల్గవరోజున రెండు జాములు దాటిన తరువాత గంధర్వ పూజచేసి, దండానికి కట్టిన త్రాటిని విప్పి, తడిపి వదలివేస్తారు. తరువాత శేషహోమం చేస్తారు. పిమ్మట వధూవరులు ఒకరినొకరు చూడటం —— సమీక్షణం. ఆ పిమ్మట, పరస్పరం వధూవరులు శేషించి ఉన్న నేతితో హృదయాలను తాకటం (హృదయస్పర్శ) తరువాత సమావేశన కర్మ.

నాకబలి:

దీనిని ముత్తైదువల నడిగి చేయాలని సూత్రకారులు అన్నారు. విడిదికి వెళ్ళి అరవేసి తెచ్చిన మధుపర్కాలను ధరించి, అలకసాగిస్తారు. పిమ్మట, తోడిఅల్లునికి,

వరుడు మరదలుమాడ యిస్తాడు. నలుగురు ముత్తైదువలు 33 దీపాలు గల పళ్ళెంతో ముందు నడుస్తూండగా, అందరికి ముందు వసంతంతో పురోహితుడు దారి చూపుతూండగా, అలంకరించి ఉంచిన ప్రోలు వద్దకు వస్తారు. మూడు ప్రదక్షిణలు చేస్తారు. తరువాత దంపతులు చేతులు కడిగి కండ్లు తుడుచుకొని విఘ్నేశ్వర పూజ, శీలలోహితపూజ, గౌరీపూజ చేసి పులగం నైవేద్యంగా పెట్టి వధువుకు ఎదురుగా నిలిచి వరుడు ఆమె మెడలో నల్లపూసలు కడతాడు. ఈ సమయంలోనే వధువుకు వరునితరపు వారిచ్చే నగలను ఇస్తారు.

తరువాత వెండి, బంగారు ఆభరణాలు వెంటిని ఒక నీళ్ళబిందెలో వేసి ఒక్కొమారుగా వధూవరులను తీయమంటారు. ఆ ఆభరణాలను అంటిన నీటితో పురోహితుడు వారిని అభిమంత్రిస్తాడు. అప్పగింతలు అయిన పిమ్మట విడిదిలో గృహ ప్రవేశం, ఆశీర్వచనం, ఇట్లా వివాహవిధులు పూర్తిగావించుకొని, వధువును తీసికొని వరుడు తనయింటికి ప్రయాణమౌతాడు.

(ఈ వివాహ విధులు గృహ్య సూత్ర భేదాలనుబట్టి, ప్రాంతీయ ఆచారాదులను బట్టి, వారి వారి కులసంప్రదాయాలనుబట్టి ముందువెనుకలుగా జరగవచ్చు. కొన్ని ఆచారాలు లోపించవచ్చు. కొన్ని అధికంగా ఉండవచ్చు; అని గ్రహించాలి)

# మూడవ అధ్యాయం

## గార్హస్థ్యం — వైవాహిక జీవనం

ఆశ్రమ చతుష్టయంలో గార్హస్థ్యం ఉత్తమమైనదని మన శాస్త్రాలు చెపుతున్నాయి. మిగతా మూడు ఆశ్రమాలకు (బ్రహ్మచర్య, వానప్రస్థ, సన్యాసాశ్రమాలకు) గార్హస్థ్యమనేది ఆధారం కాబట్టి! గృహస్థుడు ఈ మూడు ఆశ్రమాలవారిని పోషిస్తూ వారివారి ధర్మాలను అనుష్ఠించటంలో సాయపడాలన్నమాట. సమాజం ధర్మమార్గంలో నడవటానికి సైతం గార్హస్థ్యమే ప్రధాన సాధనం.

పూర్వంకాలంలో వివాహానికి ఆదర్శం, ధర్మాచరణం, సంతానప్రాప్తి, సమాజ శ్రేయస్సుగా ఉండేది. అంటే, దేవతా పితృపూజలు, అతిథి అభ్యాగత సేవలు, దాన ధర్మాలు, ధర్మం తప్పకుండా అర్థసంపాదనం. తద్వారా కామప్రాప్తి, వంశం అవిచ్ఛిన్నంగా సాగటానికై సంతానాన్ని పొందటం, ఆ సంతానాన్ని ఉత్తమపౌరులుగా తీర్చిదిద్దటం. అధ్యాపన కృషివాణిజ్య దేశరక్షణాదుల్లో పాల్గొని ఈవిధంగా సమాజానికి తనవంతు సేవచేయటం గృహస్థుయొక్క ఆదర్శంగా ఉండేది. ఇందుకోసమే సహధర్మచారిణి అవసరం అయ్యేది. ఇరువురూ కలసి ఏక మనస్కతతో, ఏక శరీరులుగా ధర్మాన్ని నిర్వహించేవారు.

### వివాహం - సంతోషకారకం:

వెనకటి రోజుల్లో వివాహం అయిదు రోజులు జరిగేది. వివాహ సంస్కారమనేది వధూవరులకేకాక వారి బంధువర్గానికి, స్నేహితులకు కూడా ఆనందాన్ని కలిగించే సంఘటన. బంధుమిత్రులంతా ఒకచోటు చేరి, తమ బాంధవ్యాన్ని నెమరు వేసుకొనే శుభసమయం. వావివరుసలతో ఒకరినొకరు పలకరించుకొంటూ, వేళాకోళాలతో, సరదాలతో, వినోదాలతో గడిపే సమయం. భోజనాలవద్ద, ఇతర సమయాలలోనూ కూడా. పరియాచకాలతో, వ్యంగ్యోక్తులతో ఆనందించే సమయం. క్రొత్త బాంధవ్యాన్ని ఆహ్వానించి తమలో కలుపుకొనే సమయం. క్రొత్త దంపతుల్ని పెద్దవారితో సమానంగా సమాజంలోకి ఆహ్వానించే సమయం. ఈ విధమైన ఆనందమయ వాతావరణాన్ని కల్పించి ఆనందించటంలో మనకంటె మన పూర్వులే రసికులని అనాలి. వారి హృదయాలకు ఈనాటిలాగా ఎక్కువ మాలిన్యం అంటలేదు.

ఈనాటి వారిలో కంటె స్వార్థభావం చాలా తక్కువ. వివాహానికి పదిరోజులు ముందే దగ్గర బంధువులు రావటం, ఇరుగుపొరుగు వారంతా వచ్చి వివాహసన్నాహాలు చేయటంలో, కన్యాదాత యింటివారికి తోడ్పడటం నిజంగా సౌహార్దానికి చిహ్నం. అదొక అలౌకికానుభవం. ఇటువంటి సంతోష సమయంలో. మన అజ్ఞానంవల్ల, దూరదృష్టి లేమివల్ల, సహనం సానుభూతి లోపించటం వల్ల, కొన్ని అపశ్రుతులు వినిపించటం వాటివల్ల మనో మాలిన్యాలు పెరిగి, క్రొత్త దంపతుల మనస్సులను గాయపరచి, జీవితాంతం తాము బాధపడుతూ, ఇతరులను బాధపెడుతూ ఉంటారు. వీటిని గురించి తెలుసుకోవటమే కాకుండా ఎవరికివారు ఆత్మవిమర్శన చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉంది.

## మర్యాదలు:

వివాహ సంస్కారం కన్య యింటనే జరగటం ఆచారంలో ఉంది. వివాహానికి పదిరోజులు ముందునుండే ఇరుగుపొరుగు వారు, సన్నిహిత బంధువులు వచ్చి ఏర్పాట్లు చేసేవారు. వరుని తరపు పెండ్లివారు - స్నేహితులు బంధువులుకూడా పెద్ద సంఖ్యలో రావటం కూడా సహజమే! ఈనాడు మూడు పూటల్లో, లేదా ఒకరోజులో, ఒక పూటలో జరిగే విధులే పూర్వకాలంలో, అయిదురోజులలో విభజింపబడి నిర్వహింపబడేవి. అందువల్ల కన్యాదాతకు తీరికగా హడావిడి లేకుండా భోజన భాజనాదులు ఏర్పాటుచేసే అవకాశం లభించేది. ఉభయుల బంధువులు అయిదురోజులపాటు కలసి మెలసి ఉండటంవల్ల సాన్నిహిత్యం బాగా పెరిగి బంధుత్వం గట్టిపడి, ఒకరినొకరు బాగా అర్థం చేసుకోవటానికి వీలయ్యేది. వధూవరులకు బెరుకుదనం తగ్గేది. ఆనాటి భోజన భాజనాదులు, మర్యాదలు ఎట్లా ఉండేవో తెలుసుకుంటే, ఆనాటి పెద్దలు సంస్కారవిధులకు, బంధుత్వానికి మాత్రమే ప్రాధాన్యత యిచ్చేవారని మనకు తెలుస్తుంది. ఈ సందర్భంలోనే, ఇట్లా అయిదురోజులు వివాహం అనేది అందరికీ ఉండేది కాదని, కొన్ని వర్ణాలకు మాత్రమే ఉండేదని కొందరు అనుకోవచ్చు! కాని, అన్ని వర్ణాలవారికి అన్నివిధులు ఉండేవని, అయిదురోజులు చేయటం అందరికి ఉన్న విధియే అని గమనించాలి. కొంతమంది ఈ విధిని కొన్ని వందల సంవత్సరాలకు ముందుగానే వదలిపెట్టారు. మరికొన్ని వర్ణాలవారు తరువాత వదలిపెట్టారు. ఇదే తేడా.

నేటిలాగా, కాఫీలు ఫలహారాలు పాచినోటితోనే సేవించే అలవాటు ఆనాడు లేదు. అసలు పెండ్లివారికి కాఫీలు ఇవ్వటమనేది లేదు. వంటవాళ్ళు లేరు. బంధు

వులు ఇరుగుపొరుగువారూ కలిసి వంటలు, వడ్డనలు చేసేవారు. ఉభయ పక్షాలలోని చిన్నపిల్లలకు ఒకే సమయంలో చల్ది అన్నాలు పెట్టేవారు. వారు చల్ది తిని ఆడుకోవటానికి పోగా పెద్దలు మిగతా విధులకు హాజరయ్యేవారు - ఈనాటి కాన్వెంటు బాబులు చల్ది అన్నం తింటారా? ఆనాడు భోజనానికై చేసే పదార్థాలకు ప్రాధాన్యతలేదు. వారు భోజనంకోసం బ్రతకలేదు. బ్రతకటం కోసం భోజనం చేశారు. పెండ్లిలో పైతం వారికి విధులే ప్రధానం! భోజనాలు, ఫలహారాలు ప్రధానంకావు. పెండ్లికోసం వచ్చామని, తిండికోసం రాలేదని తెలిసినవారు ఆనాటి పెండ్లివారు. అలకలు, మూతి ముడుపులు, మర్యాదలకోసం భీష్మించటాలు ఆనాడు లేవు. ఉన్నా, లాంఛనం కోసమే! ఈనాటిలాగా అర్ధమే పరమార్థం కాదు. ఆ అలకల్లో హుందాతనం ఉంది. నేటి అలకల్లో వెకిలితనం తొంగిచూస్తుంది. వధువు క్రొత్త బంధువర్గంతో ఐదురోజులపాటు కలిసి మెలసి తిరగటంవల్ల బంధువులందరి పరిచయమూ, ఆప్యాయతా ఆమెకు లభించేవి. (ఆనాటి వధువు షుమారు 12, 16 సంవత్సరాల వయస్సు కలదై ఉండినందున ఇంకా ఆమెకు స్వతంత్రాభిప్రాయాలు బలంగా నాటుకొని ఉండేవి కావు. 30, 35 సంవత్సరాల వధువును అత్తగారు దగ్గరకు తీసి లాలించటం అసంభవం గదా! నేటి వధువుకు బలంగా పాదుకొన్న రాజీలేని తన స్వతంత్రాభిప్రాయాలుంటాయి. వాటిని ఏమాత్రమూ ఆమె మార్చుకోలేదు) ఈనాటి నాగరకత లేనందువల్ల ప్రతి పనిలోనూ తీరిక, నిదానం, కనిపించేవి. బంధుస్త్రీలు, అత్తగారు, వధువును దగ్గరకు తీసి లాలించేవారు - వాత్సల్యంతో! ఈనాటి వధువు విషయంలో ఇది అసంభవం! వెనుకటి కాలంలోని వధువుకు తనవంటూ స్వతంత్ర భావాలు ఉండేవి కావు. ఉన్నా, అవన్నీ స్త్రీజనోచితమైనవి - వ్రతాలు, నోములు వగైరాలకు సంబంధించినవి!

ఈ కాలంలో జరిగే వివాహాలు ఒక్కరోజులో, కొన్ని గంటల్లో జరిగిపోవటంవల్ల ఎవరెవరు పెండ్లికి వచ్చారో కూడా తెలియనంతటి వేగం పుంజుకొన్నాయి. పైగా, అయిదు రోజులు జరగాల్సిన విధులన్నీ ఒక్క పూటలో జరగాలి కాబట్టి, అంతా హడావిడి. ఉభయపక్షాల బంధువులకు ఎవరెవరో తెలియదు; వధూవరులకూ తెలియదు. కన్యాదాత వందల సంఖ్యలో వచ్చే పెండ్లివారికి, తమ వారికీ కూడా విడిది వసతి ఏర్పాట్లు, భోజనాలు, కాఫీ, ఫలహారాలు, మర్యాదలు చేయాలి కాబట్టి, వంటవాళ్ళకోసం, పనివాళ్ళకోసం, పురోహితులకోసం, కల్యాణ మండపాలకోసం, జ్యోతిష్కులకోసం, డబ్బుకోసం, తిరిగి తిరిగి ఎముకలు విరగ

గొట్టుకోవాల్సి వస్తోంది. వివాహ విషయాలన్నీ అల్పకాలంలో జరగాలి కాబట్టి ఆ ఏర్పాట్లూ చూడాలి. ఇంత జరిగినా, పెండ్లికుమారుని స్నేహితులకు సిగరెట్లు, చేతి వస్త్రాలు సప్లయి చేయలేదనేలాంటి అల్పమైన నిందలు, పేచీలు, పట్టింపులు తప్పవు. తన పెండ్లికి తాను పిలుచుకొని వచ్చిన వరునికి, వేలకో లక్షల్లో కట్నం పోసిన వరునికి స్నేహితుల చదివింపులు గుంజిన వరునికి తన స్నేహితులు పీల్చే సిగరెట్లు వగైరాలు ఏర్పాటుచేసే బాధ్యత లేదా? అది కన్యాదాత చేయాల్సిన పనా? అట్లాగే వరుని తరఫు బంధువులెవరో కన్యాదాతకు ఆ అల్పకాలంలో తెలియదు. కాబట్టి తీరికగా ఉండే వరుని తండ్రే కన్యాదాతను అడిగి వారికి కావాల్సిన ఏర్పాట్లు చేసుకోవటం సముచితంకాదా? బంధువులు సైతం తాము పెండ్లి జరిపించటానికి, సంతోషంలో పాలుపంచుకోవటానికి వచ్చామే తప్ప, మర్యాదలకోసం, తిండికోసం రాలేదనే భావం కలిగి ఉండాలి గదా! కార్యభారంతో సతమతమయ్యే వారియెడల సానుభూతి చూపలేకపోతే, ఇక మానవత్వానికి అర్థమేముంది?

లాంఛనాలు:

వివాహ సందర్భంలో వరునికి, వరుని తల్లికి, ఆడుబిడ్డలకు కొన్ని ప్రత్యేక మర్యాదలు, లాంఛనాలు జరపాల్సిన ఆచారం ఉంది. ఈ లాంఛనాలనేవి కేవలం నటన. కేవలం ఒక పనికి గుర్తుగా, ప్రతీకగా చేసేవి. అవే పరమార్థంకాదు. ఉదా॥ అత్తగారికి, ఆడుబిడ్డలకు అయిదు రోజులూ వరుసగా ఉదయమే పండ్లుతోమటం అనే లాంఛనం పూర్వం జరిగేది. ఒక బొట్టు పెట్టెలో ఒక వెండిపుల్ల, వెండి తాటియాకు, కుంకుమబరిణ, కాటుక మొదలైనవి పెట్టి మేళతాళాలతో వధువు తల్లి విడిదికి వచ్చి, వియ్యపురాలికి, ఆమె కొమార్తెలకు పండ్లు తోమటం, బొట్టు కాటుక పెట్టటం ఆచారం. ఇది మర్యాదను సూచించే ఒక ప్రతీక. ఆ బొట్టుపెట్టె వగైరాలు వరుని వారికి యిచ్చివేస్తారు. ఇటువంటివి చాలా ఉన్నాయి. చతుర్థ తగవు — నాల్గోరోజు సాయంకాలం మేళతాళాలతో అభ్యంగన సామగ్రి విడిదిలోని వారికి తెచ్చి యివ్వటం. పాకెన తగవు — సదస్యం రోజున మధ్యాహ్నం తరువాత మంగళ వాద్యాలతో ఆహార వస్తువులు విడిదికి తీసికొని వెళ్ళి యివ్వటం. ఇటువంటివన్నీ సరదాకోసం ఏర్పరచుకొన్న ఆచారాలే! అట్లాగే అల్లుని అలక, వియ్యపురాలి అలక వగైరాలు. ఇటువంటివన్నీ తగాదాలకు పట్టింపులకు కారణాలై వధూవరుల పాలిట అభిశాపం కాకూడదు. అట్లాగే వివాహానికి వచ్చిన బంధువులు, వావి వరుసలతో సాగించే సరససల్లాపాలు హద్దుమీరి సరసం విరసంగా పరిణమించరాదు.

వధూవరులకు వీరంతా మనవాళ్ళే, పరాయివాళ్ళు కారు అనేభావం కలగాలి. ముందుగా, వివాహంలో ఏర్పడ్డ భావాలే వారి మనసుల్లో చెరగని ముద్రలై భద్రంగా ఉంటాయి.

పూర్వకాలంలో అంతా తమ గ్రామంలోనే, స్వగృహంలో తమ కొమార్తె వివాహం జరిపించేవారు. గ్రామంలోని వారు, కులభేదం లేకుండా యిరుగు పొరుగు వారు సహాయ సహకారాల్ని అందించేవారు. ఈనాడు గ్రామాలలో రాజకీయ పార్టీ తగాదాలు అధికమై, గ్రామ వాతావరణం కలుషితమై ఒకరినొకరు పలకరించు కోవటమే కష్టమైంది. పంచాయతీ నుండి పార్లమెంటుదాకా జరిగే ఎన్నికల తగాదాలు గ్రామాల్లో బాగా పాదుకొన్నాయి. కాబట్టి, డబ్బు ఉన్నవారంతా ఏ పట్టణానికో పోయి, ఏ కమ్యూనిటీ హాలులోనో, కల్యాణమండపంలోనో వివాహ కార్యక్రమం అయినదనిపిస్తున్నారు. భోజనాలు సైతం ఏ హోటలు వారికో ఆర్డరిచ్చి, శీఘ్రంగా పని ముగించుకొని, డబ్బు సంచి దులిపివేసి పోతున్నారు. అంతటి స్తోమతులేని మరికొందరు ఏ తిరుపతిలాంటి క్షేత్రానికో వెళ్ళి అక్కడ చేస్తున్నారు. గ్రామాలలో ఆధునిక సౌకర్యాలు తక్కువగా ఉంటాయి కాబట్టి ఈ కాలపు నాగరకులకు నచ్చదు. వివాహానికి మాట్లాడుకొనే షరతుల్లో, బస్తీలో వివాహం చేయుటమనేది ఒక షరతు అయినది.

వధువుకు — అంటే, స్త్రీలకు, ఎదురయ్యే సమస్యలు:

వివాహం అయినంతనే వధువు ఎదుర్కోవాల్సిన సమస్యల్లో ప్రధానమైనది, పుట్టిన నాటినుండి ఆనాటి వరకు తాను ఉంటూ వచ్చిన ఇంటిని, కుటుంబాన్ని తల్లి దండ్రులను, సోదరులను ఆప్తులను వదలి వేరొక యింటికి వెళ్ళవలసి రావటం.

ఇంతవరకు తల్లిదండ్రులు తననుబట్టి, తన అభిప్రాయాలకు అనుగుణంగా సద్దుకుపోయారు. ఇకనుండి, తాను ఇతరుల మనోభీష్టాలననుసరించి సద్దుకుపోవాలి. ఒక్కసారిగా తానిందుకు సిద్ధపడాలి. ఈ విధమైన మానసికమైన మార్పు వెంటనే జరగదు. ఆ క్రొత్త యింటిలో తనకు ప్రేమ ఆప్యాయత అనుబంధం లభించాలి. ఇందుకు కొంతకాలం పడుతుంది. అంతవరకు ఆ యింటివారు వేచిఉండగలగాలి. లేకపోతే విషమ సమస్యలు ఎదురౌతాయి.

ఆ క్రొత్త యింటిలో ఆమెకు ప్రేమ, ఆప్యాయత లభించనప్పుడు ఆమె జీవితం నరక సదృశం అవుతుంది. ఆమె భర్త సైతం, అటు తల్లిదండ్రులకు, ఇటు భార్యకు సమాధానం చెప్పలేని స్థితిని ఎదుర్కోవాల్సి వస్తుంది. ఈ విధంగా

మొత్తం ఇంటిలోని వారంతా ఏదోవిధంగా బాధపడాల్సి వస్తుంది. ఈర్ష్యా సూయలలో, ప్రేమాభిమానాలో ఏదో ఒకటి స్థిరరూపం ధరిస్తాయి.

ఒక స్త్రీ భర్తగా ఆ పురుషుని అభిమానాన్ని, ప్రేమను పొందగోరాలని ప్రయత్నిస్తూ ఉంటే, వేరొక స్త్రీ తన సంతానంమీది ప్రేమను, అధికారాన్ని వదులుకోలేక, పెనగులాడుతూ ఉంటుంది. ఇది స్త్రీకి పెద్ద సమస్య. మిక్కిలి సహనంతో, దూరపుచూపుతో సమాధానం పొందాల్సిన సున్నితమైన, మానసిక మైన సమస్య ఇది.

ప్రాచీన కాలంలోని వధువులకంటె ఈనాటి వధువులు వయస్సులోను చదువుసంధ్యల్లోను పెద్దవారు. ఆధునిక నాగరికతలో ఆపాదమస్తకం మునిగినవారు. ఆధునిక భోగాలన్నింటిని చవిచూడాలనే తీవ్రమైన కోరికలు కలవారు. సినిమాలు టి.వి.లు మొదలైన ప్రచార సాధనాలకు విజ్ఞాన సాధనాలకు అలవాటు పడ్డవారు. వీటిద్వారా మంచినో చెడునో సొంతం చేసుకొన్నవారు. భోగభాగ్యాలే జీవితపరమా వధిగా తలచేవారే ఎక్కువమంది కనిపిస్తున్నారు- కృత్రిమ నాగరకతకు దాసులై, కోరికలను, భోగవాంఛను పెంచుకొన్న వరులు. అత్తలు! ఇక చెప్పవలసినదేమున్నది? వ్యసనాలకు బానిసలైన భర్తలు, భోగవాంఛకు, అత్యాశకు దాసీలైన అత్తలు, పెట్టే బాధలకు, వేధింపులకు గురియై నరకబాధలు అనుభవించలేక ఆత్మహత్యలకు పాల్ప డటం, లేదా వారిచేత హత్యగావింపబడటమో జరుగుతోంది. తమ కూతుళ్ళకు లభిం చాలనే సుఖజీవనం తమ కోడలికి యివ్వలేక పోవటం మానవలక్షణమేనా?

ఈనాటి వధువులు అందరూ కాకపోయినా, కొందరైనా, పుట్టినింటిలో గారా బంగా పెరిగి, స్కూళ్ళలో కాలేజీలలో చదువుకొని, పాశ్చాత్య నాగరికతా వ్యామోహి తలై, స్వతంత్రమైన కొన్ని భావాలను పెంచుకొని, ఇతరుల భావాలను సహించలేని స్థితికి దిగజారి, విలాసాలు, భోగాలే పరమార్థంగా భావించి, సహనాన్ని కోల్పోయి, పెద్ద చిన్నల తారతమ్యాలను పూర్తిగా విస్మరిస్తున్నారు. ఇట్టివారు అత్తవారింట కలుపుగోలు తనంతో ఉండలేరు. ఇట్టి మౌఢ్యంవల్ల ఇతరులకు సైతం సుఖంలేకుండా చేస్తున్నారు.

ఈ అనర్థా లన్నింటికీ కారణం తమ ధర్మాన్ని విస్మరించటమే! లోగడ యజ్ఞంలో భర్తకు తోడ్పడటమే అర్థాంగి (పత్ని) యొక్క విధి అని, ధర్మం అని చెప్పాం. ఈనాడు ఏ యజ్ఞంలో ఆమె తోడ్పడాలి? భర్తచేసే ఉద్యోగం యజ్ఞం.

భర్త సంసారం కోసం పడే శ్రమ యజ్ఞం. సంతానానికి చదువు సంధ్యలు చెప్పించి ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దటం యజ్ఞం. తల్లిదండ్రులను, అత్తమామలను సుఖ పెట్టటం యజ్ఞం. ఈ యజ్ఞాలన్నింటిలోను భార్య సహకరించాలి. అది ఆమె ధర్మం. ఈ ధర్మాన్ని ఆమె గుర్తించాలి. వివాహమంటే కేవలం లౌకిక సుఖభోగాలకోసమే అనే అభిప్రాయాన్ని విడనాడాలి.

తల్లి తన సంతానంపై (కొడుకుపై) ఏదో పెద్ద అధికారం ఉన్నదని అనుకో వటం ఆత్మవంచన అవుతుంది. స్త్రీల హత్యలకు స్త్రీలే కారణమవటం సిగ్గుపడాల్సిన విషయం.

కాలము, కాలంతోపాటు జీవన విధానాలు, నాగరకత వేగంగా మార్పుచెందు తున్నప్పుడు, మనం మారకపోతే మన పద్ధతుల్ని మార్చుకోకపోతే మనమే నష్ట పోతాము.

స్త్రీ ఎంత పురోగమిస్తున్నా, పురుషుల పాశవికతకు, స్త్రీల ఈర్ష్యాసూయలకు, అత్యాశలకు బలికావటం తప్పటంలేదు. పూర్వం సహగమనం ఆచారంగా ఉన్న నాటి కంటె, స్త్రీల బలవన్మరణాల సంఖ్య ఈనాడు అధికంగా ఉంది. ఇది స్త్రీలతోపాటు మంచి సంస్కారంగల పురుషులంతా తలవంచుకోవాల్సిన విషయం.

హిందూ సమాజంలో దాంపత్య జీవనమనేది సుఖానికి ఆలవాలమైనది. భార్య భర్తలలో ఉండే అభిన్నమైన ప్రేమ, ఏకమనస్కతే ఇందుకు కారణం. భారతీయ వైవాహిక జీవనంలో యూరపులోలాగా కలహబీజాలకు తావులేదు. స్వార్థానికి అవ కాశంలేదు. దంపతుల సంబంధం అభిన్నమైంది. భార్యలేనట్టి భర్త జీవితంగాని, భర్తలేనట్టి భార్య జీవితంగాని, రెండూ అపూర్ణమైనవే! స్త్రీని (భార్యను) పొంది, సంతానం పొందేవరకు పురుషుని జీవనం పరిపూర్ణం కాదు —

"అర్ధో హ వైష ఆత్మనస్తస్మాద్యావజ్జాయాం న విన్దతే అర్ధో హి తావత్ భవతి. అథ యదైవ జాయాం విన్దతేఽథ ప్రజాయతే తర్హి సర్వో భవతి." అని శతపథ బ్రాహ్మణం 5-1-6-10 లో చెప్పబడ్డది.

మనువు సైతం భార్యభర్తలు వేరువేరు కాదు. ఇద్దరూ కలసి ఒకటే! అన్నాడు — "ఏతావానేవ పురుషో. యజ్జాయాత్మా ప్రజేతి హ. విప్రాః ప్రాహు స్తథా చైతద్యో భర్తా సా స్మృతాంగనా. (మనుస్మృతి. 9-45)

భార్యా భర్తల్లో ప్రేమభావమనేది ఉంటే, ఆ ఇల్లు స్వర్గంతో సమానం. అది లేకపోతే నరకం కంటె దుఃఖదాయకం అవుతుంది. భార్య గనుక అనుకూలవతి కాక పోతే ఇక నరకం కోసం వెదకాల్సిన పనిలేదు అని పద్మపురాణం చెప్తోంది —

"అనుకూల్యం హి దంపత్యో స్త్రివర్గోదయహేతవే
అనుకూలం కలత్రం చేత్ త్రిదివేన హి కిం తతః
ప్రతికూలం కలత్రం చేత్ నరకేన హి కింతతః
గృహాశ్రమః సుఖార్థాయ పత్నీమూలం హి తత్సుఖమ్

(ప.పు. 223-36, 37)

భార్య విషయంలో భర్త కూడా అంతేకదా! అంటే, భర్త అనుకూలుడైనప్పుడే భార్య జీవనం స్వర్గతుల్యమన్న మాట. దీనినిబట్టి ఒకరి సుఖానికి ఒకరు కారణమౌ తున్నారన్న మాట.

అట్లాగే, మహాభారతంలో —

"పుత్ర పౌత్ర వధూ భృత్యై రాకీర్ణమపి సర్వతః
భార్యా హీన గృహస్థస్య శూన్యమేవ గృహం భవేత్"

(మ.భా. 12-144-4)

"కొడుకులు, మనుమలు, కోడండ్రు, సేవకులు, ఎందరున్నా భార్య లేనివాని యిల్లు శూన్యంగానే ఉంటుంది" అని.

దుఃఖంలో ఉన్న భర్తకు భార్యయే అన్నిటిని మించిన ఔషధం అని మహా భారతమే చెప్తోంది —

"న భార్యాసమం కించిత్ విద్యతే భిషజాం మతమ్
ఔషధం సర్వదుఃఖేషు సత్యమేతత్ బ్రవీమి తే.

(మహాభారతం. 3-58-29)

రఘువంశంలో కాళిదాసు ఇంకా చక్కగా చెప్పారు —

"గృహిణీ, సచివః, సఖీ, మిథః, ప్రియశిష్యా లలితే కలా విధౌ" (ర.వం 8-67) స్త్రీ భర్తకు మంత్రి, మిత్రురాలు, జత, లలితకళల్లో ప్రియశిష్యురాలు, అవి.

శతపథ బ్రాహ్మణంలో ఇంతకంటె ఆసక్తికరమైన ధార్మిక విషయం చెప్ప బడ్డది —

''స రోక్ష్యన్జాయా మామంత్రయతే. జాయే ఏహి స్వోరోహావేతి. రోహా వేత్యాహ జాయా. తస్మాజ్జాయా మామన్త్రయతే. అర్ధో హ వైష ఆత్మనో యజ్జాయా (శ.బ్రా. 4-2-1-10)

''పురుషుడు భార్యలేకుండా స్వర్గంలో ప్రవేశించటానికి వీలులేదు. కాబట్టి యజ్ఞవిధుల్లోను, స్వర్గానికి వెళ్ళేటప్పుడు, భార్యకోసం వేచి ఉండాలి'' అని.

''సఖా హ జాయా'' భార్యయే భర్తకు నిజమైన మిత్రుడు అని ఇతరేయ బ్రాహ్మణం (7-3-13) చెపుతోంది.

''పుత్ర ఆత్మా మనుష్యస్య, భార్యా దేవకృతః సఖా'' పురుషునికి పుత్రుడు ఆత్మ అంటే, భార్య సఖురాలు అని మహాభారతం (1-374-73) లో ఉంది. ఇదే విషయాన్ని మహాభారతం (4-22-17) లో మళ్ళీ చెప్పారు. ''పుత్రః ప్రియాణా మధికో భార్యాన సుహృదాం వరా'' అని.

''నా కల్పాం నారీ మఖిరమేత్'' భార్యలేనిదే, భర్త, సుఖాన్ని ఊహించనైనా ఊహించలేడని గౌతమధర్మ సూత్రాల్లో (1-8-29) చెప్పబడ్డది.

భార్యయొక్క విలువను మన ప్రాచీనులు గుర్తించారని, మనం కూడా స్త్రీ యొక్క విలువను గుర్తించాలని చెప్పటానికే ఇవన్నీ ఉటంకించాల్సి వచ్చింది. అట్లాగే స్త్రీకి పురుషుడు కూడా అంతటి ప్రాముఖ్యాన్నే వహిస్తాడని గ్రహించాలి.

భార్యకు ధార్మిక కర్తవ్యాలు ఉన్నాయి. పత్ని శబ్దం ఇందుకు సాక్ష్యం. 'జాయా' అనే శబ్దానికి పుత్రుల్ని కనేది అనే అర్థం ఉంది. కాని మన ధర్మశాస్త్రాలు పత్ని శబ్దాన్నే అధికంగా వాడాయి - సంతాన సందర్భంలో తప్ప. 'పత్ని' అనే శబ్దానికి 'యజ్ఞంలో పాలుపంచుకొనేది' అని పాణిని అర్థం చెప్పాడు. కాబట్టి స్త్రీకి రెండురకాలుగా ప్రాధాన్యత ఉంది. సంతానాన్ని కని, పెంచి, సత్ప్రవర్తులుగా తీర్చి దిద్దే సాంఘిక బాధ్యత ఒకటి. భర్తతోపాటు యజ్ఞంలో పాలుపంచుకోవటం అనే ధార్మిక బాధ్యత రెండవది.

''స పత్నీ పత్యాసుకృతేన గచ్ఛతామ్. యజ్ఞస్యయుక్తౌ ధుర్యావ భూతామ్ సంజానానా విజహతామరాతీః - దివిజ్యోతిరజరమార బేతామ్.'' తై.బ్రా. 3-7-5. భర్తయొక్క కార్యాల్లో భార్య ఏకచిత్తయై ఉండాలి. యజ్ఞకర్మల్లో భర్తతోపాటు చక్కగా కలసి ఉండాలి. ఈ విధంగా ఉన్నందువల్ల వారు స్వర్గంలో అక్షయజ్యోతిని పొందుతారు అని తైత్తిరీయ బ్రాహ్మణం చెపుతోంది.

పశువు, వివాహ సమయంలోనే లాజహోమం చేస్తోంది. కాబట్టి, ధర్మ కార్యాల్లో భర్తతోబాటు పాలు పంచుకోవటం అనేది అప్పటినుండే ప్రారంభమన్న మాట. ఆమెకు భర్తతోపాటు ధార్మిక కార్యాలన్నింటిలోనూ సమాన ఫలం లభిస్తుంది. భర్తలేకపోయినా ఆమె అవసరాన్నిబట్టి దానధర్మాలు చేయవచ్చునని ఆశ్వలాయన ధర్మసూత్రాలు చెపుతున్నాయి — జాయా పత్యోర్నవి భాగోవిద్యతే. పాణిగ్రహణాద్ధి సహత్వం కర్మసు. తథా పుణ్యఫలేషు ద్రవ్య పరిగ్రహేషు చ. (ఆ.ధ.సూ. 1-6-13) భార్యాభర్త లిద్దరిలోను భేదం, విభాగం అనేది లేదు. వివాహం అయినప్పటినుండీ ఇద్దరూ యజ్ఞానికి అధికారులే! ఇద్దరూ యజ్ఞంలో సమానంగా పాల్గొనాలి. దానాలు వగైరా యివ్వటం తీసికోవటంలో ఇద్దరికీ సమాన ఫలమే లభిస్తుంది, అని.

భార్యాభర్త లిద్దరూ యజ్ఞానికి అధికారులే! ఇరువురు యజ్ఞంలో సమానంగా పాల్గొనాలి. కాని. ధార్మిక కృత్యాలు ఎక్కువగా భర్తయే చేయాల్సి వస్తున్నా, భార్య కూడా ఆమెకు విధించిన కర్మలను ఆమె చేయాల్సి ఉంటుందని జైమిని పూర్వ మీమాంసా సూత్రాల్లో (6-1-28) చెప్పబడ్డది.

స్త్రీకి ధర్మకార్యాల్లో ఉన్న ప్రాధాన్యత ఎటువంటిదంటే —

స్త్రీ ఋతుమతియై వాకిట ఉన్నప్పుడు భర్తచేసే యజ్ఞంలో పాల్గొనటానికి వీలుండదు. కాబట్టి, పురుషుడు చేసే యజ్ఞం సగం నష్టమైనట్లే అని తైత్తిరీయ సంహిత చెపుతోంది —

"అర్ధోవా ఏతస్య యజ్ఞస్య మీయతే యస్య వ్రత్యేఽహన్ పత్నీ అనాలమ్భుకా భవతి" తై. బ్రా. 3-7-1. స్త్రీ వాకిట ఉన్నప్పుడు కన్యాదానంలాంటి శుభకార్యాలు గాని, పితృకార్యాలుగాని చేయటానికి వీలులేకపోవటం మనం చూస్తున్నాం. భార్య లేనివానికి ఏ యజ్ఞం చేసే అర్హతా లేదని మనుస్మృతి చెపుతోంది. సైగా, భర్త ఉండగానే భార్య చనిపోతే ఆతని యజ్ఞ పాత్రలన్నీ ఆమెతోబాటే తగులబెట్టాలి. ఇక ఆతనికి యజ్ఞంచేసే అధికారం లేదుకాబట్టి! మళ్ళీ వివాహం చేసుకొంటేనేతప్ప పురుషునికి మళ్ళీ యజ్ఞాధికారంరాదు అన్నాడు —

"ఏవం వృత్తాం సవర్ణాం స్త్రీం ద్విజాతిః పూర్వమారిణీమ్
దాహయేదగ్నిహోత్రేణ, యజ్ఞపాత్రైశ్చ ధర్మవిత్.
భార్యాయై పూర్వమారిణ్యై దత్వాగ్నీనన్త్యకర్మణి
పునర్దార క్రియాం కుర్యాత్ పునరాధానమేవచ.

(మ.స్మృ. 5-167, 168)

ధనితో కర్మిష్ఠుల రొట్టె విరిగి నేతిలో పడ్డట్టైంది — వెంటనే మళ్ళీ పెళ్ళి చేసుకో వున్నాడు గదా! కర్మేంద్రియాలేవీ పనిచేయకపోయినా యజ్ఞార్హత సంపాదించాలనే వంకతో వివాహానికి వృద్ధులంతా సిద్ధపడ్డారు. ఇందుకు పురాణేతిహాసాల్లో చ్యవనుని లాంటివారు అనేకమంది దర్శనమిస్తారు. ఈ శతాబ్దారంభం వరకు చాలమంది వృద్ధ కర్మిష్ఠులు ఇందుకు సిద్ధపడ్డారు.

స్త్రీల సామాన్య కర్తవ్యాలు:

శ్రుతి స్మృతీతిహాస పురాణాదుల్లో కావ్య నాటకాదుల్లో, వివాహిత స్త్రీల సామాన్య కర్తవ్యాలను గూర్చి అధికంగానే చెప్పారు. ధర్మశాస్త్రాలన్నీ కూడా, ముఖ్యంగా వివాహితస్త్రీ తన భర్తయొక్క ఆజ్ఞల్ని పాటించాలని చెప్పినాయి. భర్తను దైవంలాగా పూజించాలని చెప్పినాయి. భర్తయే చుట్టం, భర్తయే దైవం, భర్తయే పరమగతి అని "పతిర్హి దేవో నారీణాం పతిర్బంధుః పతిర్గతిః

(మహాభారతం. అశ్వ. 146 - 56)

స్మృతికారుడైన శంఖుడు, ఇంకా రెండడుగులు ముందుకు వేసి "న భర్తారం ద్విషాద్యద్య ప్యష్టిపలః, స్యాత్పతితో౽జ్గహీనో వ్యాధితో వా, పతిర్హి దేవతా స్త్రీణామ్" (స్మృతిచంద్రికలోని శంఖుని వచనం) భర్త పతితుడైనా, రోగిష్టివాడైనా, అంగహీనుడైనా ముసలివాడైనా భర్తను అసహ్యించుకోరాదన్నాడు. మనువు దీనిని సమర్థించాడు —

"విశీలః కామవృత్తోవా గుణైర్వా పరివర్జితః
ఉపచర్యః స్త్రియా సాధ్వ్యా సతతం దేవవత్పతిః

(మ. స్మృ. 5-154) అని

(మనుస్మృతిలోని ఈ విధమైన వేద విరుద్ధ వచనాలన్నీ తరువాతి వారు రచించి దీనిలో చేర్చారని శ్రీ దయానందసరస్వతి భావం)

ఇట్లాగే, భారత రామాయణాదుల్లోను, పురాణాల్లోను స్త్రీకి చేసిన ఇటువంటి ధర్మబోధలు, హితబోధలు, కోకొల్లలు. ఆ ఉత్సాహంలో భార్యయెడల పురుషుని ధర్మమేమిటో చెప్పటం మరచిపోయి ఉంటారు. ఎక్కడైనా ఏకపత్నీవ్రతాన్ని చూపించినా ప్రత్యేకంగా యిట్లా పురుషునికి చేసిన హితబోధలు కనిపించవు. ఇందుకు కారణం స్మృతికారులైన పురుషులకు స్త్రీల సమస్యలు గుర్తుకు రాక పోవటమే! ఆనాటి సాంఘిక పరిస్థితులే!

ఇక భార్యయొక్క ప్రవర్తన ఎట్లాఉండాలో స్మృతికారులంతా ఐకమత్యంతో, ఏకకంఠంతో. ఉత్సాహంగా వర్ణించి చెప్పారు — మనువు "స్త్రీ స్మితవదనయై, గృహకార్యాలలో నేర్పరియై, ఇంటిలోని వస్తువు లన్నింటినీ శుభ్రంగా ఉంచుతూ ఎక్కువ ఖర్చు చేయకుండా ఉండాలి" సదాప్రహృష్టయా భావ్యం, గృహకార్యేషు దక్షయా. సుసంస్కృతో పస్కరయా. వ్యయేచాముక్త హస్తయా" (మ.స. 5-150) అన్నాడు. అంతేకాదు,

"అర్థస్య సంగ్రహే చైనాం, వ్యయేచైవ నియోజయేత్
శౌచే, ధర్మేఽన్న పంక్త్యాం చ పాణిగ్రాహస్య చేక్షణే.
(మ.స్మృ. 9-11)

తాను సంపాదించిన ధనాన్ని రక్షించటంలోను, తగిన పద్ధతిలో ఖర్చు చేయటంలోను. వంటలోను, ఇతర సామగ్రిని కాపాడటంలోను, యజ్ఞాన్ని చేయ టంలోను భర్త, భార్యకు తగిన ఆదేశాలు ఇవ్వాలి" అన్నాడు. ఈ సందర్భంలోనే, "పానం దుర్జన సంసర్గః, పత్యాచ విరహోఽటనమ్ స్వప్నోఽన్యగేహవాసశ్చ, నారీసందూషణాని షట్" (మ.స్మృ. 9-13) సురాపానం. చెడ్డవారితో సాంగత్యం చేయటం, తన భర్తకు దూరంగా ఉండటం, తిరునాళ్ళలో సంతల్లో తిరగటం, పగలు నిద్రించటం, అపరిచితుల ఇండ్లలో ఉండటం అనే ఆరూ స్త్రీకి తగని పనులు అన్నారు.

యాజ్ఞవల్క్యుడు (యా.స్మృ. 1-83, 87) లో, "స్త్రీ ఇంటిలోని పాత్రలను శుభ్రంచేయాలి. వస్తువు లన్నింటిని వాటి వాటి స్థానాల్లో ఉంచాలి. ఆమె వంటి నేర్పరియై, స్మితముఖియై ఉండాలి. మిత వ్యయం చేసేదై ఉండాలి. పతిసేవా పరాయణురాలై ఉండాలి. అత్తమామలకు సేవచేయాలి. తన ఇంద్రియాలను వశంలో ఉంచుకోవాలి; అని చెప్పాడు.

స్మృతికారుడైన శంఖుడు, ఇంకా నాలుగు అడుగులు ముందుకువేసి — "నానుక్తా గృహాన్నిర్గచ్ఛేత్. నానుత్తరీయా న త్వరితం వ్రజేత్. న పర పురుషమభి భాషేతాన్యత్ర వణిక్ప్రవ్రజిత వృద్ధ వైద్యేభ్యః, న నాభిం దర్శయేత్. ఆ గుల్ఫా ద్వాసః పరిదధ్యాత్, న స్తనౌ వివృతౌ కుర్యాత్, న హసే దనాపావృతా. భర్తారం తద్బంధూన్వా న ద్విష్యాత్, న గణికా. ధూర్తాభిసారిణీ, ప్రవ్రజితా, ప్రేక్షణికా మాయామూలకుహకకారికా దుశ్శీలాదిభిః సహైకత్ర తిష్ఠేత్. సంసర్గేణ హి కుల స్త్రీణాం చారిత్ర్యం దుష్యతి. (యాజ్ఞవల్క్య స్మృతి 1-37 పై మితాక్షర వ్యాఖ్యలో

శంఖుడు ఉదహరించిరది.) స్త్రీ, భర్త అనుమతి లేకుండా బయటకు పోరాదు. వేగంగా చప్పుడు అయ్యేటట్లుగా నడవరాదు. అపరిచితులైన పురుషులతో మాట్లాడ రాదు. కాని. సన్యాసులు, వ్యాపారస్తులు, వైద్యులు, వృద్ధులతో మాట్లాడటంలో ఈ నియమం వర్తించదు. ఆమె, తన నాభి కనపడనీయరాదు. మడమలవరకు వచ్చే టట్లుగా చీర ధరించాలి. స్తనాలు వ్యక్తం కానీయరాదు. నోటిని కప్పుకొని తప్ప బిగ్గరగా నోరు తెరచి నవ్వరాదు. భర్తను, ఆతని బంధువులను అసహ్యించుకో రాదు. వేశ్యలతో, త్రాగిన స్త్రీలతో, చెడు నడవడికల నాయికలతో, భిక్షుణిలతో, సోదె చెప్పేవారితో. జ్యోతిషం చెప్పే స్త్రీలతో, మంత్ర తంత్రాలుచేసే స్త్రీలతో దురాచారిణులైన వారితో ఉండరాదు'' అని చెప్పాడు.

అట్లాగే, విష్ణుధర్మసూత్రాలు 25-1 నుండి 26 వరకు ''భర్తచేసే వ్రతాలే చేయాలి. అత్తమామలు, పెద్దలు, దేవతలు, అతిథులు, మొదలైన వారిని పూజిం చాలి. ఇంటిలోని పాత్రలను శుభ్రంచేయాలి. మిత వ్యయంచేస్తూ, ఇంటి సామానును భద్రంగా కాపాడటంలో జాగ్రత్త వహిస్తూ, మంచి నడవడి కలదై ఉండాలి'' అని చెప్పబడ్డది.

ఇట్లా ప్రభుత్వంవారు జారీ చేసిన Fundamental rules లాగా. service conditions లాగా, విపులంగా స్త్రీల విధుల్ని చెప్పారు. వాత్స్యాయన కామసూత్రాల్లో (4-1) ఇంకా మనోహరంగా చెప్పారు. ''ఇంట్లో సమస్తమైన ఏర్పాట్లూ చేయటం స్త్రీకి ప్రథమ కర్తవ్యం. ఆమె సంవత్సరానికింతకు ప్రణాళిక (బడ్జెట్) సిద్ధంచేయాలి. దానిప్రకారం రోజువారీ ఖర్చులు నడపాలి. భర్త తప్పుడు ఖర్చులుచేస్తూ ఉంటే ఆపాలి. ఆహారవస్తువులు చౌకగా ఉన్నప్పుడే సంవత్సరాని కంతకు సరిపడకొని నిలవచేయాలి. వ్యవసాయం ఉన్న ఇల్లు అయితే పశువుల విషయం వ్యవసాయం విషయం కూడా చూడాలి. నూలు వడకటం, నేతనేయటం, త్రాళ్ళు పేనటంలో తన మిగతా సమయాన్ని వెచ్చించాలి. విపత్సమయంలో భర్తకు సలహాలు చెప్పాలి. అతడు వినకపోతే మృదుమధురమైన శబ్దాలతో అతనిని అనుకూలుణ్ణి చేసుకోవాలి'' అని.

ఈ విధంగా స్త్రీల కర్తవ్యాలను గురించి, పాతివ్రత్య ధర్మాలను గురించీ స్మృతికారులంతా దస్త్రాలకు దస్త్రాలు వ్రాశారు. ఆ స్మృతికారుల దూరదృష్టిని, ధర్మపరాయణతనూ, శ్లాఘిస్తూ అనేక గ్రంథాలు సైతం వెలువడ్డాయి. భారతదేశం లోని హిందూస్త్రీకి చెప్పబడిన మహోన్నతాదర్శాలను గూర్చి మహోపన్యాసాలు

చేసినవారూ ఉన్నారు. పురుషులకు సైతం కొన్ని ధర్మాలు. కొన్ని వ్రతాలు. శ్రుతి స్మృతుల్లో చెప్పబడినా, పతివ్రతా ధర్మాల్ని గురించి చెప్పినంత గట్టిగా ఏకపత్నీ వ్రతాన్ని గురించి చెప్పలేదు. భార్యకు చెప్పకుండా ఏ పనీ చేయరాదనీ, సురాపానం చేయరాదని, భార్యలేకుండా ఎక్కడికీ వెళ్ళరాదని. పరస్త్రీలతో మాట్లాడరాదని. అత్తమామలను, భార్యతరపు బంధువులను, గౌరవించాలని, పునర్వివాహం చేసుకో రాదని, భార్యపోయిన విధురుడు తల గొరిగించుకొని ఏకభుక్తంచేస్తూ, బ్రహ్మ చర్యాన్ని పాటించాలనీ, భార్యకు విధించిన విధులన్నీ పురుషునికి సైతం యథా తథంగా వర్తిస్తాయని చెప్పలేకపోయారు. ఇది మనం అంగీకరించాల్సిన పరమ సత్యం. పురుషునికి తన కర్తవ్యాన్ని నిర్వహించటం. నిర్వహించకపోవటంలో స్వేచ్ఛనిచ్చారు. శ్రీరాముని ఏకపత్నీవ్రతం అనేది ఆయన తానుగా ఏర్పరచుకొన్న. నియమం. సార్వజనిక నియమంకాదు. పురుషునకు ఉండిన ఈ స్వేచ్ఛవల్లనే ఈనాడు జరుగుతున్నట్టి. వెనుక జరిగినట్టి ఉచ్ఛృంఖలమైన పోకడలతో సమాజం దూషిత మైంది. ఇది పరమ సత్యం. శ్రీరామచంద్రుడు ఏకపత్నీవ్రతాన్ని పాలించినా, హరిశ్చంద్రుడు సత్యవ్రతాన్ని ఆచరించినా, కర్ణుడు దానవ్రతాన్ని పాటించినా అవన్నీ వారు తాముగా ఏర్పరచుకొని పాలించిన విశేషధర్మాలౌతాయి. పురుషుల దూషిత ప్రవర్తనకు కఠినమైన శిక్షను మన ధర్మశాస్త్రాలు విధించి ఉంటే, ఈనాటి దయనీయ పరిస్థితి ఉండేదికాదు. ఇట్లా అనటం ఆ స్మృతికారుల్ని నిందించటంకాదు. ఆ కాలపు పరిస్థితులకు, జీవన విధానానికి, ఆదర్శాలకు తగినట్లు వారు చెప్పారు. ఈనాడు సంఘం నేటి పరిస్థితులకు అనుగుణంగా ధర్మాలను నిర్ణయించి అమలు చేయించాలి. పురుషుడు ఏనాడూ తన ధర్మాన్ని తగినవిధంగా పాటించలేదనేందుకు అనేక సాక్ష్యాధారాలున్నాయి. యథార్థం వేరు, కావ్యకల్పనలు వేరు. జూదమాడటం ఏ పరిస్థితుల్లో అయినా, ఎవరికైనా తప్పే! దానిని మనం అనేక విధాలుగా సమ ర్థించినంతమాత్రంచేత ఒప్పు కానేరదు. భార్యను త్యజించటం ఏనాడైనా తప్పే! అందుకు ప్రాయశ్చిత్త విధానం ఉంది. ఆ తప్పును ఒప్పుగా చిత్రించటానికి మనం ఎన్నైనా కల్పించుకోవచ్చు. అందుకే, ఆ కాలము, ఆ పరిస్థితులు, ఆ వ్యక్తులు వేరు అని సమర్థించుకోవాల్సి వస్తోంది. ఏమైనప్పటికి స్త్రీ విషయంలో స్మృతి కారుల మాపదండం వేరు పురుషుల విషయంలోని మాపదండం వేరు అని అనక తప్పదు. అంతేకాదు, ఆర్థికవిషయాల్లో సైతం స్త్రీని చిన్న చూపే చూచారు.

స్త్రీ ధనం:

స్త్రీని తన పుట్టినింటి నుండి తెచ్చుకొన్న ధనాన్ని స్త్రీ ధనం అనేవారు. కన్యాశుల్కం అమలులోనున్న నాటి ఆచారం అయిఉండవచ్చు. కన్యాశుల్కమనేది పోయినప్పటికీ, కన్యకు ఆభరణాలు, కొంత ధనం. యివ్వటం అనే ఆచారం నిలిచి పోయింది. వరునికి యిచ్చే కట్నంలాగానే. వివాహ సమయంలో వధువుకు వరుని తరఫువారు నగలుగాని. లేదా నగలకొరకై కొంత డబ్బు యివ్వటంగాని ఆచారమైంది. కొన్ని కులాల వారిలో కట్నంలో షుమారు సగం మరికొన్ని కులాలలో కట్నానికి రెట్టింపు నగలక్రింద యిచ్చే ఆచారం ఉంది. కొన్ని కులాలలో వరుని తరఫువారి దయాధర్మాలమీద ఆధారపడి ఉంది. నగల విషయం అడిగితే సంబంధం చెడిపోతుందనే భయంతో నోరు ఎత్తరు. వివాహ సమయంలో పుట్టినింటివారు బాల్యంనుండి తాము చేయించిన ఆభరణాలతోనే కన్యాదానం చేస్తారు. దీనినే బాల తొడుగు అంటారు. ఇది కూడా స్త్రీ ధనమే! కొన్ని కులాల్లో భూమిరూపంలో కన్యకు ఆస్తి యివ్వటం ఉంది. ఇదీ స్త్రీ ధనమే! వేదాల్లో కూడా స్త్రీ ధనాన్ని ఉదాహరించారు. దానిని 'పారిణాహ్యం' అన్నారు.

ఆనాడు స్త్రీ ధనంమీదనైనా, స్త్రీకి అధికారం ఉందా? లేదా? అనే విషయం ఖచ్చితంగా చెప్పలేము. కాని, అట్టి అధికారం స్త్రీకి లేదనే అనాలి — ఈ విషయమై స్మృతికారులు చెప్పినదానినిబట్టి!

మనువు చెప్పినదానిని బట్టి — "అధ్యగ్న్యధ్యావాహనికం, దత్తంచ ప్రీతి కర్మని. భ్రాతృ మాతృ పితృ ప్రాప్తం షడ్విధం స్త్రీ ధనం స్మృతమ్."

(మనుస్మృతి 9-194)

తల్లి. తండ్రి, సోదరులు యిచ్చిన ధనం (1, 2, 3) పెండ్లి అయిన పిమ్మట భర్త యిచ్చిన ధనం (4) వివాహ సమయంలోను (5) కాపురానికి వచ్చిన పిమ్మట (6) ఇతరులు ఇచ్చిన ధనం; అని స్త్రీ ధనం ఆరువిధాలు. 7-వ శతాబ్దానికి యింకా కొన్ని యిందులో చేరాయి. భరణద్రవ్యం ఆకస్మిక లాభాలూ కూడా స్త్రీ ధనం లోకి వచ్చి చేరాయి. తరువాత భూమికూడా చేరింది. ఇంత అయినప్పటికి, ఆమెకు ఆ ధనంమీద హక్కులేదు. దానధర్మాలు చేయటానికి వీలులేదు. తన డబ్బు తాను వాడుకోవటానికే హక్కులేనప్పుడు, ఇక భర్త ఆస్తిమీద అధికారం లేదని వేరే చెప్పనక్కరలేదు. భర్త ఆస్తికి భార్య ఏనాడూ వారసురాలు కాదు. ఆపస్తంబుడు ఉత్తరాధికారుల (వారసుల) పట్టిక యిచ్చాడు — "పుత్రాభావే ప్రత్యాసన్నః స

పిండః తదభావే ఆచార్యః. ఆచార్యాభావే అంతేవాసీ ...... దుహితా వా. (ఆప. గృ.సూ. 2-14-2. 3, 4.) పుత్రుడు లేనప్పుడు సపిండుడు, వారుకూడా లేనప్పుడు ఆచార్యుడు, ఆచార్యుడుకూడా లేనప్పుడు శిష్యుడు, ఆపైన కుమార్తె'' అంటూ

మనువుకూడా ఈ మాటలే అన్నాడు. కాని, జీమూతవాహనుడు మాత్రం తన దాయభాగ ప్రకరణం( 11) లో పూర్తిగా విధవల పక్షం వహించాడు__''వివాహ సమయంలో స్త్రీ భర్త సంపదకు వేరుచేయరానట్టి (Joint) అధికారిణి అయి ఉండే. భర్త చనిపోగానే ఈ అధికారాన్ని ఎట్లా కోల్పోతోందో అర్థంకాని విషయం; ఇందుకు ఏమీ ప్రమాణం లేదు'' అని అన్నాడు.

అనేక శతాబ్దాలపాటు స్త్రీలు భర్త అనంతరం. ఆర్థికంగా అనేక కష్టనష్టాలకు గురి అయి. ఇతరుల దయాదాక్షిణ్యాలమీద ఆధారపడి. నరకబాధలు అనుభవించారు. ఈ శతాబ్దారంభం వరకు వారి దయనీయ పరిస్థితులు అట్లాగే కొనసాగాయి. కొన్ని వర్ణాలలో ఈనాటికీ కొనసాగుతున్నాయి. భారతీయ చట్టంలోని ఈ లోపాన్ని సవరించటానికై, డా. దేశముఖ్ లాంటి సంస్కర్తలు ప్రయత్నించారు. 1937-వ సంవత్సరంలో చేయబడిన Hindu women's right to Property Act ననుసరించి దాయభాగసిద్ధాంతం బ్రిటిష్ భారతదేశం అంతటా ఒకే విధంగా వర్తించింది. దీనివల్ల స్త్రీల ఆర్థికస్థితి కొంత మెరుగైంది.

ప్రస్తుతం స్త్రీలు సైతం చదువుకొని ఉద్యోగాలు చేయటం, ప్రపంచజ్ఞానం వృద్ధి అయినందున మోసగింపబడటం తగ్గిపోవటం, సమష్టి కుటుంబ వ్యవస్థ సన్నగిలిపోవటం. భర్తలు ఉద్యోగాలు చేస్తూ తమ భార్యల భవిష్యజ్జీవనానికై జీవితభీమా లాంటి ఏర్పాట్లు చేయటం. ఉద్యోగి భార్యకు సైతం పెన్షన్ సదుపాయం లభించటం. కార్మిక కర్షకులకు సైతం జీవితభీమా సదుపాయం లభించటం. ఇటువంటి అనేక కారణాలవల్ల స్త్రీల ఆర్థిక స్థితి కొంత మెరుగుపడినా. పూర్తిగా పురుషులతో సమాన స్థాయికి రాలేదనే చెప్పాలి. కాని, సంఘం మాత్రం ఈ విషయంలో సానుభూతి కలిగి ఉంది. సహకరించటానికి సిద్ధంగా ఉంది. మూఢవిశ్వాసాలు వదలి. ప్రాపంచిక జ్ఞానాన్ని పెంపొందించుకొని స్త్రీలే చొరవ చూపాలి.

ఈ స్త్రీధనానికి సంబంధించికూడా అనేక తగాదాలు ఉత్పన్నమౌతున్నాయి. భార్యాభర్తల మధ్యకూడా ఒకవిధమైన స్వార్థభావన ఉత్పన్నమై ఎవరిడబ్బు వారిదే అనే భావం ప్రబలుతోంది. ఒకరినొకరు లెక్కచేయకపోవటం సంభవిస్తోంది. ఏమై

నప్పటికి, స్త్రీకి ఆర్థికంగా సుస్థిరత్వం స్వాతంత్ర్యం అవసరం అని అంతా అంగీక రించాల్సిన విషయమే!

వైవాహిక జీవనంలోని అపశ్రుతులు:

వైవాహిక జీవనంలో ఎదురయ్యే తగాదాలు భార్యభర్తలమధ్య, అత్తకోడండ్రు, ఆడుబిడ్డల మధ్య ఉంటాయి. పరస్పర అవగాహన లేకపోవటం, సంకుచితబుద్ధి, లోకజ్ఞానంలేమి. మాఢ్యం ఇందుకు ప్రధాన కారణాలు. అత్యాశ. భోగాలాలస, అస మర్థత, బాధ్యతారాహిత్యం, దుర్వ్యసనాలు అనేవి మనకు పైకి కనిపించే కారణాలు. ఇవి ఇద్దరిలోనూ ఉండవచ్చు. కొన్ని ఈ దుర్గుణాలు ఒకరిలో, మరికొన్ని మరొకరిలో ఉండవచ్చు.

భర్త విషయంలో అయితే. చదువు సంధ్యలు తక్కువ, షోకులు భోగలాలస ఎక్కువ అయి, త్రాగుడు లాంటి దుర్వ్యసనాలకు బానిస అయి. భార్య పిల్లల విషయం పట్టించుకోక, సంపాదన చాలక భార్యను పుట్టినింటినుండి డబ్బు తెమ్మని వేధించటం, ఇందుకు పర్యవసానంగా, గుట్టుగా సాగవలసిన సంసారం బజారునపడి, వివాహ విచ్ఛేదమో (విడాకులో) లేక హత్యలు ఆత్మహత్యలో జరుగుతాయి. అట్టి భర్తకు అతని తల్లి అక్కచెల్లెండ్రు కూడా తోడైతే అగ్నికి ఆజ్యం పోసినట్లే! కొన్ని సందర్భాలలో భార్యయొక్క అజ్ఞానం, అవినీతి, భోగలాలస. కూడా పురుషుని జీవి తానికి అభిశాపం కావచ్చు. ఏమైనప్పటికీ, ఈ విధమైన అపశ్రుతులకు ముఖ్యకార ణాలు అవిద్య, ఉన్నవిద్య విశృంఖల విద్య కావటం, పాశ్చాత్య నాగరకతా వ్యామోహం, నైతిక విలువలు లోపించటం, దాంపత్యం, వివాహం అనే వాటిని గూర్చిన సరైన అవగాహన లేకపోవటం, బాధ్యతారాహిత్యం అనేవి కావచ్చు! ఇటు వంటి అపశ్రుతులన్నీ వారి వారి సంసారాలకు సంబంధించిన విషయం అనీ, ఇతరు లకు ప్రమేయం లేదనీ చాలమంది అనుకుంటారు. కాని ఇది తప్పు. ఈ దుష్పరి ణామాలు వారిద్దరికీమాత్రమే, ఆ సంసారానికి మాత్రమే పరిమితం కావు. ఇటువంటి వారి సంతానమే చదువుసంధ్యలు లేక, తల్లిదండ్రుల ప్రేమకరవై, బాధ్యతారహి తంగా పెరిగి, జేబుదొంగలుగా, దుండగులుగా, హంతకులుగా తయారౌతారు. ఇటువంటి వారితో సంఘం బాధలు పడక తప్పదు. ప్రభుత్వానికి వారు పెద్ద సమస్యగా తయారౌతారు. ఇట్లా, స్త్రీ పురుషులకు ఒకరినొకరు అర్థం చేసుకోక పోవటంవల్ల, అవగాహన లోపించటంవల్ల చివరకు వివాహ విచ్ఛేదమే శరణ్యం అవుతోంది.

## విడాకులు — పునర్వివాహాలు

విడాకులు: మనం ధర్మశాస్త్రాలను పరిశీలిస్తే, పురుషుడు తన మొదటి భార్యను వదలి మరియొక భార్యను వివాహమాడవచ్చునని తెలుస్తోంది. అంటే, స్మృతులు పురుషుని పునర్వివాహానికి ఆమోదముద్ర వేసినాయన్నమాట. ఈ సదుపాయం స్త్రీకి కల్పింపబడలేదు. స్త్రీకి, ఒకసారి ఒక పురుషునితో వివాహం జరిగితే, ఆ వివాహం ఆమె జీవితాంతం కొనసాగాల్సిందే: వివాహ విచ్ఛేదానికి వీలులేదు. వివాహసంబంధం అనేది స్త్రీ విషయంలో అవిచ్ఛేద్యం అని ప్రాచీన శాస్త్రకారుల అభిప్రాయం.

ఈ విషయమై మనువు ఎంత నిర్దయగా చెప్పాడో చూడండి —

''న నిష్క్రయ విసర్గాభ్యాం భర్తుర్భార్యా విముచ్యతే
ఏవం ధర్మం విజానీమః ప్రాక్ ప్రజాపతి నిర్మితమ్.

(మ.స్మృ. 9-46)

భర్త, భార్యను అమ్మివేసినా పరిత్యజించినా ఆ స్త్రీకి మొదటి భర్తతో సంబంధం పోదు. ఇది ప్రజాపతి చేసిన నిర్ణయం కాబట్టి!'' అన్నాడు.

వివాహమనేది ఒక ధార్మిక సంస్కారమనీ, ఆ సంస్కారం వల్లనే స్త్రీకి స్త్రీత్వం లభించి, నిలిచి ఉందనీ, భార్యాభర్తల్లో ఎవరు పతితులైనా ఆ సంస్కారం పోదనీ, ప్రాయశ్చిత్తం ద్వారా మళ్ళీ పరిశుద్ధులు కావచ్చుననీ, ధర్మశాస్త్రకారుల అభిప్రాయమైనట్లు తోస్తుంది. ఇక, అటువంటప్పుడు వారిదృష్టిలో ఇక వివాహ విచ్ఛేదానికి తావు ఎక్కడిది: స్త్రీ వ్యభిచారిణి అయినా సరే: ఆమెను పరిత్యజించటం నిషిద్ధం. అని యాజ్ఞవల్క్య స్మృతిపై విశ్వరూప వ్యాఖ్య చెపుతోంది. అందుచేతనే, పూర్వం భారతీయ వివాహవ్యవస్థలో విడాకుల అవసరాలు లేవు.

అయితే, మన ధర్మశాస్త్రాలను బాగా పరిశీలించినప్పుడు, క్రీస్తుకు పూర్వం అక్కడక్కడ విడాకులున్నట్లు కనిపిస్తుంది. వివాహ సంబంధం చాలా దృఢమైనదని గట్టిగా చెప్పిన మనువు సైతం —

ఉన్మత్తం, పతితం, క్లీబం, అబీజం, పాపరోగిణమ్
న త్యాగోఽస్తి ద్విషన్త్యాశ్చ, న చ దాయాపవర్తనమ్.

(మ.స్మృ. 9-79)

''భర్తగనుక పిచ్చివాడు. పతితుడు. నపుంసకుడు. బీజరహితుడు. పెనురోగాలు కల వాడు. నీచుడు అయితే. అట్టి భర్తను పరిత్యజించినందువల్ల స్త్రీకి దోషం రాదు'' అన్నాడు. పరిత్యజించటం అంటే వివాహవిచ్ఛేదం (తెగతెంపులు) అనే అనుకో వాలి. ఎందుచేతనంటే. మనువే (9-175, 176) లో. అటువంటి స్త్రీ పత్యసమాగ మాన్ని పొంది ఉండకపోతే, మళ్ళీ వివాహం చేసుకోవచ్చు —

''సా చేత్ అక్షతయోనిః స్యాత్, గతప్రత్యాగతాపి వా,
పౌనర్భవేన భర్త్రా సా, పునః సంస్కార మర్హతి'' అన్నాడు.

ఇట్టి స్త్రీకి పుట్టిన సంతానం ధర్మశాస్త్రరీత్యా సరియైనదిగానే పరిగణింపబడుతుంది. క్రీస్తు శకారంభంలో దాదాపు అన్ని వర్ణాలలోను వివాహవిచ్ఛేదం ఉన్నట్లు తెలుస్తోంది. అథర్వవేదం 9-5-27. 28 ననుసరించి ఒక స్త్రీ, బహుశః భర్త ఉండగానే తిరిగి వివాహం చేసుకొన్నట్లు తెలుస్తోంది. క్రీస్తుకు పూర్వం 400 సంవత్సరాలనుండి క్రీ.శ. 100 సంవత్సరాలవరకు ఉండిన శాస్త్రకారులు, బ్రాహ్మణస్త్రీ అయితే. ఆమె భర్త విదేశాలకు వెళ్ళి ఉన్నా. లేక దీర్ఘకాలంపాటు యాత్రలకు వెళ్ళి ఉన్నా. భర్త కోసం 5 సంవత్సరాలపాటు వేచి ఉండి, అతడు తిరిగి రాకపోతే మళ్ళీ వివాహం చేసుకోవచ్చు నన్నారు — దీనినే, వశిష్ఠ ధర్మసూత్రాలు 1-7-67 లో ఇట్లా చెప్పారు — ''ప్రోషితపత్నీ పంచవర్షాణి ఉదీక్షేత. ఊర్ధ్వం పంచభ్యో వర్షేభ్యో భర్తృసకాశం గచ్ఛేత్....యది ధర్మార్థాభ్యాం ప్రవాసం ప్రత్యనుకామా స్యాద్యథా ప్రేతే ఏవం వర్తితవ్యం స్యాత్. అత ఊర్ధ్వం సమానోదకపిండర్షి గోత్రాణాం పూర్వః పూర్వోగరీయాన్'' అని.

కౌటిల్యుడు మాత్రం, తన అర్థశాస్త్రం (3-4) లో వివాహవిచ్ఛేదానికి అను మతి యిచ్చాడు గాని, ''అంతతః పరం ధర్మస్థైః విసృష్టా యథేష్టం విన్దేత'' అని, అందుకు ధర్మాధికారియొక్క అనుజ్ఞ కావాలన్నాడు. కౌటిల్యుని అభిప్రాయం ప్రకారం. ఒక స్త్రీ. తన భర్తను అసహ్యించుకుంటూన్నప్పటికి ఆమె భర్త గనుక ఆమెను కోరుతున్నట్లైతే ఆతనిని పరిత్యజించటానికి వీలులేదు. ఇద్దరూ ఒకరి నొకరు ద్వేషించుకొంటూ ఉన్నప్పుడే వివాహ విచ్ఛేదానికి అవకాశం ఉంది — ''అమోక్ష్యా భర్తురకామస్య ద్విషతీభార్యా. భార్యాయాశ్చ భర్తా. పరస్పరం ద్వేషా న్మోక్షః స్త్రీ విప్రకారాద్వా పురుషశ్చేన్మోక్ష మిచ్ఛేద్యథాగృహీతమస్యై దద్యాత్ పురుష విప్రకారాద్వా స్త్రీచేన్మోక్ష మిచ్ఛేన్నాస్యై యథాగృహీతం దద్యాత్.

అమోక్షో ధర్మవివాహానామితి." (అర్థశాస్త్రం - 3-3) ఒకవేళ పురుషుడు తన భార్యవల్ల, తన ప్రాణానికి ముప్పు ఉన్నదని భావించి విడాకులు కోరితే, ఆమెవల్ల వివాహసమయంలో తనకు ఇచ్చిన ధనాన్ని తిరిగి ఇచ్చివేయాలి. అట్లాగే, ఆమె భర్తవల్ల తన ప్రాణానికి ముప్పు ఉన్నదని భావించి అతని నుంచి విముక్తిని కోరితే, ఆమె పురుషునికి ఏమీ ఇవ్వనక్కరలేదు. అయితే, ఇటువంటి వివాహ విచ్ఛేదాలు ధర్మ్యవివాహాలకు (బ్రాహ్మ, ప్రాజాపత్య, ఆర్ష, దైవ వివాహాలకు) వర్తించవు అన్నాడు. అవి అవిచ్ఛేద్యాలు కాబట్టి! కౌటిల్యుడు పైన చెప్పిన విచ్ఛేద విషయం మిగతా నాలుగురకాల వివాహాలకు సంబంధించినది.

పరాశర స్మృతి (4-24. శ్లో) "నష్టే, మృతే, ప్రవ్రజితే, క్లీబే చ పతితే పతౌ, పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే" పతి నష్టమైనా, చనిపోయినా, సన్యసించినా, నపుంసకుడైనా, పతితుడైనా ఈ ఐదు సందర్భాల్లోనూ పునర్వివాహం చేసుకోవచ్చునన్నాడు. నష్టమవటం అంటే ఏమైపోయినది తెలియరాక పోవటం. (పతితుడు అంటే — బ్రాహ్మణ హంతకుడు, సురాపానం చేసేవాడు, గురు భార్యతో కలిసేవాడు, నాస్తికుడు, నిందిత కర్మల్ని చేసేవాడు, పతితులతో కలిసి ఉండేవాడు, పతితయువని ఉంచినవారితో ఉండనివాడు, తల్లిదండ్రులకైన్నా బంధువులకు అపకారం చేసినవాడు, వీటిలో ఏ ఒకదానికి పాల్పడినా పతితుడే!) దీనినిబట్టి వివాహ విచ్ఛేదం పరాశరునికి సమ్మతమే అని తెలుస్తోంది. సమ్మతం కాకపోతే పతితుడైనా, నపుంశకుడైనా స్త్రీ పునర్వివాహానికి ఎట్లా అంగీకరిస్తాడు?

ఈ వివాహ విచ్ఛేదం అనేది బౌద్ధ గ్రంథాల్లో సైతం విరివిగా కాకపోయినా, అక్కడక్కడ కనిపిస్తోంది — ధమ్మపదం, థేరీగాథ, మజ్ఝిమనికాయం లాంటి గ్రంథాల్లో ఇటువంటి సందర్భాలు వర్ణింపబడ్డాయి. అయితే, ఉన్నత కులాల్లో ఇటువంటి ఆచారం ఉన్నట్లు కనిపించదు. క్రమంగా వివాహ విచ్ఛేదమనే ఆచారం తగ్గుముఖం పట్టి ఈ క్రీస్తుశకారంభానికి బాగా తగ్గిపోయింది. హిందూ సమాజంలో పవిత్రత, పరిశుద్ధత అనే భావాలు బాగా ప్రబలినాయి. వివాహమనేది స్త్రీకి జీవితంలో ఒక్కసారే జరగాలి అనే భావం బాగా బలపడ్డది. భర్త దుర్మార్గుడు, పతితుడు, నీచుడు అయినా అతనిని వదిలిపెట్టరాదనే భావం దృఢమైంది.

పాశ్చాత్య దేశాల్లో విడాకులు:

ఈనాడు మన దుస్తులు, ఆహార విహారాలు, జీవితావసరం, భోగలాలసత, వివాహాలు, విందులు ఇట్లా అన్నింటిలోను పాశ్చాత్య పద్ధతుల్నే యథాతథం అనుక

ఇస్తున్నందున. విడాకుల విషయంలో పాశ్చాత్యదేశాల, యూరపుదేశాల ఆచారాల్ని తెలుసుకుందాం. మన దేశంలో లాగానే పూర్వకాలం యూరపుదేశాల్లోకూడా వివాహ విచ్ఛేదం అనేది లేదు. రోమన్ కాథలిక్ చర్చియొక్క సిద్ధాంతాల ననుసరించి. వివాహ బంధన మనేది అవిచ్ఛేద్యమనే భావమే ఉండేది. (Gospel of Mark 10-2-12 మరియు లూక్ 16-18) ఇంగ్లండులో వివాహవిచ్ఛేద మనేది పార్లమెంటు అంగీకారంతో జరగాల్సి ఉండేది. ఇట్లా పార్లమెంటు అంగీకారం పొందాలంటే ఎంతో సంపన్నులైనవారికి తప్ప ఇతరులకు సాధ్యమయ్యేది కాదు. ఇందుకై ఆ రోజుల్లో దాదాపు 500 పౌండ్లు ఖర్చు అయ్యేదట. 1922 రాయల్ కమీషన్ రిపోర్టును బట్టి క్రీ.శ. 1715 నుంచి 1855 వరకు. అంటే దాదాపు 140 సంవత్సరాల్లో పార్లమెంటు 180 మందికి విడాకులు మంజూరు చేసింది. 1858 లో Divorce and Matrimonial Causes Act ఆమోదింపబడ్డది. దీనిని బట్టి, స్త్రీ విడాకులకోసం దరఖాస్తు చేయాలంటే, వివాహమైన నాటినుండి భర్త, తనతో వ్యభిచారం మాత్రమే చేస్తున్నాడని, మరొక స్త్రీని ప్రేమిస్తున్నాడని రుజువుచేయాలి. కాని, 1923 చట్టాన్ని అనుసరించి పురుషుల్లాగానే, స్త్రీలకు సైతం విడాకులుకోరే అవకాశం ఇవ్వబడ్డది. అప్పటినుండి యూరప్, అమెరికా దేశాల్లో విడాకులు మూడు పువ్వులు ఆరు కాయలుగా వృద్ధిచెందుతున్నాయి. ఈనాడు అచటి స్త్రీలు, భర్త నిద్రలో గురకపెడుతున్నాడని. ఆ కారణంగా తనకు నిద్రాభంగం అవుతోందని. భర్త రోజూ గడ్డం గీసుకోకపోవటంవల్ల తన గడ్డం గీరుకుపోతూ బాధకలిగిస్తోందని, భర్త తరచుగా తుమ్ముతున్నాడని యిట్లా స్వల్పకారణాలకు విడాకులు కోరుతున్నారు. అట్లాగే పురుషులు తన భార్య నోరు తెరచి నిద్రపోతున్నందున తనకు భయంవేస్తోందని, నవ్వేటప్పుడు పండ్లు వికృతంగా కనిపిస్తున్నందున భరించలేకపోతున్నానని. తనకు యిష్టంలేని రంగు వస్త్రాలను ధరిస్తోందని విడాకులకు కారణాలు చెప్తున్నారు. ఇందువల్ల వారి కుటుంబ జీవనం అస్తవ్యస్తమై పిల్లలు ఎవరికీ చెందనివారుగా తయారౌతున్నారు. మాతాపితరుల ప్రేమకు దూరులౌతున్నారు. ఇట్లా వారి కుటుంబ జీవనం దుఃఖమయంగా. అశాంతికి నిలయంగా తయారైంది. ఈ కారణాలవల్ల ఇంగ్లండు మొదలైన దేశాల్లో విడాకుల ఆచారాన్ని తగ్గించాలనే ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈ స్థితిలో మన దేశంలో ఈ అవకాశాలు హెచ్చుచేయాలని కోరటం విచిత్రంగా లేదా?

## పునర్వివాహం:

మన హిందూ సమాజంలో పురుషునికి భార్య ఉండగా మొదటి వివాహాన్ని రద్దుచేసుకొని రెండవ వివాహం చేసుకొనే అధికారం ఉంది. మొదటి భార్య చని పోయినా రెండవ వివాహం చేసుకొనే అధికారం ఉంది. కాని, స్త్రీకి వివాహవిచ్ఛేదము, పునర్వివాహము రెండూ నిషేధింపబడ్డాయి. పురుషుడు మాత్రం మొదటి భార్యను నిష్కారణంగానే వదిలివేసి పునర్వివాహం చేసుకోవచ్చు. ఇందువల్ల ఈ విధంగా వదలివేయబడిన స్త్రీలు దయనీయమైన స్థితికిలోనై నరకయాతనను అనుభవించారు. అనుభవిస్తున్నారు. అటువంటి స్త్రీల దుఃఖాలకు అంతులేదు. అంతేకాదు, మొదటి భార్యనుండి విముక్తి పొందటానికి, ఆమె కీయవలసిన భరణం నుంచి తప్పించుకోవటానికి, భోగలాలసులై, అబద్ధపు సాక్ష్యాలు చెప్పించి, తన భార్యను తానే వ్యభిచారిణిగా చిత్రించి వేరొకసుందరాంగిని కట్టుకొని కులుకుతున్నారు. అటువంటి స్త్రీలు ఉదరానికి సైతం నోచుకోక, పనికత్తెలుగా, వంటకత్తెలుగా దుర్భర దారిద్ర్యంతో బాధపడుతున్నారు. అట్టివారి కన్నీళ్ళతో భారతదేశ చరిత్రలోని అనేక పుటలు తడిసిపోయాయి. హిందూభర్తలచేత పరిత్యక్తలైన ఇటువంటి స్త్రీలు గత్యంతరం లేక ఇతర మతాల పజ్జన చేరుతున్నారు. ఇట్టివారికోసం చేచి, చేయి జాపుతున్న మతాలు చాలా వున్నాయి. దుష్టశక్తులూ వున్నాయి. ఇటువంటివారికోసం వారు వెతుకుతూనే ఉంటారు. చట్టంగాని, సమాజంగాని, అట్టి పరిత్యక్తలు వేరొక వివాహం చేసుకోవటానికి అంగీకరించనందున వారికి వేరే మార్గంలేదు. ఇందువల్ల ముఖ్యంగా హిందూ సమాజంలోని ఉన్నత వర్గాలలోని స్త్రీల దయనీయగాథలు పెరిగిపోతూనే ఉన్నాయి. ఈ విషయంలో శ్రమజీవులు, నిమ్నవర్గాలకు చెందిన స్త్రీల స్థితిగతులే మెరుగుగా ఉన్నాయని అనకతప్పదు. ఈనాటికీ నిమ్నవర్గాలలో విడాకుల ఆచారం అమలులో ఉంది. పైగా, ఆ కులపెద్దలే నిర్ణాయకులు, తీర్పరులు అయినందున న్యాయం త్వరగా జరుగుతుంది. తప్పుడు సాక్ష్యాలబాధ ఉండదు. వారికి ప్రభుత్వచట్టంతో పనిలేదు. వారి నిర్ణయాన్ని వారి సంఘం అంతా ఆమోదించి తీరాలి. అందువల్ల వారి సాంఘిక మర్యాదలకు, సంఘజీవనానికి ఏవిధమైన ఇబ్బందీ ఉండదు. కాబట్టి, ఈ విషయంలో నిమ్నజాతులవారి జీవనమే సుఖదాయకం అనటంలో తప్పులేదు.

## బహుభార్యాత్వ పద్ధతి:

మన స్మృతి పురాణేతిహాసాలు, బహుభార్యాత్వాన్ని అంగీకరించినాయి. అటువంటి వీరపురుషుల జీవితచరిత్రలతోనే మన ధర్మగ్రంథాల పుటలన్నీ నిండి

ఉన్నారు గృహ్యసూత్రకారులు. ధర్మసూత్రకారులు బహుభార్యాత్వానికి కొన్ని పరి స్థితుల్లో ఆమోదాన్ని తెలియజేయటమే కాక, ఆవశ్యకమని, ఈ విషయంలో ఆలస్యం పనికిరాదని కూడా చెప్పారు. కౌటిల్యుడు, అర్థశాస్త్రం (3-2) లో, ఇట్లా అన్నాడు – "భార్య పుత్రహీనురాలైనా, వంధ్య అయినా, లేదా మొదటి కానుపు తరువాత మళ్ళీ పిల్లలు పుట్టకపోయినా, 8 సంవత్సరాలు ఆగి, పురుషుడు మళ్ళీ పెళ్ళి చేసుకోవచ్చు. ఇన్ని సంవత్సరాలపాటు ఆగలేకపోతే రోజుకు జరిమానాగా 24 పణాలు చెల్లించి వెంటనే పెళ్ళిచేసుకోవచ్చు" అని.

బోధాయన ధర్మసూత్రాల్లో (2-2-4-6) పురుషునిలాగా మాట్లాడే స్త్రీని వెంటనే పరిత్యజించి మళ్ళీ పెళ్ళి చేసుకోమన్నారు. మనువుకూడా తన మనుస్మృతి 9-8 లో దీనిని సమర్థించాడు. అంతేకాదు. ఇంకొక అడుగు ముందుకు వేసి, మొదటి భార్యకు దాహక్రియలు పూర్తికాగానే వెంటనే రెండవ వివాహం చేసుకోవా లన్నాడు—"భార్యాయై పూర్వమారిణ్యై, దత్వాగ్నిం విధిపూర్వకమ్, పునర్దారక్రియాం కుర్యాత్ పునరాధాన మేవచ. (అ.శా. 5-168) అట్లా పునర్వివాహం చేసుకొని, యజ్ఞం చేయటం ఆరంభించాలి' అని చెప్పటంలో కర్మిష్ఠుల రొట్టె విరిగి నేతిలో పడ్డట్టైంది. చాలమంది కర్మిష్ఠులు ఈ విషయంలో ఏమాత్రమూ ఆలస్యం చేయలేదు.

ఇక, గృహస్థరత్నాకరంలో — "ఏకా శూద్రస్య, వైశ్యస్యద్వే, తిస్రః క్షత్రియస్యతు, చతస్రో బ్రాహ్మణస్య స్యుర్భార్యా రాజ్ఞో యథేచ్ఛతః" అని దేవలుని వచనంగా: శూద్రుడు ఒక స్త్రీని వైశ్యుడు ఇద్దరిని, క్షత్రియుడు ముగ్గురిని, బ్రాహ్మ ణుడు నలుగుర్ని, రాజు ఇష్టం వచ్చినంతమందిని వివాహమాడవచ్చునని చెప్పబడ్డది. స్త్రీమాత్రం, ఏ జాతిదైనా ఒకే పురుషుణ్ణి చేసుకోవాలని అన్ని ధర్మగ్రంథాలూ ముక్తకంఠంతో చెప్పినాయి. ఈ విషయంలో మాత్రం స్మృతికారుల్లో, సూత్ర కారుల్లో అభిప్రాయ భేదమంటూ లేదు. ఇది మెచ్చుకోదగిన విషయం. మన ఇతి హాస పురాణాదులు కావ్యనాటకాదులన్నీ చాలా భాగం బహుభార్యలు గల ధీరోదాత్తుల చరిత్రలతోనే నిండి ఉన్నాయి.

గృహ్యసూత్రకారులు, స్మృతికారులు, బహు వివాహాలను, పునర్వివాహాలను నిందిస్తూనే, పతివ్రతయైన భార్యను వదలిపెట్టటం పాపమని, అట్టి భర్తను దండించా లనీ, అక్కడక్కడ చెప్పినా, అవన్నీ ఆయా పుటల్లోనే పడిఉన్నాయి. ప్రత్యేక సందర్భాలలో చెప్పబడినట్టి, తమకు అనుకూలమైనట్టి సందర్భాలనే గ్రహించి వాటినే సామాన్య నియమాలుగా భావించి పురుషులు భార్య బ్రతికి ఉండగానే పున

ర్వివాహమనే పాపానికి పాల్పడ్డారు. దానిని ఒక అధికారంగా కూడా భావించారు. ధర్మశాస్త్రకారులు. అష్టవర్ష పరిరక్షణ భారాన్ని గుత్తకు తీసుకొన్నామనే ధార్మికులు కూడా ఈ విషయమై మౌనాన్నే వహించారు. విధవా వివాహం. రజస్వలానంతర వివాహం మొదలైన వాటిల్లో చూపించినంత వ్యతిరేకమైన శ్రద్ధలో. ఆసక్తిలో శతాంశం ఈ విషయంలో చూపించి ఉంటే అనేక లక్షలమంది స్త్రీల జీవితాలు నాశనం కాకుండా ఉండేవి. పురుషుల బహుభార్యాత్వాన్ని వారు ఖండించ లేదు. విధవా వివాహాన్ని. రజస్వలానంతర వివాహాన్ని ఎలుగెత్తి ఖండించిన వారి నోరు ఈ విషయంలో మూగపోయింది. నియమ విరుద్ధంగా బహు వివాహాన్ని చేసుకొన్న వారు, శాస్త్రాలు విధించిన ప్రాయశ్చిత్తాన్ని సైతం చేసుకోలేదని బృహత్సంహిత వల్ల తెలుస్తోంది.

వృద్ధ వివాహాలు:

భార్యలు అనేకమంది వృద్ధులు, భార్య చనిపోయిన వెంటనే, ధర్మలోపం వస్తుందనే సాకుతో పునర్వివాహాలకు తయారౌతూ ఉండేవారు. వీరికి ధర్మశాస్త్రాలన్నీ అనుమతి పత్రాలను ప్రసాదించాయి. భార్య లేనివాడు యజ్ఞానికి అర్హుడు కాడు కాబట్టి, మళ్ళీ వివాహం చేసుకోవచ్చుననే ధర్మసూత్రాన్ని ఆధారంగా చేసుకొని. వయసును వెనుకబెట్టి పునర్వివాహానికి ముందుకు వచ్చారు. కాటికి కాళ్ళుచాచిన వృద్ధులు సైతం, ధర్మలోపభయం ఎట్లా ఉన్నా. చస్తే ఏడ్చేవారుండరనే దిగులుతో కన్యల్ని వివాహమాడిన ఉదంతాలు చాలా ఉన్నాయి. వారి పుణ్యమా అంటూ, మన దేశంలో బాల వితంతువుల సంఖ్య గణనీయంగా పెరిగింది. ఈ దుస్థితిని చూచిన కవులు, సంస్కర్తలు ఈ సమస్యపై అనేక నాటకాలు. ప్రహసనాలు. వ్యాసాలు వ్రాసి, ఉపన్యాసాలిచ్చి ప్రజల దృష్టిని ఈ వైపుకు మళ్ళించారు. వారి ప్రయత్నాల వల్ల, ఉద్యమాలవల్ల ఈనాడు వృద్ధ వివాహాల సంఖ్య చాలా తగ్గింది.

వైధవ్యము:

వైధవ్యమనేది నారీజనానికి శాపం లాంటిది. ఇది మరణంకంటె భయంకరమైనది. ఇట్టి దుర్భరమైన జీవితం గడపటం నరక సదృశమే! ఎందుచేత?

1. ఆర్థికంగా ఏ ఆధారమూ, అధికారమూ లేకపోవటం.
2. బంధువుల దయాదాక్షిణ్యాలపై జీవితాంతం ఆధారపడి ఉండాల్సి రావటం.
3. సమాజంలో విలువ లేకపోవటం హీనంగా చూడబడటం.

4. ఏ శుభకార్యాల్లోనూ పాల్గొనటానికి వీలులేక, సాటి స్త్రీలలో తక్కువగా చూడబడటం.

5. వాంఛల్ని అణుచుకోలేక, అదుపులో పెట్టుకోలేక, ఒకరికి ఆధారాన్ని చేపట్టటానికి వీలులేక లోలోన క్రుళ్ళి చావాల్సి రావటం.

6. జీవితంలో సుఖ సంతోషాలకు తావులేక పోవటం — భవిష్యత్తు అంధకార మయం కావటం.

ఈ దుస్థితు లన్నింటికీ ముఖ్యకారణం స్త్రీకి పునర్వివాహాన్ని అంగీకరించక పోవటమే; కనీసం పిల్లలులేని స్త్రీకి సైతం అట్టి అర్హత లేకపోవటం. పూర్వ కాలంలో విధవా వివాహం చేసుకొన్న స్త్రీకి 'పునర్భూ' శబ్దాన్ని వాడారు. నారద స్మృతిలో స్త్రీలను ఏడు రకాలుగా విభజిస్తూ ఈ పునర్భూ శబ్దవాచ్యలైన స్త్రీలలో మూడు భేదాలు చెప్పారు. (1) వివాహం మాత్రం జరిగి, భర్తతో మాట్లాడి యెరుగని స్త్రీ. (2) మొదటి భర్తను వదలి వేరొకనిని చేసుకొని, మళ్ళీ మొదటిభర్తవద్దకే వచ్చిన స్త్రీ. (3) భర్త చనిపోయిన పిమ్మట ఆతని సపిండ సంబంధీకులను వివాహ మాడిన స్త్రీ; అని.

మనుస్మృతి (9-176)లో "సాచే దక్షత యోనిః స్యాద్గత ప్రత్యాగతాపివా పౌనర్భవేన భర్త్రా సా పునః సంస్కార మర్హతి" అక్షతయోనియైనట్టి బాలవితంతువుకు, మొదటి భర్తను వదలివెళ్ళి, మళ్ళీ తిరిగివచ్చిన స్త్రీకి వివాహ సంస్కారం చెప్పారు. కశ్యపుడు, బోధాయనుడు, ఇటువంటి 'పునర్భూ' శబ్దవాచ్యలను ఏడు రకాలుగా విభజించారు. ఆ కాలంలో భర్తయొక్క సంపర్కం కలగనట్టి బాల వితంతువులే కాకుండా, బిడ్డలు కలిగిన వితంతువులు సైతం మళ్ళీ వివాహాలు చేసుకొన్నట్లు తెలుస్తుంది. ఒక భర్తను వదలి, వేరొకనిని వివాహమాడి, మళ్ళీ మొదటి వాని వద్దకే వచ్చిన స్త్రీ యొక్క కుమారునికి "పౌనర్భవుడు" అనే శబ్దం వాడారు. నపుంసకుడు, పిచ్చివాడు, జాతిభ్రష్టుడు అయిన భర్తను శాశ్వతంగానే వదలివేసి మరియొకనిని వివాహమాడిన స్త్రీ యొక్క పుత్రుని కూడా పౌనర్భవుడు అనేవారు. దీనినిబట్టి స్మృతికాలానికి, సూత్రకాలానికి ఆరంభంలో విధవా వివాహాలు చెదురు ముదురుగానైనా ఉన్నాయనేది నిస్సందేహం. ఋగ్వేదం 10-18.8. లో ఈ మంత్రం ఉంది — "ఉదీర్ష్వ నార్యభి జీవలోకం గతాసుమేత ముపశేష ఏహి. హస్త గ్రాభస్య దిధిషో స్తవేదం పత్యుర్జని త్వ మభి సంబభూథ "ఓ నారీ! లెమ్ము! మర్త్యలోకాన్ని ప్రవేశించు; నీవు ఆ చనిపోయిన వానివద్ద పడుకొన్నావు. నేను నీ

ప్రేక్షకుణ్ణి! నేను నీ పాణిగ్రహణం చేశాను. కాబట్టి ఈనాటి నుండి నీవు 'పత్ని' అనే పదవిని పొందు'' అని. దీనినిబట్టి ఋగ్వేదకాలంలో విధవా వివాహాలు ఉన్నాయని అంటారు. కొందరు పండితులు ఈ మంత్రాన్ని మెలికలు త్రిప్పి వేరొక అర్థాన్ని కల్పించటానికి ప్రయత్నిస్తారు. కాని, సాయణుడు కూడా ఈ అర్థాన్నే చెప్పాడు — తైత్తిరీయ అరణ్యకం 6-1. పైని భాష్యంలో!

''త్వం హ స్తగ్రాహస్య పాణిగ్రాహవతో దిధిషోః పునర్వివాహేచ్ఛోః పత్యుః ఏతజ్జనిత్వం జాయాత్వమభిసంబభూథ సమ్యక్ ప్రాప్నుహి. (తై.ఆ. 6-1 సాయణ భాష్యం)

అట్లాగే, అథర్వవేదం 9-5-27 లో స్త్రీకి పునర్వివాహం ఉన్నట్లు ఉదహరించి ఉంది. అథర్వవేదంలోనే (5-17-89) ''ఉతయత్ పతయో దశ స్త్రియాః పూర్వే అబ్రాహ్మణాః బ్రహ్మా చేద్ధస్త మగ్రహీత్ స ఏవ పతిరేకధా. బ్రాహ్మణ ఏవ పతి న రాజన్యో న వైశ్యః. తత్సూర్యః ప్రబ్రువన్నేతి పంచభ్యో మానవేభ్యః'' ఒక స్త్రీకి పదిమంది భర్తలుంటే ఉండవచ్చుగాక! బ్రాహ్మణుడు గనుక ఆ స్త్రీని పాణిగ్రహణం చేస్తే, అతడే ఆమెకు యథార్థమైన భర్త అవుతాడు. వైశ్యక్షత్రియులు కారు. ఈ సత్యాన్ని ఘోషిస్తూనే సూర్యుడు తిరుగుతున్నాడు'' అని. ఇట్లా వేదాల్లో అక్కడక్కడ విధవా వివాహ ప్రస్తావన వచ్చినందున, ఆ కాలానికి అది క్రొత్తకాదని, మనం భావించాల్సి వస్తోంది.

గృహ్యసూత్రాల్లో కూడా విధవా వివాహ ప్రస్తావన ఉంది. వశిష్ఠ ధర్మసూత్రాల్లో (17-67) ''ప్రోషిత పత్నీ పంచవర్షాణ్యుదీక్షేత. ఊర్ధ్వం పంచభ్యో వర్షేభ్యో భర్తృసకాశం గచ్ఛేత్. యది ధర్మార్థాభ్యాం ప్రవాసం ప్రతి అనుకామా స్యాత్. యథా ప్రేతే ఏవం వర్తితవ్యం స్యాత్. ఏవం బ్రాహ్మణీ పంచప్రజాతా అప్రజాతా చత్వారి. అత ఊర్ధ్వం సమానోదక పిండజన్మర్షి గోత్రాణాం పూర్వః పూర్వః గరీయాన్ న తు ఖలు కులీనే విద్యమానే పరగామినీ స్యాత్.'' భర్త పరదేశం వెళ్ళిఉంటే, బ్రాహ్మణ స్త్రీ 5 సంవత్సరాలపాటు అతనికోసం వేచిఉండాలి. ఆపైన అతడు ఇంటికి తిరిగి రాకపోయినా, ఆమెకు అతని వద్దకు వెళ్ళటానికి ఇష్టం లేకపోయినా, ఆతని ఇంటిపేరు వానినిగాని, ఆతని గోత్రం కలవానిని పెళ్ళిచేసుకోవచ్చునన్నారు.

వశిష్ఠ ధర్మసూత్రాల్లోనే (17-14) పౌనర్భవుని సంస్కారాన్ని గురించిన వర్ణన ఉంది. ఇట్లా, ధర్మసూత్రాల్లో — అత్యంత ప్రాచీనమైన ధర్మసూత్రాల్లో —

స్త్రీ పునర్వివాహం చేసుకోవచ్చునని అంగీకరించినట్లుగా ఉంది. కాని. గృహ్య సూత్రాల్లో లేదు. అప్పటికి ఆ ఆచారం తగ్గిపోయి ఉండవచ్చు. మనుస్మృతి (9-166)లో ''సా చేదక్షత యోనిః స్యాద్ గత ప్రత్యాగతాపి వా పౌనర్భవేన భర్త్రాసా. పునః సంస్కారమర్హతి'' అని బాల వితంతువులకు పునర్వివాహం అంగీకరింపబడ్డది. అట్లాగే. యాజ్ఞవల్క్య స్మృతి (1-222)లో ''రోగీ హీనాతి రిక్తాంగః. కాణః. పౌనర్భవస్తథా. అవకీర్ణీ, కుండగోళౌ, కునఖీ శ్యావదంతకః'' అంటూ శ్రాద్ధానికి భోక్తగా పనికిరాని వారి జాబితాలో పౌనర్భవుని చెప్పారు. అంటే. ఆ కాలంలో మగవారి లాగా పౌనర్భవులు కూడా సంఘంలో చాలా మందే ఉండి ఉండాలి. అపరార్కుడు. బాలవిధవకు బలాత్కారంగా దొంగిలింప కొని పోబడిన స్త్రీకి — పునర్వివాహాన్ని ఉదాహరించాడు.

భర్త పరదేశం వెళ్ళి ఉండే బ్రాహ్మణ స్త్రీ 8 సంవత్సరాలపాటు వేచి ఉండాలి. పుత్రుడు జన్మించి ఉండకపోతే 4 సంవత్సరాలు ప్రతీక్షించాలి. తరువాత మరియొకరిని వివాహమాడవచ్చు. ప్రోషితభర్తృక అయితే (భర్త పరదేశం పోగా అతనికోసం చింతిస్తూ ఉండే నాయిక) భర్త గనుక జీవించి ఉంటే, పైన చెప్పిన దానికి రెట్టింపు కాలం వేచి ఉండాలి. ఇది ప్రజాపతి ఆజ్ఞ. అప్పటికీ భర్తజాడ ఏమాత్రమూ తెలియకపోతే మరొకరిని వివాహమాడవచ్చు —

''అష్టౌ వర్షాన్యుదీక్షేత. బ్రాహ్మణీ ప్రోషితం పతిం
అప్రసూతా చ చత్వారి. పరతోఽన్యం సమాశ్రయేత్
జీవతి శ్రూయమాణేతు. స్యాదేషః ద్విగుణోఽవధిః
అప్రవృత్తౌ చ భూతానాం దృష్టిరేషా ప్రజాపతే
అతోఽన్యగమనే స్త్రీణామేష దోషో న విద్యతే.''

అని నారదస్మృతి (94-101)లో చెప్పబడ్డది. మనుస్మృతి (9-176)లో

— ''ప్రోషితో ధర్మకార్యార్థం. ప్రతీక్ష్యోఽష్టౌ నరః సమాః
విద్యార్థం షట్. యశోఽర్థంవా కామార్థం త్రీంస్తువత్సరాన్.''

భర్త ధర్మకార్యాలకోసం పరదేశం పోయి ఉంటే 8 సంవత్సరాలు. విద్య, లేదా. కీర్తి సంపాదనకోసం వెళ్ళివుంటే 6 సంవత్సరాలు, మరొక స్త్రీని వివాహమాడి నట్లయితే 3 సంవత్సరాలూ వేచి ఉండాలని అన్నాడు.

కౌటిల్యుడు, అర్థశాస్త్రంలో (3-4) సన్యసించిన వాని భార్య, పరదేశం పోయినవాని భార్య, చనిపోయినవాని భార్య, ఏడు ఋతుకాలాల పాటు వేచి ఉండా లన్నాడు. ఆమెకు సంతానం గనుక ఉంటే, ఒక సంవత్సరం పాటు ఆగి, భర్త యొక్క తమ్ముని వివాహమాడటం మంచిదన్నాడు. మరదులు లేకపోతే సపిండుని లేదా ఆ వంశంవానిని లేదా ఆ గోత్రం లేదా ఆ కులం వానిని చేసుకోవాలన్నాడు. పరాశర స్మృతి (4-30)లో భర్త, ఏ కారణంవల్లనైనా నష్టమైనా (కనిపించకుండా పోయినా) చనిపోయినా, నపుంసకుడైనా, సన్యసించినా, పతితుడైనా, ఈ అయిదు సందర్భాల్లోనూ స్త్రీ, పునర్వివాహం చేసుకోవచ్చు నన్నారు.

> ''నష్టే, మృతే, ప్రవ్రజితే, క్లీబే చ పతితే పతౌ
> పంచస్వాపత్సు నారీణాం పతిరన్యో విధీయతే'' అని (ప. స్మృ. 4-30)

అయితే పండితులు ఈ శ్లోకానికి రకరకాల విపరీతార్థాలు కల్పిస్తూ ఉంటారు — వాద వివాదాలు లేవదీస్తూ ఉంటారు.

వశిష్ఠస్మృతి (17-69)లో ''పాణిగ్రాహే మృతే బాలా కేవలం మంత్ర సంస్కృతా, సాచేదక్షతయోనిః స్యాత్ పునః సంస్కార మర్హతి'' భర్తృ సమాగ మాల్లేని పొందని బాలిక — అక్షతయోనియైన బాలవితంతువు మళ్ళీ వివాహ సంస్కారానికి అర్హురాలు అన్నారు. అట్టి బాలవితంతువు, కన్యక్రిందే లెక్క అని లఘు శాతాతప స్మృతి 5-44 లో ఇట్లా అన్నారు — ''ఉద్వాహితా చ యా కన్యా, న సంప్రాప్తా చ మైథునం, భర్తారం పునరభ్యేతి యథా కన్యా తథైవ సా.''

నారదస్మృతిలో (12-50) ''మృతే భర్తర్యసంప్రాప్తం దేవరాదీన పాస్యయా ఉపాగచ్ఛేత్ పతిం కామాత్ సా ద్వితీయా ప్రకీర్తితా.'' తన మొదటి భర్తయొక్క మరణానంతరం తన మరదిని తప్ప ఇతరులను వివాహమాడితే, ఆమె కామలిప్సలో పడిన వేశ్యక్రింద లెక్క అన్నారు; పునర్వివాహం అంగీకరించినట్లే గదా!

బాల వితంతువులు పునర్వివాహం చేసుకున్నా తప్పులేదనీ, ఆమె సంతానం, దేవతలకు పితరులకు హవ్య కవ్యాదులు ఇవ్వటానికి అర్హులని మహాభారతంలో (13-55-7) ''పునర్భూరపి సా కన్యా స పుత్రా హవ్యకవ్యదా'' అని అన్నారు. ఇవన్నీ వేదకాలంనుండి స్మృతికాలం వరకు ముఖ్యంగా బాల వితంతువుల పున ర్వివాహాలు ఉన్నాయనేందుకు ప్రమాణాలుగా చెప్పబడ్డాయి. చరిత్రకాలంలో ఇటు వంటి వివాహాలు కొల్లలుగా కనిపిస్తాయి. ఉ॥ గుప్తవంశానికి చెందిన సుప్రసిద్ధ చక్ర

వర్తి చంద్రగుప్త విక్రమాదిత్యుడు, తన అన్నగారి భార్యయైన ధ్రువదేవిని వివాహమాడాడు. వీరి పుత్రుడు కుమారగుప్తుడు, తరువాత గుప్తవంశానికి పాలకుడైనాడు.

రోజులు గడచినకొద్దీ క్రీ. శ. 200 తరువాతినుండి వచ్చిన స్మృతికారులు ఇందుకు విరుద్ధంగా ఏకకంఠంతో చెప్పనారంభించారు. క్రీ. శ. 600 నుండి సమాజంలో విధవా వివాహాలకు వ్యతిరేకత ఎక్కువైంది. ప్రాచీన స్మృతికారులు విధవా వివాహాలకు అనుకూలంగా చెప్పినది ఈ కలియుగానికి సంబంధించినది కాదని. ఇతర యుగాలకు సంబంధించిన విషయమనీ బుకాయించటం ఆరంభించారు. ఇతర యుగాలవారికోసం ఈ యుగంలో వీరు ఈ ధర్మసూత్రాలు ఎందుకు వ్రాయవలసి వచ్చింది? వారికి తగిన ఆధారం ఏదీ దొరకనందున వారికి సమకాలీనమైన ఆదిత్య పురాణంలోనిదంటూ ఈ శ్లోకాన్ని ప్రమాణంగా చూపించారు —

''ఊఢాయాః పునరుద్వాహం. జ్యేష్ఠాంశం. గోవధం తథా
కలౌ పంచ న కుర్వీత భ్రాతృజాయాం. కమండలుం'' అని.

క్రీ. శ. 1000 నుండి బాలవితంతు వివాహాలను కూడా నిషిద్ధం అనటం ఆరంభించారు. క్రీ. శ. 1150 నాటికి స్మృతిచంద్రిక లాంటి గ్రంథాలన్నీ అక్షతయోనియైన బాలవితంతువుల పునర్వివాహం అనేది కలియుగానికి సంబంధించిన విషయం కాదని, అనటం మొదలుపెట్టాయి. రానురాను విధవ అనే శబ్దానికి విస్తృతమైన అర్థాలు లాగటం మొదలుపెట్టారు. మాట ఇచ్చి వివాహం కాకపోయినా, మనస్సులో ఎవరైనా వరించినా, వివాహ సంస్కారం జరక్కపోయినా వివాహిత క్రిందనే జమకట్టారు. ఈ ధర్మశాస్త్రకారులు పోటీలుపడి ఎంతవరకు పచ్చారంటే, వివాహం నిశ్చయమైన పెమ్మట వరుడు చనిపోతే ఆ కన్యను కూడా — వివాహం జరగకపోయినా విధవక్రిందనే జమకట్టారు —

''ఏవం చ యాని సంస్కారాదూర్ధ్వ మక్షతయోన్యాః పునరుద్వాహ పరాణి తాని యుగాన్తరాభిప్రాయాణీతి మన్తవ్యమ్'' (స్మృతిచంద్రిక)

''సప్త పౌనర్భవాః కన్యాః వర్జనీయాః కులాధమాః.
వాచాదత్తా మనోదత్తా కృతకౌతుక మంగలా'' (స్మృతిచంద్రిక)

అనిఇట్టి అక్షతయోనియైన బాలవితంతువులకు సైతం పునర్వివాహాన్ని నిషేధించారు.

పొరపాటున ఎవరైనా అట్టి విధవను చేసుకొంటే ప్రాయశ్చిత్తం చేసుకొని ఆమెను వదలిపెట్టాలని లఘు ఆశ్వలాయన వచనం —

"అజ్ఞాతస్తు ద్విజో యస్తు విధవా ముద్వహేత్ యది
పరిత్యజ్య చ పై తాంచ, ప్రాయశ్చిత్తం సమాచరేత్ (ల.ఆ. 21-6)

ఇట్లా తరువాతి స్మృతికారులంతా ఒక్కుమ్మడి ప్రౌఢవితంతువుల విషయంలోనేగాక బాలవితంతువుల విషయంలో కూడా చాలా నిర్దయగా చెప్పారు. వారిపై పండెత్తారు. అటువంటి బాల వితంతువుల కన్నీటితో భారతదేశంలోని అన్ని ప్రాంతాలూ తడిసినాయి. ఆ చిత్తడి నేలలో ధర్మకర్షకులు ధర్మబీజాల్ని నాటి తత్ఫలితాల్ని చూచి ఆనందలాస్యం చేశారు. ఆ ధర్మపరిరక్షకుల కన్నెఱ్ఱలకు భయపడి, ధర్మభీరువులైన తల్లిదండ్రులేగాక, ఆ అమాయిక కన్యలుసైతం తమ అదృష్టాన్ని తామే నిందించుకొని జీవయాత్రలు చాలించారు. అయితే, ఈ దౌర్భాగ్య స్థితిని అనుభవించింది నాటి సమాజంలోని ఉన్నతవర్గాల వారే; ఆటవికులు, అనాగరకులు అనబడేవారికి ఈ ధర్మరక్షకుల భయంలేదు కాబట్టి వారు విధవా వివాహాలను స్వేచ్ఛగా చేసుకొన్నారు; చేసుకొంటున్నారు. ఈ విషయంలో నిమ్నజాతులవారే ప్రశంసార్హులు అనాలి. వారికి ధర్మం అంటే ఏమిటో తెలియకపోయినా, శ్లోకాలకు అర్థం ఏమిటో తెలియకపోయినా మానవత్వం అంటే ఏమిటో తెలుసు. గడచిపోయిన విషయాలను త్రవ్వుకొన్నందువల్ల ప్రయోజనం లేదని, పూర్వులను నిందించటం అనవసరమని తెలుసు. అయినప్పటికి చరిత్రనుండి మనం నేర్చుకోవలసినవి చాలా ఉంటాయి. చరిత్రను అస్థిపంజరంగా భావించటం తప్పు. మన భవిష్యత్తుకు బాటవేసుకోవటానికి ఉపయోగించే విషయాలెన్నో చరిత్రవల్ల తెలుస్తాయి. చేసిన తప్పులు చేయకుండా చరిత్ర మనకు త్రోవ చూపుతుంది.

సరే; బాల వితంతువుల రక్తాశ్రువులతో పవిత్ర భారతం అంతా తడిసిందని అన్నాంగదా; ఈ మాట కావ్యకల్పనగా కొట్టిపారవేయవచ్చు; దీనిని (ఈ దృశ్యాన్ని) పాఠకుల కళ్ళముందు ఉంచటానికి ఉదాహరణ — 1931 లో జరిగిన జనాభా లెక్కలను బట్టి భారతదేశంలో —

| | | |
|---|---|---|
| ఏడాదిలోపు హిందూ బాల వితంతువులు | — | 1515 మంది |
| 5 సంవత్సరాలలోపు బాల విధవలు | — | 23667 మంది |
| 5 నుండి 10 సంవత్సరాలలోపు బాల విధవలు | — | 83920 మంది |
| 11 నుండి 15 సంవత్సరాలలోపు బాల విధవలు | — | 145449 మంది |
| 16 నుండి 20 సంవత్సరాలలోపు బాల విధవలు | — | 4041672 మంది |

(ఈ అంకెలు Census of India 1931 Part I Part II Imperial table page 120 - 122 లోనివి.) ఈ అంకెలవల్ల బాల్య వివాహాలు ఎంత అధికంగా జరిగినాయో, వాటివల్ల కలిగిన దుష్పరిణామం ఎంత భయంకరంగా ఉందో మనకు తెలుస్తుంది. ఏడాదిలోపు వయస్సుకల విధవలున్నారంటే నిజంగా మనం సిగ్గుపడవద్దా? ఈ అంకెలన్నీ మన హిందూ విధవలకు సంబంధించినవి. ఆనాటి ఆంగ్లేయులు అబద్ధాలు వ్రాయించారనే ధర్మపరిరక్షకు లెవరైనా ఉంటే వారికి సమాధానాలు. ఆనాటి ఉమ్మడి భారతదేశ జనాభా షుమారు 25 కోట్లు. ఆ జనాభాలో మహమ్మదీయులు, క్రిష్టియన్లు, ఇతర మతాలవారు పోగా షుమారు 20 కోట్లమంది హిందువులలో పదికోట్లమంది స్త్రీలని మనం అనుకుంటే ఆ స్త్రీలలో దాదాపు 43 లక్షలమంది బాలవిధవ లున్నారంటే హృదయవిదారకమైన విషయం కాదా? ఒక సంవత్సరంలోపు విధవలు ఏ దేశంలోనైనా, ఏ యుగంలోనైనా ఉన్నారో లేదో పరిశోధించాల్సిన విషయం. నామకరణం జరగటంతోనే వివాహం, మాటలు రాకపూర్వమే వైధవ్యప్రాప్తి అనేది మనం ఈనాడు ఊహించలేము. కాని జరిగింది మాత్రం యథార్థం.

దుష్పరిణామాలు:

ఇట్లా బాలవితంతు వివాహాన్ని సైతం ధర్మశాస్త్రకారులు నిషేధించటంవల్ల, ఈ వితంతువులకు మూడే మార్గాలున్నాయి.

1. జీవితాంతం వైధవ్యంతో దుర్భరమైన జీవితం గడుపుతూ, ఈ పెద్దలచేత పతివ్రత, పవిత్రురాలు అనే బిరుదాన్ని పొందటం.
2. భర్తతోపాటే సహగమనంచేసి ఈ సమాజం నుండి, ఈ ధర్మరక్షకుల నుండి విముక్తి పొందటం.
3. శరీర వాంఛల్ని, సహజమైన కామాదుల్ని అతిక్రమించలేక, వ్యభిచారానికి పాల్పడటం, సంఘ బహిష్కారాన్ని అనుభవించటం, ఆదరించే ఇతర మతాల పంచన చేరటం.

ఈ విధమైన బాలవితంతువులు కామవాసనాప్రేరితులై ధనవంతుల పజ్జనచేరి, వారికి రహస్య భోగసాధనాలుగా ఉపయోగపడినట్లు కామశాస్త్రంవల్ల తెలుస్తోంది —

"విధవా త్విన్ద్రియ దౌర్బల్యా దాతురా. భోగినం గుణసంపన్నం
విన్దేత సాభ్యార్థినీ సాకిలాన్యం విన్దేత" (కామశాస్త్రం 4-2. 39,41)

ఈ వితంతూద్వాహ నిషేధంవల్ల కలిగిన ముఖ్య ఫలితాలు రెండు. (1) సహగమనాచారం ప్రబలటం (2) వ్యభిచారం ప్రబలటం. తద్వారా వేశ్యలనే క్రొత్త వర్గం, వారి ద్వారా సాంఘిక సమస్యలు కొన్ని క్రొత్తగా పుట్టటం. వీటివల్ల కలిగిన ఆనుషంగిక ఫలితాలు — (1) జాతీయశక్తి నశించటం (2) వర్ణసంకరం (3) భ్రూణహత్యలు (4) వేశ్యలవల్ల కులస్త్రీలకే హాని కలగటం (5) వేశ్యావృత్తి వృద్ధి పొందటం (యతీంద్రమోహనదత్తులాంటి వారు కొంతమంది సమాజ శాస్త్రజ్ఞులు వేశ్యల్లో నూటికి 75 మంది హిందూ వితంతువులని లెక్కలు చూపించారు) (6) విధవా వివాహాలను ఆదరించే మతాల సంఖ్యను పెంచటం (7) బాల వితంతువులకు క్రొత్తధర్మాల్ని సృష్టించాల్సి రావటం. సహగమనం చేయాలి. శుభ కార్యాలకు ధార్మిక కార్యాలకు పనికిరాదని శిరోముండనం చేయించాలని, అలంకారాలు పనికి రావని, ఒక్కపూట భోజనం చేయాలని. వారికి అనేక వ్రతాలు ఉపవాసాలూ ఏర్పాటు చేశారు. భర్త చనిపోయిన పిమ్మట ఏడాది వరకు నేలమీద పడుకొంటూ, కంద మూలాలు తింటూ శరీరాన్ని కృశింపచేయాలని. జీవితాంతంవరకు సహనం కలిగి వ్రతశీలం కలిగి. బ్రహ్మచారిణిగా ఉండాలనీ. ఈ నాలుగు ధర్మాలూ పాటిస్తే పుత్రులు లేకపోయినా. వితంతువు స్వర్గానికి వెళుతుంది అని. మనుస్మృతిలో 5-157 నుంచి 160 వరకు చెప్పబడ్డది.

బోధాయనుడు "సంవత్సరం ప్రేతపత్నీ మధు మాంస మద్య లవణాని వర్జయేదధః శయీత షణ్మాసానితి మౌద్గల్యః" బౌ.ధ.సూ. 2-2-66. 68 అంటూ ఆమోద ముద్రవేశాడు. వశిష్ఠ ధర్మసూత్రాలు (17-55. 56) లోను. పరాశరస్మృతి (4-31) లోను. పై విషయాలకే ఆమోదం తెలిపారు. వృద్ధ హారీత స్మృతిలో (11-206 నుండి 210) వరకు విపులంగా వితంతు ధర్మాలు చెప్పబడ్డాయి — తల దువ్వుకోకూడదు. తాంబూలం వేసుకోరాదు. గంధం. పుష్పం. ఆభరణాలు. రంగు వస్త్రాలు. ధరించకూడదు. లోహ పాత్రల్లో భోజనం చేయరాదు. రోజుకు రెండుసార్లు మాత్రమే తినాలి. కాటుక పెట్టుకోరాదు. ఇంద్రియాలను జయించి, తెల్లటి వస్త్రాలు కట్టుకొంటూ. జపటం. సోమరితనం లేకుండా భగవంతుని పూజించాలి. నేలమీద. చాపమీద పడుకోవాలి. రజస్వల అయినప్పుడు నిరాహారం తోనే ఉండాలి. ఇట్లా ఒక సూత్రకారుడు కొన్ని మరచినా. వేరొక సూత్రకారుడు వాటిని పూరిస్తూ విధవా ధర్మాల్ని గ్రంథస్థం చేశారు. ఈ విధంగా వితంతువుల్ని హింసించారని మనం అన్నా, అవన్నీ వారి ఆరోగ్యం కోసం చెప్పబడిన

సూత్రాలని సమర్థింపజాలిన పండితులున్నారు. ఇట్లా సమాజాన్ని పవిత్రంగా, దోషరహితంగా ఉంచడానికై వారు చేయవలసినదంతా చేశారు. ఆశ్చర్యకరమైన విషయం ఏమంటే, శాస్త్రకారులకు ఈ విషయంలో (విధవల్ని కట్టుబాటులో పెట్టి హింసించటంలో) వారు ఆశించిన దానికంటె ఎక్కువ ఫలితం కనిపించింది. అంటే, వారి అనుయాయులు ఇంకా నాలుగు ఆకులు ఎక్కువ చదివినవారన్నమాట.

**వితంతువుల శిరోముండనం :**

ప్రాచీన కాలంలోని విధవలకు శిరోముండనం ఉండేదా? లేదా? అనేది ఖచ్చితంగా తెలియదు. కొంతమంది పండితులు వేదకాలంనుండి శిరోముండనం ఆచారంగా ఉందని అంటారు. కొంతమంది పదవ శతాబ్దం తరువాతనే ఈ ఆచారం ఏర్పడ్డదంటారు. ఋగ్వేదంలో 'విధవ' అనే శబ్దం మాత్రమే వాడబడ్డది. ముండన మనే మాట లేదు. అథర్వ వేదంలో ఒకటి రెండు చోట్ల 'వికేశా' అనే మాట వచ్చింది. ఈ మాటకు 'వికీర్ణకేశి' (చెల్లాచెదరైన జుట్టుకలది) అనే అర్థంగా, ముండనమంటే ఇష్టంగల పండితులు సందర్భానికి అన్వయించకపోయినా 'విగతకేశి' అనే అర్థంతీసి వేదకాలంనుండి విధవలకు శిరోముండనం ఉన్నదన్నారు. సాయణుడు సైతం 'వికీర్ణకేశి' అనే అర్థం చెప్పాడు. జుట్టులేనిది అనే అర్థం చెప్పలేదు. బోధాయనుడు తన పితృమేధ సూత్రాల్లో (1-4-3) "అస్య భార్యాః కనిష్ఠప్రథమాః ప్రకీర్ణకేశ్యో వ్రజేయుః పాంసూనంసేష్వావపమానాః" అని. అందులోనే (1-4-13)లో "ఏవ మమార్యా ఏవం స్త్రియః సంయమ్య కేశాన్ యథేతం ప్రతి పునః ప్రతిపరియన్తి" అగ్నిహోత్రియైన పురుషుడు చనిపోతే అతని భార్యలు, చిన్న భార్య అందరికంటె ముందుండగా, విరబోసిన జుట్టుతో శ్మశానానికి పోవాలి; తమ భుజాలపై దుమ్ము చల్లుకోవాలి. పిమ్మట తమ జుట్టు ముడివేసుకొని మూడుసార్లు ప్రదక్షిణం చేయాలి," అని చెప్పి. ఆ పిమ్మట, మృతుని దగ్గర బంధువులు మీసాలు గడ్డాలు గొరిగించాలన్నాడు. ఆనాడు ఆ ఆచారం ఉంటే, బంధువుల మీసాలు గడ్డాలు గొరిగించాలన్నవాడు, భార్య విషయం మరచిపోరాదా? విధవకు శిరోముండనం చెప్పకపోగా ఆ బోధాయన పితృమేధ సూత్రాల్లోనే స్పష్టంగా విధవకు శిరోముండనం లేదన్నారు. (2-3-17) "న స్త్రీణాం కేశవపనం విద్యతే. నబితిర్వేష్టవా. న ప్పనర్ధోహో దారువత్త్రీణాం పాత్రాణి భవన్తీతి విజ్ఞాయతే" అన్నారు.

ఆనాడు విధవలకు శిరోముండనమే ఉండి ఉంటే మనువులాంటి స్మృతికారుడు ఉపహరించకుండా ఉండడు. యాజ్ఞవల్క్య స్మృతిపై మితాక్షర వ్యాఖ్యలో

(3-17) విధవకు శిరోముండనం నిషిద్ధం అన్నారు — 'విధ్వా ద్విప్రపన్నపత్రీణాం నేష్యతే కేశవాపనమ్. ఋతే మహాపాతకినో గోహన్తుశ్చావకీర్ణినః'' అని. వృద్ధ హారీతస్మృతిలో సైతం నిషిద్ధ విషయాలను విస్తారంగా వర్ణించి, శిరోముండనాన్ని చెప్పలేదు — కేశరంజనం పనికిరాదన్నారు — ''కేశ రంజనతా గంధపుష్పాది సేవనం'' (వృ. హా. స్మృ. 11-206) అని; కేశాలంకరణం పనికిరాదన్నారు.

అట్లాగే మహాభారతం స్త్రీపర్వం 16-18 లో ''ప్రకీర్ణ కేశాః క్రోశన్త్యః. కురరీరివ మాధవ'' అని జుట్టు విరియబోసుకొని ఏడ్చే కోండ్రను గూర్చి గాంధారి చెప్పినట్లుంది. అట్లాగే స్త్రీపర్వంలోనే 17-25 లో — ''ప్రకీర్ణ కేశాం సుశ్రోణీం దుర్యోధన శుభాంగనామ్'' అంటూ దుర్యోధనుని ఒడిలో విరియబోసుకొన్న జుట్టు గల లక్ష్మణుని తల్లిని వర్ణించారు. మౌసలపర్వం 7-17 లో ''ప్రకీర్ణమూర్ధజాః సర్వాః విముక్తాభరణ స్రజః'' వసుదేవుని మరణానంతరం ఆతని అంతఃపురంలోని స్త్రీలను వర్ణిస్తూ ప్రకీర్ణమైన కేశాలు కలిగిఉన్నట్లే చెప్పారు. పైగా, శంఖసంహితలో ''జన్మరోమణి యానారీ క్షురకర్మ సమాచరేత్, కన్యా వా విధవా వాపి రౌరవం నరకం వ్రజేత్.'' కన్యగానీ, విధవగానీ, పుట్టువెంట్రుకలను గొరిగిస్తే రౌరవ నరకాన్ని పొందుతుందన్నారు. మనుసంహితలో (మనుస్మృతి కాదు) భర్తలేని స్త్రీ గనుక తల గొరిగిస్తే చండాలయోనిలో జన్మిస్తుందన్నారు. ఇవన్నీ క్రీ. శ. 100 సంవత్సరాలకు పూర్వం రచింపబడిన గ్రంథాలు, కాబట్టి అప్పటివరకు వితంతువుకు శిరోముండనం ఆచారంలో లేదు అని తెలుస్తోంది. పైగా, ఆ కాలంలో నాస్తికులైన జైన బౌద్ధులు మాత్రమే శిరోముండనం (శిఖలేకుండా గొరిగించటం) చేయించే వారు; కాబట్టి అట్లా పూర్తిగా స్త్రీలకు తల గొరిగించటం వైదికమతానుయాయులైన మన ధర్మశాస్త్రకారులకు ఇష్టం ఉండి ఉండదనేది స్పష్టం. జైన బౌద్ధాలు క్షీణ దశలో ఉన్నప్పుడు జైనబౌద్ధ భిక్షుణిలు పవిత్రతకోసం తల గొరిగించినట్లుగా, విధవల పవిత్రతను కాపాడటానికి, తరువాత వచ్చిన ధర్మశాస్త్రకారులు ముండనాన్ని విధించి ఉండవచ్చు.

శిరోముండన మనేది మొదటిసారిగా స్కాందపురాణంలో, కాశీఖండంలో 4-75 ''విధవా కబరీబన్ధో భర్తృ వన్ధాయ జాయతే

శిరసోవపనం తస్మాత్ కార్యం విధవయాతయా.'' చెప్పబడిన ఈ శ్లోకాన్ని ఆధారంగా తరువాతివారు విధవలకు శిరోముండనం విధించి ఉంటారు. క్రీ.శ. 1000

సంవత్సరానికి తరువాతిదైన వ్యాసస్మృతిలో ఈ శ్లోకాన్ని ఉదహరించారట. ఏమైనప్పటికీ, వితంతు శిరోముండన మనేది క్రీ. శ. 1000 సం॥ తరువాతిదేగాని, పూర్వాందికాదు అనే విషయం స్పష్టం.

ప్రస్తుతస్థితి:

కాలక్రమేణ ఆచార వ్యవహారాల్లో, పురుషుల దృక్పథంలో, స్త్రీల ఆలోచనా విధానంలో మార్పులు వచ్చాయి. సంఘసంస్కర్తలు విధవా వివాహ విషయంలోను, వితంతువుల స్థితిగతుల్ని బాగుచేయటంలోను మిక్కిలి శ్రద్ధవహించారు. ఆంగ్ల విద్య, ఆంగ్ల నాగరకతా సంపర్కం, హేతువాద ప్రాబల్యం, స్త్రీ విద్య, ఆరోగ్యం వృద్ధి చెందటం మొదలైన కారణాలవల్ల బాల్య వివాహాలు తగ్గటం జరిగింది. మరణాల సంఖ్య తగ్గటంవల్ల బాలవితంతువుల సంఖ్య తగ్గింది. ఈ విధమైన సత్ఫలితాలు కనిపిస్తున్నాయి. పండిత ఈశ్వరచంద్ర విద్యాసాగరుడు చేసిన భగీరథ ప్రయత్నంవల్ల 1856 హిందూ పునర్వివాహం చట్టం అమలులోకి వచ్చింది. దీనివల్ల స్త్రీ పునర్వివాహం చట్టసమ్మతమైంది. ఈ విషయంలో మన ఆంధ్రదేశంలో కందుకూరి వీరేశలింగం పంతులుగారు మనకు ప్రాతస్మరణీయులు. ఇట్లాగే, అనేక విషయాల్లో స్మృతులు చెప్పిన ఆదేశాల్ని గ్రుడ్డిగా పాటించటం మానివేసి, తార్కికంగా ఆలోచించటం ప్రారంభించటంవల్ల పరిస్థితులు చాలవరకు మారినాయి. అద్యతనభావిలో వితంతువులకు సంఘంలో అందరిలాగానే సమాన గౌరవం, ఆదరణ, ఆర్థికాది కారాలూ సంక్రమించే సూచనలు కనిపిస్తున్నాయి.

సహగమనాలు:

వివాహంతో సంబంధం కలిగిఉన్న విషయా లన్నింటినీ మనం చర్చిస్తున్నప్పుడు, సహగమానాలను గురించి కూడా తెలుసుకోవాల్సి ఉంది. విధవా వివాహాల లాగానే ఈ సహగమన సమస్య కూడా కొన్నాళ్ళపాటు ఒక ఊపు ఊపి వదలింది. సహగమనం, అనుగమనం, లేదా సహమరణం అనుమరణం అని రెండువిధాలుగా దీనిని మనం చెప్పవచ్చు. భర్తతోపాటే అదే చితిలోపడి భస్మమైపోతే సహగమనం, భర్త యెక్కడో దూరదేశంలో చనిపోయిన వార్తవిని చితిపేర్చుకొని అందులోపడి భస్మమైపోతే అది అనుగమనం. ఉదాహరణగా చెప్పుకోవాలంటే, మాద్రిది సహగమనం. రతీదేవిది అనుగమనం; అవుతుంది.

మన హిందూ వైవాహిక వ్యవస్థలోని అపశ్రుతుల్లో ఎక్కువ కల్లోలాన్ని కలిగించిన విషయం సహగమనం అనేది. మన మతంలోనేకాకుండా, అనేక మతాల

వారి విశ్వాసం ఏమంటే. చనిపోయిన వ్యక్తి ఏ లోకానికి పోయినా. అక్కడకూడా ఈ లోకంలో అతనికి అవసరమైన వస్తువులన్నీ అవసరం అవుతాయనే నమ్మకం ఉంది. అందుచేతనే చనిపోయిన వ్యక్తి తాలూకు వస్తువులన్నింటినీ. అతనితోపాటే పాతిపెడతారు, కొందరు. కొందరేమో ఆతనికి అవసరమైన వస్తువుల్ని దానం చేస్తారు. అన్నం, లేదా. బియ్యం. చెంబు. గొడుగు, చెప్పులు, వస్త్రాలు. పీటలు, పుస్తకాలు వగైరాలు. వీటి అన్నింటితోపాటు. పరలోకంలో సైతం పురుషునికి అత్యంతావశ్యకమైనది భార్య. పైగా. భార్య భర్తలకు విడదీయరాని ధార్మిక సంబంధం ఉన్నదని. భార్య అంటే అర్ధాంగి కాబట్టి. భర్త చనిపోయినప్పుడు వైధవ్యాన్ని అనుభవిస్తూ. ఈ లోకంలో బాధలు అనుభవించటంకంటె. భర్తతో పాటే పరలోకానికిపోయి, అతనితోపాటే ఉండటం మంచిదనే భావం ఈ సహగమనం అనే ఆచారానికి మూలభావన అయిఉండవచ్చు; అయితె, భార్య ముందుగా చనిపోతే. భార్యకు కూడా భర్త అవసరం ఉంటుంది కాబట్టి భర్త కూడా ఎందుకు సహగమనం చేయకూడదు? అని ఎవరూ అడగరాని ప్రశ్న. కొంతమంది స్త్రీలు, మాద్రిలాంటివారు. అత్యంత ప్రేమాస్పదుడైన భర్త చనిపోగా దుర్భరవియోగాన్ని భరించలేక, జీవితంమీద రోసి, సహగమనం చేస్తే చేసిఉండవచ్చు. ప్రాగుబోతుతో. జూదగానితో ఈ లోకంలోనే పడరాని పాట్లు పడి. పరలోకంలో కూడా యీ బాధలు పడటానికి ఏ స్త్రీ స్వచ్ఛందంగా అంగీకరిస్తుంది?

సరే, మొదట స్వచ్ఛందంగా జరిగిన ఈ పద్ధతి, తరువాత తరువాత ఒక ఆచారంగా బలవంతంగా తయారై స్త్రీల పాలిట ఒక శాపంగా తయారై ఉండవచ్చు. భారతదేశంలోనేకాక, అనేక పాశ్చాత్యదేశాల్లో సైతం. ఇటువంటి అనుగమనం, సహగమనం అనే ఆచారాలు ఉన్నట్లుగా, డా॥ వింటర్‌నిట్స్, డా॥ వెస్టర్ మార్క్ లాంటి పాశ్చాత్య చారిత్రకులు, విద్వాంసులు అయినవారి వ్రాతలవల్ల తెలుస్తోంది. చైనాలో సైతం ఇటువంటి సహగమనం చేసిన స్త్రీలను ఆదరించినట్లుగా చరిత్ర చెపుతోంది.

వేదాల్లో సహగమన పద్ధతి ఉన్నట్లు కనిపించదు. ఋగ్వేదంలోని మృత్యు సూక్తంలో సైతం దీని ప్రస్తావనలేదు. విలియంబెంటిక్ కాలంలో అనేకమంది పండితులు ఒకటి రెండు మంత్రాలలోని శబ్దాల అర్థాలను మార్చి, తికమకచేసి, సహగమనమనేది వేదోక్తమని రుజువుచేయటానికి విఫలయత్నం చేశారు. ఇండో యూరపియన్ కాలానికి చెందిన ఆచారంయొక్క అవశేషంగా మిగిలి ఉన్నట్లు

అథర్వణవేదంలోని (18-2-1) మంత్రాన్ని బట్టి ఇట్లా తెలుస్తోంది — ఆనాటి ఆచారాన్ని బట్టి భర్తయొక్క చితిమీదకు ఆతని భార్య ఎక్కాలి. పిమ్మట ఆమెను దిగి వమ్మనీ. నీవు నీ పుత్రులతో ధనధాన్యాదులతో సుఖంగా బ్రతకమని ప్రార్థిస్తారు. తైత్తిరీయ ఆరణ్యకం (6-4) లో "ధనుర్హస్తాదాదదానా మృతస్య. శ్రియై బ్రహ్మణే తేజసే బలాయ అత్రైవ త్వమిహవయం సుశేవా విశ్వాః స్పృధోఽభిజాతీర్జయేమ" భర్తయొక్క చితిమీదకు భార్య ఎక్కి, ఆతని చేతిలోనున్న ధనుస్సు, బంగారం, వస్త్రాలు మొదలైన వాటిని తీసికొని తిరిగి రావాలని, పిమ్మట ఆమె సుఖంగా జీవించాలని ప్రార్థిస్తారు.

దీనినిబట్టి, వైదికకాలానికి ఇటువంటి సహగమనమనే ఆచారం ఏదైనా ఉండి ఉంటే, అది క్షీణదశలో అవశేషంగా మిగిలి ఉన్నట్లు తెలుస్తుంది.

క్రీస్తుకు పూర్వం. 600 సం॥ నుండి క్రీ.శ. 300 సం॥ వరకు రచింపబడ్డ గృహ్యసూత్రాల్లో ఈ ప్రస్తావన లేదు. ధర్మసూత్రాల్లోనూ లేదు. ఉండి ఉంటే, వివాహం, చావు, శ్రాద్ధం మొదలైనవాటిని విపులంగా వర్ణించి చెప్పిన ఈగ్రంథాల్లో సహగమనాన్ని గురించి చెప్పకుండకపోరు. విధవలకు వందలకొలదీ కఠోర నియమాల్ని చెప్పిన ఈ గ్రంథాల్లో సహగమనాన్ని గురించి చెప్పకుండా ఉంటారా? దీనిని గురించిన ప్రస్తావనకూడా లేదు. బౌద్ధ గ్రంథాల్లోనూ కనిపించదు. సహగమనమనేది ఉండి ఉంటే, పశుహింసనే సహించలేక వ్యతిరేకించిన బౌద్ధులు మానవహత్యలను మిన్నకుండేవారా? ఆనాటి విదేశయాత్రికులు సైతం — మెగస్థనీస్ తన ఇండికాలోగాని, కౌటిల్యుడు అర్థశాస్త్రంలోగాని పేర్కొనలేదు. విధవా ధర్మాలను విపులంగా చెప్పిన మనువు, యాజ్ఞవల్క్యుడూ సైతం ప్రస్తావించలేదు. కాబట్టి, వేదకాలంలోను, ప్రాచీన సూత్రకాలంలోనూ కూడా ఈ ఆచారం లేదని తెలుస్తోంది.

మహాభారతంలో సహగమనాన్ని గురించిన ప్రస్తావన చాలాసార్లు వచ్చింది. సంస్కృత కావ్యాల్లో, నాటకాల్లో సహగమనం అనే ఆచారం వర్ణింపబడ్డది. వాత్స్యాయన కామసూత్రాలు (6-2-53)లో, వేశ్యలు తమ ప్రేమికులతో, వారు చనిపోయిన పిమ్మట, వారితోపాటు సహగమనం చేస్తామని చెప్పి, వారిని లోబరచుకొనేవారని చెప్పబడ్డది.

ఈ ఆచారం ముందుగా క్షత్రియుల్లో ఆరంభమైనట్లు తెలుస్తోంది. బ్రాహ్మణ స్త్రీ సహగమనం చేయరాదని శాస్త్రాలు చెపుతున్నాయి. అపరార్కుడు 'పైఠీనసి'

అంగిర, వ్యాఘ్రపాదుల వాక్యాలను ఉదహరిస్తూ బ్రాహ్మణస్త్రీ సహగమనం చేయరా దన్నాడు.

"మృతాను గమనం నాస్తి. బ్రాహ్మణ్యాః బ్రహ్మశాసనాత్
ఇతరేషాంతు వర్ణానాం స్త్రీధర్మోఽయం పరః స్మృతః (పైఠీనసి)

"యాస్త్రీ బ్రాహ్మణజాతీయా మృతం పతిమనువ్రజేత్
సాస్వర్గ మాత్మఘాతేన నాత్మానం పతిం నయేత్. (అంగిర)

"నమ్రియేత సమం భర్త్రా బ్రాహ్మణీ శోకమోహితా
ప్రవ్రజ్యాగతి మాప్నోతి మరణాదాత్మఘాతినీ. (వ్యాఘ్రపాద)

పైగా సహగమనం నరకహేతువని, ఆత్మహత్యతో సమానమనీ కూడా అన్నారు. అయితే, వీరికి తరువాతి పండితులు "బ్రాహ్మణ స్త్రీ భర్త చితికి దూరంగా వేరే చితిలో సహగమనం చేయటం పాపమనీ, ఆ భర్త చితిమీదనే సహగమనం చేయా లనీ" అర్థం లాగారు. చదువు, తెలివితేటలు, ఎక్కువ అయినా, ప్రమాదమే అనేందుకు ఇది చక్కని ఉదాహరణ. అతి తెలివితేటలు లాగానే, అతి పాండిత్యం సైతం ప్రమాదహేతువే అనేందుకు ఒక్కటి దృష్టాంతం.

అయితే బ్రాహ్మణస్త్రీకి మాత్రమే సహగమనం అక్కరలేదని ఎందుకు అన్నారు? అంటే, బ్రాహ్మణ వర్ణం పూర్వకాలంలో శ్రేష్ఠమైనదీ, ధర్మపరిరక్షక మైనదీ కాబట్టి, బ్రాహ్మణ విధవ తపస్సుతో నియమపూర్వకంగా జీవితాంతం వైధవ్యాన్ని గడపగలదనీ, ఇతరులకు ఆదర్శంగా ఉండగలదనీ, భావించి ఉంటారు. మహాభారతంలో, ద్రోణుని భార్యయైన కృపి, భర్త మరణం తరువాత, విగలిత కేశాలతో కనిపిస్తుందే తప్ప సహగమనం చేయలేదు. పాండురాజు మరణానంతరం, మాద్రి సహగమనానికి సిద్ధపడగా ఋషులు వారించారు. అప్పుడు మాద్రి "నేను ఇంద్రియాలను వశంలో ఉంచుకోలేను. పైగా, కుమారు లందరి యెడల సమాన ప్రేమను సైతం చూపలేను" అని, సహగమనాన్ని ఎన్నుకుంది. దీనినిబట్టి ఇంద్రియ నిగ్రహంతో బ్రహ్మచర్యాన్ని, వైధవ్య నియమాల్ని పాటించలేని స్త్రీలకు, ఐచ్ఛికంగా మాత్రమే సహగమనం చెప్పారని గ్రహించాల్సి వస్తుంది. సహగ మనాన్ని, స్మృతికారులంతా కూడా గర్భిణియైన విధవ విషయంలో నిషేధించారు.

ఇక, చరిత్రలో చూస్తే భారతదేశంలోని అన్ని ప్రాంతాలలోనూ, సహగమ నాలు జరిగినట్లు సాక్ష్యాలున్నాయి. రాజపుత్ర చరిత్ర, తన పరాక్రమానికి, దేశ

భక్తికీ, ఎంత ప్రసిద్ధిచెందిందో సహగమనాలకు సైతం అంతటి ప్రసిద్ధిని పొందింది. సిక్కుల్లోనూ, మహారాష్ట్రుల్లోనూ కూడా ఈ ఆచారం ఉంది. చేది, చోళ మండలాల్లో ఈ ఆచారం ఉన్నట్లు సాక్ష్యాలున్నాయి. చేది వంశానికి చెందిన రాజు, గంగయదేవుడు, తన 150 మంది స్త్రీలతో సహా, ప్రయాగలోని వటవృక్షం క్రింద ముక్తిని పొందినట్లు శిలాలేఖ ఉంది. ఈ ఆచారం క్రీ. శ. 1000 సంవత్సరాలకు పూర్వం లేనట్లు తెలుస్తోంది. కర్నాటకలోని శిలాలేఖలవల్ల క్రీ. శ. 1000 నుండి 1400 వరకు 11 మంది మాత్రమే సహగమనం చేసినట్లు తెలుస్తోంది. వారు నాయక గౌడ కులాలకు చెందినవారు. ఈ సంఖ్యనుబట్టి చూస్తే ఇది ఐచ్ఛికంగా చేసినవే తప్ప విధిగా చేసినవి కావని తెలుస్తుంది. డా. అల్టేకర్ వ్రాసిన The Position of women in Hindu Civilization అనే గ్రంథంలో, రాజపుత్ర స్థానంలో, క్రీ. శ. 1300 నుండి 1800 సం॥ వరకు, 500 సంవత్సరాల్లో నూటికి 25 మంది సహగమనం చేసినట్లు ఉంది. ఇది ఊహయే కావచ్చు.

అదృష్టవశాత్తు 19 వ శతాబ్దం పూర్వార్థంనుండి ఈ ఆచారం తగ్గుముఖం పట్టింది.. గవర్నమెంటు రికార్డులనుబట్టి 19 వ శతాబ్ది మొదటి 25 సంవత్సరాల్లో అప్పటి బొంబాయి, మద్రాసు రాష్ట్రాల్లో రెంటిలోను కలిపి 50 మందికంటె ఎక్కువ మంది సహగమనం చేయలేదు. దక్షిణాన తంజావూరు జిల్లా సహగమనాలకు కేంద్రంగా ఉండేదిట. అక్కడ 1817 కు పూర్వం $1\frac{1}{2}$ సంవత్సరాలలో 24 మంది సహగమనం చేశారట —— సంవత్సరానికి 16 మంది అన్నమాట .

వారణాసి, సనాతన హిందూ సంప్రదాయాలకు కేంద్రం అని మనకు తెలుసు. అయినప్పటికీ; ఎడ్వర్డు థాంప్సన్‌లాంటి ఆంగ్లేయులు సంపాదించి భద్రపరచిన, 1825 నుండి 1828 వరకు జరిగిన సహగమనాల సంఖ్యలనుబట్టి చూస్తే, ఆనాటి కలకత్తా డివిజన్‌కంటె బనారస్ డివిజన్‌లోని సహగమనాల సంఖ్య చాలా తక్కువ అని, మహమ్మదీయులు. అధికంగా ఉన్న ఢక్కా డివిజన్‌లో ఇంకా తక్కువ అని తెలుస్తుంది.

| ఆనాటి కలకత్తా రాజధానిగా గల డివిజన్లు | క్రీ శ. 1825 నుండి 1828 వరకు సహగమనాల సంఖ్య |
|---|---|
| కలకత్తాడి విజన్ (హిందూ ప్రాధాన్యం) | 5099 |
| ఢక్కావిడిజన్ (మహమ్మదీయ ప్రాధాన్యం) | 610 |

| ఆనాటి కలకత్తా రాజధానిగా గల డివిజన్లు | క్రీ. శ. 1615 నుండి 1828 వరకు సహగమనాల సంఖ్య |
|---|---|
| ముర్షిదాబాద్ డివిజన్ (ముస్లిం ప్రాధాన్యం) | 260 |
| పాట్నా డివిజన్ (హిందూ ప్రాధాన్యం) | 709 |
| బరేలీ డివిజన్ (హిందూ ప్రాధాన్యం) | 193 |
| బనారస్ డివిజన్ (సనాతన హిందూ ప్రాధాన్యం) | 1165 |

(Mill and Wilson — History of British India chapter 9 Page 371)

కలకత్తా డివిజన్‌లో సహగమనాలు అధికంగా ఉండటానికి కారణం — దాయభాగనియమాల్ని బట్టి, పుత్రులు లేని విధవకు సైతం, భర్త ఆస్తిలో అధికారం ఉంది. అంటే, భర్త ఆస్తికి వారసురాలు అవుతుంది. అందుచేత, ఆమెకు యిష్టం లేకపోయినా, ఆస్తిని కాజేయటానికై బంధువులంతా కలసి, బలవంతంగానైనా ఆమెచేత సహగమనం చేయించేవారు. ఆనాటి బొంబాయి, మద్రాసు రాజధానుల కంటె, బెంగాలులో సహగమనాలు ఎక్కువ జరగటానికి కారణం ఇదే అయిఉండ వచ్చు. నాటి బెంగాలు రాష్ట్రంలోని భాగాలే అయిన అస్సాం, బీహార్, ఒరిస్సా, యు. పి. ప్రాంతాల్లోకంటె కలకత్తా ప్రాంతంలోనే ఎక్కువగా జరిగేవి. అవి కూడా బ్రాహ్మణజాతి స్త్రీలలో ఇంకా ఎక్కువగా జరిగేవి — వారికి సహగమనం నిషిద్ధమే అయినా!

19 వ శతాబ్దంలో రాజారామమోహనరాయలు లాంటి సంఘ సంస్కర్తలు ప్రారంభించిన ఉద్యమ ఫలంగా 1929 లో లార్డు విలియం బెంటిక్, సహగమనాన్ని అపరాధంగా చేస్తూ, సహగమనాన్ని నిషేధించే చట్టాన్ని తెచ్చాడు. ఈ చట్టానికి విరుద్ధంగా సనాతనులైన హిందువులు ఆందోళన ప్రారంభించి ప్రీవీ కౌన్సిల్‌లో అప్పీలుచేశారు. వీరు భారతదేశం అంతా తిరిగి కేవలం 800 మంది సంతకాలను మాత్రం సేకరించగలిగారు. దీనినిబట్టి, సామాన్య ప్రజల్లో సహగమనాచారం ఎడల ఎంతటి వైముఖ్యం ఉందో తెలుస్తుంది. ఆంధ్రదేశంలోని బాల విధవల దుస్థితికి కందుకూరి వీరేశలింగం పంతులుగారు ప్రతిస్పందించినట్లే, బెంగాలు లోని స్త్రీల సహగమన దురాచారానికి రామమోహనరాయలు లాంటివారు ప్రతిస్పందించారు. క్రీ. శ. 1829 నుంచి భారతదేశంలో ఈ దురాచారం అంతమై పోయింది. ఆనాటి వితంతువులను బలవంతంగా సహగమనానికి అంగీకరింప

జేయటం. చితిని ఏర్పాటుచేసే పద్ధతులు. సహగమనంచేసే స్త్రీని లేపుకుంపా చితి మీద ఉంచే పద్ధతులు. అన్నీ మనకు లభ్యమైనా యిప్పుడిక అనవసరం అని వ్రాయ లేదు. సహగమనాన్ని గురించి ఎందుకు వ్రాయాల్సి వచ్చింది? అంటే, ఈ పుస్తకం వ్రాస్తున్న ఈ సంవత్సరంలోనే సహగమనాన్ని గురించిన వివాదం ఒకటి ఆరిపోయిన దసుకున్న నిప్పునుంచి లేచిన రవ్వలాగా లేవటం. ఆ రవ్వకు పీఠాధిపతి లాంటివారు ఊది రగుల్కొల్పాలని ప్రయత్నించటంవల్ల ఎందుకైనా మంచిదని పాఠకుల ముందీ విషయం క్లుప్తంగా ఉంచటం జరిగింది.

ఇక్కడ మనం గుర్తుచేసుకోవాల్సిన ముఖ్య విషయం ఒకటి ఉంది. అదే, ఈ పుస్తకం వ్రాయటానికి ప్రేరణ అయినది. అదేమంటే — ఆనాడు దేశం మొత్తంమీద జరిగిన సహగమనాల సంఖ్యకంటె, ఈనాడు ఒక్క జిల్లాలో జరిగే కట్నాల హత్యలు కొన్నిరెట్లు అధికంగా ఉన్నాయి. క్రీ. శ. 1815 లో సమష్టి బెంగాలు రాష్ట్రంలో 378 సహగమనాలు జరిగాయి. అంటే, నేటి అస్సాం, బీహార్, ఒరిస్సా, యు. పి. బెంగాల్ రాష్ట్రాలు అన్నింటిలోనూ కలిసి 378 అన్నమాట. ఈనాడు ఏ ఒక్క జిల్లాలోనైనా సరే, స్త్రీల హత్యలు, ఆత్మహత్యలు (కట్నాలు, అత్తవారి దౌర్జన్యాల కారణంగా) అంతకంటె ఎక్కువగా జరుగుతున్నాయి? నిజంగా యిది హృదయవిదారకమైన విషయం. ఈ విషయమై ప్రజలను గ్రామ ప్రాతి పదికపై సమీకరించి ఉద్యమాన్ని నడిపించాల్సిన అగత్యం ఎంతైనా ఉంది. ఈ పని స్వార్థపరులైన రాజకీయ నాయకులవల్ల కాదు. రామమోహనరాయలు లాంటి నిస్వార్థులైన సంస్కర్తలవల్ల ఈ పని జరగాలి. ఈ పని ఎంత త్వరలో ఆరంభ మైతే జాతికి అంత మంచిది.

నియోగము:

పూర్వకాలం, భర్త జీవించి ఉండగా కాని, చనిపోయిన తర్వాతగాని, సంతానం లేనప్పుడు భర్తయొక్క తమ్ముని లేక, సపిండుని ద్వారా సంతానాన్ని పొందటాన్ని 'నియోగం' అంటారు. వైదిక గ్రంథాల్లో, గృహ్యసూత్రాల్లో, మహా భారతంలాంటి ప్రాచీన గ్రంథాల్లో ఈ పద్ధతి ఉన్నట్లు కనిపిస్తుంది. దీనిని గురించి అధికంగా ప్రమాణాలను ఉదాహరించటంకంటె ప్రధాన విషయాలను చెప్పటం మంచిదని అభిప్రాయం —

(1) ఇందుకు పెద్దల అనుమతి ప్రధానంగా కావాలి. (2) స్త్రీ ఇష్టపడాలి. (3) ఋతుకాలంలో మాత్రమే సమాగమం జరగాలి. (4) మదిలేనప్పుడు

సపిండుడు. సగోత్రుడు అయి ఉండాలి. (5) ఒకరు లేక ఇద్దరు పుత్రులకంటె ఎక్కువమందిని కనరాదు. (6) ఇట్లా పుట్టినవానిని క్షేత్రజుడు అంటారు. అతనికి ఔరసునిలాగానే అన్ని అధికారాలూ ఉంటాయి. (7) ప్రాచీన స్మృతికారులు ఆపస్తంబుడు. బోధాయనుడు ఈ పద్ధతిని వ్యతిరేకించారు. వశిష్ఠుడు గౌతముడు కూడా దీనిని నిందించారు. (8) ప్రస్తుత కాలంలో సమాజంలో ఇటువంటి పద్ధతి నింద్యగా తలచబడుతోంది. (9) (శోధన నాళిక శిశువుల్ని) గాజుగొట్టాల్లో పిల్లల్ని (Test tube Babies) తయారుచేస్తున్న ఈ రోజుల్లో ఈ నియోగానికి ఆదరణ ఉండదు. అందుచేత దీనిని ఇంతటితో వదిలివేస్తున్నాం.

దత్తత:

పుత్రులు లేనప్పుడు సగోత్ర. సప్రవర, సపిండులనుండి పుత్రునిగా ఒకనిని దత్తత చేసుకొనే ఆచారం ఉంది. ఇది శ్రుతి స్మృతి సమ్మతంగా పరిగణింపబడుతోంది. దత్తుడు. ఔరసునిలాగానే అన్ని అధికారాలూ. కర్తవ్యాలూ ఉన్నవాడౌతాడు. పూర్వం స్త్రీకి దత్తత చేసుకొనే అధికారం ఉండేదికాదు. 1955 సం॥ చట్టాన్ని అనుసరించి స్త్రీకి దత్తత చేసుకొనే అధికారం పొందింది. అంతేకాదు. లోగడ పురుషుని మాత్రమే దత్తత తీసుకొనేవారు. ఇప్పుడు ఆడపిల్లను సైతం దత్తత తీసుకోవచ్చు. సమానాధికారాలే సంక్రమిస్తాయి. నియోగింపబడే ఆచారం కంటె ఇది (దత్తత) ఉత్తమమైన పద్ధతి గదా!

# నాల్గవ అధ్యాయం

## హిందూ వివాహం — మరికొన్ని విషయాలు
## సమస్యలు — నేటివి, రేపటివి

ఇంతవరకు మనం చదివిన విషయాల్ని బట్టి చూస్తే ప్రాచీన శాస్త్రకారులు స్త్రీ పురుషుల ధర్మాలను, కర్తవ్యాలను, అధికారాలను నిర్ణయించే సందర్భంలో రెండురకాల కొలబద్దలను ఉపయోగించారనేది స్పష్టం అవుతోంది. మన స్మృతి కారులు తమ దూరదృష్టితో సమాజ శ్రేయస్సుకోసం ధర్మాలను కర్తవ్యాలను సూత్రీకరించారనేది నిర్వివాదమైన విషయం. చాలకాలంపాటు వారు ఆశించినవిధంగా సమాజ వ్యవస్థ కొనసాగింది. కాని, వారు ఉపయోగించిన రెండురకాల మాప దండాలవల్ల స్త్రీ జాతికి నష్టము, పురుషుల్లో విశృంఖలత పెరిగిపోయి, సమాజానికి కొంత నష్టం వాటిల్లింది అనే విషయం కూడా మనం అంగీకరించి తీరాలి. ప్రవ ర్తనకు, శీలానికి సంబంధించి చెప్పే సందర్భంలో స్త్రీలకు విధించిన కర్తవ్యాలు వేరు. పురుషులకు విధించినవి వేరు. స్త్రీలకు గార్హస్థ్యజీవనంలో, వైధవ్యంలో అనేక కఠిన నియమాలు చెప్పారు. పురుషులకు ఆ నియమాలను వర్తింపచేయలేదు. అట్లాగే స్త్రీలకు, విధవలకు కర్తవ్యాలను గూర్చిన పెద్ద పట్టిక యిచ్చారు. ప్రతి స్వల్ప విషయంలోను విధి నిషేధాలు అనేకం చెప్పారు. పురుషుల విషయం వచ్చే టప్పటికి మౌనాన్ని అవలంబించారు. వారి దృష్టిలో పురుషులు సహజధర్మపరా యణులని, వారికి చెప్పవలసిందేమీ లేదని, స్త్రీలు సహజంగా చపలచిత్తులు కాబట్టి వారికే చెపుతున్నామన్నట్లుగా ఉంది. వారి ధోరణి. బాల వివాహాల సందర్భంలో, విధవా వివాహాల సందర్భంలో, ఆర్థిక విషయాలలో, దాయసత్వ నిర్ణయ సందర్భంలో వైధవ్యంతో ప్రతికే విషయంలోనూ ఇట్లా అన్ని విషయాల్లోనూ, స్త్రీని పురుషుని యొక్క ఆస్తిగా, పరిగణించారే తప్ప, స్వతంత్ర వ్యక్తిత్వంగల మనిషిగా గుర్తించ లేదు. ఈ కారణాలవల్ల అనేక శతాబ్దాలపాటు మన హిందూ సమాజంలో సగ భాగం, ఏవిధమైన ఉన్నతిని సాధించటానికి వీలులేకపోయింది. విద్య మొదలైన అనేక విషయాల్లో వెనుకబడి పోయినట్టి స్వాతంత్ర్యం లేనట్టి స్త్రీ సమాజానికి పుట్టిన సంతానం ఏ ఏ విషయాల్లో ఎంతెంత నష్టపోయినదీ ప్రత్యేక పరిశోధనాంశమే అవు తుంది. కాబట్టి, ఈ ప్రస్తుత కాలంలో, స్త్రీకి పురుషునితోపాటు అన్ని రకాల

సాంఘిక, ఆర్థిక రాజనైతిక, ధార్మిక విషయాల్లోనూ సమాన హక్కులు ఉండాలనేది, నేటి నిర్వివాదాంశం. ఆయా సందర్భాలలో ఈ విషయం చెప్పటం జరిగింది.

కుటుంబ నియంత్రణ:

నేడు గార్హస్థ్య జీవితంలో యువతీయువకుల ముందున్నట్టి సమస్యల్లో ప్రధానమైనది కుటుంబనియంత్రణ సమస్య. సంతానమనేది పూర్వకాలంలో వివాహానికి ప్రధానోద్దేశం. సంతాన మనేది, పూర్వకాలంలో వ్యక్తిగత విషయంగా ఉండేది — ఎవరికి ఎంతమంది సంతానం కావాలో ఎవరికి వారే నిర్ణయించుకొనేవారు. లేదా, ఒక నిర్ణయమంటూ లేకుండానే సంతానాన్ని కనేవారు. కాని, రాను రాను యిది సమాజానికంతకు సంబంధించిన సమస్యగా మారింది.

సామాజిక సమస్య అవటానికి కారణమేమంటే. ప్రజాప్రభుత్వంలో ప్రజలకు కూడు, నీడ, గుడ్డ, ఆరోగ్యం, విద్య ఉపాధి అవకాశాలు కల్పించటం అనేవి ప్రభుత్వ కర్తవ్యమైంది. అంటే లోగడ ఎవరి సంతానాన్ని వారే పోషించుకోవాల్సిన బాధ్యత ఉండేది. ఇప్పుడది సమాజం (ప్రభుత్వం) బాధ్యత అయిందన్నమాట. ఈ విధంగా, పౌరుల వ్యక్తిగతమైన సంసార విషయంలో సైతం ప్రభుత్వ జోక్యం అవసరమైంది. దేశంలో జనాభా వృద్ధి అయినకొద్దీ ప్రభుత్వ బాధ్యత పెరుగుతోంది. అందుచేత, జనాభాను అదుపుచేయాల్సిన అగత్యం కలిగింది. ఈ అదుపు బలవంతంగా చేయవచ్చు, స్వచ్ఛందంగానూ చేయవచ్చు. మన ప్రభుత్వం పౌరులే స్వచ్ఛందంగా కుటుంబ నియంత్రణను పాటించేటట్లు చేయాలనే నిర్ణయానికి వచ్చింది. ప్రచారమే ఇందుకు ప్రధాన సాధనం. ఇతరవిధాలైన ప్రోత్సాహాలు మరొక సాధనం. ప్రజలకు కష్టనష్టాలు తెలియజెప్పి వారిచేత కుటుంబనియంత్రణ స్వచ్ఛందంగా చేయించటంకోసం విపులమైన ప్రచారం చేయాల్సివస్తోంది. ప్రచారమే కాక ఉద్యోగులకు జీతంలో వృద్ధి (ఇంక్రిమెంట్లు) లాంటి ప్రోత్సాహాలు. ఇతర రకాల శ్రమజీవులకు ఆర్థికమైన ప్రోత్సాహాలు కల్పిస్తున్నారు.

కుటుంబ నియంత్రణమనేది, లౌకికరాజ్యమైన మనదేశంలో రాజకీయ సమస్యే కాకుండా, మతపరమైన సమస్యగా కూడా తయారైంది. అంటే, మనదేశంలోనే, కొన్ని మతాలవారు తమ మతానికి కుటుంబ నియంత్రణమనేది వ్యతిరేకం అంటూ పాటించటంలేదు. ఎవరి మత విశ్వాసాలలోనూ జోక్యం కలిగించుకోకూడదని లౌకిక రాజ్యం కాబట్టి, అటువంటి వారిని ప్రభుత్వం ఏమీ అనదు. మన హిందూమతం

సైతం. ఏ ధర్మగ్రంథాల్లోనూ సంతాన నిరోధాన్ని చెప్పి ఉండలేదు. అయినా హిందువుల కుటుంబ నియంత్రణాన్ని పాటించవలసివస్తోంది. ఇట్లా, కొన్ని మతాలవారు ప్రాతికూల్యాన్ని చూపించటంవల్ల. వారి జనాభా పెరిగి, ఓటుహక్కుతో, ఓట్ల బలంతో ఏర్పడే ప్రభుత్వాలు కాబట్టి, ఇది రాజకీయ సమస్యరూపం దాలుస్తోంది. ఇట్లా ఇతర మతాల జనసంఖ్య పెరిగినందువల్ల కలిగిన ఫలితాల్ని దేశం అనుభవిస్తూనే ఉంది. కాబట్టి, ఈ కుటుంబ నియంత్రణను వ్యతిరేకించే రాజకీయ పార్టీలు పుట్టినా పుట్టవచ్చు.

సంతాన నిరోధం, లేదా, సంతాన నిగ్రహం అనేదానికి మారు పేరే కుటుంబ నియంత్రణం: ప్రభుత్వంవారి ఉద్దేశాన్ని బట్టి ఇద్దరు లేక ముగ్గురు బిడ్డల కంటె ఎక్కువమందిని కనవద్దని; కృత్రిమోపాయాలద్వారానైనాసరే బిడ్డలను కనకుండా ఆపమని చెప్తూ, దీనికి కుటుంబనియంత్రణమనే గొప్ప పేరు పెట్టారు. ప్రభుత్వం చెప్పేదేమంటే, జనసంఖ్య పెరిగిపోతోంది. వనరులు తగ్గుతున్నాయి, దామాషానుసరించి ఆహార వస్తూత్పత్తులు పెరగటం కష్టమని, ఇట్లా జనాభా పెరిగిపోతూ ఉంటే కరవుకాటకాలు ఏర్పడే ప్రమాదం ఉందని, జాతిబలహీనమైపోతుంది అని.

కొంతమంది విద్యావేత్తలు సైతం ఇందుకు భిన్నంగా ఏమంటారంటే — ఈ సంతాన నిరోధం అనేది, మంచంమీద పడుకున్నవాని కాళ్ళు బారుగా ఉన్నాయి కాబట్టి, మంచానికి సరిపడేటట్లు కాళ్ళను నరకమన్నట్లుంది. కాళ్ళకు సరిపడేటట్లు మంచాన్ని సరిచేయాలే తప్ప నరకటం ఏమిటి? అట్లాగే, అన్నం చాలదని కృత్రిమంగా మానవోత్పత్తిని బలవంతంగా ఆపటం అనేది, నీతికాదు. నీటివసతులు కల్పించి, ఎరువులు వాడి, ట్రాక్టర్లులాంటి ఆధునిక పనిముట్లు వాడి, మానవశక్తిని పూర్తిగా ఉపయోగించి, దుబారా తగ్గించి ఉత్పత్తి పెంచాలే తప్ప, మానవుల పుటకను బలవంతంగా ఆపరాదు. ప్రకృతి చేయాల్సిన పని ప్రకృతి చేసుకుంటుంది.

ప్రభుత్వం మాత్రం రేడియో, టి. వి. సినిమాలు, నాటకాలు, ఇతర — ప్రచార సాధనాలద్వారా ఊదరకొడుతోంది. జీతాలిచ్చి ప్రచారకులను నియమిస్తోంది. ఇందుకు ప్రభుత్వంలో ఒక ప్రత్యేక శాఖ పనిచేస్తోంది. బహుమతులిచ్చి, ఆపరేషన్లు చేయించుకొన్నవారికి డబ్బు, వస్త్రాలు, బియ్యం ఇచ్చి ఎన్నో విధాల కృషిచేస్తున్నారు. ఈ కుటుంబ నియంత్రణ విషయమైన కొన్ని నినాదాలు, సూక్తులు, చిన్నపిల్లలకు సైతం కంఠోపాఠం అయినాయి.

ఒకరు ముద్దు, ఇద్దరు హద్దు ఆపైన ఇకవద్దు.
మనం ఇద్దరు — మనకు ఇద్దరు.
చిన్న సంసారం. సుఖ సంసారం. ఇట్లా ఎన్నో....

ఇదే విధంగా ట్యూబెక్టమీ. వాసెక్టమీ. లూప్స్. నిరోధ్, వగైరా పదాలన్నీ సర్వసామాన్యమైనాయి. అధిక సంతానం దారిద్ర్యహేతువు అనే విషయానికి అధిక ప్రాధాన్యం వచ్చింది. యువతరం అంతా పిల్లల కాన్వెంటు చదువులు. ఇతర ఖర్చులు భరించలేమనే నిర్ణయానికి వస్తున్నారు — సంతాన నిరోధానికి అనేక ఉపాయాలు స్వచ్ఛందంగానే పాటిస్తున్నారు. ఇదంతా హిందువుల్లో. మధ్యతరగతి. దిగువ మధ్యతరగతివారి పరిస్థితి. నిమ్నజాతులవారిలో, శ్రమజీవుల్లో సంతాన నిరోధానికి ప్రాధాన్యత తక్కువ. వారికి ఇంకొక బిడ్డఉంటే, పశువుల్ని కాయటానికో, తమ వృత్తిలో సాయానికో. సంసారానికి ఏదో విధంగా ఉపయోగపడతారు. కాబట్టి వారికి పిల్లల్ని పోషించలేమనే దిగులు లేదు. ఇక, కొన్ని మతాలవారు తమ మతం అంగీకరించదని చెప్పుతూ వారి మతం ప్రసాదించిన సౌకర్యం మేరకు నలుగురి భార్యలను చేసుకుంటూ దేవుడిచ్చినంత వరకు కంటున్నారు. పరిస్థితులు ఈ విధంగా కొనసాగితే భవిష్యత్తు ఎట్లా ఉంటుందో చరిత్రవల్ల మనకు తెలుస్తోంది. సంతాన సమస్య, మత సమస్యకాదు, సాంఘిక సమస్య అనే ధైర్యం ప్రభుత్వానికి లేదు — ఆ వర్గంవారి ఓట్లు పడకపోవచ్చు.

సంతాన నిరోధానికి వ్యతిరేకుల వాదం:

నిజానికి ఏ తల్లిదండ్రులైనా తాము పెంచి పోషించగలిగినంతవరకే బిడ్డల్ని కనాలి. ఇది ధర్మం. తమ బిడ్డల్ని సత్పౌరులుగా తీర్చి దిద్దగలగాలి. ఇందుకు ఆత్మనిగ్రహాన్ని అలవరచుకోవాలి. అంతే తప్ప, బలవంతంగా కృత్రిమంగా గర్భనిరోధాన్ని పాటించకూడదని కొందరు సమాజ నీతిశాస్త్రజ్ఞుల వాదన. ప్రభుత్వం మాత్రం కృతనిశ్చయంతో, కోట్లకు కోట్లు ఖర్చుపెడుతూ, birth control జన్మనిరోధాన్ని అమలుపరుస్తోంది. అనేక ప్రలోభాలను చూపిస్తోంది. లూపులు. ఆపరేషన్లు, రబ్బరు తొడుగులు వగైరాలు ఉచితంగా చేయిస్తోంది. చివరకు గర్భపాతాల్ని సైతం, భ్రూణహత్యల్ని సైతం చట్టబద్ధం చేయటానికి వెనుకాడటం లేదు. ఇట్లా చేయటంవల్ల మరొక విధంగా వ్యభిచారాన్ని చట్టబద్ధం చేసినట్లే అవుతుందని. యువతీ యువకుల్ని తప్పుమార్గానికి త్రిప్పటమేనని. ఇప్పటికే గర్భపాతాల

(Abortions) సంఖ్య పెరిగిపోతోందని. సదాచారానికి తిలోదకాలివ్వాల్సి వస్తుందని కొందరు అంటారు. ఇంతేకాదు, సంఘశక్తికే హాని కలుగుతుందని, మానవశక్తి (Man power) తగ్గిపోతుందని, ఎన్ని మారణాయుధాలున్నా మానవశక్తిలేని దేశం నాశనంకాక తప్పదని అంటున్నారు. ఆచారమనేది ధర్మానికి ప్రాణంలాంటిది. సదాచారానికి హానికలిగితే సమాజస్థితి ఎట్లా ఉంటుందో విజ్ఞులు ఊహించవచ్చు. సంఘశక్తికి హానికలిగే ఏ పనీ ప్రభుత్వం చేయరాదు. సంతాన నిరోధానికి ఖర్చుపెట్టే కోట్లకొలది ధనాన్ని, భిక్షకుల పొట్టనింపే కార్యక్రమాలకోసం, దారిద్ర్య నిర్మూలన కోసం, అధికాహారోత్పత్తి కోసం, విద్యాభివృద్ధి కోసం ఖర్చుపెడితే సంతాన నిరోధం దానంతట అదే జరుగుతుంది. దారిద్ర్యానికి అధిక సంతానానికి సంబంధం ఉంది కాబట్టి. సంతాన నిగ్రహమనేది స్వేచ్ఛగా ఆత్మనిగ్రహంతో జరగాలే తప్ప బలవంతంగా కృత్రిమ ఉపాయాలతో జరగరాదు. వారు చెప్పే ముఖ్యమైన అభ్యంతరాలు—

1. దేశంలో మానవశక్తి తగ్గిపోతుంది. తద్వారా దేశబలం, ప్రభుత్వ బలం తగ్గిపోతుంది. దేశ రక్షణకు మానవశక్తి చాలా అవసరం. అంతర్జాతీయ పరిస్థితుల్ని బట్టి పురుషశక్తిని తగ్గించుకోవటం మంచిదికాదు.

2. హిందూజాతి స్వదేశంలోనే అల్పసంఖ్యాకమయ్యే ప్రమాదం ఉంది. వేర్పాటు ధోరణులు పెరగవచ్చు. దేశ విభజనవల్ల ఇటువంటి వేర్పాటు ధోరణులు ప్రబలటంవల్ల కలిగే దుష్పరిణామాలను దేశం అనుభవిస్తోంది—. వాటిని ఎదుర్కోవటంలో సతమతమౌతోంది, దేశ ప్రగతి కుంటుపడుతోంది. దేశనాయకులు ఈ విషయాన్ని ఆలోచించాల్సిన అగత్యం ఉంది.

3. ఈ పవిత్రమైన భారతదేశపు గడ్డపై పుట్టవలసిన. జాతి సంపదలాంటి, అనేకమంది వీరులు, పండితులు, నాయకులు, శాస్త్రజ్ఞులు అయినవారు పుట్టకుండా పోవటం మరొక అనర్థం అని వీరు అంటారు. ఎందుచేతనంటే — చాలమంది గొప్పవారంతా జ్యేష్ఠులు. ఏకైక సంతానమూ కారు. జాతిపితయైన గాంధిమహాత్ముడు వారి తల్లిదండ్రులకు మూడవ లేదా నాల్గవ సంతానం. రవీంద్రనాథఠాగూరు తన ఆరుగురు సోదరుల్లో చివరివాడు. సుభాస్‌చంద్రబోసూ అంతే! ప్రపంచాన్ని తన పరాక్రమంతో గడగడలాడించిన నెపోలియన్ ఆతని తండ్రికి ఆరవ సంతానం. ఇట్లా అనేక ఉదాహరణలు దొరుకుతాయి. సంతానం విషయమై ఒకరు, ఇద్దరు అనే ఆంక్ష విధిస్తే అనేకమంది మహాపురుషులు పుట్టే అవకాశమే లేకపోవచ్చు;

అని ఇవన్నీ కొందరు మేథావులు చెప్పే అభ్యంతరాలు అయితే, వీరు అధిక సంతానంమీద స్వేచ్ఛతో కూడిన, ఆత్మనిగ్రహంతో కూడిన నియంత్రణ ఉండాలనీ, బహుమతు లిచ్చి, ప్రలోభాలు చూపి, నరాలు కత్తిరించటాన్ని మాత్రం వ్యతిరేకిస్తారు.

ఇదంతా ఎందుకు చెప్పవలసి వచ్చిందంటే. ఈనాటి యువతరం వివాహానికి పూర్వమే, ఈ కుటుంబ నియంత్రణ విషయం కూలంకషంగా చర్చించుకొని. దేశ భవితవ్యాన్ని దృష్టిలో ఉంచుకొని ఒక నిర్ణయానికి రావలసి ఉంది. తమ యిష్టంతో చేసుకొన్న నిర్ణయం అయినందున ఉభయులు ఆత్మనిగ్రహంతో వ్యవహరించి జాతికి సత్పౌరుల్ని. వీరుల్ని ప్రసాదించ గలుగుతారు.

ఇంతవరకు వివాహ వ్యవస్థయొక్క పూర్వ స్వరూపాన్ని సంక్షేపంగా వర్ణించటం జరిగింది. నిజానికి, ఈ పూర్వ చరిత్ర అంతా గతజలసేతుబంధనమే అయినా, ఏదైనా సమస్యను పరిష్కరించాలని అనుకొన్నప్పుడు ఆ సమస్య మూలాన్నీ, దాని పుట్టుకను స్వభావాన్నీ తెలుసుకుంటే తప్ప పరిష్కరించలేము. అట్లా కాకపోతే రోగాన్ని వదలి లక్షణాలకు చికిత్స చేసినట్లుంటుంది. కాబట్టి మనకు ఈ విషయమైన పూర్వ చరిత్ర అవసరం అవుతోంది ఇక ఈనాటి వైవాహిక సమస్యలు, వాటి పరిష్కార మార్గాలు, భవిష్యత్తులో వివాహ వ్యవస్థయొక్క స్వరూప స్వభావాలు ఎట్లా ఉంటాయి? అనే విషయాలను గురించి ఆలోచిద్దాం.

## నేటి కన్యావరణం — వరవరణం:

ఈనాడు వరులు చాలమంది చదువుకొన్నవారు. అని మనం అనుకుంటాం. కాని, యిది సత్యంకాదు. నూటికి ముప్పదిమంది కూడా అక్షరాస్యులు లేని మన దేశంలో. ఎక్కువమంది వరులు, వధువులు, చదువురానివారే! మొత్తం వివాహ వయస్సు వచ్చిన వారిలో నూటికి నలుగురైదుగురు మాత్రమే అక్షరాస్యులుంటారు; ఉద్యోగాలు చేసేవారుంటారు, అనేది నగ్న సత్యం. మిగతావారంతా వ్యవసాయ కూలీలు, కార్మికులు. శ్రమజీవులు. వీరి విషయంలో మనం చెప్పవలసిందేమీ లేదు. ఎందుచేతనంటే, వీరు సమస్యల్ని సృష్టించరు. సృష్టించలేరు. వీరికి కావలసింది కడుపుకు భోజనం, కట్టుగుడ్డ ఉండటానికి నీడ. వీరికి తమ వివాహ విషయమైన పెద్ద కోరిక లంటూ ఉండవు. గంతకుతగ్గ బొంత అన్నట్లు వారికితగ్గ సంబంధం తేలిగ్గానే దొరుకుతుంది. వీరికిపెద్ద ఆశలు ఉండవు. వధూవరులిద్దరూ శ్రమజీవులైతే

పాటు: పారిశ్రమకు వెనుకాడరు. వీరికి మేడలు, ఓన్‌కార్లు, టి.వి.లు స్కూటర్లు. A. C. లు వగైరా భోగాలు కలలోనికి కూడా రావు. అందుచేత వీరిని వరించే కన్యాదాతలుగాని పురుషులుగానీ ఆ స్థాయిలోనే ఉంటారు. వీరిలో బ్రతుకుమీద రోసి. — అత్తకోడండ్ర పోట్లాటలు దారుణంగా — కిరసనాయిలు నాశ్రయించటం కనిపించదు. వీరికి తమంత వారు బ్రతుకగలమనే ధైర్యం. తమ రెక్కల కష్టంమీద విశ్వాసం ఎక్కువగా ఉంటుంది. కాని. వీరిలో త్రాగుడు, రాకెట్ ఆడడం లాంటి దుర్వ్యసనాలు. వ్యసనాలు అధికంగా ఉన్నందున సంసారాలు కోలుకోవు. ఒకవేళ ఈ వర్గం వారిలో వివాహ విచ్ఛేదం అంటూ జరిగినా, ఇరువురూ పునర్వివాహానికి (వారి భాషలో మారు మనువుకు) పూనుకున్నా అభ్యంతరం ఉండదు. భార్యను పోషిస్తున్నాననే గర్వం భర్తకు ఉండదు. మన ధర్మసూత్రకారులు చెప్పిన 'అర్ధాంగి' 'పత్ని' అనే శబ్దాలు వీరికి చక్కగా అన్వయిస్తాయి. ఎందుచేతనంటే, వీరు తమ భర్తలుచేసే యజ్ఞంలో (వృత్తిపనిలో) భాగస్వాములుగా ఉంటూ ఉంటారు. ఆ దృష్టితోనే భార్యను చూస్తారు. బొమ్మ పక్కపెల్లను వెంట వేసుకొని త్రిప్పినట్లు భార్యను త్రిప్పటం వారిలో ఉండదు. నిజమైన దాంపత్యం వీరిలోనే ఉన్నదని అనిపిస్తుంది. ఇంటి పనులలో సహకారం అనేది ఉభయత్రా ఉంటుంది. దారిద్ర్యంవల్ల, సంతాన పోషణం, పిల్లల చదువు సంధ్యలు వారికి కష్టంగా ఉంటుంది. వీరి ఆర్థిక పరిస్థితి బాగుపడితేనే తప్ప ఇతర సమస్యలు ఉత్పన్నం కావు.

సంఘంలో మరొక వర్గంవారున్నారు. వారు ఉన్నవర్గంవారు - అంటే సంపన్న వర్గంవారు. మంత్రులుగా, శాసన సభ్యులుగా, పారిశ్రామిక వేత్తలుగా దేశ భవితవ్యాన్ని, దేశ ఆర్థికస్థితిని తమ చేతుల్లో ఉంచుకొన్నవారు. వీరినిబట్టి, వీరికిగాను పరిపాలనసాగుతూ ఉంటుంది. ఈ వర్గంలో పెద్ద ఉద్యోగులు, అధికారులూ కూడా ఉంటారు. వీరు డబ్బుకోసం భారతదేశ పౌరులుగా ఉంటారు. ఆ డబ్బును విదేశాలలో అనుభవిస్తారు. వీరి సంసారంలోని సభ్యులందరికీ విదేశాలలోని బాంకులలో ఖాతాలు ఉంటాయి. విదేశ పరిశ్రమల్లో వాటాలు ఉంటాయి. వీరి జీవనవిధానం భారతీయం కాదు. వీరి ఆలోచనా ధోరణి భారతీయం కాదు. వీరి జీవనం, భార్యా భర్తల సంబంధం, తల్లిదండ్రులతో పిల్లలకుండే సంబంధం అంతా కృత్రిమమే! వీరి ఆచార వ్యవహారాలన్నీ కృత్రిమాలే! వీరు విదేశాల్లో చదువు(ను) కొంటారు. ఆ కొన్నచదువుతో పరిశ్రమల్లోను, ప్రభుత్వంలోను చేరి రెండు చేతుల్తో, నోటితో సంపాదిస్తారు. విలాసాలు అనుభవిస్తారు. వీరే దేశభవితవ్యాన్ని

-తెర్చి దిద్దుతామంటారు. జీవిత పరమార్థ మేమిటో ఎన్నడూ ఆలోచించరు. వీరి ప్రవర్తనలో ఆడ, మగ భేదం ఉండదు. గుర్తించటం కూడా కష్టమే! తల్లి దండ్రులు తమ సంతానం యొక్క ప్రయోజకత్వానికి రాక్షసానందం పొందుతారు. వీరి ప్రవర్తనలోని క్రుళ్ళు, అపస్వరాలు. బీభత్సం లోకానికి తెలియనంతటి, కనిపించనంతటి ఎత్తులో. దూరంలో ఉంటారు. కాబట్టి, ఈ వర్గం వారిని గురించి మనం చర్చించినా ప్రయోజనం లేదు. వారికి సమాజంతో పనిలేదు. సమాజానికి వారివల్ల లాభంలేదు.

ఈ రెండు వర్గాలకు మధ్యనుండే వర్గం ఒకటి ఉంది. ఆ వర్గమే ఎన్ని సమస్యలనైనా ఎదుర్కొంటూ, సుఖాలకోసం ఆరాటపడుతూ, బాధలతో సతమత మౌతూ, చదువు నేర్చుకొన్నందున ఉద్యోగాలు చేస్తూ, తమ పిల్లలకోసం ఖరీదైన చదువును కొంటూ, ఆ చదువుల ఖరీదుకు తట్టుకోలేక తలక్రిందులౌతూ, తమ పిల్లలకు మమ్మీ డాడీ సంస్కృతిని ఒంటబట్టించటానికై ప్రయత్నిస్తూ. పై వర్గం వారి లాగా తమ పిల్లలను స్వేచ్ఛగా వదలలేక, పాత సంప్రదాయాల విలువల్ని వాదనలేక, క్రొత్తపోకడలకు ఆకర్షితులౌతూ ఉండే వీరే సగటు భారతీయ ప్రతి నిధులు. వీరి చుట్టూ సమస్యలే! వీరు చదువుకొన్నవారు కాబట్టి చెప్పినదానిని నమ్మరు. కొన్న చదువు కాబట్టి ఆలోచన సరిగా ఉండదు. ఉద్యోగాలు కొంతవరకు హుందాతనాన్ని యిచ్చినా. పై వర్గాన్ని అందుకునేందుకు తగ్గ ధనం ఉండదు; క్రింది వర్గానికి దిగిరాలేరు. వీరిది త్రిశంకు స్వర్గం. ఇతర సమస్యలతోపాటు, వీరి వైవాహిక సమస్యలు కొల్లలు.

యూరపు గాలులు:

మన దేశంలోని మధ్యతరగతి వారిపై కూడా యూరపు గాలులు బాగా వీస్తు న్నాయి. చదువుల్లో, తిండిలో. ఆచార వ్యవహారాల్లో, ఆలోచనా ధోరణుల్లో, ఆడ మగ భేదం లేకుండా అందరూ ఆవైపుకు ఆకర్షితులౌతున్నారు. కాలేజి చదువుల్తో పాటు సినిమాలు, టి. వి. లు, నవలలు, మొదలైనవన్నీ వీరిని ఆ దిశకు ఆకర్షిస్తు న్నాయి. ముఖ్యంగా సంపన్నవర్గాలవారిలాగా తాము కూడా ఉండాలనే భావం ఈ వర్గాల వారిలో కూడా కనిపిస్తోంది. ఆ పోకడలు పోయి, ఎదురుదెబ్బలు తిని. ఆస్పత్రులపాలౌతున్నారు. పెద్దలకు మనఃక్లేశాన్ని కలిగిస్తున్నారు. కాబట్టి ప్రస్తుతం

యూరపులోని ధోరణులు ఎట్లా ఉన్నాయో తెలుసుకోవటం మంచిది. అపట అమలులోనున్న కొన్ని వివాహ పద్ధతుల్ని గూర్చి తెలుసుకుందాం.

పరీక్షణ వివాహం (Trial marriage)

మనం బజారులో బియ్యం, పప్పులు, గోంగూరలాంటి వస్తువుల్ని కొనాలని అనుకున్నప్పుడు మనకు వాటి నాణ్యత విషయమై అనుమానం ఉంటే (ఉడుకుతాయా? లేదా? ఏమైనా కల్తీ ఉందా? అని) ముందు కొంత మచ్చుకు వాడి చూచి బాగుంటే, తరువాత కొంటాం. అట్లాగే, బల్బులు, రేడియోలులాంటి వస్తువుల్ని కూడా వెలిగించి, మ్రోగించి, పరీక్షించి తీసుకుంటాం. మరి వివాహమనేది జీవితాంతం ఉండే బంధం, అత్యంత ప్రధానమైన విషయం కాబట్టి తొందరపడి మోసపోవటం కంటె పరీక్షించి చూచి చేసుకోవటం మంచిదనే సిద్ధాంతమే ఈ విధమైన వివాహాలకు మూలకారణం. యువతీ యువకుల, ఒకరి మనోభావాలు, అలవాట్లు, పద్ధతులు మాటలు, ఒకరి కొకరికి నచ్చుతాయా? లేదా? అని కొంత కాలంపాటు పరీక్షించుకోవటానికై కలిసి ఉంటారు. కామవాసనలు తీర్చటంలో ఒకరి కొకరు సమర్థులని అనుకుంటే వివాహం చేసుకుంటారు. ఇట్టి పరీక్షణ సమయంలో వారు కలిసి ఉన్నప్పుడు వారి లైంగిక సంబంధాలకు అడ్డు ఉండదు. వారికి నచ్చితే పెండ్లి చేసుకొంటారు. లేకపోతే విడిపోతారు.

ఈ విధంగా పరీక్షణ వివాహమనేది సంతానం కలిగిన పిమ్మట కూడా చేసుకోవచ్చు. డా. వెస్టర్‌మార్కు తన Future of marriaga అనే గ్రంథంలో ఈ విధమైన పరీక్షణ వివాహాలు యూరప్‌లో లోగడ కూడా ఉండేవని, ఇప్పుడూ ఉన్నాయనీ వ్రాశాడు — Trial marriage has been and is still in Practice on a large scale in Europe - అని 'రిఫార్మేషన్' సంస్కరణలకు సంబంధించిన ఆందోళనకు పూర్వం స్కాట్లండ్‌లో ఇది ఒక ఆచారంగానే ఉండేది. అక్కడ బహిరంగ ప్రదేశాల్లోనే స్త్రీలను ఎన్నుకొనేవారు — ఒక ఏడాదిపాటు కలసి ఉండే షరతులతో! ఈనాటికీ ట్యూటానిక్ దేశాల్లోని గ్రామాల్లో ఇది ఒక సంప్రదాయంగానే ఉంది. జర్మనీలోని అనేక ప్రాంతాల్లో నూటికి నలభై యాభై మంది, ఒక్కొక్కచోట నూటికి తొంభై మంది ఈవిధంగా వివాహానికి పూర్వం జన్మించినవారే! వీరంతా చట్టసమ్మతమైన పౌరులే! ఇంగ్లండులో కూడా చాలా భాగాల్లో ఈవిధమైన Free unions (స్వేచ్ఛా కలయికలు) చట్టసమ్మతంగానే పరిగణింపబడుతున్నాయి. చాలాదేశాల్లో ఈనాడు చట్టబద్ధమైన వివాహానికి పూర్వమే

యువతీ యువకులు లైంగిక సంబంధాలు కలిగిఉండటమనేది మామూలు విషయమై పోయింది. Clera Colate వ్రాసిన Educated Working Women అనే గ్రంథంలో, తూర్పు లండన్‌లోని సగ భాగంలో యువతులకు బిడ్డలు పుట్టబోయే సమయంలోనే చట్టసమ్మతమైన వివాహం జరుగుతోందని వ్రాయబడ్డది. అమెరికాలో సైతం, చాలవరకు ఇదే పద్ధతి కొనసాగుతోంది. జర్మనీలో సరేసరి. ఇట్లా యూరప్ దేశాలలో బయలుదేరిన Trial marriage గాలులు మనదేశంవైపుకు వీస్తున్నాయి. విదేశ నివాసం, విదేశాలతో సంబంధం, వారి సంపర్కంతో మనదేశపు ఉన్నత వర్గాలలో ప్రవేశించి, మెల్లగా నవలలు, సినిమాలు, పత్రికలు విషయజ్ఞానాన్ని ప్రసాదించగా, పిక్నిక్‌లాంటి సమావేశాలు, యాత్రలు అనుభవ జ్ఞానాన్ని ప్రసాదిస్తూ మన యువతరాన్ని ఆకర్షిస్తున్నాయి. కొద్దిరోజుల్లో సంపన్న వర్గాలతోబాటు, మధ్య తరగతివారిలో కూడా ఈ పద్ధతి ప్రవేశించి వ్యాప్తిలోకి వచ్చే సూచనలు కనిపిస్తున్నాయి. ఎందుచేతనంటే, మన దేశంలోని యువతీయువకులకు మన వివాహ వ్యవస్థ గూర్చిన అవగాహనను మనం కలిగించటంలేదు. భారతీయ వివాహధర్మాలను గూర్చి వారికి ఏమీ తెలియదు. వయస్సువల్ల కలిగే వాంఛాపరితృప్తికై ప్రాకులాట మాత్రమే వారిలో కనిపిస్తోంది.

సహవాసంకోసం వివాహం (Companionate marriage):

యూరప్ దేశాలలోని యువతీయువకులు స్వేచ్ఛగా కలుసుకొనే ఏర్పాట్లు, అవకాశాలూ అధికంగా ఉన్నాయి కాబట్టి, సహవాసంకోసం చేసుకొనే వివాహాలు సైతం వ్యాప్తిలో ఉన్నాయి. ఈ పద్ధతి ప్రకారం స్త్రీ పురుషులు, సంతానోత్పత్తిని కోరకుండానే కలసిమెలసి తమకు కావలసినట్టి వాసనలను తీర్చుకుంటూ ఒకచోటనే నివసిస్తూ ఉంటారు. Dr. M.M. Knight తన "The Companionate marriage and family" అనే పుస్తకంలో ఇట్లా వ్రాశారు — "A marriage of the Companionate type is a union of two People for sexual Companionship without the intention of Producing offspring" అని. ప్రసిద్ధ న్యాయాధీశుడైన Lindsey ఈ విధమైన వివాహాన్ని గూర్చి తన "The Companionate marriage" అనే గ్రంథంలో ఇట్లా వ్రాశారు — 'The Companionate marrige, is a legal marriage with legalised, birth - control and with the right to divorce by mutual consent for childless Couples. It is a state of lawful wedlock, entered into for love, companionship and co-operation by persons who, for reasons of health, finances, temperament

etc, are not prepared at the time of their marriage to undertake the care of a family" సంతానంలేని దంపతులకు తమకిష్టమైనప్పుడు సంతానాన్ని కనే స్వేచ్ఛ చట్టరీత్యాఉంది. ఆరోగ్యరీత్యా నిర్బలురై ఆర్థికస్తోమతు లేనివారై, స్వాభావికమైన దౌర్బల్యంవల్ల సంతానభారాన్ని వహించలేని అసమర్థులకోసం ఈ వివాహం న్యాయమైనదిగానే పరిగణింపబడుతుంది. ప్రేమ, సాంగత్యం, సహకారం, అనేది ఇందులో ప్రధానం. ఉద్యోగాలుచేస్తూ లేదా కూలిపనులుచేస్తూ ఉండే స్త్రీ పురుషులకు, సంసారాన్ని, పిల్లలని పోషించలేని తక్కువ ఆదాయం కలవారు, ఈ పద్ధతిని ఎన్నుకుంటున్నారు. రోగిష్టి తల్లిదండ్రులు, అసమర్థులైన, దుర్బలులైన సంతానాన్ని కనకుండా ఉండటానికి ఈ పద్ధతి వివాహాలు ఉపకరిస్తాయి. సంసారభారం లేకుండా కామవాసనాతృప్తి అనేది ఈ పద్ధతిలోని ప్రధానాంశం.

తాత్కాలిక (అస్థిర) వివాహాలు (Temporary marriages):

కొద్ది నిర్ణీతకాలంపాటు, పరస్పర ఒడంబడికతో జరిగే వివాహాలు —— ఇవి స్థిరంగా, ఎక్కువకాలంపాటు కొనసాగాలనే ఉద్దేశ్యంతో చేసుకొనేవి కావు. వివాహాలవల్ల కలిగే దుష్పరిణామాలను ఈ పద్ధతి వివాహాలవల్ల అరికట్టవచ్చునని పాశ్చాత్య సమాజ శాస్త్రవేత్తల అభిప్రాయం. ఇటువంటి వివాహంలో, ముందుగా పరస్పర ఒడంబడిక చేసుకుంటారు —— ఏ అయిదు సంవత్సరాలపాటో భార్యాభర్తలుగా ఉండటానికి ఉభయులు అంగీకరించి వివాహం చేసుకుంటారు. ఈ అయిదు సంవత్సరాల్లోనూ ఒకరి మనస్తత్వం మరొకరు బాగా అర్థంచేసుకోగలిగితే, ఉభయులకు ఇష్టమైతే వివాహ ఒడంబడిక కాలాన్ని పొడిగించుకోవచ్చు, రద్దు చేసుకోవచ్చు, లేదా శాశ్వత వివాహంగా మార్చుకోవచ్చు. ఒడంబడిక కాలంలో వీరు సంతానాన్ని కనవచ్చు. అట్టి సంతానం చట్టసమ్మతమైనదిగానే పరిగణింపబడుతుంది. ఈ దంపతులు, తమ ప్రేమ సరియైనది కాదనుకొంటే, ఒడంబడిక కాలం తరువాత విడాకులు తీసుకోవచ్చు. ఒడంబడిక అమలులో ఉన్నంతకాలం విడాకులకు వీలుండదు. దీనివల్ల ఒకరినొకరు బాగా అర్థంచేసుకోగలుగుతారని, మాటిమాటికి విడాకులిచ్చుకోవటం, ఒడంబడిక కాలాన్ని పెంచుకుంటూ ఉండటం కంటె, శాశ్వత వివాహబంధనాన్ని కల్పించుకోవటమే మంచిదని కొంతమంది భావం.

ఈ అశాంతి, అసంతృప్తి యెందుకు? :

ఇట్లా స్వేచ్ఛగా, విచ్చలవిడిగా వివాహాలు చేసుకొనే అవకాశాలున్న పాశ్చాత్య దేశాల్లోని యువతీ యువకుల్లో, ఈ అశాంతి ఉండటానికి కారణం

ఏమిటీ? అంటే, వివాహం విషయమై వారికున్న అవగాహనలోని లోపం అనక తప్పదు. వారి దృష్టి కేవలం లౌకిక విలాసాలపై. భోగాలపై కేంద్రీకరింపబడటమే! షికారుకు (వాహ్యాళికి) వెళ్ళేటప్పుడు ఒక బొచ్చుకుక్కను వెంటపెట్టుకుపోవటం, వెనుకటి రోజుల్లో. సంపన్నుల సరదాగా ఉండేది. ఆ సరదాకోసం, ఆ కుక్కకు బిస్కట్లుపెట్టి పోషించేవారు. అంతే తప్ప, ఆ కుక్కమీది ప్రేమతో. జీవకారుణ్య భావంతో కాదు. అట్లాగే. ఈనాటి యూరప్‌లోని చాలమంది సంపన్నులు, తమ వెంట క్రికెట్ టోర్నమెంట్సుకు. గుఱ్ఱపు పందేలకు ఇతర వినోదాలకు వెళ్లేటప్పుడు వెంట ఉండటానికై ఒక స్త్రీ స్నేహితురాలిని కోరుతున్నారు. ఇట్లాగే. అరబ్‌దేశాల లోని కొందరు సంపన్నులు సైతం. తమ అసలు భార్యను ఇంటియందుంచి, షికా రుకు టోర్నమెంట్సుకు. క్లబ్బులకు. గుఱ్ఱపు పందేలకు వెంటబెట్టుకొని పోవటానికై స్త్రీ స్నేహితుల్ని కంట్రాక్టు పద్ధతిలో. తెచ్చుకుంటున్నారు. వీరి తళుకు బెళుకులకు, ఇతర దేశాలలోని మధ్యతరగతివారు, సమ్మోహితులై గుటకలు మ్రింగుతున్నారు. వారి వైవాహిక వ్యవస్థలో నిజమైన ప్రేమ. ధార్మికమైన సంబంధం లేదు. తుచ్ఛమైన కామవాసనా పరితృప్తి, కృత్రిమ ఆడంబరాలు, నటన, వీటికి మాత్రమే ప్రాధాన్యం ఉంది. సాంఘిక విషయాలలో వారికీ, వారి వివాహానికీ, వారి సంతానం ద్వారా ఉన్న బాధ్యతలను, వారు గుర్తించటం లేదు. ధార్మికదృష్టి అనేది లేనే లేదు. ఇద్దరిలో, ఎవరి కామవాసనా తృప్తికి ఆటంకం కలిగినా, విడాకులే శరణ్యం! మళ్ళీ కథ మామూలే! నీకు సిగ్గూలేదు, నాకు ఎగ్గూలేదు, వస్తూ పోతూ ఉండు! అన్నట్లు ఈనాడు అమెరికా. యూరప్ దేశాలలో, విడాకుల సంఖ్య, మూడు పూవులు, ఆరు కాయలుగా, వృద్ధి అవుతోంది. ప్రతి ఆరు వివాహాలలో, ఒక వివాహం విడాకులకు దారి తీస్తోందని, గణాంక వివరాలు చెపుతున్నాయి. ఇప్పుడిప్పుడే, సామాన్యమైన అల్పవిషయాలపై విడాకులను నిషేధించాలనే ప్రయత్నాలు, సాగు తున్నాయి. ఇట్టి తరుణంలో, మన యువతరం ఆవైపుకు ఆకర్షితులౌతూ ఉండటం దురదృష్టకరం!

ఆ దేశాల్లోని సామాజిక బంధనం, ధార్మిక బంధనం, పూర్తిగా శిథిలమై పోయాయి. అది ఏ పరిస్థితికి చేరిందంటే, ఏ పురుషుడైనా సరే, ఏ స్త్రీవద్దకైనా పోయి తమ కామవాసనల్ని ప్రకటించి. తృప్తిపరచమని కోరవచ్చు! తప్పులేదు! సిగ్గులేదు! తన భార్య కానివారితో ఎట్లా ప్రవర్తించినా, ఏమి చేసినా తప్పులేదు. సమాజం పట్టించుకోదు; సమాజాన్ని వారు పట్టించుకోరు. ఈ పద్ధతులన్నీ మన

దేశంలోని సంపన్నవర్గాలలో ప్రవేశిస్తున్నాయి; మధ్యతరగతి వారిని ఆకర్షిస్తున్నాయి; దిగువ తరగతివారి కింకా వినోదంగా, వింతగా తోస్తున్నాయి.

అక్కడ. కొన్ని యూరప్‌దేశాల్లో, మనలాగా భార్యతో, పిల్లలతో సంసారం చెయ్యటం అంటే అంత తేలికకాదు. వారి అలవాట్లు, ఆచారాలు, పోకడలు అటు వంటివి. తమకు పుట్టిన బిడ్డలు తమకే అడ్డు. వారు తమతో ఉండటానికి వీలులేదు. అట్లా పిల్లలు తమతో ఉంటే, వారు తమ దాంపత్య జీవనానికి, సుఖానికి అడ్డు. (ఈ విధమైన ధోరణి మన దేశంలోని సంపన్న వర్గాలలో ప్రబలటంవల్లనే నేడు ఇన్ని రెసిడెన్షియల్ కాన్వెంట్లు, స్కూళ్ళు, కాలేజీలు పెరిగిపోతున్నాయి) వారికి ఇతరత్రా, యింటినుండి దూరంగా ఏర్పాట్లు చేయాలి. వారు ఎక్కడో పెరగాలి. కాబట్టి వారి ఖర్చులు భరించాలి. అసలే జీవితం చాలా విశాలవంతమైనదైనందున, ఉభయులకు త్రాగుడు, సిగరెట్లు, తిండి, క్లబ్బులు, రేసులు, పిక్నిక్‌లు, వగైరా కృత్రిమ భోగాలు, వినోదాలు, ఆడంబరాలకు చాలా ఖర్చు అవుతుంది. అందుచేతనే యువకులు చాలమంది వివాహం అంటేనే భయపడుతున్నారు. వారికి మాతా పితృ ప్రేమ, సంసార బాధ్యత, కుటుంబంతో సంబంధం, లేకపోవటంవల్ల, వారిలో ఏదో ఒక వెలితి, ఒంటరివాళ్ళమనే భావం, చోటు చేసుకొంటోంది. ఆడవాళ్ళు సైతం, ఉద్యోగాలలో, కర్మాగారాల్లో కార్మికులుగానో, పనిచేస్తూ ఉంటారు కాబట్టి, వారికి గృహకృత్యాలు చేసుకోవటానికి, పిల్లల్ని పోషించటానికి, అవకాశం ఉండదు. అందుచేతనే ఒకరి కొకరు మిత్రుల్ని వెతుక్కుంటూ ఉంటారు; తోడుకోసం! వీరిని చూచే మన దేశంలోని యువతీ యువకుల్లో కూడా Boy friends, girl friends తయారైనారు. తుమ్మెదల్లాంటి జీవనం కోసం! మధువు దొరికినంతవరకు ఒక పువ్వు! ఆపైన వేరొక పువ్వు! అందుకే, ''ఇంటికి ఆవును తెచ్చి పెతికి పాలు ఇస్తూఉంటే, ఆవును మేపి పోషించే బాధ ఎందుకు పడాలి?'' అన్నారు. ఇటువంటి యువతీ యువకులు వివాహం, సంసారం అనే బాధ్యతను ఎందుకు తెచ్చిపెట్టు కొంటారు? వారు అటువంటి బాధ్యతకు అంగీకరించేటప్పటికి, జీవితంలో అమూల్య మైన భాగం గడచిపోనే పోతుంది. ఒకవేళ చేసుకున్నా, ఇరువురూ ఆ బాపతే కాబట్టి త్వరలోనే విడాకులు తప్పవు. ఈ విధమైన దుష్పరిణామాలవల్ల వివాహాల సంఖ్య దేశానికి అవసరమైన జనబలం (Man power) తగ్గిపోతుందని ఆయాదేశాల ప్రభుత్వాలు కలవరపడుతున్నాయి.

మన దేశంలో వివాహ సంబంధం అనేది స్థిరమైనది; ధార్మిక ప్రాధాన్యం కలది. చపలచిత్తానికి, కేవలం శారీరవాసనలకు తావు లేనట్టిది. ధర్మమనే పునాది మీద నిర్మితమైయున్న వ్యవస్థ కాబట్టే శతాబ్దాల తరబడి ఆటుపోటులకు తట్టుకుంటూ (విదేశాలతోడి సంబంధాలు ఉంటున్నా) నిలిచి ఉంది. వివాహ విచ్ఛేదాలకు ఇక్కడ ఆదరణ లేదు. వివాహమనేది భారతీయ దృష్టిలో జీవితాంతం ఉండే ధార్మికబంధనం. అంతేకాదు, జీవితాంతమందు, తరువాతి జన్మలతో సైతం సంబంధం ఉన్నట్టి శాశ్వత బంధనం. అంతే తప్ప, పాశ్చాత్యుల్లోలాగా ఒడంబడిక అనీ, స్త్రీ పురుషుల సామర్థ్య పరీక్ష అనీ, కాలక్షేప సహవాసం అనీ, జంతు సహజమైన లైంగిక పరితృప్తి అనీ అనటానికి వీలులేదు. మన దేశంలో సంతానం లక్కర్లేని వివాహాన్ని ఊహించనైనా ఊహించలేము. మన భార్య భర్తల అనుబంధం లాగానే సంతానంయొక్క అనుబంధం కూడా తరతరాలు నిలిచి ఉండేది. కామవాసన అనేది ఆనుషంగికం. ధర్మం అనేది ప్రధానం. పుట్టిననాటినుండి తన సంతానం, తనకు దూరంగా ఉండాలని కోరుకొనే భారతీయ స్త్రీ ఉండదు. మన వైవాహిక గార్హస్థ్య జీవితంలోని శాంతికి, నిండుతనానికి కారణం ఇదే! ఈ గుణాలకు పాశ్చాత్యులు ముగ్ధులై ఇటు ఆకర్షితులౌతున్న తరుణంలో మన యువత వారిని అనుకరించటానికి పూనుకోవటం దురదృష్టం కాదా?

మన వివాహ వ్యవస్థలో దోషాలు లేవా? అంటే, ఉన్నాయి. ఆ దోషాలను తొలగించుకోవాలే తప్ప క్రొత్తదోషాలను కొనితెచ్చుకోకూడదు.

ప్రస్తుతం మన వివాహవ్యవస్థలో ఉన్న దోషాలు, వాటి కారణాలు:

1. పెద్దలు అత్యధికమైన బాధ్యతను నెత్తిన వేసుకోవటం. ఇందువల్ల యువతీ యువకుల్లో అసంతృప్తి కలగటానికి అవకాశం ఉంది. వివాహ సంబంధాన్ని కుదర్చటంలో తల్లిదండ్రులు యువతీ యువకుల అభిప్రాయాలకంటె, తమ అభీష్టాలకు అత్యధిక ప్రాధాన్యం యివ్వటం తప్పు.

2. తమ బాధ్యతలను సంతానంపై మోపటం పెద్ద తప్పు. అనేక మధ్యతరగతి, దిగువ మధ్యతరగతి కుటుంబాల్లో తల్లిదండ్రులు తమ సంతాన బాధ్యతలను కొడుకులపై కూతుళ్ళపై మోపటంవల్ల, వారి జీవితం దుఃఖభాజనం అవుతోంది. మన సమష్టి కుటుంబ వ్యవస్థను, ఈవిధంగా, దుర్వినియోగపరుస్తున్నారు. తమ కొడుకుల, కూతుండ్ర సంపాదనలపై, కుటుంబ సభ్యుల బాధ్యతను మోపటం జరుగుతోంది.

3. కొడుకుల ద్వారా కట్నాలు తెచ్చి, కూతుళ్ళ వివాహాలు చేద్దామని భావించటం. తాహతుకు మించిన సంబంధాలకోసం ప్రాకులాడటం, సమాజంలో ఒక్కొక్కప్పుడు, ఒక్కొక్క చదువు చదివిన, ఒక్కొక్క ఉద్యోగం చేస్తున్న వరుల రేటు, డిమాండు పెరగటం, అటువంటి సంబంధాలకోసం ప్రాకులాడటం (ఒకప్పుడు ఇంజనీరుకు, డాక్టరుకు ఎక్కడలేని రేటు పెరిగిపోగా, ఒకప్పుడు వారికి పిల్లనీయటానికి ముందుకు వచ్చేవారే కనిపించని రోజులున్నాయి. అట్లాగే ఒకప్పుడు బ్యాంకి ఉద్యోగికి డిమాండు ఎక్కువ ఉంటుంది) ఇది వివాహానికి ఏ మాత్రమూ తగని ధోరణి.

4. విధవా వివాహాలు లేకపోవటం ఒకలోటు.

5. అసవర్ణ వివాహాలకు — కులాంతర శాఖాంతర వివాహాలకు అనుమతి లేకపోవటం.

6. యువతీయువకులకు వివాహాన్ని గూర్చిన సరియైన అవగాహన లేకపోవటం.

7. వివేకాన్ని పెంచలేని ఈనాటి విద్య.

8. స్మృతికారులు స్త్రీ పురుషుల విషయంలో రెండురకాల మాపదండాల్ని ఉపయోగించటం.

9. విడాకులకు అంగీకారాన్ని చూపకపోవడం.

10. గాంధర్వ వివాహపద్ధతికి సమాజంలో ఆదరణ లేకపోవటం.

11. కులవ్యవస్థ, సంఘంలో ఎక్కువ తక్కువ భావాలు కొనసాగటం.

12. బహు వివాహ నిషేధం గట్టిగా పాటించకపోవటం.

పెద్దలు - బాధ్యతలు - వారువేసే తప్పటడుగులు:

వివాహ సంబంధాన్ని కుదర్చటంలో పెద్దలు చాలా యిబ్బందులకు బాధలకు గురి అవుతూ ఉంటారు. సపిండ, సగోత్ర, అసవర్ణ సంబంధమైన యిబ్బందులను అధిగమించటం ఏమంత కష్టంకాదు. ఇవన్నీ ముందే తెలిసిపోతాయి. ఇప్పుడు చాలా పట్టణాలలో ఏ కులానికాకులంవారు వివాహ సంబంధాలకు వేదికల్ని ఏర్పాటు చేసుకుంటున్నారు. వధూవరుల తల్లిదండ్రులు తగిన సంబంధాలకోసం అక్కడికి వస్తారు. అక్కడివారు తమవద్దనున్న రికార్డును బట్టి, వారికి పరస్పరం పరిచయాలు

చేస్తారు. పార్టీలే తరువాతి సంప్రదింపులు కొనసాగించుకుంటారు. మధ్యవర్తులు రావాలనుకుంటే ఉంటారు. ఇది నిజంగా సంత పద్ధతిలో సాగుతుంది. కాబట్టి, ఏ రేటువారు ఆ రేటువారివద్దకే వెడతారు. బేరాలు సాగిస్తారు.

అసలే. పెద్దలకు ఎదురౌతున్న పెద్ద సమస్య కట్నాల సమస్య. సంతలో పశువుల బేరగాడు తాను కొనేటప్పుడు చెప్పే మాటలువేరు. తాను అమ్మేటప్పుడు చెప్పే మాటలు వేరు. అట్లాగే. తన కొడుక్కు భార్యను (తన కోడల్ని) తెచ్చేటప్పుడు చెప్పే మాటలు, ఆ ధోరణి వేరు. తన కూతురికి భర్తను (అల్లుని) తెచ్చేటప్పుడు చెప్పే మాటలు, ఆ దైన్యం. ఆ ముఖకవళికలు వేరు. తమకు కట్నం యివ్వటం యిష్టంలేనప్పుడు తీసుకోవటానికి కూడా అయిష్టతను చూపాలి. మరొక విషయం ఏమంటే, — తాముచేసే బేరంలో చౌకగా లభించాలి — తక్కువ ధరలో ఎక్కువ యోగ్యతఉన్నవాడు లభించాలి — అందంగా ఉన్నవాడు, మంచి చదువు, ఉద్యోగం. ఆ ఉద్యోగం త్వరలో ప్రమోషన్లు వచ్చేదీ, లంచాలు దండుకోవటానికి వీలైనదీ. కూతుర్ని ఎక్కించుకొని త్రిప్పటానికి వాహనయోగం ఉన్నవాడూ అయివుండాలి. ఆస్థి ఉండాలి, భూవసతి లేకపోయినా బస్తీల్లో స్వంత యిళ్ళు, స్థలాలూ ఉండాలి. అత్తమామలు యిద్దరూ లేకపోతే ఉత్తమం. అత్త లేకపోవటం మధ్యమం. ఇద్దరూ ఉండటం అధమం. అసలు ఆడుబిడ్డలు లేకపోవటం ఉత్తమం. పెండ్లికావలసిన ఆడుబిడ్డలు లేకపోవటం మధ్యమం. పెండ్లికావలసి ఆడుబిడ్డలు ఉండటం అధమం. తన కూతురికీ అల్లుడికీ ప్రాపంచిక భోగాలు తప్ప, ప్రాపంచిక కష్టాలు ఉండకూడదు. రాబోయే అల్లుని జాతకాన్ని జ్యోతిష్కులంతా ఏకగ్రీవంగా ఆమోదించాలి. ఇట్లా అనేక కోరికలు లోపల పెంచుకొని అల్లుళ్ళను వెదకటానికి బయలుదేరుతారు. భగవంతుని సృష్టి ద్వంద్వాలతో కూడినట్టిదని. కష్టాలతోబాటు సుఖాలు. సుఖాలతోబాటు కష్టాలూ ఉంటూనే ఉంటాయనే జ్ఞానంఉండదు. ఇక తన కొడుక్కి భార్యను (తన కోడల్ని) వెతికేటప్పుడు ధోరణి వేరు. ఒక్కతే కూతురై ఉండాలి. అభ్రాతృక అయితే ఉత్తమోత్తమం. సభ్రాతృక అయితే మధ్యమం. అక్కచెల్లెండ్రు, ఎక్కువమంది ఉంటే అధమం. కట్నం అడిగినంత ఇవ్వాలి. నగలు బాగా పెట్టి పంపాలి. లాంఛనాలు జరపాలి. ఇంటి సామానంతా యివ్వాలి. పిల్ల అందము, అణకువ కలిగి. అత్త చెప్పిన పని నోరు మెదపకుండా చేసేదై ఉండాలి. ఉద్యోగంచేసి డబ్బు సంపాదించేదైతే ఇంకా మంచిది. ప్రతి పండక్కి అల్లుణ్ణి తీసుకుపోయి వస్తువాహనాలు చదివిస్తూ ఉండాలి. పిల్ల తల్లి

దండ్రులు సైతం తాము చెప్పినట్లు వింటూ మర్యాదగా ఉండాలి. ఇట్లా ఉంటాయి కోరికలు.

ఇటువంటి ద్వివిధ మనస్తత్వం కలవారివల్లనే సమస్యలు అధికంగా ఉత్పన్నమౌతూ ఉంటాయి. ఈ అజ్ఞానులకు జ్ఞానోదయం అయితే తప్ప ఈ సమస్యకు మోక్షంలేదు. లేదా. యువత అయినా మారాలి. కాని, ప్రస్తుతం యువ వెన్నుపూస కలదికాదు. మాతా పితృభక్తుల్లాగా ఉంటారు. బయట ఎన్ని వేషాలైనా వేస్తారు. ఎన్ని అభ్యుదయ భావాలనైనా ప్రదర్శిస్తారు. వీరుల్లాగా, కార్యశూరుల్లాగా మాట్లాడుతారు. వీరికి గుండెబలమూ, కండబలమూ రెండూ ఉండవు. స్వతంత్ర వ్యక్తిత్వం కలవారు కారు. పూర్వంలాగా చిన్నవయసువారై, ఏమీ తెలియని వారూ కారు. ఇట్టి వీరివల్లనే అనేక వివాహ సమస్యలు ఉత్పన్నమౌతున్నాయి.

బాల్య వివాహాలు, అతివృద్ధ వివాహాలూ కూడా ఆగిపోయినాయి. కాబట్టి ఇవి ఈనాడు సమస్యలుగా లేవు. ఎక్కడో, సనాతనుల్లో అక్కడక్కడ బాల్యవివాహాలు జరుగుతున్నా అవి లెక్కలోనికి రావు. సగటు ఆరోగ్యం బాగా వృద్ధిచెందినందువల్ల పెద్దగా సమస్యలు ఉత్పన్నం కావటంలేదు. రజస్వల అయినతరువాత జరుగుతున్నాయే తప్ప పూర్వకాలంలోలాగా 4, 5 సంవత్సరాలకే జరగటంలేదు. వృద్ధులకు బాలికల్ని ఇచ్చి కట్టటం అనేది సమూలంగానే నశించింది అనవచ్చు.

ఈనాటికీ విధవా వివాహాల విషయమై సంఘంలో సంకోచం కనిపిస్తూనే ఉంది. పురుషుల విషయంలో పునర్వివాహానికి సంకోచించనివారు, బాలికల విషయంలో ఎందుకు సంకోచించాలో అర్థంకాని విషయం. ఇదే ద్వివిధమాపదండం: బాలవితంతువులకు, విధురులకు కూడా నిర్ణీత వయస్సులోపల వివాహం చేయాలనే భావం సంఘంలో బలపడాలి. యువకులైన విధురులు వితంతువులను మాత్రమే వివాహం చేసుకోవాలనే శాసనం సైతం ఉండటం అవసరమని తోస్తోంది. ఇటువంటి జీవింపతుయుంటే వారికి ఉపాధి సౌకర్యాలు కల్పించాలి.

అసవర్ణ వివాహాలు ఈనాడు చెదురు మదురుగా జరుగుతున్నా, ఇంకా ఎక్కువ సంఖ్యలో జరగాల్సిన అగత్యం ఉంది. వర్ణభేదం — కులభేదం — అనేది మన సమాజంలో రాజకీయాల్లో వికృతరూపం దాల్చిఉంది. చదువుసంధ్యలు, నాగరికత పెరిగి అన్ని కులాల్లోను మంచి సంస్కారం కలిగిన, సదాచారసంపన్నులైన యువతీయువకులు తయారౌతున్నప్పుడు తగిన వధూవరులను ఇతరకులాల నుండి ఎన్నుకోవటంలో తప్పు కనిపించదు.

మతాంతర వివాహాలను సమర్థించే స్థాయికి మనదేశం రాలేదనే చెప్పాలి. ఈ గడ్డపై పుట్టి పెరిగినవారే ఈ గడ్డమీది మతాన్ని సహించే స్థితిలో లేనప్పుడు, ఈ దేశాన్ని మాతృదేశంగా భావించగలిగిన స్థితిలో లేనప్పుడు, సాంఘికంగానూ, రాజకీయపరంగానూ కూడా అనేక సమస్యలు ఉత్పన్నమౌతాయి. కనీసం వివాహ విషయంలోనైనా సమాన పద్ధతులు నియమాలు లేవు. ఒక మతం బహుభార్యాత్వాన్ని సమర్థిస్తోంది. అధిక సంతానాన్ని కావాలంటోంది. అటువంటి మతాలవల్ల, లౌకిక భావాలు కలవారి సంబంధాలు చేస్తే అనేక సాంఘిక రాజకీయ సమస్యలు పుట్టుకొస్తాయి. వారికి పుట్టే బిడ్డలవల్ల సైతం సమస్యలు ఉత్పన్నమౌతాయి. అందు చేతనే, ఇటువంటి మతాంతర వివాహాలను విజ్ఞులు అనేకమంది వ్యతిరేకిస్తున్నారు. భావసారూప్యం లేనివారితో సంబంధాలు వినాశహేతువే! మన సమాజం మతాంతర వివాహాల స్థాయికి, అంతర్జాతీయ వివాహాల స్థాయికి ఎదగలేదు.

ఈనాడు కాలేజీల్లో సెక్సు విద్యను బోధించాలని చాలామంది అంటున్నారు. సెక్సు విద్యకంటె, యువతీయువకులకు వివాహ విషయంలో మన భారతీయ ఆదర్శాలను గూర్చిన పరిజ్ఞానం కలిగించటం అవసరం. ఈనాటి యువతీయువకులలో భోగలాలసత పెరిగిపోయింది. ధనం ఉంటే సుఖం ఉంటుందని భావిస్తున్నారు. ఉద్యోగంచేసే భార్య కావాలని యువకులంతా కోరుతున్నారు. ఇద్దరూ సంపాదిస్తే అధిక భోగాలు లభ్యమౌతాయని! ఏ యువతిని పలకరించినా పెద్ద ఉద్యోగస్తుడు భర్తకావాలని అంటోంది. తానూ ఉద్యోగం చేయాలని కోరుతోంది. ఉభయులకూ ఉద్యోగాలనేది ఎక్కడో తప్ప సామాన్యంగా లభించటం కష్టం. ఆడపిల్లల విషయంలో వారి తండ్రులు ఉద్యోగ ప్రయత్నాలు, పెళ్ళి ప్రయత్నాలు రెండూ సాగిస్తూ ఉంటారు. ఏ కొద్దిపాటి ఉద్యోగమో దొరుకుతుంది. ఆ ఉద్యోగం చేయిస్తూనే ఆ డబ్బులు వదలటానికి యిష్టంలేకనే, సంబంధాల వేట సాగిస్తూ ఉంటారు. ఇట్లా 10, 12 సంవత్సరాలపాటు తిరిగి తిరిగి చివరకు వయసు తల నెరిసే సమయానికి, తాము తిరస్కరించిన సంబంధాలవంటి మామూలు సంబంధాలకే తలఒగ్గుతారు. పెండ్లియొక్క ప్రాముఖ్యాన్ని, వయసుయొక్క ప్రాముఖ్యాన్ని వారు గమనించరు. మన భారతీయ వైవాహికాదర్శం, ధార్మిక సామాజిక విషయాల్లో భార్యాభర్తల సహధర్మచరణం, అని గమనించకపోవటమే ఈ అనర్థాలకు కారణం అనక తప్పదు. భర్తచేసే యజ్ఞంలో పాలుపంచుకోవటం భార్యయొక్క (పత్ని, అర్ధాంగియొక్క) ధర్మం. ఇప్పుడు పురుషులు యజ్ఞాలు

చేయటం లేదుగదా! అని ప్రశ్నించేవారున్నారు. "స్వర్గకామోయజేత" అని స్వర్గం కోసం యజ్ఞం చేయటమనేది పూర్వం ఉంది. ఈనాడు యజ్ఞం అంటే, 'పురుషార్థం కోసం చేసే ప్రయత్నం' అనాలి. ధర్మాన్ని — ఆచరించటం. ధర్మమార్గంలో అర్థసంపాదనం. తద్వారా కామప్రాప్తి అని తెలుసుకోవాలి. ఇది ఒకవిధమైన కర్మ యోగం. దీనిద్వారా మోక్షానికి అర్హత లభిస్తుంది. అయితే, పురుషుని ధర్మం ఏమిటి? ఏదో ఒక ఉద్యోగాన్ని, లేదా ఒక వృత్తిని ఆశ్రయించి న్యాయంగా, నీతిగా అర్థ సంపాదనచేయటం. ఆ ధనంతో భార్యాబిడ్డల్ని పోషించటం, పిల్లల్ని ధర్మపరులుగా, ఉత్తమ పౌరులుగా తీర్చిదిద్దటం అనేవి. ఈవిధమైన స్వధర్మాచరణంలో అవినీతికి, అన్యాయానికి, అత్యాశకు తావులేదు. ఇదే కర్మయోగం. ఈవిధంగా పురుషుడుచేసే యజ్ఞంలో పాలుపంచుకోవాలి. విద్యావతియై, భర్తకు అతని ఉద్యోగ వృత్తుల్లో చేదోడు వాదోడుగా ఉంటూ 'పత్ని' సహధర్మచారిణి, అర్ధాంగి అనే పదాలను సార్థకం చేయాలి. ఆనాడు భవిష్యత్తులో స్వర్గసుఖాలను కోరి, కష్టాలు సహించి యజ్ఞాలు చేసినట్లే, భవిష్యత్తులో సుఖంకోసం పైనచెప్పిన పురుషార్థంకోసం ప్రయత్నం చేయటం కూడా యజ్ఞమే! ఈవిధంగా తమ సంతానాన్ని ఉత్తమ పౌరులుగా ధర్మ పరుల్నిగా తీర్చిదిద్దామని. తన ఉద్యోగంలో వృత్తిలో అన్యాయం, అవినీతి, ద్రోహాలకు పాల్పడలేదని, ఈ విధంగా ఈ జన్మకు నావంతు దేశసేవ చేశాననే తృప్తి వార్ధక్యంలో కలగటంకంటె సుఖం ఏముంటుంది? అన్యాయార్జితంతో, భోగలాలసులై, ధర్మదూరులైన వారికి చివరకు మిగిలేది అసంతృప్తి, మానసిక వేదన, కష్టాలే! ఈ సత్యాన్ని గ్రహించటం అవసరం.

స్త్రీలు చదువుకోవాల్సిందే! అన్ని చదువులూ చదవాల్సిందే! అన్ని ఉద్యో గాలకు కావలసిన అర్హతలూ సంపాదించాల్సిందే! దొరికితే ఉద్యోగాలు చేయాల్సిందే! భర్త సంపాదనవల్ల సంసారం గడవకపోతే తానూ ఉద్యోగంచేసి సంపాదించా ల్సిందే: కాని, కొంతమంది స్త్రీలను "మీరు ఉద్యోగం ఎందుకు చేస్తున్నారు? మీ వారికి మూడువేల రూపాయల జీతంగదా!" అని అడిగితే "ఇంట్లో ఏమీతోచక చేస్తున్నా"మని, ప్రొద్దుగడవక చేస్తున్నామని సమాధానం వస్తుంది. ఈ పట్టభద్రు రాండ్రకు కాన్వెంటుల్లో ట్యుటోరియల్సులో నెలకు 3, 4 వందలకంటె ఎక్కువ యివ్వరు. ఆ స్వల్ప సంపాదనకోసం ఉదయం భర్తకు, పిల్లలకు ఆప్యాయంగా ప్రేమతో తిండైనా పెట్టకుండా, సిటీ బస్సుల్లో చెమటలు క్రక్కుకుంటూ వచ్చి, సాయంకాలందాకా, భర్తచేత కూడా తినని చీవాట్లుతింటూ, ఎందుకు ఈ తోచని

ఉద్యోగం చేస్తున్నారో అర్థంకాదు. ఇంట్లో పనిమనిషికి, గుడ్డలు, సిటీ బస్సులకు, హోటల్ తిండికి అయ్యే ఖర్చులకే ఈ సంపాదన సరిపోతుందే: ఇంట్లోనే ఉంటే ఈ ఖర్చులు తప్పుతాయి. పిల్లలకు మాతృప్రేమ లభిస్తుంది. ఇంట్లో కూర్చుని కూడా నెలకు రెండు మూడు వందలు సంపాదించగలిగే చేతిపనులు చాలా ఉన్నాయి. ఈ ఇంటిపద్ద తోపని విద్యావతులద్వారా లక్షలకు లక్షలు ఆర్జిస్తున్నవారు నగరాల్లో ఉన్నారు. ఇటువంటి స్త్రీలవల్ల నిజంగా సంపాదన అవసరమైనవారికి అవకాశాలు లభించకపోవచ్చు గదా!

భూగరిష్ఠ పరిమితి చట్టంలాగానే, ఇంటికి ఒక్క ఉద్యోగమే అనే నినాదం సంఘంలో వినిపిస్తోంది. కొన్ని సంసారాల్లో తల్లి, తండ్రి, కొడుకు, కోడలు, కూతుళ్ళు కూడా ఉద్యోగాలు చేస్తున్నారు. కొన్ని సంసారాల్లో ఎవరికీ ఉద్యోగం లేదు. ఉద్యోగం ఉంటేనేగాని పురుషుడుగాని, స్త్రీ గాని, వివాహం చేసుకొనే అవకాశంలేదు. ఇటువంటి చట్టమే గనుక వస్తే పరిణామాలు ఎట్లా ఉంటాయి? భూస్వాముల్లో ఈనాడు చాలమంది చట్టరీత్యా విడాకులు పుచ్చుకొన్నవారే! వారి మైనరు పిల్లల్తో సైతం వారికి సంబంధాలు రికార్డురీత్యా ఉండవు — అందరి పేరు మీద పొలాలు గరిష్ఠ పరిమితికి సరిపడిఉంటాయి కాబట్టి! అట్లాగే, ఇంటికొక్క ఉద్యోగమే అన్నప్పుడు ఇంటి పెద్దల్లో, కొడుకులు, కోడళ్ళు, అల్లుళ్ళు కూతుళ్ళు పెండ్లికాగానే విడాకులు తీసుకోవాలి! లేకపోతే ఉద్యోగాలు ఉండవుగదా! అయితే, తరువాత పుట్టే సంతానానికి తల్లిదండ్రులు ఎవరో వారే చెప్పాలి. ధనంమీది మోజుతో, ఉద్యోగంమీది ప్రేమతో తన భార్యకాదని, తన భర్తకాదని, తన సంతానం కాదని చెప్పటానికి కూడా సిగ్గుపడరు. చదువుకు, ముఖ్యంగా స్త్రీల చదువులకు ఉద్యోగమే పరమావధిగా ఉండరాదు — అవసరమైతేనే తప్ప.

దొంగలు పడిన ఆరునెలలకు కుక్కలు మొరిగినాయట. మన హిందూ సమాజంలో వధూవరుల కనీస పెండ్లివయస్సు చాలా పెరిగిపోయింది. మధ్యతరగతి కుటుంబాల్లో మగపిల్లవానికి 30 సం॥లోపు ఆడపిల్లకు 25 సం॥లోపు వివాహాలు చాలా అరుదుగా జరుగుతున్నాయి. ఎందుచేతనంటే ఉభయుల దృష్టి, చదువుమీద, ఉద్యోగంమీద, స్థిరమైన సంపాదనమీద ఉండటమే కారణం. శ్రామిక వర్గాల్లో సైతం వధూవరుల కనీస వివాహ వయస్సు 18, 21 కంటె ఎక్కువగానే ఉంది. ఇప్పుడు ప్రభుత్వం చట్టంచేసి టి.వి.లు, రేడియోలను అదరకొడుతోంది. ప్రభుత్వం పెండ్లికి గరిష్ఠవయోపరిమితిని నిర్ణయించాల్సిన రోజులు వస్తున్నాయి. ఎందుచేత

నంటే, ఈనాడు 40 సం॥రాల వరులు, 35 సం॥లు పై బడిన కన్యలు కూడా కని పిస్తున్నారు. మన పద్ధతులు ఏవైనా అతిగానే ఉంటాయి. చేస్తే అతిబాల్యవివాహాలు, కాకపోతే అతిప్రౌఢ వివాహాలు! ఇట్టిపరిస్థితుల్లో పాశ్చాత్య దేశాల్లో లాగానే అవి వాహితుల్లో గర్భపాతాలు పెరిగిపోవచ్చు అని వైద్యులే అంటున్నారు. మనకు ఆరోగ్యం ఇవ్వలేని తిండి ఎంత అనర్థదాయకమో, వివేకాన్ని యివ్వలేని చదువు సైతం అంతటి అనర్థదాయకమే!

చట్టాలు — సంస్కరణలు:

ఇంతవరకు మనం వివాహ విషయంలో స్మృతికారులు చెప్పిన విధి నిషే ధాలను గూర్చి తెలుసుకున్నాం. మన అనుభవంలో ఉన్న విషయాలను చర్చించు కొన్నాం. ఇక మన ప్రభుత్వం ఈ వివాహ వ్యవస్థను సంబంధించి ఏ ఏ చట్టాల ద్వారా ఏ ఏ సంస్కరణలు తీసికొనివచ్చిందో కూడా మనం తెలుసుకుందాం. ప్రస్తుత సమాజం ఏ పనైనా చట్టబద్ధంగా ఉంచే తప్ప అంగీకరించటంలేదు. చట్టం వలని భయంతోనే ప్రజలు వ్యవహరిస్తున్నారు. లేకపోతే ఎటువంటి ధర్మాన్ని అయినా అతిక్రమించటానికి వెనుకాడరు. కాబట్టి, మన వైవాహిక వ్యవస్థలో ఏ సంస్కరణ అయినా చట్టబద్ధంగా ఉండటమే మంచిది.

మన కేంద్రప్రభుత్వం The Hindu marriage Act 1955, The Hindu Succession Act 1956, The Hindu Adoption and maintenance Act 1956 అనే చట్టాలు, తరువాత వచ్చిన సవరణలద్వారా ఈ దిగువ పేర్కొన్న ప్రధానమైన సంస్కరణలు అమలులోకి వచ్చాయి.

వివాహ విషయంలో:

(1) ఏకపత్నీ వివాహానికి హిందూ సమాజంలో చట్టపరమైన ప్రతిపత్తి వచ్చింది. (2) బహుపత్నీత్వం, బహువివాహాలు (భార్య ఉండగానే) నిషేధింప బడ్డాయి. (3) హిందూ వివాహ వ్యవస్థలో విడాకులకు చట్టపరంగా స్థానం కల్పించ బడ్డది. (4) సగోత్ర, సపిండ సంబంధాలకు సమ్మతి లభించింది. (5) వితంతు వులకు, పరిత్యక్తలకు, విడాకులీయబడిన స్త్రీలకు పునర్వివాహాధికారం కల్పింపబడ్డది. (6) వివాహానికి ఒకేజాతి లేక ఉపజాతి లేక ఒకే శాఖ అయిఉండవనక్కరలేదు. ఈ చట్టానికి పూర్వం జరిగిన సగోత్ర సప్రవర వివాహాలన్నీ చట్టసమ్మతాలౌతాయి. (7) హిందువులు. సిక్కులు, జైనులు, బౌద్ధులమధ్య జరిగే వివాహాలన్నీ చట్టసమ్మతా

లౌతాయి. (8) వివాహానికి వరుని కనీస వయస్సు 18 సంవత్సరాలు. వధువు కనీస వయస్సు 15 సంవత్సరాలుగా నిర్ణయింపబడ్డది. (ఈ వయస్సు నిబంధన ప్రస్తుతం వరునికి 21 సం॥ రాలు. వధువుకు 18 సం॥ రాలుగా సవరింపబడ్డది) ఈ వయస్సు కంటె తక్కువ ఉంటే, ఆ వివాహం చట్టసమ్మతంకాదు; పైగా శిక్షార్హం అవుతుంది (8) ఈ చట్టాల్నిబట్టి వివాహం చేసుకోని కన్యకు, వితంతువుకు వివాహ విష యంలో ఏ విధమైన వివక్షత ఉండదు. వివాహ సంస్కారం ఫలానా విధంగానే జరగాలని చట్టం శాసించలేదు. సమంత్రకం అయినా రిజస్ట్రేషను వివాహమైనా ఒకటే. ఈ చట్టం విడాకులకు అవకాశాన్ని కల్పించినా, ఈ దిగువ పరిస్థితుల్లో — మాత్రమే విడాకులను అంగీకరిస్తుంది —

(1) భర్త వ్యభిచారి అయినప్పుడు (2) కుష్ఠురోగి అయినా (3) మరొక మతాన్ని అవలంబించినా (4) పిచ్చివాడైనా (5) సంసారం వదలి సన్యాసిగా, బైరాగిగా అయినా (6) ఏడు సంవత్సరాలవరకు భర్తజాడ తెలియకపోయినా (7) సంసారం చేయవలసిందిగా న్యాయస్థానం యిచ్చిన తీర్పును రెండు సంవత్సరాల పాటు అమలుచేయకపోయినా (8) కన్యల్ని అపహరించటం, rape చేయటం వగైరా నేరాలు చేసినవాడైనా (9) సలింగమైథునానికి పాల్పడే పాతకుడైనా. (10) మొదటి భార్య బ్రతికి ఉండగానే మరొక వివాహం చేసుకున్నా (11) పశు ప్రవర్తన కలవాడైనా విడాకులు కోరవచ్చు.

ఈ హిందూ వివాహ చట్టంవల్ల మన హిందూ వివాహ వ్యవస్థలో విప్ల వాత్మకమైన మార్పులు వచ్చాయి. అట్లాగే హిందూవారసత్వ చట్టంద్వారా కూడా స్త్రీలకు అనేక శతాబ్దాలుగా లేని స్త్రీలకు అనేకమైన అధికారాలు చట్టపరంగా లభించాయి. (1) ఏ స్త్రీ అయినా పుత్రుణ్ణిగాని, పుత్రికనుగాని దత్తత తీసుకోవచ్చు. (ఇంతకు పూర్వం స్త్రీకి దత్తత తీసుకొనే అధికారంలేదు. ఆడపిల్లను దత్తత తీసుకోవటమూ లేదు. మగపిల్లవానిని మాత్రమే దత్తత తీసుకోవాలి) (2) పెండ్లికాని స్త్రీ సైతం దత్తత తీసికోవచ్చును. వితంతువు కూడా దత్తత తీసుకోవచ్చు.

లోగడ — ఈ చట్టానికి పూర్వం స్త్రీకి వారసత్వపు హక్కు ఉండేదికాదు. ఈ చట్టంవల్ల స్త్రీకి వారసత్వపు హక్కు లభించింది — ఆర్థికంగా స్త్రీకి లభించిన గొప్ప అధికారం ఇది. వారసుల జాబితాలు నాలుగు రకాలుగా యిచ్చారు. మొదటి షెడ్యూల్లో — ఒక వ్యక్తి - కుటుంబ పెద్ద - చనిపోతే తరువాతి వారసులు క్రమంగా

(1) కొడుకు (2) కూతురు (3) చనిపోయినవాని వితంతు భార్య (4) చనిపోయిన వాని తల్లి (5) అంతకు పూర్వమే మృతుడైన కొడుకు యొక్క పుత్రుడు (మనుమరాలు) (6) అంతకుపూర్వమే చనిపోయిన కూతురి కొడుకు (దౌహిత్రుడు) (7) అంతకుపూర్వమే మరణించిన కూతురియొక్క కూతురు (మనుమరాలు) ఇట్లా స్త్రీకి మొదటిసారిగా ఆస్తికి వారసురాలయ్యే హక్కు వచ్చింది. (అయితే కొడుకు తరువాత కూతురికి స్థానం ఇవ్వటం అన్యాయమని, కొడుకుతోపాటే సమాన స్థానం కూతురికి ఇవ్వాలని ఆలోచన ఉంది. దేశవ్యాప్తంగా ఇది అమలులోకివస్తే కట్నాల సమస్య తగ్గుముఖం పట్టవచ్చు — ఆస్తిలో ఎట్లాగో వాటా వస్తుంది కాబట్టి దానినే కట్నంగా పరిగణించవచ్చు.) పై చట్టాలననుసరించి మొదటిసారిగా ఏ స్త్రీ అయినా తన ఆస్తిని, స్త్రీ ధనాన్ని తన యిష్టం వచ్చినట్లు, అనుభవించటానికి, అమ్ముకోవటానికి హక్కు లభించింది. ఇది స్థూలంగా ఈనాడు అమలులో ఉన్నట్టి ప్రభుత్వ చట్టాల స్వరూపం.

## అప్పగింతలు — అంపకాలు

భారతీయ యువతీయువకుల్లారా! మీరు వివేకవంతులు. కాబట్టి, ఇంతవరకు చెప్పిన విషయాలను విమర్శించుకొని, మీదా దేశానికి ఏది మంచిదో నిర్ణయించ గలరు. మీమీదనే, మీ సంతానంమీదనే దేశభవితవ్యం ఆధారపడి ఉంది. మీరు ఆచరించని దానిని, మీ సంతానంనుండి ఆశించలేరు గదా! అందుచేత, మీరు ధర్మానికి విరుద్ధం కానట్టి పద్ధతిలో, మీరు నడుస్తూ, దేశాన్ని నడిపించాలి. ఇందులో స్త్రీ పురుష వివక్షతకు తావులేదు. పాశ్చాత్య సభ్యత, మన నేలకు, మన నీటికి ఉపకరించేది కాదు. అందులో ఏదైనా మంచి ఉంటే గ్రహిద్దాం — గుడ్డిగా అనుకరించటం తగదు. మనదంటూ ఒక సంస్కృతి లేకపోతే, యితరుల సంస్కృతిని అనుసరించాల్సి వస్తుంది. మనకు వేలకొలది సంవత్సరాలనుండీ, అవిచ్ఛిన్నంగా సాగివస్తున్న సంస్కృతి ఉంది. దానిని పరిరక్షించుకోవాల్సిన అగత్యం ఉంది ఆ సంస్కృతే మన పెద్దలు మనకు యిచ్చిన తరగని ఆస్తి. దానిని మనం సురక్షితంగా మన సంతానానికి యివ్వాలి.

మన ఆచార వ్యవహారాల్లో లోపాలుంటే, కాలాన్నిబట్టి సవరించుకోవాల్సిందే! కాలాన్నిబట్టి నడవక తప్పదు. కాని, కాలాన్నిబట్టి నడవటం వేరు, కాలగతిలో పడి కొట్టుకుపోవటం వేరు. అనుసరించటం వేరు, అనుకరించటం వేరు; అని గ్రహించాలి.

మన ప్రాచీన ఋషులు, తమవద్ద చదువుకొన్న శిష్యుల విద్య, పరిసమాప్తి అయిన పిమ్మట, వారికి చేసిన హితబోధ (ఈనాటి స్నాతకోపన్యాసం లాగా) — నాయనలారా! మీ విద్య పరిసమాప్తి అయినది. కాబట్టి, వివాహం చేసుకోండి — "ప్రజాతన్తుం మా వ్యవచ్ఛేత్సీః" సంతానమనే సూత్రాన్ని భగ్నం కానీయకండి. అని అంటే. వివాహం చేసుకొని, పుత్ర పౌత్రాదుల్ని పొంది, దేశభక్తికి తోడ్పడండి, అని అర్థం. నీవు వివాహం చేసుకొని, సత్సంతానాన్ని పొందటం నీకు నీ కుటుంబానికి ఎంత ముఖ్యమో. దేశానికీ అంతే ముఖ్యం! వారే దేశ భవితవ్యాన్ని తీర్చిదిద్దాల్సినవారు కాబట్టి!

మరొక ఉపదేశం — "స్వాధ్యాయాన్మాప్రమదః" స్వాధ్యాయాన్ని మరువ వద్దు. స్వాధ్యాయమంటే, పూర్వం తన వేదశాఖ అని అర్థం చెప్పుకొనేవారు. ఆనాటి చదువు అదే కాబట్టి! ఈనాడు అనేక శాస్త్రాలు అనేక విద్యలు, అనేక వృత్తులు ఉన్నాయి. ఎవరి చదువు వారి స్వాధ్యాయం. ఎవరి వృత్తి వారికి స్వాధ్యాయం. కాబట్టి నీవు నీ చదువును. నీ వృత్తిని ఉపేక్షించవద్దు, అని భావం.

మరొక ఉపదేశం — "యాన్యనవద్యాని కర్మాణి తాని సేవితవ్యాని నోఇత రాణి" నింద్యములు కానట్టి పనులను మాత్రమే చేయాలి. అంటే, మంచి పనులను మాత్రమే చేయాలి? మంచిపనులని గుర్తించటం ఎట్లా? అంటే —

ఒరులేయవి యొనరించిన
నరవర అప్రియము తన మనంబునకగు, తా
నొరులకు నవి సేయకునికి
పరాయణము పరమధర్మ పథముల కెల్లన్.

ఎదుటివారు ఏ పనిచేస్తే నీ మనస్సుకు కష్టం, దుఃఖం. కలుగుతుందో. ఆ పనిని నీవు ఇతరులయెడ చేయకుండా ఉండటమే ఉత్తమధర్మం.

సమాజంలో స్త్రీ పురుష వివక్షతపోగా, సమాన ప్రతిపత్తి లభించి, మన వేదకాలీన వైవాహికాదర్శాలను, మళ్ళీ మన భారతదేశంలో పాదుకొల్పాల్సిన పవిత్ర బాధ్యత మీదే! మన ధర్మాన్ని, దేశాన్ని రక్షించాల్సిన బాధ్యత మీదే!

"ఉత్తిష్ఠత, జాగ్రత, ప్రాప్యవరాన్నిబోధత"

"లేవండి! మేల్కొండి! శ్రేష్ఠులైనవారివద్దకు వెళ్ళి జ్ఞానాన్ని పొందండి."

— స్వస్తి —

## శ్రీ నోరి శ్రీనాథ వేంకటసోమయాజులు గారి
## వేదాంత గ్రంథాలు

1. ఉపనిషద్దర్శనం 1 భాగం రూ. 20/-
   (తైత్తిరీయ, ప్రశ్న, ఈశ, కేన,
   మాండూక్య ఉపనిషత్తులు) (అచ్చులో)
2. ఉపనిషద్దర్శనం 2 భాగం 20/-
   (బృహదారణ్యకోపనిషత్తు)
3. ఉపనిషద్దర్శనం 3 భాగం 25/-
   (ఛాందోగ్య, ఐతరేయ, ముండకోపనిషత్తులు)
4. ఉపనిషద్దర్శనం 4 భాగం 9/-
   (శ్వేతాశ్వతర, కైవల్యోపనిషత్తులు)
5. ఆత్మానాత్మ వివేకం 6/-
6. ఆత్మబోధ 5/-
7. అపరోక్షానుభూతి 8/-
8. పతంజలి యోగదర్శనం 25/-
9. బ్రహ్మసూత్ర దర్శనం 60/-
10. వేదాంత పంచదశీ 60/-